# బుద్ధభగవానుడు

ధర్మానంద కోశాంబి

అనువాదం:
'సరస్వతీపుత్ర'
పుట్టపర్తి నారాయణాచార్యులు



సాహిత్య ఎకాడమీ తరఫున:
విద్యోదయా పబ్లికేషన్సు,
కడప వారిద్వారా ప్రచురితము.

# భక్తుఁడు, బండితుఁడు, నైన ధర్మానంద కోశాంబి

ఈ గ్రంథమునకు మూల లేఖకులు శ్రీ ధర్మానంద కోశాంబిగారు. వారు 'పాలీ' భాషయందుఁ గావించిన పరిశ్రమ - ప్రచండమైనది. కేవలము భాషాదృష్టితోనే గాక, సాహిత్య దృష్టితోఁగూడ వా రా వాఙ్మయమున నమోఘమగు గృషిసల్పిరి. బౌద్ధధర్మమును, బోధించు ననేక మౌలిక గ్రంథములపై వారిమాట కగ్ర తాంబూలము ఈ విషయమున వారి కీర్తి - ఇతర రాష్ట్రములకుఁ గూడ నెగఁబాకెను. కాని వారికృషి కేవలము ప్రతివాదుల మూతి బిగించు - తర్క ప్రధానమైన శుష్క పాండిత్యము - మాత్రమేగాదు. మఱి - సహృదయతతో నార్ద్రముఁగూడ. బుద్ధభగవానునకు వార నన్యులైన భక్తులు, అందుచే ధర్మానంద కోశాంబి గారి నిష్ఠ యుదాత్తమైనది. బౌద్ధధర్మాధ్యయనమున వారు గావించిన పరిశ్రమ - పొందిన ఫలము, సాహితీరచనా రూపమున వారు దేశమున కొసఁగిన జ్ఞానోపదేశము - మూఁడును కూడ, బహు జన హితము కొఱకే. బహుజనుల సుఖముకొఱకే.

వారు రచించిన ఈ 'బుద్ధ చరిత్ర'యే దృష్టితోఁ జూచినను గొప్పది. కారణ మేమనఁగా నీ విషయమున వారికృషి యంతలోతైనది- ప్రామాణికమైనది. ఈ గ్రంథమునెవరైనను జదివినచో - బుద్ధుని చరిత్రపై నింతకుముందు వారి కున్న యపోహలుఁ దొలఁగి పోవును. సత్యములై, ప్రామాణికములై యపూర్వ విషయములు దొరకును. కాకమ్మ కథలపై యాధారపడవలసిన దురవస్థ - యా పాఠకున కుండదు.

ఈ నాఁడును మనము బుద్ధ దేవుని జీవిత చరిత్రను చదువుచునే యున్నాము. కాని యా చరిత్ర మూలగ్రంథముల యాధారముపై రచింపబడినది గాదు మఱి - యైరోపీయ విద్వాంసులు గావించిన కృషి సారము.

'ఎడ్విన్ - ఆర్నోల్డ్' మహాశయుఁడు "Light of Asia" యను కావ్యమును రచించినాఁడు. దానిలో బుద్ధ దేవుని చరిత్ర వర్ణింపఁబడినది. కాని దానిలో, బుద్ధుని జీవిత ఘట్టములయందు వాస్తవమునకంటె గల్పన లెక్కువ. అట్లున్నను, దాని ప్రభావము ప్రాక్పశ్చిమ దేశముల లోని విద్వాంసుల మనస్సులపై, యమోఘముగఁ బనిఁజేసినది. ఆ గ్రంథ రచనముచే, 'ఆర్నోల్డ్' మహాశయునకుఁ, గాలమునందు, జెఱగి పోని కీర్తి దక్కెను. ఆ పరిశ్రమమునకై పాఠకు లాతనికిఁ జిరకృతజ్ఞులై యుందురు. కాని ఆర్నోల్డ్ మహాశయుఁడు రచించిన, బుద్ధచరిత్రలో, కావ్యమయ చిత్రణ మెక్కువ. 'పాల్కారస్' మహాశయుఁడు గూడ, నీ రీతిగనే యొక బుద్ధ చరిత్రమును - ఆంగ్ల వచనమున వ్రాసినాఁడు. అదియును గొప్ప శిల్పమే. వీరిర్వురి తర్వాతకూడ మఱియెందరో గవేషణమును సాగించి, బుద్ధదేవుని చరిత్రములు లిఖించిరి. కాని యిన్ని యున్నను, ధర్మానంద కోశాంబిగారి, యీ ప్రయత్నమునకుఁ జోటు మిగిలియే యుండెను. వీరు మూల పాలీ గ్రంథములు - త్రిపిటకములు. వీనిని నిష్కారుణముగ నవలోడించి, వాని యాధారముపై, సవిమర్శముగ నీ గ్రంథముగ రచించిరి. ఇట్టి ప్రయత్నమును, గావించిన భారతీయులలో మొట్టమొదటివారు వీరనుటకు సందేహమే లేదు. ప్రపంచ రచయితలలోగూడ - మొదటివారు వీరేనేమో! త్రిపిటక గ్రంథములలోను గాల్పనికముగఁ దోచిన నెన్నియో విషయములను, వీరు నిష్పక్ష పాతముగఁ ద్రోసిపుచ్చిరి. పౌరాణిక చమత్కారముల వదలిపెట్టిరి. అసంభావ్యములైన వస్తువుల విసర్జించిరి వారు నమ్మిన విషయములనుఁ గూడ - కేవలము, "గగనం - గగనాకారము" గ వివరింపక వాని యన్నిటికి మూల గ్రంథములనుండి, ప్రమాణములఁ జూపినారు బౌద్ధ, జైన, సాహిత్యములలో దొఱకు, నాటి, సామాజిక, ధార్మిక, రాజనైతిక, పరిస్థితుల నన్నిటిని, వీరెంతో కనుగలిగి గమనించిరి. ఆదరింపఁదగిన యొక్క విష

యమునుఁగూడ - వదలినవారు గారు. వీని సాయముతో, బుద్ధ భగవానుని, కాలపరిస్థితిపై, నొక యపూర్వమగు, ప్రకాశమును వెదజల్లినారు గ్రంథకర్తలు.

ధర్మానంద కోశాంబిగారు, బుద్ధదేవున కనన్యభక్తు లని ముందే దెల్పితిమిగదా ! కాని, భక్తికంటెను వీరి సత్యనిష్ఠ గొప్పది. అభినివేశములకు లోఁబడక, దాము సత్యమని నమ్మినదానిని, నిర్భయముగ వచించు నార్జవము, గ్రంథకర్త లందరికిని గల్గు నదృష్టముఁగాదు. వీరి గ్రంథమున వాడిన, భాష చాల సరళమైనది. కారణ మేమనగా, వారి రచనా ప్రయత్నము, జనసామాన్యము కొఱకే. వారికందరకు నర్థమగు భాష యుండవలెనుగదా ! ఈగ్రంథ మొక్కటియేగాదు వీరి యన్ని పుస్తకములును భాషా దృష్టిలోఁ జాల సరళమైనవి.

పాలీ భాషలో నీరి పాండిత్య మసామాన్యమంటిని. ఇది ముమ్మాటికిని నిజము. వారు పాలీ భాషలో నేమాత్రముఁ గష్టపడక - దమ జన్మ భాషలో వలెనే - సునాయాసముగ రచన మొనర్చుచుండిరి. బౌద్ధ గ్రంథములపై, పాలీ భాషలో వా రెన్నియో, టీకలు వ్రాసినారు. కొందఱు వ్యాఖ్యాతృ శిరోమణుల పాండిత్యమునకు మనము నవ్వవలసి వచ్చును. సరళములైన మూలగ్రంథ వాక్యములు, వీరి వ్యాఖ్యానముతో జటిలములై పోవును. జటిలములైన వాక్యములు, జటిలతరము లగును. అప్పుడు మూలమునః నర్థము చేసికొనుట కా వాఖ్యానకర్త సాధకుఁడు గాక, బాధకుఁడుగఁ బరిణమించును. ఈ జబ్బు కోశాంబిగారికి లేదు. వారి వ్యాఖ్యానములు-మూలము నెంతయో సరళ మొనరించి, వాని యర్థమును, "అరటి పండొలచినట్లు" పాఠకుల కందించును.

భారతీయులు, గ్రమక్రమముగ, బుద్ధ భగవానుని మఱచినారు. కళ్యాణమయములైన, బుద్ధుని బోధలపైఁ బండితు లెత్తిన యభాండములకు మితియేలేదు. ఈ యాగడములఁ జూచిన ధర్మానందులు, మనస్సున

బాధపడి వాని యదార్థ స్వరూపమును, సామాన్య జనుల కందించిరి. పండితుల శుష్కతర్కములకు, సాధ్యమైనంతవరకు, జవాబు లిచ్చినారు. ఈ గ్రంథము 'గుజరాతీ' భాషలోనికిఁగూడ ననువదింపఁ బడినది. ఆ పుణ్యము గుజరాతు విద్యాపీఠము వారిదే.

ధర్మానంద కోశాంబిగారు 1876 వ సంవత్సరమున జన్మించినారు. వీరి గ్రామము గోవా దగ్గరనున్న యొక పల్లెటూరు. గోవా సర్కారువారు పిల్లల విద్యాబుద్ధులకై యే యేర్పాటునుఁ జేయలేదు. కనుకఁ జిన్నతనమున వీరికి లభించిన విద్య గొంత మహారాష్ట్రము; కొలది సంస్కృతము మాత్రమే. పగలంతయు దమ తోటలోని టెంకాయచెట్లకు నీరు ద్రిప్పుటయందే యాతనికి సరిపోయెడిది. ఆ నాళ్ళలో, నొక మరాఠీ, మాసపత్రిక వచ్చుచుండెను. 'బాలబోధ'మని దాని పేరు. ఒకసారి యా పత్రికలో బుద్ధభగవానుని జీవితచరిత్ర వ్రాయబడినది. దాని నీ పిల్లవాడుఁ జదివెను. అతని పసిహృదయముపై బుద్ధ చరిత్ర మాసిపోని ముద్రను వైచినది. అనాఁడే యా పిల్లవాడు, దన జన్మమందు బౌద్ధధర్మమునుఁ జక్కగ సాధించ వలెనని నిశ్చయించి కొన్నాఁడు. ధర్మానంద కోశాంబిగారు, దమ జీవిత చరిత్రమున నీ క్రింది వాక్యములు వ్రాసిరి.

"ఎన్ని సంకటములు ప్రాప్తించినను, విపత్తులు సహింపవలసి వచ్చినను, బుద్ధుని ధర్మోపదేశముల నీ జీవితమున నర్థ మొనర్చికొనియే తీరవలెను. ఆనాఁడే నా జన్మకు సాఫల్యము" అని భావించితిని।

ధర్మానందునకు వయసు గడచివచ్చినది. వయస్సుతోఁ బాటు, కుటుంబమునందు గలతలు హెచ్చయ్యెను. అందుచే ధర్మానందకోశాంబిగారికి దమ బెండ్లి పెడాకులపై మనసు బోలేదు. ఒకానొకనాడు వా రిల్లు వదలినారు. ఆనాఁ డాతని కిరువది రెండేడ్ల వయసు. నేరుగా వారు బొంబాయి జేరిరి. అచటి ప్రార్థనా సమాజముయొక్క సాయముతో, కొంత

కాలము వారు, దమ యధ్యయనమును, సాగించినారు. అటనుండి పూనాకుఁ బ్రయాణము గట్టినారు. అదృష్టవశాత్తు, మహాపండితులైన డాక్టరు భండార్కారుగారి యాదర మబ్బినది. కొంతకాలము దరువాత, గ్వాలియరు, కాశీ, నగరములలో కోశాంబిగారు సంస్కృతమునుఁ జక్కఁగాఁ జదివికొనిరి. ఇప్పటికి బౌద్ధ ధర్మమునకు గావలసిన సాధన సంపత్తి సమకూరినట్లే. చిన్ననాటి యాకాంక్ష వారిలో మఱల మొల కెత్తెను. కాని బౌద్ధ గ్రంథముల నెవరు జెప్పువారు! ఈ యూహతో వారు, నేపాలు దేశమున కేగిరి. అది బుద్ధ భగవానుని జన్మదేశముగదా! అటనుండి నేరుగా బుద్ధగయకు వచ్చినారు. అక్కడికి వచ్చిన తరువాత బౌద్ధ శాస్త్రములు, త్రిపిటక గ్రంథములుఁ, జక్కఁగ బోధించు పండితులు సింహళమున దప్ప మరెక్కడను లేరని వారి కర్థమైనది.

యువకులైన ధర్మానందులు, సింహళమునకు దారి దీసినారు. దారిలో వారుబడిన గష్టముల కంతులేదు. కాని పట్టుదల వదలినది గాదు. కడకు ధర్మానందులు, సింహళమునుఁజేరి బౌద్ధధర్మ దీక్షను గైకొనిరి. వారికి ధర్మదీక్ష నిచ్చిన యాచార్యుఁడు 'మహాస్థవిర సుమంగలా చార్యుఁడు'. వారికడ వసించి ధర్మానందుఁడు, పాలీ గ్రంథముల నతి జాగ రూకతతో నభ్యసించెను. సింహళమునుండి బ్రహ్మదేశమున కేగెను. అక్కడ ధ్యానమార్గమునుఁ జక్కఁగ నవగతముఁ జేసికొన్నాఁడు. తరు వాత బర్మానుండి భారతదేశమున కా యువకుఁడు దిరిగివచ్చెను. ధర్మ జిజ్ఞాసతో - దేశదేశములు దిరుగుటలో, ధర్మానందులు బడిన యవస్థలు దలఁచిఁకొన్నచో - మనకు రోమాంచము జనించును.

సనాతన ధర్మము - బౌద్ధధర్మము - యీ రెంటిలో నొక దొడ్డభేద మున్నది. సనాతన ధర్మానుసారము, దొలుతటిది బ్రహ్మచర్యము. దాని పిదప గార్హస్థ్యము. అటుతర్వాత వాన ప్రస్థము. కడపట సన్యాసము. ఇది వరుస. ఒకానొక బ్రహ్మచారి, గార్హస్థ్యమును స్వీకరింపకయే,

సన్యాసి గావచ్చును కాని సన్యాసమును నిర్వహించుటకు వాఁ డసమర్థుఁ డైనచో, మరల గృహస్థుఁ డగుటకు వీలులేదు. అందుకే సనాతన ధర్మ సాంప్రదాయస్థులైన గురువులు, సులభముగ సన్యాసదీక్ష నివ్వరు. వారి కెంతయో విశ్వాసము గలిగిననే యొసఁగుదురు.

ఈ విషయముల బౌద్ధుల దృష్టివేరు. బాలుఁ డెదిగినంతనే, సర్వ శ్రేష్ఠమైన, భిక్షుధర్మదీక్ష నొసగుట, దమకు గొప్ప యదృష్టముగ, తల్లి తండ్రులు భావింతురు. కర్తవ్యముగఁగూడ నెంతురు. సన్యాసియైన బాల కునకుఁ, దా నా యాశ్రమమును నిర్వహింపలేనని దోచినచో వాఁడు మరల గృహస్థుఁడు గావచ్చును. వానిని బౌద్ధధర్మ మాక్షేపింపదు. భిక్షు చర్యయం దున్నవాఁడు. దన కా స్థితి యశక్య మని దోచినచో వెంటనే గురువునకు నివేదించును. ఆచార్యుని యనుజ్ఞతో, మరల వాడు గృహస్థుఁ డై పోవును. ధర్మానంద కోశాంబి యిట్లే యొనర్చెను.

భారతదేశమునకుఁ, దిరిగివచ్చిన తరువాత ధర్మానందులకు, బౌద్ధ ధర్మమును, బ్రచారము సేయఁ గోరిక గలిగినది. అందుచే వారు గలకత్తా విశ్వవిద్యాలయమం దధ్యాపకులుగఁ జేరిరి. కొంతకాలమున్న తరువాత, వారు, మహారాష్ట్ర దేశమునకు వచ్చి, బరోడా రాజైన సయాజీరావు గయక్వాడును గలిసికొన్నారు. ఆ మహారాజు ధర్మానంద కోశాంబిగారికి, గ్రాసవాసముల కేర్పా టొనరించెను. వారి సాయముతో, బౌద్ధ ధర్మమును గొంతకాలము, ధర్మానందులు బోధించుచుండిరి. మఱల పూనాకువచ్చి - డాక్టర్ భండార్కరును, దరిసించినారు. వారి సాయమున బొంబాయి యూనివర్శిటీలో, పాలీ భాషాధ్యాపలుకులుగఁ గుదురుకొనిరి.

ఆ సమయమున "డా॥ జేమ్సు ఉడ్స్" భారతదేశమునకు వచ్చెను. వారు అమెరికాలోని హార్వర్డు యూనివర్శిటీలో నాచార్యులు. "విసుద్ధి మగ్గ" బౌద్ధ గ్రంథములలోఁ జాల జటిలమైనది. దానిని హార్వర్డ్ యూని వర్శిటీ పర్యవేక్షణక్రింద వెలువరించు తలఁపు, అమెరికా బందితున

కుండినది. కాని యీ ప్రయత్నమున కొక గొప్ప పాలీ పండితుని సాయము గావలసి యుండెను. "జేమ్సువుడ్స్" దొరగారు, ధర్మానందుల నా పనికిం బురిగొల్పిరి. వారి బలవంతముతో ధర్మానందు లమెరికాకు, బ్రయాణమైనారు. అట నేవియోం గొన్ని చిలుగులు! అందుచే శీఘ్రకాలము లోనే వారు, భారతదేశమునకు మరలి రాక తప్పినదిగాదు. "ఫర్గూసన్" కాలేజీలో ధర్మానందులు 'పాలీ' శిక్షాచార్యులుగం జేరిరి. వారి చేతిక్రింద నెందరో యుత్తములైన శిష్యులు దయారైరి. ఆఱు వర్షముల యనంతరము, మరల వారు అమెరికాకు వెళ్ళి 'విసుద్ధి మగ్గ' కార్యమును బూర్తి గావించినారు,

భారతదేశమున, కలకత్తా, బరోడా, అహమ్మదాబాదు, పూనా, కాశీ - యింకెన్ని చోటులలోనో వారు నివాస మొనర్చికొనిరి. ఈ స్థలములలో వారు దయారుం జేసిన శిష్యులకు లెక్కలేరు. ఆనాండు దయారైన శిష్యులలో, నొక్కొక్క డొక్కొక్క మెరికెగా నిప్పుండు విఖ్యాతి నందినారు. ఇంతలో గాంధిమహాత్ముండు స్థాపించిన, గుజరాతు విద్యాపీఠము నుండి ధర్మానంద కోశాంబుల కాహ్వానము వచ్చెను. వారచటి కేగి కొన్ని గ్రంథములు రచించిరి. అప్పు డక్కడ బ్రసిద్ధులైన జైనవిద్వాంసు లనేకులుండిరి. పండిత సుఖలాలు మహాశయుండు, మునిజిన విజయసూరి, శ్రీ ఖేచరదాస్, రసికలాల్ పరీఖ్, మొదలైనవా రా పండితులలో బ్రసిద్ధులైన గొందఱు. ఈ జైనవిద్వాంసులతో, 'ధర్మానంద కోశాంబి' యార్ద్రభావముతో, సహకరించెను. జైన బౌద్ధ గ్రంథములపై, తులనాత్మక సాహిత్యసృష్టి యెంతయో యప్పుడు జరగినది.

1929 లో 'ధర్మానందులకు' రష్యానుండి, యాహ్వానము వచ్చెను. దానికి కారకులు ప్రొ॥ సేరబేద్‌స్కీగారు. వారు బ్రసిద్ధులైన పాలీ పండితులు.

ధర్మానందు లమెరికాలో నున్నప్పుడు, లాలా హరదయాలు గారితో, గొప్పమైత్రి గుదిరినది. లాలా హరదయాలుగారు పంజాబు దేశ

ములోని, గొప్ప విప్లవకారులు, ఆతని మైత్రితో కోశాంబిగారి భావనలు, సమాజ వాదమువైపు మొగ్గ మొదలుఁ బెట్టెను. సామ్యవాదముయొక్క గుణదోషములను. ప్రత్యక్షముగ జూచి, విమర్శించుకొను నవకాశము, రష్యాయందు ధర్మానంద కోశాంబిగారికి దొరికినది. తత్వనిష్ఠమైన వారి దృష్టి, రష్యాదేశములోని సామ్యవాదము నెంతయో యాకళించికొనెను.

బుద్ధ భగవానుని యవతారమే బహుజన హిత సుఖములకొరకు గదా! ఆ మహామహునకు భక్తులైన ధర్మానందుగారు, బహుజన హితం కరములైన కార్యముల కలిప్తులై యుండగలరా? 1930 వ సం॥ న రష్యానుండి వారు వెనుకకు వచ్చినారు. వచ్చిన వెంటనే భారతదేశ స్వాతంత్ర్య సమరమునందు, యోధులుగఁ జేరిరి. ఆ మహాప్రయత్నమందు వారు, వేయిచేతులతోఁ బనిచేసినారు. ఉప్పుసత్యాగ్రహమున వారికి ప్రత్యేకాభిమానము. దీక్షాబద్ధులైన యెందరో సత్యాగ్రహులను వారు దయారు చేసిరి. ఈ సేవకు బురస్కృతిగ వారికిఁ గారావాసము దప్పలేదు. అటుతరువాత మరల నామెరికాకు వెళ్ళినారు, అమెరికాకు వెళ్ళుట యది నాల్గవసారి. అటనుండి దిరిగి వచ్చిన వెంటనే, కాశీలోఁ గాపురముఁ బెట్టిరి. అపుడు వ్రాసినదేఁ 'హిందీసంస్కృతిఆణి యహింసా' యనెడు గ్రంథము. వారి వాక్కు వణకుశేనిది. వారి నిర్ణయములు నిర్భయము లైనవి. , ధర్మచింతనము, ధర్మచర్చ, వెన్నెముక గాఁగల, భారతీయసంస్కృతి స్వరూపమును, దోచినది తోచినట్లుగ, - స్పష్టముగ వారాగ్రంథమున, వివరించినారు. ఇట్టి నిర్భీకములైన నిర్ణయములు, వివాదాస్పదము లగుటలో నాశ్చర్యమేమున్నది?

బొంబాయి యందు, వారొక, యాశ్రమమును నిర్మించికొనిరి. ఆ యాశ్రమమున్నది, కూలీలు నివసించుచోట. దానికిఁ 'బహుజన విహారమ'ని పేరు. ఈ నాటికిని పరదేశములనుండి బౌద్ధులెందరో వచ్చి దాని యాశ్రమమున వసించుచుందురు.

బొంబాయినుండి ధర్మానందులు సారనాథునకు వెళ్ళినారు. సారనాథులో జగదీశకాశ్యపుని వంటి, ప్రసిద్ధులైన పాలీ విద్వాంసు లెందరో యుండిరి. వారికి ధర్మానందుల సహాయము గల్పతరువుగ బని చేసినది.

జైన తీర్థంకరులలో, నిరువది మూడవవాఁడు పార్శ్వనాథుడు. అతని 'చతుర్యామ ధర్మము' యొక్క ప్రభావము, ధర్మానందుల మనస్సుపై నమితముగఁ బడెను. చతుర్యామధర్మము 'అధ్యాత్మిక సమాజవాద'మను నిశ్చయము ధర్మానందులకుఁ గలిగెను. ఈ దృష్టితోఁ బార్శ్వనాథుల చతుర్యామ ధర్మముల వివరించుచు వారొక గ్రంథమునుఁ గూడ వ్రాసిరి. ధర్మానందుల మరణానంతరము, వారి స్మారకసంఘము వారు దానిని బ్రకటించిరి.

పార్శ్వనాథుని యొక్క ధర్మోపదేశ మన్నచో, కోశాంబిగారికి బరమప్రాణము. కేవలము ప్రేమించుటయేగాక,— యా ధర్మము ననుష్ఠించుటకుఁ గూడ వారు బూనుకొనిరి. "శరీరము క్షీణ క్షీణమై, దనకు తానై వ్రాలిపోవు వరకును, మృత్యువున కెదురుఁ జూచుచుండుట, మానవునకుఁ దగని పని. శరీరమందు బలస్థైర్యము లుండువరకును, జీవింపవలసినదే. ఇతరుల కుపకరింపవలసిందే. పరోపకారమునకేగదా ప్రాణము! శరీరము సేవాధర్మమున కసమర్థమైనపు డన్నము, నీరు, వదలిపెట్టి, జీర్ణవస్త్రమును వలె, దేహమును వదలిపెట్టుటయే, చక్కని పని" యని ధర్మానందు లనుచుండిరి.

ఈ యభిప్రాయముతో వారు - క్షీణమైన శరీరత్యాగమునకై ప్రాయోపవేశమునకుఁ బూనుకొన్నారు. ఈవార్త గాంధీ మహాత్మునకు దెలిసెను. ఇట్టి ప్రయత్నమునుండి విరమింపవలసిన దని వా రాదేశించిరి. గాంధీమహాత్ముని యాన శిరస్సుపై ధరించి, ధర్మానందులు, ప్రవాస దీక్షకు స్వస్తి జెప్పినారు. కాని, బ్రదుకుపై నిచ్ఛమాత్రము వారికి సంపూర్తిగఁ దొలగిపోయినది. పార్శ్వనాథుని సిద్ధాంతముపై ధర్మానందుల కున్న

నిశ్చయము, సడలనేలేదు. కొంతకాలము వారు గాశియందును, బొంబాయి యందును గడిపిరి. కడకు, మహాత్ముని సేవాగ్రామమునుఁ జేరినారు. నాడు 1947 జూన్ మాసము, 5 వ తేదీ. ఆనాఁడు ధర్మానందుని క్షీణ దేహము యిహ లోకమును వదలెను.

ధర్మానందుల దేహావసాన సమాచారము, దేశమందుఁ జిచ్చువోలె వ్యాపించినది. అపుఁడు గాంధీమహాత్ముఁడు డిల్లీయం దుండెను. వారు ప్రార్థనాసభయం దిట్లన్నారు. "మనలో నొక గొప్ప దురభిరుచి బలిసి పోయినది. గద్దలము సేయువారే, మనకు గొప్పవారు. రాజకీయములందు- యేమిపని సేయకయే- యేమో చేసినట్లు తప్పెట కొట్టుకొనుచు దిరుగు వారిని మన మాకాశమున కెత్తుదుము. కాని నిశ్శబ్దముగ నుండి, నిష్ఠతో గార్యమును నిర్వహించు కర్మయోగులను మనము బలుకరింపము. ధర్మానంద కోశాంబి యట్టి మూక కర్మయోగి."

ధర్మానందుల జ్ఞాపకార్థమై, గాంధీమహాత్ముఁడు నిధి, మొదలగున వేర్పాటు సేయనివ్వలేదు. ఆయన పేరిట డబ్బును వసూలుజేసి, బౌద్ధ ధర్మమును, సాహిత్యమును నభ్యసించుటకై, సింహళమున కేగు విద్యార్థుల సహాయార్థ మది వెచ్చింపఁ బడవలెనని యాదేశించెను. ధర్మానందుల గ్రంథములన్నియు, బ్రకటించుట కేర్పాటు గావించెను. గాంధీ మహాత్ముని యీ కార్యము, ధర్మానందుల స్వభావమున కెంతయో దగిన పురస్కృతి.

సనాతన ధర్మము, జైనధర్మము, బౌద్ధధర్మ మని, ధర్మానందుల మనస్సులో వింగడింపులేదు. దేనినైనను, గళ్యాణ కారకమైన దాని నాతఁడు ప్రేమించుచుండెను. జన్మతః యతఁడు బ్రాహ్మణుఁడు. చిన్న నాటినుండి బ్రాహ్మణుల యాచారములోని, నటనల నాతఁడు గమనించు చునే యుండెను. అందుచే బ్రాహ్మణులకు సమాజముపై నున్న దృష్టియు, నాతనికిఁ జక్కఁగ బరిచితమే. వీనితో మనస్వియైన ధర్మానందులకు,

బ్రాహ్మణులపై నొక ఈర్ష్య సముత్పన్న మయ్యెనని, వారి మిత్రులు గొందఱందురు. ఏది యెట్లున్నను, శిష్యసమూహములు, గ్రంథములు, ఉప దేశములు—వీనిద్వారా బుద్ధభగవానుని జీవనము, వ్యక్తిత్వము మున్నగు వానిని ప్రపంచమునకు వెల్లడించుటకు, ధర్మానందు లెంతయోఁ బనిజేసిరి. బుద్ధుని యుపదేశముల లోని యాదార్థ్యమును బయటపెట్టుటకు, వారు బడిన శ్రమ యింతంతగాదు. నేటి సమాజవాదము యొక్క సహాయ ముతో, బుద్ధుని యుపదేశములు జరితార్థము లగునను నమ్మకము కోశాంబి గారికి మెండుగ నుండెను. వా రీవిషయమును, దమ గ్రంథములలో నొక్కి జెప్పిరి.

మహాత్ముఁడన్నచో, కోశాంబిగారికి గొప్ప శ్రద్ధాభక్తు లుండెను. అయినను దమకు సరిపోని విషయములందు వారితో భేదించుటకు, ధర్మా నందు లెన్నఁడును జంకలేదు.

పార్శ్వనాథుని 'చాతుర్యామ ధర్మము' నుండియే, జైన-బౌద్ధ సంప్రదాయములు సంభవించెనని, ధర్మానందుల నిశ్చయము. ఇంతేగాదు. జైన, బౌద్ధ, ధర్మములయొక్క దార్శనిక దృష్టిని తోడుగగొని, జీవిత ముల బరిష్కరించి కొన్నప్పుడే సమాజవాద, సామ్యవాదములు కృతా ర్థము లగుననెడు దలఁపుగూడ వారి కుండెడిది. అట్లయిననే మానవజాతికి క్షేమము గల్గుట సంభవమని వా రనెడువారు.

వారి కిట్టి యభిప్రాయము లుండుటచేతనే, మహాత్ముని యుపదేశ ములు, వారిమనస్సుపై నెక్కువగ బనిచేసెను. గాంధీమహాత్మునకు వా రనన్య భక్తులైరి. మహాత్ముని స్వాతంత్ర్యసమరమందు—దా మొక యతిరథులుగ బనిజేసిననేఁ దమ జన్మ సార్థక మగునని వారు నమ్మిరి.

వారు జన్మించినది గోవాదేశమందు గదా! అపుడు గోవా స్వాతంత్ర్య సమరము జరగుచుండెను. "ఈ దేహమున గొంతశక్తి యుండినచో, గోవా స్వాతంత్ర్యసమరమున, నేదోయొక పని జేసియుండెడి

వాడను" అని వృద్ధాప్యమున కోశాంబిగా రనుచుండిరి. కాని శరీరము దినదినమును క్షీణించుచునే యుండును గదా! ఇంతలో 'నౌఖాలీ' దురంతములు జరగినవి. గాంధీమహాత్ముఁ డపూర్వత్యాగమును ప్రదర్శించెను. ఆ వృత్తాంతమును విన్న ధర్మానందులు గన్నీళ్ళతో. "ఈ దేహము బాగున్నచో, నేనుఁగూడ గోవాఁ జేరి, యా స్వాతంత్ర్య సమరమందు, నాదేహమును వదలియుందును" యని బల్కిరట.

ధర్మానందుల కున్న బుద్ధభక్తి, పాండిత్యపరాయణము గాదు. వారి నిష్ఠకు, శీలకు హృదయము. వారు జీవితమున నెదుర్కొనిన కఠిన పరిస్థితులకు లెక్కలేదు. దేశదేశములు దిరిగినప్పుడు, విపరీతములైన సంఘటన లెన్నియో వారికి దాపురించెను. కాని వా రే యాఘాతములకు లోగినవారు గారు. వారిజీవితము నిష్పాపము. నిర్మలము. మచ్చలేని మల్లెపూవు వంటిది. శీలము నింతగా ప్రేమించు చుండిరి గనుకనే, ధర్మానందులకు శాంతి దేవాచార్యులు రచించిన, "బోధిచర్యావతారము" గడుంగడుఁ గూర్చు పొత్తమయ్యెను దానిని వారు మరాటీ, గుజరాతీ భాషలలోని కనువదించి నారు. శాంతిదేవాచార్య లీపుస్తకమును, దమ మనోనైర్మల్యము కొఱకే వ్రాసి కొనియుండిరి. అందుచే నా పుస్తకము సర్వత్ర, శీలసుగంధ భరితమైయుండెను. ధర్మానందు లాపొత్తము నంతగాఁ బ్రేమించుట-యందుచేతనే.

కోశాంబిగా రెంతయో నిర్భీకులు. ఒకసారి వారు బరోడాలో నుపన్యసించుచుండిరి. ఉపన్యాస విషయము 'అశోక చక్రవర్తిని గుఱించి.' నాటి సభ కధ్యక్షులు బరోడా మహారాజు 'సయాజీరావుగారే!' ఈ యుపన్యాసము జరగుటకుఁ గొంతముందే మహారాజు దగ్గరకుఁ గొందఱు రాయబారము వెళ్ళియుండిరట; కల్లుదుకాణములు మూసివేయవలెనని యాజనులు రాజునకు విన్నవించుకొన్నారు. మత్తుపదార్థములతో, గవర్నమెంటు కెక్కుడ రాబడి వచ్చుచున్న దనియూ, వాని యమ్మకము

నిలిపినచో నా రాబడి తగ్గుననియు, పరిపాలనము కష్టమగుననియు వా రుత్తర మిచ్చియుండిరి. ఆ యాదాయము నితర విధముల సంపాదించుట కవకాశ మున్నచోఁ గల్లు దుకాణముల మూసివేయుటకుఁ దమ కాక్షేపణ లేదనియు, దెల్పియుండిరట! ఈ విషయము ధర్మానందులకు దెలిసెను. వా రుపన్యాస మధ్యములో, "అశోకుఁడు దన రాజ్యమున మద్యమును నిల్పియుండెను. కల్లునుండివచ్చు నాదాయము, యితర రీతుల వచ్చినచోఁ దాను మద్యమును నిలుపుదునని యశోకుఁ డనలేదు" యని నిర్భయముగ నుపన్యసించిరి. మహారాజేమియుఁ బలుకలేదు. ఉపన్యాసానంతరము, "ధర్మానందజీ! తమరు మాకుఁ జక్కని పాఠమును నేర్పితిరి" యనిపలికి వారు వెళ్ళిపోయిరి.

ధర్మానందులపై మహారాజునకు గోపము వచ్చెనని యందఱు ననుకొన్నారు. అందుచే నిదివఱకు మహారాజునుండి ధర్మానందుల కందుచున్న సహాయము, యికమీద ముట్టదని వా రనుకొనిరి. కాని యా తలఁపునకు విద్దూరముగ జరగినది, మఱుదినమే, దమ రాజ్యమందు గల్లు దుకాణములు మూసివేయవలెనని, మహారాజుగా రుత్తరువు దయచేసినారు

## కోశాంబిగారి సాహిత్యము

బౌద్ధులు దీక్ష గైకొనునప్పుడు, 'శరణత్రయము'ను పఠింతురు. కోశాంబిగారు తొట్టతొలుత నీ శరణత్రయముపై వ్యాఖ్యాన మొనర్చిరి. అదే వారి మొదటి గ్రంథము.

వీరి యుత్కృష్ట గ్రంథము, 'బుద్ధలీలాసార సంగ్రహము.' దీనిలో బౌద్ధసంప్రదాయము ననుసరించి, బుద్ధభగవానుల పూర్వజన్మ కథలు, గొన్ని చెప్పబడినవి, గౌతమబుద్ధుని విపులమైన జీవిత చరిత్రయు గలదు. వారి ధర్మోపదేశముల సారముఁ గూడ నీ గ్రంథమున నున్నది. ఈ పొత్తము బౌద్ధధర్మమునకు గావించిన సేవ యింతింతగాదు. ఇంటింటిలో నీ పుస్తకము ప్రవేశించెను. చదివినవారికెల్ల హృదయము మార్చెను.

బుద్ధుఁడు దన కనుయాయులైన భిక్షులకు కొన్ని సంఘ ధర్మము బుపదేశించెను. వైయక్తికమైన జీవనమునకు, సంబంధించిన నియమము లనుఁ గూడ నేర్పాటు జేసినాఁడు. ఆ ధర్మబోధలు 'వినయపిటక'మందు గలవు. ఆ బోధల సారమును, మా కందివ్వవలెనని నేను కోశాంబిగారి నర్థించితిని. ఆ యభ్యర్థనా ఫలమే "బౌద్ధ సంఘాచాపరిచయ" యను గ్రంథము.

బుద్ధ భగవానుని యుపదేశములు, పాలీ భాషలో 'ధమ్మపదము' 'సుత్తనిపాతము'అను రెండు గ్రంథములుగఁ గలవు. ఈరెండు పొత్తము లును జాల సుందరమైనవి. ధర్మానందు లీ రెంటి ననువదించిరి. నిత్య పారాయణము కొఱకై యొక పాలీ లఘుపాఠమునుఁ దయారు జేసిరి. దానిలో మరాటీ భాషాంతరముఁ గూడ నొసగి యున్నారు. మహాయాన పంథలో శాంతి దేవాచార్యులు బ్రసిద్ధులు. వారి రచనలలో, 'బోధిచర్యావ తారము' గొప్ప గ్రంథము. దానినిఁగూడ, "కోశాంబి" గా రనువదించిరి.

'విసుద్ధిమగ్గ' బౌద్ధమత సాధనా సర్వస్వము, దానిని సంశోధించి, ప్రకటించుటకే ధర్మానందులు, నాల్గు తడవ లమెరికాకు వెళ్ళినది. ఈ గ్రంథముపై వారు పాలీ భాషలో 'దీపిక' యను టీకను రచించినారు. దానిసారమును మరాటీ, గుజరాతీ భాషలలోని కనువదించిరి. ఆ యను వాదమునకు, 'సమాధి మార్గము'ని బేరు.

బౌద్ధ సాహిత్యమం దత్యంత సుందరమైనవి జాతక కథలు. వీనిలో బుద్ధుని పూర్వజన్మ వృత్తాంతము లున్నవి. ధర్మానందులు వీనిని సంగ్రహించి, గుజరాతీ భాషలోఁ బ్రకటించిరి. బుద్ధుఁ డిల్లు విడుచుటకుఁ గారణము; రోగిని, వ్యాధితుని, మృత్యుగ్రస్తుని జూచుట యని జెప్పుదురు. ఇది కేవలము గాల్పనికమైన కథ. వాస్తవమున కంటె, దీనిలో గావ్యత్వ మెక్కువ. నిజమునకు వా రిల్లు విడిచిన దీకారణములతోఁ గాదు. బుద్ధుని గృహత్యాగమునకుఁ గారణములు, ధర్మానందులు తర్కసహముగ, వివ

రించినారు. ఆ యభినివేశముతోనే వారు, 'బోధిసత్త్వ నాటకము'నుఁ గూడ, మరాటీలో వ్రాసిరి. బోధిసత్త్వుఁ డిల్లు వదలుటకు గల కారణము లను-ఆ నాటకముఁ జక్కఁగ దెలుపును. 'అభిధమ్మము'ను గ్రంథముపై వీరు 'నవనీత' మను టీక లిఖించిరి. దానిసారము గుజరాతికిఁ గూడ, ననువదింపబడెను.

గుజరాతు విద్యాపీఠమందు ధర్మానందులు, జాలకాల మాచార్యులుగ నుండిరి. ఆ సాకుతో జైన, బౌద్ధ సాహిత్యములకు వీ రొనర్చిన సేవ వర్ణనాతీతము. అమెరికాయం దున్నప్పుడు లాలా హరదయాళుగారి సహ వాసముతో వీరు, సమాజ సత్తావాదము నభ్యసించిరి. ఆ వ్యాసంగ ఫలమే "హిందీసంస్కృతి - ఆణి యహింసా", "పార్శ్వనాధ - కా - చాతుర్యా మ ధర్మ" యనెడు రెండు గ్రంథములు.

నివేదనము - 'ఖులాసా' యను మఱి రెండు గ్రంథములు గలవు. ఆ రెండును వీరి యాత్మచరిత్రలే. 'నివేదనము' గుజరాతీ - మరాటీ లలోఁ బ్రకాశితమై యున్నవి. 'ఖులాసా' యింకను వెలుఁగు జూడ లేదు.

—కాకాసాహబ్ - కాలేల్కర్



# ఆధారభూత గ్రంథములు

ఈ పొత్తమున ముఖ్యముగా 'పాలీ' భాషలోని 'సుత్తపిటకము' ననుసరించితిని. 'అట్ఠకథ'ను గూడ ననుసరించిన దెక్కువయే. 'వినయ పిటకము' లోని విషయములను గూడ గొన్నిటిని వాడుకొంటిని. కాని 'సుత్తపిటం' విషయములలో సంవాద మున్నపుడే 'వినయ పిటకము' నాదరించితిని. వినయపిటకమున కన్నను 'సుత్తపిటకము' నకే యైతిహాసిక ప్రాముఖ్య మెక్కువ యని నా తలంపు.

జైన వాఙ్మయమునుండి 'యాచారాంగ సూత్రము, భగవతీ సూత్రము, దశవైకాలిక సూత్రము, ప్రవచన సారోద్ధారము' - అను పుస్తకములను మాత్రమే గ్రహించితిని.

మొదటి ప్రకరణమున 'ఋగ్వేదము' నుండి కొన్ని విషయములు గ్రహించినాను. ఉపనిషత్తులనుగూడఁ దడవితిని.

'ధర్మసూత్రములు, మనుస్మృతి'యు నా కుపకారకములే.

విష్ణుశాస్త్రి చపళూణ్కర్ మహాశయుల 'బాణభట్ట' చరిత్రనుండి కొంతభాగము నుల్లేఖించితివి. కాని యీ భాగమును గైకొన్నది — పూర్వపక్షముగ మాత్రమే.

Arctic home in the vedas : by B. G. Tilak.
Myths and Legends of Babylonia and Assyria : by Lewis Spence
A History of Babylon : by L. W. King
Buddhist India (1903) by Prof. Rlys Danids

ఈ పై గ్రంథములను నా కార్యమున కెంతయో యుపకరించినవి.

# ప్రస్తావన

పాలీ వాఙ్మయమందుఁ 'దిపిటక' (త్రిపిటక) ములను గ్రంథసముదాయము ముఖ్యమైనది. దానిలో- 'సుత్తపిటకము' దొలిభాగము. మలిభాగము 'వినయ పిటకము.' మూఁడవది 'యభిధమ్మపిటకము'. సుత్తపిటకమందు ముఖ్యముగా బుద్ధుఁడు - యాతని యగ్రశిష్యులు గావించిన యుపదేశములు సంకలితములు. భిక్షువు లెట్లు వర్తింపవలెనో వివరించుచు బుద్ధుఁడేర్పరచిన నియమములు. యా నియమములు సేయుటకుఁగల కారణములు - యప్పుడప్పు డా నియమములలోఁ దీర్చిన మార్పులు - చేర్పులు, వానిపై టీకలు, యివి యన్నియుఁజేరి 'వినయ పిటక'మైనది. అభిధమ్మ పిటకమునం దేడు ప్రకరణము లున్నవి. బుద్ధుని యుపదేశములలో - విచార సహములైన యంశములపై - యూహాపోహాలు దీసిలాని విషయము.

'సుత్తపిటకము'లోఁ పెద్దభాగములైదు. 'దీఘనికాయ-మజ్ఝిమ నికాయము'లు మొదటిరెండు, 'సంయుక్త నికాయము - అంగుత్తర నికాయము' ద్వితీయ చతుర్థ సంఖ్యాకములు. 'ఖుద్దక నికాయము' గడపటిది. 'దీఘ నికాయము'లో ముప్పదిరెండు సుత్తము లున్నవి. ఇవి యన్నియు నించుమించు దీర్ఘకాయములే. పెద్దవైన సుత్త

ముల నిండు సంకలనము సేయుటచేతనే - దాని కా పేరు. 'దీఘము' దీర్ఘశబ్ద భవము.

'మజ్ఝిమ నికాయ'మందు నడిమి తంపు సూత్రముల సంకలన మున్నది. అందుకే దానికి 'మజ్ఝిమ' (మధ్యమ) నికాయమని పేరు. 'సంయుత్త నికాయము'లో మొదటి భాగమందు గాథామిశ్రితములైన సుత్తములు సంగృహీత ములు. రెండవదానియందు వేఱువేఱు విషయములపై సుత్త ములున్నవి. వానిలో గొన్ని చిన్నవి, కొన్ని పెద్దవి. దాని నందుకే 'సంయుక్త నికాయ' మందురు. 'సంయుక్త' మనఁగా మిశ్రితమని యర్థము. 'అంగుత్తర నికాయ'మందు - పోను పోను, క్రమక్రమముగా నంగముల పరిమాణము పెరుగుచుం డును. దీనియందుఁ బదునొకండు నిపాతము లున్నవి. ఒక్కొ క్క నిపాత మందును బుద్ధుఁ డొక్కొక్క విషయమును గురించి యుపదేశించిన 'సుత్తముల' సంగ్రహణముండును. అట్లే - 'దుక' 'తిక' నిపాతములు మొదలైనవి.

'ఖుద్దకనికాయ' మనఁగా - చిన్ని ప్రకరణముల సంగ్ర హము. దానిలో - బదునైదు ప్రకరణము లున్నవి. ఖుద్దక పాఠ-ధమ్మ పదో దానేతి వృత్తక సుత్తనిపాతములు మొదటి దైదు. విమానవత్థు, పేతవత్థు, థేరగాథా, థేరీగాథ జాతక ములు తరువాతివి. 'నిద్దేశ, పటిసంభిదా మగ్గములు' పిదపవి. 'అపదాన, బుద్ధవంస, చరియాపిటకములు' గడపటివి. ఇది సుత్తపిటకముయొక్క విస్తృత స్వరూపము. వినయపిటక మునం దైదుభాగము లున్నవంటిమిగదా! పారాజిక పాచి తి

యాది మహావగ్గములు మొదటి మూఁడు. చుల్లవగ్గ పరివార పాఠములు దగువాతి రెండు.

ఇక మూఁడవది 'యభిధమ్మ పిటకము'. దీని కేడు ప్రకరణములు. 'ధమ్మ, సంగణి, విభంగ, ధాతుకథా, పుగ్గల, పంజత్తి కథావత్థువు'లు క్రమముగా వచ్చును. తరువాత - 'యమక' పట్ఠానములు గలవు.

బుద్ధఘోషునికాలమందు - అనఁగా క్రీ॥ శ॥ ఐదవ శతాబ్దమున, ని గ్రంథసముదాయములోని వాక్యములకు, 'పాలి' యనెడు సంకేతముండెడిది. బుద్ధఘోషుఁడు దన గ్రంథములందు 'త్రిపిటకవచనము'ల నిర్దేశింపవలసి వచ్చినపుడు 'అయమేత్థపాలి' 'పాలియం'దిట్లు యనును; లేక 'పాలియం వుత్తం' 'పాలీలోఁ జెప్పఁబడినది' యనిపలుకును. పాణిని వైదికపదములను సూచించుటకు 'ఛందసి'యని వాడుట నాడుక. 'భాషాయాం' యను పదముచే సమకాలీన సంస్కృతభాషను - సంకేతించును. అట్లే - బుద్ధఘోషాచార్యుఁడును 'పాలియం' యనుమాటచే 'త్రిపిటక వచనము'ల నిర్దేశించును. 'అట్ఠకథాయం' యని ప్రయోగించి - యాకాలమందు సింహాలీభాషలో బ్రచలితములైన 'అట్ఠకథ'లలోని వాక్యముల నుల్లేఖించును.

'అట్ఠకథ' యనఁగానేమి? అర్థసహితమైనకథ. 'త్రిపిటకము'లందలి వాక్యముల కర్థములు వివరించునప్పుడు వాని కుపస్కారకములుగ మరికొన్ని గథలు - గారణములు - జెప్పు పరిపాటి సింహళద్వీప మందుండెడిది. కాలాంతరమున నీ 'యట్ఠకథ'లు వ్రాతలకెక్కినవి. కాని - వానిలో బునరుక్తి

లెక్కన నైగానా విషయములు సింహళద్వీపవాసుల కర్థమైనంత నన్యదేశములవారి కర్థముగావు. కొన్ని యుపయోగ పడవుగూడ. ఈ బాధను గమనించిన బుద్ధఘోషాచార్యులు - వానిలో ముఖ్యమైన కొన్ని 'యట్ఠకథల' నేఱికొని, 'త్రిపిటక' భాషలోని కనువదించిరి. ఇంకఁజెప్పవలసిన దేమున్నది? దినములు గడువఁగాఁ 'త్రిపిటకము'లకిచ్చిన గౌరవము వానితో సమానముగ వీనికిని దక్కెను. 'త్రిపిటకము'లకు జెల్లినట్లే 'పాలి' యనుపదము 'అట్ఠకథ'లకుఁగూడ జెలామణి యైనది. నిజమునకు 'పాలి' యనుపదము భాషావాచకమే గాదు. పాలీభాషకు మూలము మాగధి. మరి, యీ నవీన నామకరణ మీరీతిగ జరగినది.

పై జెప్పిన 'త్రిపిటకము'ల విభాగ మెప్పుడేర్పడెను? రాజగృహమునందు జరగిన 'ప్రథమభిక్షుపరిషత్తు'లో నీ విభాగమేర్పడెనని బుద్ధఘోషాచార్యుల యభిప్రాయము బుద్ధుఁడు బరినిర్వాణమందిన తరువాత భిక్షువులు శోకాకులురైరి. వారి నోదార్చువానివలె 'సుభద్రుఁడ'నెడు వృద్ధభిక్షువొకఁడు "బుద్ధుఁడు జచ్చుటయే మంచిదైనది. ఆతఁడు బ్రదికినంతసేపు 'యీపని జేయుఁడు.యీపని జేయకుండ'ని నియమములుగీచి మమ్ము నిరంతర బంధమున బడవేసి వేధించుచుండెను. ఇప్పుడానిర్బంధము దప్పినది. ఎవరికి రుచించినట్లు వారు నడచుకొన వీలయ్యె"నని పలికినాఁడు. ఈ వృద్ధుని మాటలకు మహాకాశ్యపునకు భయమయ్యెను. బుద్ధుఁడు బలికిన ధర్మవినయ సూత్రము లొకచోట జేర్చకున్నచో 'సుభద్రు'నివంటి భిక్షుకులు స్వైరచారులగుటకవకాశము జిక్కును.

అందుచేఁ- గొందఱిగ భిక్షుసంఘమును జేర్చి ధర్మవినయములను సంగ్రహింపవలెను. ఈ యాలోచన గట్టిదయే తడవు- మహాకాశ్యపుఁడు రాజగృహమం దేనూఱు భిక్షువుల సమావేశ పఱచెను. అవి చాతుర్మాస్యలు. ఆసభలో 'ఉపాలి' యను శిష్యుని సహాయముతో వినయసూత్రముల సంగ్రహణము జరగినది. తరువాత నానందుని బ్రశ్నించి యతని సాయముతో 'సుత్త' 'అభిధమ్మపిటకము' ల సంగ్రహించిరి. కొందఱు .'ఖుద్దకనికాయము' ను 'అభిధమ్మపిటక' మందే జేర్చియుండవలె నందురు. కొందఱు 'సుత్తపిటక' మందుఁ జేర్చవలెనందురు.

పైవిషయ మంతయు 'సుమంగల విలాసినీ నిదాన కథ'లోని సారాంశము. ఇదే యథావత్తుగా 'సమంత పాసాదికా' యనెడు 'వినయ అట్ఠకథ' యొక్క 'నిదానకథ' లోను - గనబడుచున్నది. కాని - పై విషయమునకు 'త్రిపిటక' గ్రంథములందు - లవమేని యాధారములేదు. బుద్ధభగవానుని 'పరినిర్వాణము' నకుఁ బిదప - రాజగృహమందు - భిక్షుసంఘముయొక్క మొదటి పరిషత్తు జేరినమాట నిజమే. కాని- ఈ పరిషత్తులో నిప్పుడు గన్పడు 'పిటకముల' విభాగము జరుగనేలేదు. 'పిటక' మనెడు పేరుగూడ యా పరిషత్తున నుచ్చరించినట్లు గానరాదు. అశోక కాలము వరకు బుద్ధుని యుపదేశము లన్నియు 'ధర్మము - వినయ' మను రెండు విభాగములుగ మాత్రమే యుండినవి. ధర్మమున దొమ్మిది భాగము లుండెనని విందుము. సుత్త గేయ్య, వేయ్యాకరణ గాథోదానములైదు. ఇతివుత్తక, జాతక,

అబ్భుత ధమ్మ, వేదల్లము, లని దక్కినవి నాలుగు. ఈయంగముల యుల్లేఖము 'మజ్ఝిమనికాయము'లోని 'అలగద్దూపమ సుత్తము' నందు 'అంగుత్తర నికాయ'మందును నేడుసారులు వచ్చినది.

పాలీ యందలి సుత్త శబ్దమునకు సంస్కృతములోని 'సూక్త - సూత్రము' లు రెండును మూలము లౌటకు సంభవమున్నది. వేదములందు సూక్తములున్నట్లే పాలీభాష యందు గూడ నివి 'సూక్తము' లని గొందఱనిరి. కాని - మహాయాన సంప్రదాయ గ్రంథములు మాత్రము - వీనిని సూత్రములనెను. ఈ యర్థమే సంగతముగఁ దోచుచున్నది. నవీన కాలమందు - సూత్రమన్న వెంటనే స్ఫురించునవి - పాణిని సూత్రములు - వానివంటి బ్రహ్మసూత్రములు యిత్యాదులు. కాగా - నాశ్వలాయన గృహ్యసూత్రములు, మొదలైనవి యీసంక్షిప్త సూత్రముల కంటెను గొంచెము పెద్దవి. ఈ వ్యవహారము ననుసరించియే 'పాలీ' భాషలోను సూత్రరచన మొదలయ్యెనని దలఁపవచ్చును. 'పాలీ' సూత్రముల ననుసరించి యాశ్వలాయనాది సూత్రరచన మేర్పడెనా? లేక బౌద్ధులీ సూత్రముల పోకడల ననుసరించి రచించిరా? యను వివాదము - యిపుడనావశ్యకము. ఒకటి నిజము. అశోకునకు ముందు బుద్ధుని యుపదేశముల పై వివరణ వాక్యముల వంటి యే రచన లుండెనో వానిని 'సుత్తము' లనుచుండిరి. అవి స్వరూపమున నంతఁ బెద్దవి గావు.

గాథాయుక్త సూత్రములను 'గేయము' లందురు. ఈ పరిష్కారము 'అలగద్దసుత్తము' యొక్క యట్ఠకథలో-నివ్వఁ

బడినది. ఆ 'యట్ఠకథ'లో - దాని కుదాహరణము గూడ - సంయుత్త నికాయముయొక్క మొదటి విభాగమివ్వఁబడెను. గేయగాథా లక్షణములకు భేదము దెలియవచ్చుట లేదు. రెండు నొక్కరీతిగనే గన్పట్టుచున్నవి. మఱి-గాథయని వేఱు విభాగము ప్రచారములోనేలవచ్చెనో చెప్పలేము. 'గేయ్య' మనఁగా యీ ప్రకారమైన గాథ - యని యొక విశిష్ట లక్షణము జెప్పుటకు సాధ్యపడుట లేదు.

వేయ్యాకరణ మనఁగా వ్యాఖ్య. ఒక సూత్రమును గైకొని - దానికి మట్టసముగగాని - విపులముగగాని- యర్థము సేయుటకు 'వేయ్యాకరణ' మనిపేరు. దీనికి సంస్కృత వ్యాకరణ శబ్దముతో సంబంధమున్నట్లు గానరాదు.

ధమ్మపదము - థేరగాథ - థేరీగాథ - యీమూఁడు గ్రంథములకు 'గాథా' సందర్భము క్రిందనే లెక్కయని బుద్ధఘోషాచార్యుల యభిప్రాయము. కాని - థేర - థేరీ గాథలు బుద్ధునితరువాత మూఁడు నాల్గు శతాబ్దములలో నున్నట్లగపడదు. ఇఁక ధమ్మ పదమందమా! అది కేవలము జన్న గ్రంథము. గనుక గాథయను పేరు దానికి మాత్రమే జెల్లునా ? లేక మఱి కొన్ని గాథలు గూడ యీ విభాగములో జేరునా ? యని నిర్ణయించుట గష్టము.

పైని జెప్పఁబడిన 'ఖుద్దకనికాయము' యొక్క పట్టికలో- 'ఉదాన' మనెడు పేరువచ్చినది. దానిలోని యుదానములు- నారీతిగనే, 'సుత్తపిటకము' మొదలైన కొన్నియెడల గన్పడు నితరవచనములు వీనియన్నిటికి గలిపి

'యుదాన'మను నామము జెల్లెనని బుద్ధఘోషాచార్యులన్నారు. కాని యశోక కాలము నాటికి వీనిలో నెన్ని 'ఉదానము' లుండెనో దేల్చుట గష్టము. అశోక కాలానంతరమిది- దిన దినమునకును బెరిగె ననుటలో సందేహము లేదు.

'ఇతివృత్తక' ప్రకరణమందు - 112 యితి వృత్తకములు సంగ్రహింపఁబడినవి. వీనిలోఁ గొన్ని యశోక కాలమునను దాని యనంతర మొక శతాబ్దమునను శరీరమును ధరించినవి. ఆపైని బెరుగుచుఁ బోయెను.

జాతకము లనెడు కథలు సుప్రసిద్ధములు. వీనిలో- గొన్నిటిని గమనించినపుడు 'సాంచి—బర్హుత్' యీ స్తూపముల చుట్టుపట్టులలోని తెలఁగులు గన్పడుచున్నవి. దీనిని బట్టి జాతకము లనేకములు యశోకుని కాలమందే బౌద్ధ వాఙ్మయమున దిన్నగఁ బ్రవేశించెనని యూహింపవచ్చును. 'అబ్భుతధమ్మ' మనఁగా - నద్భుతమైన చమత్కారము. బుద్ధ భగవానుఁడు- యితని యొక్క ప్రముఖ శిష్యులు జూపిన యద్భుత చమత్కారములను వర్ణించు నొకానొక గ్రంథ మాకాలమున నుండెనని యీ పదము సూచించును. మరి - యీ నాఁడా గ్రంథముయొక్క [illegible] దెలియదు. దాని యన్ని భాగములును - నేఁడు 'సుత్తపిటకము'న గలసి పోయియున్నది. బుద్ధ ఘోషాచార్యులవారు, 'అద్భుత ధర్మము'నఁగా నేమి? యని వివరించుట గష్టమగుచున్నది. ఆయన యన్నాఁడు:

చత్తారోమే భిక్ఖవే అచ్ఛరియా [illegible] ధమ్మా
ఆనందేతి ఆదినయ ప్పవత్తా సబ్బేపి [illegible] రు

అబ్భుతధమ్మ పటి సంయుత్తా

సుత్తంతా అబ్భుత ధమ్మం తివేదితచ్చా.।

'భిక్షువులారా ! ఈ నాలుగాశ్చర్యములైన యద్భుత ధర్మము లానందమధ్యమున వసించుచున్నవి. ఈ రీతిగ నద్భుత ధర్మములచే మొదలైన, యాశ్చర్యాద్భుత ధర్మ యుక్తములై సర్వసూత్రములును, నద్భుత ధర్మములని దెలియవలెను.'

బుద్ధఘోషాచార్యుల గల్పన యేదో క్లిష్టముగ నున్నది. అతఁడు జెప్పిన 'అబ్భుతధమ్మ' గ్రంథమునకు-నద్భుత ధర్మములకును సంబంధమేమియు లేదు.

'మహావేదల్ల' 'చూళవేదల్ల' ములని రెండు సూత్రములు. 'మజ్ఝిమ నికాయమం'దున్నవి. వీనినిబట్టి వేదల్ల మనెడు ప్రకరణ మెట్లుండునో యూహింపవచ్చును. మహావేదల్లమందు 'మహాకోట్ఠితుఁడు సారిపుత్తుని గొన్ని ప్రశ్నలడుగును. వీనికి సారిపుత్తుఁడు యథాయోగ్యముగ సమాధానము లిచ్చును. రెండవదానిలో 'ధమ్మదిన్నా' యనెడు 'భిక్షుణికి' విశాఖునితో నడచిన సంవాదమున్నది. 'ధమ్మదిన్న' పూర్వాశ్రమమందు-'విశాఖుఁ'డామె మగఁడు. ఈ రెండు సుత్తములును బుద్ధభాషితములు గావు. సంవాద రూపములైన వానిని 'వేదల్లము' లందురు. ఇతరుల సంవాదములకేగాక, శ్రమణులు-బ్రాహ్మణులు మొదలైనవారితో బుద్ధునకు జరిగిన సంభాషణములను గూడ నొక గ్రంథముగ జోడించి-'వేదల్లము'లని బిలుచుచుండినట్లు దోచును.

పై జెప్పిన దొమ్మిది యంగములు నేర్పడుటకుముందు 'సుత్తగేయ్యము'లను విభాగములు రెండే యుండి-పిక్కిన యంగము లెల్లను- వానియందే గలసియున్నట్లు దోచును. ఈ యనుమానమును 'మహాసుజ్ఞాతసుత్తము'లోని విషయము గూడ బలపరచుచున్నది. ఆ విషయ మిది. బుద్ధభగవానుం డానందునితో ననుచున్నాండు—

"నభో ఆనంద అరహతి సావకో సత్థారం అను బంధితుం
యదిదం సుత్తంగేయ్యం, వేయ్యాకరణ స్స హేతు.
తం కిస్స హేతు. దీఘరత్తం హినో ఆనంద
ధమ్మా సుతాధాతా వచసా పరిచితా".

"ఓయీ, యానందా! సుత్త-గేయ్యముల స్పష్టీకరణకై శ్రావకుండు గురువువెంట దిరుగుట వాంఛనీయము గాదు. ఎందుకనంగా- నీవే ఈ విషయములన్నియు విన్నావు. నీ కివి బరిచితములే"

అనంగా-దీని పిండితార్థమిది. సుత్తము-గేయ్యము, ఇవి రెండే బుద్ధుండు స్వయముగ నొనరించిన యుపదేశములు. వాని వ్యాఖ్యానాద్యర్థ వివరణము శ్రావకుల కొప్పింపంబడి నది. పోను పోను-వానిలో మఱి యాఱంగములు జేరెను. ఇంకను గొన్ని గలిపి-నేటి, బ్రహ్మాండమైన యీ స్వరూపము నొసంగినారు. దీనిలో-బుద్ధుండే స్వయముగ నిచ్చిన యుపదేశము లేవి? ఇతరులు గల్పించిన వేవి? అని నిర్ణయించుట గొంత కష్టమే. కాని-యశోకుని యొక్క 'భాబ్రా-లేక భాబ్రూ'యను శిలాలేఖముల యాధారముతో పిటకము

లందు ప్రాచీనము లేవియని సూచనా నేయుట యసాధ్యము గాదు.

అశోకుని 'భాబ్రా' శిలాలేఖములలో బుద్ధుని యే డుప దేశములు-భిక్షుణీ, భిక్షుకులు-నుపాసికోపాసకులు – మాటి మాటికిని విని, మననము సేయవలెనని యున్నది. ఆ యుప దేశము లీ క్రిందివి:- 1. వినయ సముకసే 2. అలియవసాని 3. అనాగతభయాని 4. మునిగాధా 5. మోనేయసూతే 6. ఉపతి సపాసినే 7. లాఘులోవాదే ముసావాదం అధిగిచ్య భగవతా బుద్ధేనా భాసితే.

పై యేడిటిలో నేడవది 'మజ్ఝిమనికాయము'లోని 'రాహులోవాద' 'సుత్త' (నం 61) మేనని-పాశ్చాత్యులైన 'ఓల్డెన్ బర్గ్' 'సేనార్' మొదలైనవారు ఋజువు సేసిరి. తక్కినవాని 'భోగట్టా' దీయుటకును ప్రొఫెసర్ డేవిడ్సు యత్నించెను. కాని సుత్తనిపాతములోని 'మునిసుత్తము' దప్ప నతఁడు జూపిన దక్కినవన్నియుఁ బొరపాటులే. పై వానిలో నాల్గు * 'సుత్తములెం'దులోని వను విమర్శనను నే నొక • సారిగావించి యుంటిని. దానిలో-వాని పుట్టు పూర్వోత్తరముల విచారము గొంతయున్నది. ఆ వ్రాత లనేకు లామోదించిరిగూడ. మొదటి సూత్రమును గుఱించి నా కపుడేమియు 'పత్తా' దెలియలేదు. 'వినయసముకసే' (వినయ సముత్కర్ష) యనుదానికి – వినయ గ్రంథముతో నేదో యొక-సంబంధ ముండవలెనని నాకుఁదోచినది. కాని–

---

* 2, 3, 4, 5, 6 సుత్తములు:

• 1912, ఫిబ్రవరిలోని 'ఇండియన్ ఆంటిక్వెరీ' సంచిక.

దాని కాధారము ? ప్రాచీన గ్రంథములలో నెక్కడను దాని యూసేలేదు. దీనితో మొదటి 'సూత్రము' పై యే నిర్ణయమునకు నపుడు రాలేకపోయితిని.

ఏది యెట్లున్నను వినయ శబ్దమునకు 'వినయగ్రంధ' మని యర్థము సేయుట మాత్ర మన్యాయము. 'అహంభో కేసి పురిసదమ్మం సణ్హేన పివినేమి ఫరుసేన పివినేమి. (అంగుత్తర చతుక్కనిపాతము. సుత్త, నం. 111) తమేసం తథాగతో ఉత్తరం వినేతి (మజ్ఝిమ, సుత్త, నం107)యన్నూనాహం రాహులం ఉత్తరిం అసవానం ఖయేవినేయ్యంతి (మజ్ఝిమ, సుత్త, నం. 147)ఇత్యాదులలో 'వి' పూర్వకమైన 'ని' ధాతువునకు 'నేర్పించుట' యనియే యర్థము. ఈ యర్థమును బట్టియే-గాలక్రమేణ-వినయము యొక్క నియమములకు 'వినయపిటక'మని వాడుకయైనది. బుద్ధుఁడు – భిక్షువుల సంఘమును నిర్మింప మొదలుపెట్టిన నాటికి-'వినయగ్రంథము' బుట్టనేలేదు. ఏదైనను బోధింపవలసి నప్పుడది-'సుత్త' రూపముననే జేయఁబడెడిది. పంచవర్గీయులు బుద్ధునికడ బ్రణిపాత మొనర్చినపుడు వారి శిష్యత్వము 'ధమ్మచక్కపవత్తన సుత్తము' యొక్క యుపదేశముతో నారంభమైనది. అందుచే 'వినయ' శబ్దమునకు మొదటి యర్థము– 'ఉపదేశించుట' యనియే గ్రహింపవలెను. కనుక వినయముయొక్క సముత్కర్ష యన్నచో బుద్ధుని యత్కృష్ట ధర్మోపదేశములని యర్థము. 'సముక్కంస' శబ్దము 'పాలీ' భాషయందు 'బుద్ధోపదేశ వాచకము'గఁ గన్పడుట లేదు. కాని 'సాముక్కంసికాధమ్మదేసనా' యను వాక్యము జాల యెడల నున్నది. 'దీఘని

కాయమున' 'సంబట్ఠ సుత్తపు' గడపటి సన్నివేశమును-జూడుడు.

"యదా భగవా అఞ్ఞాసి బ్రాహ్మణ పోక్ఖర సాతిం కల్లచిత్తం ముదుచిత్తం వినీవరణచిత్తం ఉదగ్గచిత్తం, పసన్నచిత్తం అథయా బుద్ధానం సాముక్కంసికా ధమ్మదేసనా తం పకాసేసి దుక్ఖం సముదయం నిరోధం మగ్గం"

(బుద్ధుఁ డెపుడు 'పౌష్కరసాతి' బ్రాహ్మణుని చిత్తము ప్రసంగమున కుచితము. మృదువు, యావరణ విముక్తము యుదగ్రము ప్రసన్న మని గ్రహించెనో, యపుడు 'సాముత్కర్షిక ధర్మదేసన' నాతనికి వివరించెను. అది ఎట్టిది? దుఃఖము, దుఃఖ సముదయము, దుఃఖ నిరోధము, తన్నిరోధ మార్గము)

ఈ సుత్తమందే గాదు. "మజ్ఝిమనికాయము'లోని-'ఉపాలిసుత్తము' వంటి యితరము లందును 'వినయపిటకము!' లోను ననేక చోటుల నీ వాక్యమే వచ్చుచున్నది. 'అంబట్ఠ సుత్తమున 'పోఖ్కరిసాతి' బ్రాహ్మణు నుద్దేశించి చెప్పఁబడినది. ఇక్కడ 'ఉపాలి' మొదలైన గృహస్థుల నుద్దేశించి యుపదేశము. భేద మింతే. దీనిని బట్టి 'వినయ సముత్కర్ష' మనెడు పదమునకు వినయమన నుపదేశము. దాని సముత్కర్ష మనఁగా 'సాముత్కర్షిక ధర్మదేసన' యని యర్థమని దోచును. ఒకానొకనాఁడు - నాలుగు గార్యసత్యముల యుపదేశమును 'వినయసముక్కంస' మనెడు వారు. దీన సందేహము లేదు. 'ధమ్మ చక్కపవత్తన సుత్త' మనెడు పేర అశోకునికిఁబిదపఁ జాలకాలమునకు బ్రచారమునకు వచ్చినది.

'వినయ సముకసే' యనునదే 'ధమ్మచక్కపవత్తనము' యని గ్రహించినచో 'భాబ్రూ' శిలాలేఖమందు నిర్దేశింపఁబడిన యే డుపదేశములు బౌద్ధవాఙ్మయమున గన్పడు చున్నవి. అవి యివి :

1. వినయసముకసే - ధమ్మ చక్కపవత్తనసుత్త
2. అలియవసాని - అరియవంసా (అంగుత్తరచతుక్కనిపాతము)
3. అనాగతభయాని - అనాగతభయాని (అంగుత్తర పంచకనిపాతము)
4. మునిగాధా - మునిసుత్త (సుత్తనిపాతము)
5. మోనేయసూతే - నాళకసుత్త (సుత్తనిపాతము)
6. ఉపతిసపసినే - సారిపుత్తసుత్త (సుత్తనిపాతము)
7. లాఘులోవాద- రాహులోవాద (మజ్ఝిమ సుత్త. సం. 61)

ఈ యేడింటిలో 'ధమ్మచక్కపవత్తనము' అనేక చోటుల వచ్చును. ఆ వచ్చుటయే దాని మహాత్వవిశేషమును జెప్పుచున్నది. అందుకే - యశోకుఁడు దానిని దొట్ట తొలుత నిర్దేశించెను. తక్కినవానిలో మూఁడు-సుత్తనిపాతము లోనివే. దీనిచే-సుత్తనిపాత ప్రాచీనత వ్యక్తమగుచున్నది. సుత్తనిపాతమందలి గడపటి రెండు వర్గములు 'ఖగ్గవిసాణసుత్తము' - వీనిపై 'నిద్దేశ' మనెడు నొక విపుల టీకయున్నది. అది 'ఖుద్దకనికాయము' ననే జేర్పఁబడినది. 'సుత్త నిపాతము' లోని యీ భాగములు 'నిద్దేశ' టీక

కంటె-యొకటి రెండు శతాబ్దములైనను ప్రాచీనములు గాకున్నచో వానిపై టీక బుట్టదుగదా! ఈ కారణము చేతను సుత్తనిపాతము జాలప్రాచీన మనియే తెలియుచున్నది. దీనిలో నన్ని సుత్తములును-ప్రాచీనము లనుటకు వీలులేకున్నను-కొన్నిమాత్ర మత్యంత ప్రాచీనము లనుట కే సందేహమును లేను. ప్రస్తుత గ్రంథమందు బుద్ధునిచరిత్ర—యాతని యుపదేశములు వీనిని గురించి జేయఁబడిన చర్చ యీ ప్రాచీన సుత్తములపై నాధారపడియే.

ఇక బుద్ధచరిత్రను విచారింతము.

త్రిపిటక గ్రంథములలో నెక్కడను- బుద్ధుని చరిత్ర యు కే యొకచోట సముదితముగాలేదు. 'జాతకట్టకథ' లోని నిదానకథలోఁగొలుత దీనియావిర్భూతి ఈ యట్టకథ. బుద్ధఘోషుని కాలమున— అనఁగా నైదవ శతాబ్దమున వ్రాయఁబడినది. దీనికిముందు 'సింహాలీయట్టకథ' యొకటి యుండెడిది. దానినుండి చాలవిషయము యట్టకథ లోనికి దిగినది. ముఖ్యముగ దీనిలోని బుద్ధచరిత్ర 'లలితవిస్తరము' నాధారముగ గొని వ్రాయఁబడెనని దోచును. 'లలితవిస్తర' రచనాకాలము క్రీ॥ పూ॥ మొదటి శతాబ్దమో-దానికి గొంత ముందో యగును. ఆ గ్రంథము-మహాయాన సంప్రదాయము నకుఁ జెందినది. దానినుండియే 'జాతకాట్టకథా' కారుఁడు దన బుద్ధచరిత్రను సంగ్రహించెను. 'లలిత విస్తరము'గూడ- దీఘ నికాయములోని 'మహాపదానసుత్తము' నాధారముగ గొనియే రచితమైన ట్లున్నది. ఆ సుత్తమున 'విపస్సి' బుద్ధునిచరిత్ర విపులముగ వర్ణితము. దానిసాయముతో

'లలితవిస్తర' కారుఁడు బురాణమును రచించెను. ఇట్లే- గౌతమ బుద్ధుని చరిత్రలోను- జాలవిషయములు ప్రవేశించి నవి.

మహాపదానసుత్తములోని గొన్నిభాగములను వేరుగ దీసికొని వానిని సుత్తపిటకములోని బుద్ధచరిత్రములోని కెక్కించినట్లు గన్పడును. ఉదాహరణార్థము – మూఁడు ప్రాసాదములవిషయమును బర్యాలోచింతము. 'విపస్సి' రాజకుమారుఁ డుండుటకై మూఁడుప్రాసాదములు మహాపదానసుత్తము ప్రకారముండినవి. మఱి-గౌతము బుద్ధునికేల లేకపోవలెను? ఇతనికిని ప్రాసాదత్రయ ముండెనను కల్పన బయలుదేరెను. ఇది చాలదేమో యన్నట్లు 'దనకు మూఁడుప్రాసాదము లున్నవనియు, దానందుస సుఖముగ నుంటిననియు గౌతమబుద్ధుని నోటినుండియే బలికించి గ్రంథ కర్తలు కృతార్థులైరి. గౌతమ బుద్ధచరితలో వచ్చు-సీ మూఁడు మేడలగొడవ నిజముగాదని యీ గ్రంథమున గొంత ఋజువు పఱచితిని. కాని నాకొక జిక్కు- దటస్థపడెను. ఈ మూఁడు మేడలకథ యంగుత్తర నికాయమున గూడ నున్నది. అందుచే గౌతమబుద్ధుని చరిత్రలోని ప్రాసాదములకథ యొక వేళ నైతిహాసిక సత్యమై యుండునా!' యని యనుమానము దోచెను. కాని నాకొకవిషయము సంరక్షకమైనది. 'భాబ్రూ' శిలా లేఖనములోని రెండు సుత్తము లంగుత్తర నికాయమున గనపడినవి. దానిపై మఱికొంత వివేచన సేయఁగా సంగుత్తర నికాయములోని యెన్నో భాగములర్వాచీనములుగఁ జేర్పబడినవిఁగా నర్థమయ్యెను.

మూఁడు ప్రాసాదముల గుఱించిన విషయము 'తికనిపాత' మందును సంగ్రహింపఁ బడినది.

ఇట్టికలగా పులగముగ నున్న కథలనుండి విశ్వసనీయమైన బుద్ధుని చరిత్ర నెట్లుగడ్డకు దీయుట? తీయవచ్చుననియే దోఁచినది. ఆ ప్రయత్నమునే నే నీగ్రంథమందు గొంత జేసినది. ఇట్టి యత్నము నింతవర కెవ్వరును జేయగా నేను జూచినది లేదు. పైగా నితరులు బుద్ధుని చరిత్రలో- దానిని బరిశోధించుటలో- నేవి యల్పము లనుకొందురో- యావిషయములు నాదృష్టిలో గొప్పవిగఁ గానుపించినవి. కాని- సంశోధనా పద్ధతిలో నే నెక్కడను దారి దప్పిపోయినట్లు నాకు గనిపించుట లేదు.

పైగా నీపద్ధతి నవలంబించి విమర్శ యారంభించినచో- బుద్ధుని చరిత్ర యాకాలము నందలి యితిహాసము- వీనిపై నొక క్రొత్త వెలుఁగు బ్రసరించుటకు వీలగునని నా విశ్వాసము. ఆ విశ్వాసముతోనే యీపొత్తమును వ్రాసితిని. దీనిలోని కొన్ని భాగములు ముందొకప్పుడు- పురాతత్త్వ మనెడు త్రైమాసిక యందును 'వివిధజ్ఞానవిస్తార' మనెడు పత్రిక యందును ప్రకటింప బడినవే. కాని యావ్యాసముల నున్నవాని నున్నట్లు- యీగ్రంథమునకు జేర్ప లేదు. వానిలో నెన్నియో మార్పులు- చేర్పులు జరగినవి.

ఆవ్యాసములలోని చాలవిషయము లీ పుస్తకమున గన్పించుచున్నను నిది యొక స్వతంత్ర గ్రంథ మనుటలో సందేహము లేదు.

ఈ పుస్తకము యొక్క వ్రాతప్రతిని నవభారత గ్రంథ మాలా సంపాదకుల కిచ్చితిని. వారు దయతో దీని నంతయు జదివిరి. ఈగ్రంథములో కొన్నివిషయముల గుఱించి యింకను విశేషముగ వివేచనము సేయవలసి యుండెనని యట్టి తావులుగొన్ని నాదృష్టికి దెచ్చిరి. వానిని గొంత యీప్రస్తావనలోనే విచారించుట మంచిదని తలంచినాను. ఈక్రిందివి వారిప్రశ్నలు- నా సమాధానములు.—

1 బుద్ధుని జన్మతిథిని గుఱించి వేలువేలు మతభేదము లున్నవిగదా! వాని నుల్లేఖించి వానిలోని సాధక-బాధకము లను జర్చించి యొక నిర్ణయము చేల్చవలదా! మన ప్రాచీన లేక మధ్యయుగ చరిత్రలోని 'గ్రంథకారులు, ధర్మగురువులు, రాజ్యకర్తలు,' మొదలైనవారి చరిత్రలు వ్రాయునపుడు, సాధారణముగ విమర్శకులుం దొలుత, వారి కాలనిర్ణయము సేయుటకై యెంతయో శ్రమింతురు. ఆ పని ఈగ్రంథమున మీరేల జేయలేదు? దీనికిది నాసమాధానము:— మధ్య యుగమునకు-జెందిన కవులు గ్రంథకారులు, వీరు శకకర్తలు గారు. వీరి జన్మతిథులను గుఱించి యెంత వాదించి కొన్నను నికరముగ దేలు ఫలము మాత్రము సున్న. బుద్ధుని విషయ మట్టిదిగాదు. అతని పరినిర్వాణము నుండి నేటివర కాతని పేర నొక శకమే యేర్పడినది. మధ్యకాలములోని పాశ్చాత్య పండితులు వాద వివాదములు సేసికొని, యాతని జన్మతిథి 56 యనియు 65 యనియు దికమకలు-బడి యొక సిద్ధాంతము నకు రానే లేకపోయిరి. 'సింహళద్వీపము' లోనున్న పరం పరయే సిద్ధాంతిత మయ్యెను. బుద్ధుని జన్మతిథిలో-గొంత

హెచ్చు-తగ్గులు వచ్చినచో - దానిచే నాతని చరిత్రకు గలుగు లోపమేమియు లేదు. నా దృష్టిలో-నాతని జన్మతిథి విషయ మంత ముఖ్యమైన సమస్యగాదు. మఱి 'బుద్ధుఁడు పుట్టుటకుముందు సమాజస్థితి యెట్లున్నది? ఆస్థితిలో బుద్ధుడు నవీనమార్గము నెట్లుపదేశించెను?' యనునవి. ఈ విషయములు గొంత విశదముసేయ బూనుకొన్నచో- నీ నాఁడు బుద్ధుని గుఱించి ప్రచారమందున్న యనేకములు కల్పనలు దొలఁగి పోవును. ఆనాటి యితిహాసముగూడ మనకు స్పష్టముగా నర్థమగును. ఈయూహతో బుద్ధుని జన్మతిథిని నిర్ణయించుట కీగ్రంథమందు నే నెక్కుడ శ్రమింపలేదు. బుద్ధుని చరిత్ర కేవి యత్యంతోపయుక్తములో, వానిపైననే నాచూపును గేంద్రీకరించితిని.

2 "బుద్ధుఁ డుపదేశించిన యహింసను- హిందూ సమాజము 'తూ. చా' తప్పక యనుసరించినది. దానివల్లనే యీజాతి సత్వవీర్యము లుడిగి- పరులకు 'పవాడా'లు బాడ నారంభించెను" అని గొంతమంది వాదము. ఈ విమర్శ కీ గ్రంథమున సమాధాన మీవలిసి యుండెను.

బుద్ధుని చరిత్రలో నీ విమర్శ కంతగా సందర్భ మున్నట్లు నాకు దోచలేదు. అయినను జూతముగాక! బుద్ధుని పరినిర్వాణము క్రీ॥ పూ॥ 543 వ వర్షమున జరిగి నది. అటుపిదప రెండు శతాబ్దములకుఁ జంద్రగుప్తుఁడు సామ్రాజ్యమును స్థాపించెను. అతఁడు జైనధర్మానుయాయి యందురు. కాని గ్రీకుల నీదేశమునుండి వెడలనడచుట కహింసాసిద్ధాంత మతనికడ్డురాలేదే! అతని దాహిత్రు డశో

కేఁడు నూటికి నూరుపాళ్లు బౌద్ధుఁడు. కాని యోగ మహా సామ్రాజ్యము నాతఁడు పాలించినది.

మహమ్మదు 'బిన్నకాసీము' క్రీ॥ శ॥ 712 వ సంవత్సర మందు సింధుదేశముపైకి దండెత్తెను. అప్పు డచట బౌద్ధధర్మము వ్యాపింపలేదు. బ్రాహ్మణ ధర్మమే 'తోజుగా' నుండినది. మఱియుఁటి జయుంతవాఁడైన యాఖలీపా సరదారుఁడు సింధుదేశమును బాదాక్రాంత మొనర్చుకొనెను. ఆ రాజును జంపి, యాతని ముద్దుల గూతును 'ఖలీఫా' కు 'నజరానా'గా బంపినాఁడు. ఆ చచ్చిన హిందూరాజు-అహింసావాది గాఁడే!

ముసల్మానులు - సింధు - పంజాబులలోని గొన్ని భాగములను బాదదళిత మొనర్చిన నూరేండ్లకు శంకరాచార్యుఁడు జన్మించెను. ఆయన వేదాంతము నంతయు - క్రోడీకరించిజూచినచోఁ దేలుముఖ్యవిషయ మేమి? శూద్రులు వేదము జదువరా దనునదే! వాఁడు వేదవాక్యము విన్నాఁ డనఁగానే - యా చెవులలో సీసము బోయవలెనట! లక్కనింపవలెనట! వేదవాక్యము నుచ్చరించిననో - వానినాల్క గోయవలెను. వేదమంత్రము ననుష్ఠించినవానిని జంపవలెను. ఇది యతని వేదాంతమునిగ్గు! ముసల్మానులు వాకిటికి ద్రోసికొనివచ్చిరి. ఈ సంఘటనమునుండి సనాతను లేమిగుణపాఠము నేర్చికొన్నారు? ఇఁక బుద్ధుఁడన్ననో వీరికిఁ బ్రత్యక్ష శత్రువు. ఆతనినుండి వీ రేమైన నేర్చికొందురా!

రాజపుత్రులు 'నికాలసు' గా సనాతనులు. వార లహింస నాదరింపలేదు. అవసరము వచ్చినచోఁ దమలోఁ దాము తలల నుత్తరించుకొనుచుండిరి. హింసాసిద్ధాంతమునకు

బరమభక్తులైన యీ శూరులను 'మహమ్మదు గజనీ' దన గంఖాణాంకిలకింది ధూళికన్న హీనముగఁ జూచెను. మఱి వీరు బౌద్ధులు గారే!

మహారాష్ట్రదేశమందలి 'పీష్వాలు' పేరుమోసిన బ్రాహ్మణభక్తులు. కడపటి బాజీరావు 'ధర్మనిష్ఠ'కుఁ బరాకాష్ఠ. హింస వీనిలో గట్టుకుఁ దన్నెను. యుద్ధములలో వీరి స్వైరవిహార ముండనేయున్నదిగదా! అంతమాత్రమే కాదు. ఊరక కుడిచికూర్చున్నప్పుడుగూడఁ బరులరక్తముఁ దృప్తి దీర గ్రోలనిది వీరికన్నులు మూతపడవు. కారణములేకయే- 'దౌలతరావు సింధియా' పూనాను లూఠీజేసెను. వేఱొక సారి - 'యశ్వంతరావు హోల్కర్' పూనాపైఁబడి ప్రాణ మాన - సంపత్తులను దోఁచెను. ఇట్టి యీ నిస్సీమ హైందవ భక్తుల సామ్రాజ్యము, హిందూదేశమంతయు నేల వ్యాపింపలేదు? నిజమునకుఁ బీష్వాలకంటెను, ఆంగ్లేయులు నూఱింత లహింసావాదులు. మఱి యీ యహింసావాదుల పాదముల నీ హింసావాదులు బట్టిరి. ఒకరొకరుగ నాంగ్లేయుల కోడి పోయిరి.

జపాను నేటి కెంతయోకాలమునుండి బౌద్ధధర్మాను యాయి. 18౫౩ లో నాదేశముపై 'కమోడోర్ ఫెరీ' తుపాకు లాడించినప్పుడు జపానుదేశము గన్నులుదెరచి యేకీకృతమై పోరాడెనుగదా! వారి కహింస యడ్డురాలేదే!

బౌద్ధముపై నెసరువెట్టువారీప్రశ్నలకు సరియైన సమాధానము లీవలెనని నా యాశ. ప్రసిద్ధుఁడైన మోరో పంతు 'స్వయంకృతాపరాధము లితరులపై వేసి' రుద్దు పెద్ద

మనుష్యులను జూచి యొక యాార్యావృత్తమును వ్రాసి నాఁడు. ఆ పెద్దమనుష్యు లీ విమర్శకులవంటివారే. వారు - వారిపూర్వులు జేసిన యన్నిపాపములు బుద్ధునిపైఁ ద్రోసి తామేదో చాతుర్యము జూపినట్లు వర్తింతురు.

బోధిసత్త్వునకు 'సంబోధి' గల్గిన పిదప - నడచిన యాతని చరిత్రకుఁ - గాలక్రమము ననుసరించి రూపురేఖలు దిద్దవలసియుండెను. ఆ పని యీ గ్రంథమున జేయలేదు.

ఇప్పటివర కుపలబ్ధమైన ప్రాచీనవాఙ్మయముయొక్క యాధారముతోఁ నీ పనిజేయుట సాధ్యముగాదు. బుద్ధుని యుపదేశములు-కాలక్రమానుసార మా గ్రంథములం దివ్వఁ బడలేదు. ఇంతమాత్రమే గాదు. బుద్ధుని యుపదేశము లనెడు వానిలోగూడ - నెంతయో యితరులపొత్తు జేరినది. వీనిలో బుద్ధుఁడే యొనర్చిన యుపదేశము లేవి? ఇతరులు జేసినవేవి? యని గనుగొన యత్నించుట కడిదియైన యుద్యోగము. అయినను యీ ప్రయత్నము గొంతవఱకీగ్రంథమున జేసితిని. కాలముననుసరించి - బుద్ధుని చరిత్రను గ్రమపరచుట యిప్పటిలో సాధ్యముగాని పని.

4. 'వైదిక సంస్కృతి' యార్యులు భరతఖండమునకు వచ్చినతర్వాతఁ బుట్టినది. దానికి ముందు - 'దాసుల' అనఁగా -'బ్రాహ్మణుల సంస్కృతి యుండినది.' యని వ్రాసితిరి. దీని కాధారమేమి?

దీని విచారము గొంత నా 'హిందూసంస్కృతి ఆణి యహింసా' యను గ్రంథము మొదటిలోఁ గావించితిని. ఆ గ్రంథముగూడ దీనివలెనే - నలుగురును జదువదగినదని నా

యభిప్రాయము. చదివినవారందఱు నా యభిప్రాయములనే స్వీకరింపవలెనను చాపల్యము నాకులేదు. నాదృష్టిలో నే విషయములు వివేచనా యోగ్యములని దోఁచి నవో వానిని బాఠకుల ముందుంచితిని. నేను జేసినపని యంతే. 'దాసులు-ఆర్యులు'- వీరి సంస్కృతి యొక్క స్వరూప-స్వభావ వివేచనతో-బుద్ధచరిత్ర కంతగా సంబంధములేదని నా యూహ. ఈ రెండు సంస్కృతుల సంఘర్షణముతో నుత్పన్నమైన సంస్కృతి బుద్ధునికాలము నకుఁ జక్కఁగా - బ్రతిష్ఠితమై యుండెనను విషయమును రేఖామాత్రముగ సూచించునంతటివఱకే - యీ గ్రంథము లోని మొదటిప్రకరణముయొక్క ప్రయోజనము.

5. ఉపనిషత్తులు - గీత యివి బుద్ధుని యనంతరము రచింపఁబడిన వనుట కాధారమేమి ?

ఈ ప్రశ్నకును, నా 'హిందూ సంస్కృతి - ఆణి అహింసా' యను గ్రంథమందే యుత్తరములు గలవు. వానిని మరల నీ గ్రంథమునను వివరించుట, బునరుక్తియే యగును. ఒక యుపనిషత్తు లేమి ? - యారణ్యకములుగూడ బుద్ధునికిఁ దరువాత వ్రాయఁబడినవే! దీని కెన్నియో గారణములు జూపించినాను. 'శతపథ బ్రాహ్మణ' మందును, 'బృహదారణ్యక' మందును, నివ్వఁబడిన వంశావళిని బట్టి చూచినచో - ఆ పరంపర బుద్ధుని యనంతరము-ముప్పది యైదు తరములవరకు సాఁగినట్లు దోఁచును. 'హేమచంద్ర రాయచౌదరి' ప్రతితరమునకు - ముప్పదివర్షములు, లెక్క గట్టెను. ఒక్కొక్కతరమునకు - తక్కువలోఁ దక్కువ -

యిరువదియైదు వర్షములు జమకట్టికొన్నను, బుద్ధుని యనంతరము (875) వర్షముల పర్యంత మీ పరంపర జెల్లినది. అనఁగా సముద్రగుప్తునికాలమువఱ కన్నమాట. అప్పటికీ- బ్రాహ్మణులు - ఆ యుపనిషత్తులు, యిప్వోసు దిరపడిరి. కాని యంతకు ముందాయుపనిషత్తులలోఁ గొన్నిమార్పులు- జేర్పులు గలుగలేదనుటకు వీలులేదు. 'పాలీ' వాఙ్మయమునఁగూడ నీ స్థితియే బట్టినది. బుద్ధఘోషునకు, రెండునూర్లవర్షములకు ముందే 'పాలీ' వాఙ్మయము స్థిరపడెను. కాని - బుద్ధఘోషుఁడు 'అట్ఠకథ' (టీకా) వ్రాసినతరువాతనే యాభాష 'భాష' యనిపించుకున్నది. శంకరుఁ డుపనిషత్తులపై 'టీక' వ్రాసినది తొమ్మిదవ శతాబ్దమందు. అంతకు ముందు, 'గౌడపాదుల మాండూక్య కారిక' లుండెను. దానిలో నక్కడక్కడ బుద్ధునిస్తుతి యుండనే యున్నది. ఇంత యెందుకు? అక్బరుచక్రవర్తి కాలమున వ్రాయఁబడిన 'యల్లోపనిషత్తు' గూడ, నుపనిషత్తులలో నొక్కటియై గూర్చున్నదిగదా!

ఆత్మవాదము - తపశ్చర్య - యీ రెండుసిద్ధాంతములను, శ్రమణసంప్రదాయమునుండి, యుపనిషత్తులు గైకొన్నవి. ఇందులో సందేహము లేదు. అందుచే నీ రెండు విషయలకు, యజ్ఞయాగముల సంస్కృతితో నే సంబంధము లేదు. నేఁడు- ఆర్యబ్రహ్మ సమాజములు. 'బైబిలు' లోని యేకేశ్వర వాదమును దెచ్చి, వేదములు- ఉపనిషత్తులు [illegible] రుద్దుటకు, ప్రయత్నించుట మనము జూచుచునే యున్నాము. ఇట్లే యీ నాఁ డాత్మవాదము- తపశ్చర్య యీ రెంటిని

వేదములపై, పద్దుటకు, 'ఉపనిషత్తులు' యత్నించెను. కాని యుపనిషత్తులు, —శ్రమణుల యహింసనుమాత్ర మంగీకరింపలేదు. అంతవఱకు దమ వైదికత్వమునకు భంగము రానివ్వక నిలిపికొన్నవి. ఇది యట్లుండగా,— నేటికిఁగూడఁ గర్మఠులైన మీమాంసకు లుపనిషత్తులను, వైదికములను టకుఁ దయారుగా లేరు.

'పాలీ'భాషా మూలగ్రంథములుగాని, - లేక వాని యాంగ్లానువాదములుగాని, జదువఁగల్గువారికి యీనాగ్రంథము సత్యశోధనలోఁ గరదీపికగాఁ దోడుపడును. ఆ యవకాశములేనివా రీక్రింది మైనుపుస్తకములు దప్పక జదువవలెను.

1. బుద్ధ ధర్మ ఆణి సంఘ
2. బుద్ధ లీలాసార సంగ్రహ
3. బౌద్ధ సంఘాచాపరిచయ
4 సమాధి మార్గ
5. హిందీ సంస్కృతి - ఆణి ప్రశింసా

ఈ గ్రంథములు నలుగురి మెప్పు సంపాదించికొనుటకై వ్రాయలేదు. కేవలము సత్యాన్వేషణ బుద్ధితోనే రచింపఁ బడినవి. సత్యమెన్నటికిని లోకమునకుఁ గొంత కటువే. అట్టియెడ - సువిచారప్రకాశన మండల సంచాలకులు— యీ పుస్తకమునకు దమగ్రంథమాలలో స్థానమొసఁగిరి. చాల సంతోషకరమైన విషయము. నిర్వికారమైన మనస్సుతో, ప్రాచీ నేతిహాసమును విమర్శించు సనేకులు

మహారాష్ట్రీలున్నారు. వారీగ్రంథ సహాయమును గైకొని సువిచార ప్రకాశన మండలి యొక్క ప్రయత్నమును సఫలము సేయుదురని నా యాశ.

ప్రొ॥ శ్రీనివాస నారాయణ వనహట్టి యీపుస్తకమునకు, (మరాఠీ గ్రంథము) ప్రూఫులు దిద్దుట మొదలైన శ్రమలో నాకు సాయపడెను. వారికి నాకృతజ్ఞత.

— (సం) ధర్మానంద కోశాంబి.

—...—

# అనుక్రమణిక

# ప్రథమ ప్రకరణము

## ఆర్యుల జయము

### ఉషస్సూక్తము

ఋగ్వేదమునం దుషస్సూక్తము లున్నవి. వాని నాధారముగఁ గైకొని - లోకమాన్యతిలకుగారు -దమ "The arctic home in the Vedas" అను పొత్తమునందు 'ఆర్యు లుత్తరధ్రువప్రాంతము లందుండి' రని - నిర్ణయించుటకై శ్రమించిరి.

సదృశీ రద్యసదృశీ రిదుశ్వో

దీర్ఘం సచంతే వరుణస్యధామ (ఋ. 1-123-8)

* (ఈదినము, రేపు. యీరెండును సమానములే. ఇది దీర్ఘకాలపర్యంతము- వరుణదేవుని యింటిని బొందు చున్నవి.)

ఈ ఋక్కును - దీనివంటి మఱియొక ఋక్కును- ఉత్తరధ్రువప్రాంతములలోని యుషస్సు నభివర్ణించున వని- లోకమాన్యుల తలఁపు; అయినచో 'దీర్ఘకాలపర్యంత ముష వరుణగృహమును బొందుచున్నది' యనుట కభిప్రాయమేమి? ఉత్తరధ్రువమునం దాఱునెలలు జీఁకటియుండును గదా! ఆ

---

* Arctic home in the Vedas, పేజీ 103 చూడుము.

విషయమే ఆలంకారికముగ ఋక్కునందుఁ జెప్పఁబడిన దని- లోకసామాన్య లర్థమును పొసఁగించిరి.

ఇంతవరకు బాధలేదు. కాని- దీనికిఁ బన్రెండవ ఋక్కునం దుషోదేవికి విశేషణములు—

• "అశ్వావతీ ర్గోమతీ ర్విశ్వవారా"

అని వాడఁబడినవి. 'వేనియందుఁ గొల్లలుగ గుఱ్ఱములును- గోవులును గలవో - యేవి యెల్లరచేతను బూజింపఁ బడునవో' యని యీ విశేషణముల కర్థము. ఉత్తరధ్రువమునం దిప్పుడు- గుఱ్ఱములు మొదలేలేవు. గోవులసలు లేవు. నేఁడుగా కున్న నొకవేయి యేఁడులకు ముందైనను నిట నవి యుండె ననుటకును- ఆధారములు లేవు. ఈ యొక సూక్తమునందే గాదు; అనేక ఋక్కులలో నుషోదేవిని గురించి 'యామె యశ్వవతి. గోప్రదాత్రి. గోవులకు జన్మదాత్రి' యిత్యాది విశేషణములు వాడఁబడినవి. దీనినిబట్టి యీఋక్కులుత్తర ధ్రువమునందు - రచింపఁబడలేదనుట దెల్లము.

ఇశ్తర్

అయినచోఁ బైని చెప్పిన వరుణగృహ వృత్తాంత మునకుఁ గతియేమి? 'బాబిలోనియ'ను దేశమునందుఁ జాల ప్రాచీనమైన కథ యొకటి గలదు. దాని నిట జోడించినచో నా ఋక్కునకర్థము సరిపోవును. ఆ కథయిది. 'ఇశ్తర్' నువాఁ డొక దేవత. అతనికి 'తమ్ముజ' లేక 'దముత్సి' (వైదికదమ్

• ఇట నుషశ్శబ్దము—బహువచనాంతము

నన్) యను పేరుగల దేవతపై వలపుకలిగినది. కలిగినదే తడవు 'నముత్సి' మరణించెను. ఆమెను బ్రతికింపవలెనని 'యిశ్తర్' నకాకాంక్ష. దానికుపాయ మమృతాపహరణమే. అపుడు 'యిశ్తరు' పీయూషమును గొనివచ్చుటకై పాతాళమునకుఁ బోయెను. పాతాళరాణికి 'అల్లతు' యని పేరు. ఆమె యీతని దోఁబుట్టువే. కాని - యామెకెందుకో యమృత మొసఁగ నిచ్చలేదు. అందుచే నారాణి 'యిశ్తరు' ను భయంకరముగ వేధించినది. వానివస్తువులన్నియు లాగుకొన్నది రోగములు గూడఁదెప్పించెను. కారయందు ద్రోయించెను. ఈ రీతి నైదారు నెలలు గడచినవి. 'ఇశ్తరు' దన పట్టాన్ని వదల లేదు. కడకామె కమృతమివ్వక దప్పినదిగాదు దానిని గొని యతఁడు *ఋడమికి వచ్చినాఁడు 'ఇశ్తరు' నుగురించి యిం కను ననేక కథలున్నవి. కాని - వాని యన్నిట నిది దలకట్టు వంటిది. 'బాబిలోనియ'ను సారస్వతమందీగాథకున్న ప్రచార మింతంతగాదు. ఋగ్వేదమునందలి వైఋక్కులీకత నుద్దేశిం చియే ప్రవర్తించియుండును. దీన సంటయము లేదు.

'ఇశ్తరు' పాతాళమునుండి భూమికివచ్చినపుడా ఋతు వునం దాతనికి మరియాదనొనరింప నెత్తికోలుండెను ఎఱ్ఱని- యెద్దులుగట్టిన బండియం దాతనికి మెరమణి సాగుచుండినది. ఇంతలో - గుఱ్ఱములు వెదకి తెచ్చి రథమునకుఁగట్టి యా రథ ముపై నాతని నూరేగించిరి. 'ఏషాగోభి రరుణో భిర్యుజానా' (ఋ-5-80-3) (ఎఱ్ఱని యెద్దులీడ్చు రథముగల నీయుష) విత

---

* Lewis Spenu: Maths and Legends of Bobylonia and Assyria PP 125 - 131.

ద్యాయు రరుణయుగ్భి రశ్వైః (ఋ. 6-65-2) (అరుణవర్ణము లయిన హయము గలిగిన రథమునం దుషో దేవి వచ్చెను.) యను సూక్తాక్షరము లీసన్ని వేశమును సూచించును.

## యుద్ధములందుఁ దురగముల నుపయోగించుట

క్రీస్తునకు రెండువేలయేండ్లకుముందు 'బాబిలోనియా' వారికి గుఱ్ఱముల వాడుకయే దెలియదు. రథముల కెద్దులు గట్టెడువారు. గాడిదలను గూడ వాడుచుండిరి. వారు గుఱ్ఱముల నడవిగాడిద లనుచుండిరి. బాబిలోనియనున కుత్తర దిక్కున గొండజాతులవా రుండిరి. వారికి 'కేశీ' జనులని పేరు. ఆ జనులు దమ సామానుల మోసికొని వచ్చుటకై హయములనుపయోగింప మొదలు వెట్టిరి. వా రీయడవిగాడిదలను 'లగాము' లకు మచ్చిక యొనర్చిరి. వీనిపైన సవారి చేయుచు- ధాన్య సేకరణకై - 'బాబిలోనియాకు' వచ్చెడివారు. అచటి రైతులకుఁ బనిలో దోడ్పడి-'కూలికి' దొరకిన గింజల నీ గుఱములపై వేసికొని యూరిత్రోవఁ బట్టుచుండిరి. ఈ 'కేశీ' జనులకు యుద్ధకళ దెలియనే తెలియదు. వా రీ కళ 'బాబిలోనియా' జనులనుండి నేర్చిరి. నేర్చి వారే దొట్ట తొల్త హయములను గయ్యములకు వాడినది. *

గందశుఁడు 'కేశీ' జనుల రాజు. అతనికి గుఱ్ఱపు దళము లెచ్చు. ఆ బలముతో నతఁడు- 'బాబిలోనియా'ను నిర్జించి సార్వభౌముం డై నాఁడు. ఈ సంఘటనము జరిగినది, క్రీ॥ పూ॥ 1760 వ, వర్షమునందు. 'కందశు'ని పిదప

*L. W. King : A History of Babylon (1915) P. 125

నావంశపువారే రాజులైరి.*ఈ గాథలోఁ దేలినవిషయమిది: 'క్రీస్తుశకమునకుఁ బదునెన్మిది శతాబ్దములముం దశ్వముల నాహవములందు వాడిరని దెల్పుట కేయాధారములును లేవు.' వేదములం దక్కడక్కడ నలఁతియలఁతిగ హయముల మహత్త్వము వర్ణింపఁబడినది. ఆ వర్ణన 'కేశీ' జనులకు వానితోనున్న సన్నిహిత సంబంధమును దెలుపు నంతే. కాఁబట్టి యార్యులు 'సప్తసింధు' వుపై కెత్తి వచ్చిన ఘట్టము క్రీ॥ శ॥ బదునేడువందల వర్షములకన్నను ముందునకు ద్రోయుటకు సాధ్యమేగాదు. ఇదిస్పష్టము.

దాసులు

ఆర్యులరాకకు ముందు సప్తసింధు(సింధుపంజాబులు) ప్రదేశములలో దాసులరాజ్యములుండినవి. 'దాస' శబ్దమునకు సేవకుఁడనుట నేటియర్థము. కాని వేదమందు 'దాస్' లేక 'దాశ్' యీ రెండు ధాతువులును 'యిచ్చుట' యను నర్థమున బ్రయుక్తములు. తర్వాతి నిఘంటువులందును వీనికి 'దానార్థ' మే యున్నది. కనుక- దాసుఁడనఁగా- దొల్లిట 'దాత' ఉదారుఁడు (Noble) యను నర్థముండినది. అవెస్తా గ్రంథమునందు 'ఫర్వదన్ యస్త' మున నీ దాసదేశములందుఁ బితరులపూజ యున్నట్లుఁ జెప్పఁబడినది. ఆగ్రంథమునందు వీరిని 'దాహి' యని బిలచిరి. (We worship the Fravashis the holy men, in the Dahi Countries)

ప్రాచీన పర్షియన్ భాషయందు- సంస్కృతపు 'స' కారము వ్యాకరణమున 'హ' కారమగును. అవెస్తాలో 'సప్తసింధు'

* L. W. King. A History of Babylon (1915) P. 214.

శబ్దము 'హాస్తహిందు' యైనది. అట్లే 'దాస' లేక 'దాశ' శబ్దమును- 'దాహి' గా మారెను.

## ఆర్యులు

'ఆర్య' శబ్దము 'ఋ' ధాతు సముత్పన్నము. వ్యాకరణము నందు భిన్నభిన్న గణములలో 'ఋ' ధాతువులున్నవి. కాని- వీనిలో ననేకములు గత్యర్థకములు. అనగా నీపదమునకు 'ద్రిమ్మరు' లనియర్థము. ఆర్యుల కిండ్లు వాకిండ్లు గట్టికొని వసించుట రుచించినట్లుదోపదు. మొగలులు 'డేరాల'నడుమఁ గాపుర ముండినట్లే- యార్యులును గుడారములలోనో-జప్పరములు వేసికొనియో వసించెడువారు. ఒకరీతిగఁ జూచినచో వారి కీయలవాటు నేటికిని యున్నట్లున్నది. బాబిలోనియా యందు యజ్ఞయాగ స్థలములందుఁ బెద్దగోడలు నాల్గువైపులను నుండును. 'హరప్పా'లోను 'మొహింజదారో' యందును- ప్రాచీన నగరావశేషములు గలవుగదా! వానిలో 'దాహి' జనుల గృహములందే యజ్ఞయాగములకుఁ బ్రత్యేకస్థలము లుండెనని విజ్ఞులకు దోచును. ఆర్యులుమాత్ర మీ యాచారమును ఖండించిరి. యజ్ఞయాగములు గావించినచో మండపములందే చేయవలెనని వారి వ్యవహారము. కాలక్రమముగ నార్యసంతతులు గుడారములువిడిచి యిండ్లుగట్టి వసింపఁ దొడఁగిరి. కాని- యజ్ఞమండపములు మాత్రము మాఱలేదు.

## ఆర్యులచే దాసులెందుకు జయింపఁబడిరి !

నిలువ నీడనెఱుఁగక 'ద్రిమ్మరు'లైన యార్యులు- పిరికంటును నాగరికులైన దాసుల నెట్లుగెల్చిరి? దీని కుత్తర

మిచ్చుట కెక్కువ తడఁబడ నక్కఱలేదు. మన యుత్తర హిందూస్థాన చరిత్రలోనే- యిట్టి సన్నివేశము లనేకములు. ఒక రాజపరివారము గొంచెము ధనధాన్యములు గల్గియున్న దనుకొందము. అనఁగా- దీనికర్థమేమి? ఒక చిన్నవర్గము నందు- సత్త్వ సమాక్రాంతమైనదనియే గదా! వారంతతో నూరకుండరు. అధికారముకొఱకై దమలోఁదాము- జగడ మాడుదురు. ఎద్దులెద్దులు పోటులాడి నడుమ దూడలుజచ్చి నట్లు- వీరిపోరాటముల వెచ్చములకై 'పన్నుల' నెక్కువగాఁ బ్రజల తలలపైఁ గట్టుదురు. దీనితో నీవర్గముపైఁ బ్రజకు గూఢద్వేష- మారంభమగును. అధికార సంపదలలో వెనుక బడిన వేఱొకవర్గమున కిది మంచితఱుణము. వారు వీరిని గూడఁగట్టికొని 'రాచవారి' పై గత్తిదూసి లొంగదీసి కొందురు. పదమూఁడవ శతాబ్దమున - అనాగరకులైన మొగలులు 'ఝగిశ్ ఖాను' నిట్లేగదా లొంగఁదీసినది! ఇట్లే యార్యులుగూడఁ దమలోఁదాము గీచులాడుకొను దాసులను నిర్జించిరి. ఇందులో నసంభవ మేమున్నది ?

## పట్టణములఁ గూల్చు నింద్రుఁడు.

దాసులు జిన్నచిన్నపట్టణములం దుండెడి వారు. వానిలో నొకదాని కొకటి పగ. పగలతో రగులుకొనెడు తగవులు- 'దివోదాసుఁడు' దాసవంశమువాఁడు. అయినను- నీ జగడములలో నతఁడు బలుసారు లింద్రునకుఁ గోడ్పడినట్లు ఋగ్వేదమునందున్నది. దాసులకు వృత్ర బ్రాహ్మణుఁడు నాయకుఁడు. వాని కెదురు 'త్వష్ట'. అతఁడింద్రున కొక యంత్రముఁ (వజ్రము) దయారు జేసి యొసఁగను. దాని

సాయమున నింద్రుఁడు దాసుల నగరములు నిర్జించి- కడకు వృత్రబ్రాహ్మణుని జంపినాఁడు. 'పురందరు' డనఁగా నగరములను నాశనము సేయువాఁడని యర్థము. ఇంద్రున కీవిశేషణము ఋగ్వేదమున బలుతావుల నొడఁబడినది. *

## ఇంద్రుని పరంపర

ఇంద్రశబ్దము 'ఇన్' 'ద్ర' యీ రెంటి సమసనముచే నేర్పడినది. 'ఇన్' అనఁగా యోద్ధ. అందుకే 'సహ ఇనా వర్తత యితి సేనా' యన్న శబ్ద నిష్పత్తి యైనది. 'ద్ర' శబ్దమునకు 'శిఖరము' లేక 'ముఖ్యుఁడు' అన్నయర్థము - బాబిలోనియను భాషలోఁ గలదు. కనుక 'నింద్రుఁడ' నఁగా - సైన్యముయొక్క- యధిపతి - లేక - 'సేనాపతి' అని యర్థము. పోను పోను - 'యింద్ర' శబ్దము - సాహిత్యమున రాజవాచక మైనది. 'దేవేంద్ర-నాగేంద్ర - మనుజేంద్రా' దులలో నీ పరిణామము దెలియుచున్నది గదా! మొట్ట మొదటి యింద్రునకు 'శక్రుఁ' డని పేరు. అతనిపిదప - నతనిపరంపర యనేకకాలము సెల్లినది. నహుషున కింద్ర పదవి యిచ్చినకథ-పురాణములం దున్నది. 'అహం సప్తహా నహుషో నహుష్టరః' అను వాక్యము ఋగ్వేదము(10-49-9) న గలదు. నహుషకథయందుఁ గొంత సత్య ముండితీఅవలెను.

---

*దీని విషయమింకను నెక్కువగ దెలియవలెనన్నచో 'హిందీ సంస్కృతి అణి అహింస' పుట 17-19 చూడుఁడు.

### ఇంద్ర పూజ

యజ్ఞములందు సార్వభౌములైన రాజులనాహ్వానించి వారికి 'సోమపాన' మిచ్చెడి యలవాటు బాబిలోనియాలో నుండెను. సార్వభౌములు యజ్ఞమునకు వచ్చినపుడు వారిని గురించిన స్తుతిపాఠములు రాగయుక్తముగఁ బాడుటయు వాడుక. ఇంద్రుని గూర్చిన యనేకసూక్తము లిటువంటివే. ఇంద్రసంస్థ నష్టమైనపిదపగూడ నీ స్తోత్రము లట్లే యుండెను. వానియర్థము మాత్ర మదుకుటలేదు. 'ఇంద్రుఁ డాకాశ మందున్న దేవతలకు రాజు' యిట్లొక కల్పన దలయెత్తెను. ఇంతేగాదు. ఇంద్రసూక్తము లనేకచోటులం దెవ్వరికిని నర్థము గాని స్థితులుగూడ నేర్పడినవి. అట్లయినను వా రాసూక్తములు వదలలేదు. ఆ శబ్దములందే - సంగ్రథనమందే ఏదో మంత్రశక్తిగలదని నమ్మిరి. నమ్మి - వానిని బాడెడువారు.

### ఇంద్రుని స్వభావము

సప్తసింధువుపై నధికారమును నెలకొల్పిన సేనాపతి-యింద్రుఁడు మానవుఁడే యనుటకు ఋగ్వేదమందే యాధారములు దండిగదొరకును. ఆతనిస్వభావముయొక్క- రేఖామాత్రము 'కౌషీతకి ఉపనిషత్తు' నందున్నది. ఆ సన్నివేశ మిది. దివోదాసుని సుతుఁడు ప్రతర్దనుఁడు. వాని విక్రమము విశంకటము. అది యింద్రుని మెప్పునకెక్కినది. ఇంద్రుఁడు వానితో నన్నాఁడు:

'ఓయీ! ప్రతర్దనా! నీకు నేను వరమిత్తును'

'మనుష్యులకుఁ గల్యాణకారకమైన వరమిమ్ము'

'పర మితరుల కొఱకై యడుగరాదు. నీ ప్రయోజన మున కేదేని యడుగుము'

'నా స్వార్థమునకు నా కే వరమక్కఱలేదు'

అపుడింద్రుఁ డేది సత్యమో దానిని వచింపమొద లిడెను. కారణ మేమన - నింద్రుఁడే సత్యము. అతఁడిట్లు బలికెను:

'ప్రతర్దనా! నన్నెఱుఁగుము. నన్నెఱుఁగుటయే మనుష్యులకు హితకారకము. త్వష్ట తోడ్పాటుతో నేను - త్రిశీర్షుని జంపితిని. 'అరుర్మగు' లను యతులపైఁ గుక్కల నుసిగొల్పి - వానిచే దినిపించితిని. అటనుండి గదలి - దివ్య లోకమున బ్రహ్లాదుని యనుయాయులను వధించితిని. అంతరి క్షమున పౌలోములను నాశమొనర్చితిని. భూమిపై 'గాల కాశ్య' ల బుడమార్చితిని. ఈ రీతి నన్నెవఁడు దెలియునో- వాఁడు మాతృవధ జేసినను - జేయించినను - దొసఁగు వాని నంటదు. పితృవధ-చౌర్యము - భ్రూణహత్య, మొద లగు వానివిషయమునగూడ నింతే. వానికెవ్వఁడును కష్ట ములు గల్పింపలేడు. మొగమునందలి కాంతి వాడనేవాడదు'

తన సామ్రాజ్యమును స్థాపించునప్పుడింద్రుఁడు- బైఁ దెల్పిన యత్యాచారములు గావించెను. ఈ విషయములు ఋగ్వేదమునందే వచ్చును. ఇంద్రుఁడేమి? ఏమనుష్యుడై నను - దనరాజ్యమును నెలకొల్పునప్పు డిట్టిపనులు చేసియే తీరును. అట్టియెడ - క్షమ - దయ - దాక్షిణ్యము మొద లైన గుణములకుఁ జోత్తుగుదురదు. భేదోపాయము బుష్క లముగఁ బ్రయోగించియే కావలెను. 'శివాజీ' 'చంద్రరావు

మోఢోను జంపుట న్యాయమా; - కాదా? యనెడు తర్కము నిరర్థకము. అడుగడుగునను - న్యాయాన్యాయ విచారములలోఁ - బ్రొద్దుగడపినచో 'శివరాజు' రాజ్యస్థాపనమే జేసియుండ లేడు. సామ్రాజ్యమునందున్న ప్రజగూడ - నిట్టి సమయములలో- క్షుల్లక పాప పుణ్యవిచారము గావించుచుఁ గూర్చుండదు. ఈ సామ్రాజ్యస్థాపనతో సామాన్య జనులకు మేలుగల్గినదా; లేదా? యను విషయమే యిది గమనించునది.

## ఆర్యుల జయముచేఁ గల్గిన లాభములు

ఇంద్రుని-లేక యార్యుల సామ్రాజ్యస్థాపనచే-సప్త సింధుప్రజలకుఁ జాల లాభముగల్గినది. చిన్నచిన్న నగరముల వారు బరస్పరము గీచులాడుకొనుచుండి రంటిమిగదా! అవి యార్యప్రాభవముతో నణఁగిపోయినవి. దీనిచేఁ బ్రజలబ్రదుకులం దొక భద్రత గుదిరెను. పీష్వాలసంబంధముచే శనిబట్టిన ప్రదేశములం దాంగ్లులజండా యెగిరినది. పీష్వా లోడిపోయినదే తడవు - యితరహిందువు లుత్సాహముతో నుత్సవము లొనర్చిరట ! - ఆర్యులవిషయమునగూడ నిది జరిగినది. వృత్రుని జంపుట బ్రహ్మహత్యయేయైనను - వాని చావుతో నంతఃకలహములు మాసినవి. అందుకు జనులు సంతోషించినారు. మరి - వా రింద్రునియందు భక్తిప్రపత్తులను జూపుటలో నాశ్చర్య మేమున్నది? సప్తసింధుప్రజానయిదాయము హాయిగా నెదలపైఁ జేతులు బెట్టికొని నిద్రవోయినది. ఆర్యులరాకకు ముందు - బ్రాహ్మణులు రాజకీయములందుఁ బ్రధానపాత్రలై యుండిరి. వారి కా పెద్దరికము బోయినది.

తొల్త నింద్రుఁడు - త్వష్టసంబంధముతో - విశ్వరూపునకు బురోహితపదవి నిచ్చెను. మఱల నతఁడు దన్ను మోసగించునేమో యన్న సందియము గల్గి -తలదరిగెను. ఈ విషయము ఋగ్వేదమునందు గలదు. యజుర్వేదమునగూడ నున్నది. ('హిందీ సంస్కృతి ఆణిఅహింసా' పుట 19-20 చూడుఁడు).

ఇంతయైనను బౌరోహిత్యమును మాత్ర మొకఁడు గాకున్న నొకఁడు - బ్రాహ్మణుఁడే నిర్వర్తించుచుండెను. రాజకీయములగొడవలనుండి జేయిగడిగికొనుటచే విప్రులు వాఙ్మయమువైపు జూపుద్రిప్పిరి.

## వైదిక భాష

హిందూస్థానమును ముసల్మానులాక్రమించిరి గదా! పిదప హిందువులును జాలనాళ్ళు గలసి మెలఁగవలసి వచ్చెను. ఈ యిర్వురి సంఘర్షణముచే నొక క్రొత్త భాష యేర్పడినది. అదియే 'ఉర్దూ'. ఈ రీతిగనే యార్య- దాస సంసర్గముచే నొక నవీనభాష యుత్పన్నమయ్యెను. దానికే 'వైదికభాష' యని పేరు. హిందూస్థానమున 'నుర్దూ' భాష యేనాఁడును- అత్యున్నతస్థాయి నందలేదు. అందికొను నాశయము లేదు. వైదికభాషావిషయ మట్టిది గాదు. మేరు శిఖరములకన్న నున్నతగతి నది యందికొన్నది. 'దేవభాష' యై కూర్చున్నది.

'వైదికభాష' బాగుగ నర్థమగుటకు 'బాబిలోనియను' భాషయందుఁ బొక్కు జ్ఞాన మవసరము. ఒకానొక

'ధాతువు' నుండి జనించిన శబ్దము క్రమక్రమముగ నెట్లు మారిపోవునో 'యార్య' 'దాస' శబ్దముల విచారముతోఁ దెలిసినది గదా! 'దాస' శబ్దమునకు 'దాత' మూలార్థము. 'ఆర్య' శబ్దమునకు 'ద్రిమ్మరి' మూలార్థము. ఆ పదములు నేరుగా విరుద్ధార్థము నందు నేఁడు సారస్వతములో నున్నవి.

## ఆర్యుల జయముచే కలిగిన హానులు

ఆర్యులు సప్తసింధువుల నాక్రమించికొనుటచేఁ గలిగిన వన్నియు లాభము లేగాదు. నష్టములుగూడ నున్నవి. దాసుల నగరనిర్మాణము- గృహనిర్మాణము మొదలైన వాస్తు కల సర్వమును లుప్తప్రాయమైనది. సింధు-పంజాబులలో నగుపించు వాస్తు కల- హిందూస్థానమున గన్నులకే గానరాదు. అడవులలో నివసించుచుండిన యతులప్రవృత్తి లెట్లుండెనో దెలిసికొనుటకు వీలులేకపోయినది. పైననే జెప్పితిమి గదా! యింద్రుఁడు- యతులను గుక్కలచేఁ దిన్పించిన విషయమును, 'కౌషీతకము' నందీసందర్భమున సాలావృకములని వాడఁబడినది. ఆ శబ్దమున కర్థము గుక్కలు, లేక తోడేళ్ళు. టీకాకారులు 'తోడేళ్ళ' ను నర్థమునే యాదరించిరి. కాని యిటఁ గుక్క లను నర్థమే సందర్భ శుద్ధముగ నున్నట్లున్నది. ఇంద్రునిదగ్గర 'వేటకుక్క' లుండవచ్చును. తోడేళ్ళ నెవరును బెంచియుండరుగదా! ఇంద్రుఁ డీ యతుల నెందుకుఁ జంపించెను? సమాజముపైని వారిపటుకుఁబడి యెక్కువగనుండినది. ఇంతకుమించి వేఱుకారణ మేదియు లేదు. కాని- యీ యతిసముదాయము - పరిపాలింపని నశించుటచే

వారి ప్రవృత్తి యెట్టిది? వారిని జనులెట్లు మన్నించిరి ? యను విషయములు తెలిసికొనుటకు మార్గమే లేకపోయినది.

## ఆర్య సంస్కృతి _ కృష్ణ విరోధము.

సప్తసింధువుల నింద్రరాజ్యస్థాపనము జరగినదిగదా ! దాని ప్రభావము మధ్యహిందూస్థానముపైఁబడక యెటులుం డును ? పడనేపడినది. కాని యక్కడ నా సంస్కృతికిఁ దీవ్ర ప్రతిస్పర్థు లుండిరి. దేవకిబిడ్డఁడైన కృష్ణుఁడొక గొల్లలరాజు. ఇంద్రుని యజ్ఞయాగముల సంస్కృతి - యాతని పెద్దతికము యీ రెంటి నాతఁడు గౌరవింపలేదు. దీనితోఁ బగలు దప్పని వైనవి. ఇంద్రుఁడాతనిపై నెత్తెను. కృష్ణునకు హయసైన్యము లేదు. ఈ సిలుగు యోచించి - గృష్ణుఁడొక దుర్ఘటప్రదే శమున జేరెను. అట - నతని నెదురించుటకు దేవేంద్రుని వశము గాలేదు. బృహస్పతి సాయమున నెట్లో 'బ్రతుకు జీవుఁడా' యని బైటఁబడినాఁడు. ఋగ్వేదములోని గొన్ని ఋక్కు (౮-౯౬-13-15) లీగాథను జెప్పును. భాగవత పురాణ కథయు నించుమిం చీపరిణామమునే వర్ణించును. *

యజ్ఞయాగము లిష్టములేకున్నచోఁ గృష్ణునకిష్టమైన సంస్కృతి యేది ? అంగిరసఋషిచే నాతనికొక సులభమైన యజ్ఞపద్ధతి యుపదేశింపఁబడినది. దానికి - తపశ్చర్య, దానము, యార్జవము, యహింస, సత్యవచనము యిత్యాదులు దక్షిణలు. 'అథ యత్తపోదాన, మార్జవ, మహింసా సత్య వచన మితి తా అస్యదక్షిణాః' (ఛాం. ఉ. 3-17-46) అంగి

* హిందీ సంస్కృతి ఆణి అహింసా' పుట 22-25 చూడుము

రసుని యీ యుపదేశము సప్తసింధువులం దార్య దాస సంఘర్షముచే లుప్తమైన యతిసంస్కృతి గంగా యమునా ప్రదేశములు శరణ్యములుగ బ్రతికి యుండెనని దెలుపును. తపోమగ్నులైన యహింసా మునులను గృష్ణునివంటిరాజులు బూజించుచుండి రనుట కంగిరసుని యుపదేశమే సాక్షి.

## వైదిక సంస్కృతియొక్క వికాసము

కృష్ణునివంటివా రెంత 'యాసరా' నిచ్చినను నీ యహింసారూప సంస్కృతి గొప్ప యభివృద్ధి నందికొన్నది గాదు. బ్రాహ్మణులు రాజకీయములనుండి జేయిగడిగి కొన్నది మొదలు, వాఙ్మయము - యితర లోకోపకారక విషయములు - వీనియందుఁ దమదూష్టి సారించిరి. 'తక్షశిల' హిందూస్థానములోని విశ్వవిద్యాలయములలో నెల్లఁ బ్రాచీన మైనది. దానియందు విప్రులెట్లును వేదములు సెప్పుచుండిరి. ఇంతేగాక - ధనుర్విద్య - వైద్యము మొనలగు శాస్త్రము లును నేర్పఁబడు చుండెడివి. సప్తసింధువులం దింద్రపరంపర గాలక్రమమున నశించినను-వారిలో నాగంభమైన సంస్కృతి మాత్రము - నమసిపోలేదు. దానిరాజ్య మవిచ్ఛిన్నముగ సాఁగినది. దానికి మంచి గౌరవ మేర్పడినది.

## వైదిక సంస్కృతికి మధ్యదేశమునందు విజయము

కృష్ణుఁ డింద్రు నెదురించె నంటిమిగదా ! అటుతరు వాత వచ్చినపరిక్షిత్తు నతనికొమరుఁడు జనమేజయుఁడు-సప్త సింధువులందు - మొదలైన యార్య సంస్కృతిని గంగా యమునా ప్రదేశములలో నలకొల్పిరి. వీరిప్పుడుఁ బాండవ

కులోత్పన్నులు. పాండవులు వైదిక ధర్మానుయాయులైనట్లు వైదిక వాఙ్మయమునుబట్టి తెలియరాదు. కృష్ణుఁడు - పాండవులు వీరి నడుమ నెంతైనను - నాలుగు నూలుయేండులు భేద ముండును. మహాభారతమునందు వచ్చెడుకృష్ణకథలు ఊరక యుబుసుపోకకుఁ జూచినను - వానిలో ననేకములు ప్రక్షిప్త ములని దోఁచును. ఇంద్రునితోఁ బోరిన కృష్ణుఁడు-భారతము నందలి కృష్ణుఁడు నొకరే యనుటకు వీలులేదు. పాండవ కులో త్పన్నులు-బరీక్షిజ్జనమేజయులు మాత్రము వైదికసంస్కృ తిని పూర్ణముగ నాదరించినవారని యథర్వ వేదమునుబట్టి (కాండ 20-సూ 127) స్పష్టము. ♦

సప్తసింధువులందు నష్టమైన యతి సంస్కృతి- మధ్య హిందూస్థానపు మఱుఁగు జొచ్చెనని పల్కుటిమిగదా! దీని కుపస్ఫోరకముగ- ఛాందోగ్యోపనిష ద్విషయమును జెప్పఁ బడెను. 'పాలీ' భాషలోని 'సుత్త నిపాతము' నందలి బ్రాహ్మణ ధమ్మిక 'సుత్తము' గూడ నీ యూహనే బలపర చును*. సప్తసింధువునందలి 'చాతుర్వర్ణ్యము' మధ్యహిందూ స్థానములోను దిరపడెను. పంజాబులోని విప్రులార్యసంస్కృతి లోని యజ్ఞయాగముల స్వరూపము నున్నదున్నట్లనుసరించిరి. వారివలెనే — బలులొసఁగుచుండిరి. గంగా యమునా ప్రదేశములందలి బ్రాహ్మణు లగ్నిపూజ గావించుచుండినను బలులొసఁగుటలేదు. వానికి బదులు బియ్యము 'జావ' మొదలైనవి వాడెనగు. కాని పరీక్షిజ్జన మేజయుల కాలమునకే యహింసాత్మక బ్రాహ్మణసంస్కృతి

♦ 'హిందీ సంస్కృతి అణి అహింసా' పుట 37-38

* 'హిందీ సంస్కృతి అణి అహింసా' పుట 39-40

రూపు మాసినది. దాని స్థానమును హింసాత్మకమైన- యజ్ఞ యాగ సంస్కృతి యాక్రమించి రెండింతలుగ వెలిఁగినది. ఆనాటినుండి సప్తసింధువులకు బదులు గంగాయమునల మధ్య దేశమే 'యార్యావర్త' మను నెన్నిక గనెను.

## మాసి పోవని యహింస

ప్రాచీనమైన బలులులేని యగ్నిపూజ నష్టప్రాయమైనది గాని- పూర్తిగ నష్టముగాలేదు. 'రాజదర్బారు'లు రాజులవంటివారే యైన యున్నతవర్గము దాని నాదరింపలేదు. అప్పుడది యడవుల నాశ్రయించెను. ప్రాణివధ నంగీకరింపని యహింసావాదులైనమునులు గానలుసేరి కాయగసురులతోఁ గడుపుఁ బోషించికొనుచుఁ దపశ్చర్యలు సాగించుచుండిరి. జాతక అర్థకథలలో వీరినిగురించిన విషయము లనేకములు వచ్చును. నవీనమైన యజ్ఞపద్ధతులఁ గంటగించికొన్న బ్రాహ్మణులేమి- యితర కులముల వారేమి యడవులఁజేరి యాశ్రమములు గట్టికొన్నవారు బల్వురు. సంవత్సరమున కెప్పుడో యొకసారి వారి 'కంబలి' 'యుప్పు' మొదలైనవి జవి చూచుటకు మనసు బీకినపుడు- జనపదములకు వచ్చుట వాడుక. మఱల వెంటనే యాశ్రమములకుఁ బోదురు. ఇంతకును దేలిన సారాంశమేమి?సప్తసింధువులందు శ్వభక్షితులైన యతులవలె మధ్యహిందూస్థానమందలి ఋషులు-మునులు వీరు సమూలనాశ మందలేదు. అడవులయందుఁ దపమాచరించుచు నెట్లో గడుపు లోముకొనుచుండిరి.

## ఆధునికములైన యుదాహరణములు

నిన్న మొన్నటి చరిత్రలోఁగూడ నిట్టిఘట్టము లనేకములు బుడుతగీచులు బశ్చిమ సింహళమును జయించిరి. జయించిన దే తడవు- నాశనకాండ యారంభమైనది. అక్కడి బుద్ధమందిరములు- భిక్షువుల విహారములు, వీనిని నేలపాలు గావించిరి. అటనున్నవా ఱంగరిని పాపము! గొంతులపైఁ గత్తులుజూపి బలనంతముగ 'రోమన్ కాథలిక్కు' ధర్మదీక్షలిచ్చిరట! అప్పుడు సింహళరాజు సేయదగిన దేమియులేక- బుద్ధభగవానుని దంత ధాతువులు గైకొని- 'క్యాండీ' యడవులకుఁ బరువెత్తెను. ఆ కొండగుట్టలలో నవీనరాజధాని నేర్పఱచి కొన్నాడు. బుడుతగీచులనుండి దప్పించికొన్నవారు బౌద్ధభిక్షువులు- జేతికిఁదొరకిన బౌద్ధగ్రంథములను దీసికొని యాతని జేరిరి. ఇటులే- 'గోవా' లోఁ గూడ జరగినది. పోర్చుగీసులు మొదట జయించినవి మూఁడుతాలూకాలు. 'సార్ష్టి-బార్దేశ్-తిసవాడా' యనునవి. వెంటనే వారి 'మామూలు' పని మొదలైనది. దేవళములు బడఁగూల్చి-దొరకిన వారినెల్ల 'రోమనుక్యాథలిక్కు'లను గావించిరి. అట్టి యెడఁ గొందఱు హిందువులు 'యినాము' లకు నీళ్ళువదలుకొని- 'దేవతావిగ్రహములు' దీసికొని కాలికి బుద్ధిజెప్పినారు. వారందఱు దగ్గరనున్న 'సంవదేకర్' సంస్థానాధిపతి శరణు జొచ్చిరి. నేటికిని- ఆనాఁడు దీసికొనివచ్చిన హిందూ దేవతా విగ్రహములన్నియు- నచ్చట దొరకును. అటుపిదప-బుడుతగీచులు 'సంవదేకర్' సంస్థానమునుగూడ జయించిరి. కాని-

మజల వారు 'హిందూస్థానము' లపై దాడి నీయలేరు. మొదటి యనుభవముతో గుణపాఠము నేర్చుకొన్నారు. ఇట్టి పరిస్థితియే-కొంతవరకు - నాఁడు మధ్యహిందూస్థానములోని యహింసా సంస్కృతికిని జరగియుండును.

## అహింసా ప్రభావము

పరీక్షిత్తుగాని- జనమేజయుఁడుగాని బలిదానపూర్వక యజ్ఞపద్ధతిని లోకులపై బలవంతముగ వేసి రుద్దలేదు. వారా సంస్కృతి కాశ్రయమొసఁగిరి. రాజాశ్రయమున కా విధానము నోచుకొనుటయే దడవు- బ్రాహ్మణులు దానిని స్వాయత్తీకరించికొన్నారు. ఆ పద్ధతులిష్టములేనివా రహింసా వ్రతమునే జేపట్టి-యడవులు జేరి బ్రదికిరి. పోర్చుగీసులెందఱో బౌద్ధులను- హిందువులను 'క్రిస్టియన్లు' గా మార్చిరంటిమి గదా! వారు 'క్రిష్టియ'న్లయినను-కొన్నికొన్ని ప్రాతయలవాటులు మాత్రము మారక వారిలో నట్లే నిల్చిపోయినవి. ఆ రీతిగనే 'మధ్యహిందూస్థానము' లోని జనులను నవీనమైన యార్య సంస్కృతి లోఁగొన్నను బ్రాంతవాసన వారిని బూర్తిగ వదలలేదు. అహింసా సంస్కృతిలోని కొన్ని యాచారములు కొద్దిగనో- గొప్పగనో- వారిలో నిల్చి యుండెను. అడవులలోనున్న ఋషులు- మునులు, అప్పుడప్పుడు గ్రామములలోనికి వచ్చుచుండిరంటిమి గదా! వారు వచ్చినవెంటనే జను లా ఋషులచుట్టును భక్తితో మూగెడు వారు. వారికిఁ బూజ లొనర్చెడువారు. ఇతరవేళలందు యథాప్రకారము యజ్ఞయాగములు - బలిదానములు గావించెడువారు.

## యజ్ఞ సంస్కృతియొక్క యున్నతి.

అహింసావాదులైన ఋషి మునుల కింతటి గౌరవ మున్నను వారిసంస్కృతిమాత్ర మెన్నడును గొప్పఁగాఁ బ్రచారమునకు రాలేదు. సప్తసింధువులందు 'దక్షశిల'వంటి విశ్వ విద్యాలయములు స్థాపింపఁబడె నంటిమిగదా! అవియే విద్యా శిక్షణమునకుఁ బ్రత్యేక కేంద్రములయ్యెను బ్రాహ్మణులు వేదాధ్యయనమునకు - రాజకుమారులు ధనుర్విద్యకు దూరమైనను - 'దక్షశిల'వంటిచోటులకే - సప్తసింధువులకే వెళ్ళెడివారు.

సప్తసింధువు లందేమి - మధ్యహిందూస్థానమం దేమి ఇంద్రపరంపరవంటి సామ్రాజ్యము మఱల దలనెత్తలేదు. పరీక్షి జ్జనమేజయుల రాజ్యములక్రింద సామ్రాజ్యముతోఁ బోలికయే లేదు. వారిర్వురును - బలిపూర్వక యజ్ఞములను బ్రోత్సహించిరి. వారి ప్రయత్నముతో - గంగా యమునల మధ్యప్రదేశ మార్యావర్త మయ్యెను. పరీక్షి జ్జనమేజయులు సాధించిన విజయము లీ రెండే. వారికాలమునను - వారితరువాతను - సప్తసింధు మధ్యహిందూస్థానములలోఁ జిన్నపెద్ద స్వతంత్రరాజ్యము లుండనే యుండెను. అయినను-'ఆర్యులు-దాసులు' వీరిసంస్పృముచే జనియించిన యజ్ఞసంస్కృతి మాత్ర మన్నిటను - బాగుగ వేరూనికొనిపోయినది.

# రెండవ ప్రకరణము

# సమకాలీన రాజకీయ పరిస్థితి

"యో ఇమే సం సోళ సన్నం మహా జనపదానం పహూతసత్త
రతనా ఇస్సరాధి పచ్చం రజ్జం కారేయ్య, సేయ్యథీదమ్"

1. అంగానం 2. మగధానం 3. కాసీనం 4. కోసలానం 5. వజ్జీనం 6. మల్లానం 7. చేతీనం 8. వంసానం 9. కురూనం 10. పంచాలానం 11. మచ్ఛానం 12. సూరసేనానం 13. అస్సకానం 14. అవంతీనం 15. గంధారానం 16. కంబోజానం.

ఈ యనుక్రమణిక 'అంగుత్తరనికాయము'నందు నాలుగు చోటులఁ గనపడును. బుద్ధుని పుట్టుకకుముందు 'జంబూద్వీపము' (హిందూస్థానము)న వేలువేలుగఁ బదునాఱు రాజ్యము లుండెనని 'లలితవిస్తరము'న మూఁడవయధ్యాయమున గలదు. కాని - వీనిలో నెనిమిది రాజ్యముల రాజకులములనుగుఱించి మాత్రమే - మనకుఁ గొంత విపులముగఁ దెలియునది. ఈ దేశములపేరు లన్నియు - బహువచనాంతములుగనే యున్నవి. ఇందుకుఁ గారణ మేమైయుండునని యూహింపఁగాఁదోచున దిది. ఒకనాఁ డీదేశములు 'మహాజనసత్తాకము'లై యుండెను. అప్పుడు 'మహాజను'లను రాజులనిరి. వారి యధ్యక్షుని 'మహారాజ'ని బిలచెడువారు బుద్ధునికాలమునను 'మహాజన సత్తాక' పద్ధతికి బల ముడిగినది. పతనమునొందెను దాపురించెను. దానిచోటు నాక్రమించికొని 'ఏకసత్తాక' రాజ్యపద్ధతి ఠీవితోఁ గూర్చున్నది. ఈ తిరిమాకలను పేటు

వేమి? దీనిని దలపోయుటకు ముందు–ఆ పదునాఱు రాజ్యముల గుఱించి కొంత దెలిసికొనుట యసంగతము గాదు.

### అంగము

ఇది 'మగధ' కుఁ దూర్పున నుండెను. దీని యుత్తర భాగమునకు 'అంగుత్తరాప' మనిపేరు. మగధరాజంగమును గెల్చెను. దానితో వారి 'మహాజనసత్తాక' పద్ధతి తలవ్రాల్చినది. రాజు లని పిలువబడు పూర్వమహాజనుల సంతతివా రింకను బ్రదికి యుండిరి. కాని–వారి స్వాతంత్ర్యము మాత్రము జచ్చెను. కాలాంతరమున 'అంగము' తనప్రత్యేకత భంగమై 'యంగమగధా' యను ద్వంద్వసమాసమున జేరి పోయినది.

బుద్ధభగవాను లీదేశమున ధర్మోపదేశము లొనర్చిరి. దీని ముఖ్యపట్టణము 'చంపానగరము'. అట 'గగ్గరా' రాణి యొక చెఱువు గట్టించినది. దానిగట్టునవే–'ముక్తామాల' యుండెను. ఈ విషయము 'త్రిపిటకము' లం దనేకసార్లు జెప్పఁబడినది. ఈ 'చంపానగరము' గూఁడ యొకనాఁడైనను బ్రాంతరాజుల యధీనమం దున్నది గాదు. దీనిని బింబిసారుఁ డొకనికి 'జహాగీరు'గా నిచ్చెను. ఆ 'ప్రతిగృహీత' 'సోణ దండుఁ' డను విప్రుఁడు. ఈ 'యినాము' సంక్రమించిన తర్వాత 'సోణదండుఁడు' అప్పుడప్పుడు–పెద్దపెద్ద యజ్ఞము లొనర్చి–'జిహ్వాతుప్తుఁడుల్ల' నామెత లొసంగెనట! *

* దీఘనికాయమున 'సోణదంతసుత్తము' జూడుము.

## మగధము

బుద్ధుని కాలమున మగధ - కోసలములందుఁ బ్రజా పాలన మొక దెఱఁగుననే యుండెను. ఈ రెంటియందును - నాఁడు బాగుగఁబాదుకొనియున్న 'ఏకసత్తాక రాజ్యపద్ధతి'. మగధరాజు బింబిసారుఁడు. కోసలాధిపతి పసేనది (ప్రసేన జిత్తు). వీ రిర్వురు ఉదారులు. అందుచే నచ్చటి రాజ్యపద్ధతి ప్రజలపాలికి భంజకముగా లేదు రంజకమే యైనది. ఇర్వు రకును యజ్ఞయాగములం దాదరము గద్దు. ఇర్వురును వానిని బ్రోత్సహించిరి. వీరి యీ యాదరము శ్రమణుల (పరిప్రాజ కులు) కేరీతిగను బాధకముగా లేదు. వారు స్వేచ్ఛగ వీరి రాజ్యములందుఁ దమ ధర్మములను బోధించుకొనుచుండిరి. ఇంతేగాదు. బింబిసారుఁడు వారి 'గ్రాసవాసము'ల కనువైన యేర్పాటులును గావించెను. సన్యసించిన గౌతముఁడు రాజ గృహమునకు వచ్చినాఁడు. బింబిసారుఁడు పాండవపర్వతము వరకును - గాలినడకతో ఆయన కెదురువచ్చెను. ఇంతచేసిన బింబిసారుఁడు 'దనసైన్యములో దొడ్డనౌకరీ యిత్తును, స్వీక రింపు' మని బుద్ధునికి వినతిచేసినాఁడట! ఈ వ్యామోహము నకు గౌతముఁడు జలించునా? తపశ్చర్యానివిష్టమైన యాతని చూపు మఱలనే లేదు. 'గయ'కుఁ గెలఁకుననున్న 'యురువే ల'ను జేరినాఁడు. తపోదీక్ష యారంభమైనది. కడకు తత్త్వ బోధయొక్క- మధ్యమ మార్గము నాతఁడు బోధించి విడిచెను. తొట్ట తొల్త - బుద్ధుఁడు గావించిన యుపదేశము వారణాసి యందు. తరువాత నాతఁడు దన యైదుగురు శిష్యులతో 'రాజగృహము'నకు వచ్చినాఁడు. బింబిసారుఁ డప్పుడు బుద్ధు

నకు నాతని భిక్షుసంఘమునకు వాసార్థమై యొక్క యుద్యాన వనము నొసంగెను. దానికి - 'వేళువన' మని పేరు. కాని దానియందొక విహారమైనను నుండెననుటకే యాధారమును దొరుకుటలేదు. మఱి - వనదానమున కర్థమేమి? 'వేళువన' ప్రదానమునకు వ్యాఖ్యానము- బుద్ధుఁడు, నతని భిక్షుసంఘము నిర్విఘ్నముగ నచ్చట నుండుటకు 'బింబిసారుఁడ'నుమతించె ననునంతవఱకు. ఆ దాన మొసంగుటగూడ వారిపై నాదరము లేనిది బొసంగదు గదా!

కేవలము బౌద్ధభిక్షువులకే గాదు. ఆనాఁడున్న సకల శ్రమణసంఘములకును - బింబిసారుఁడు నిలువనీడ నొసంగి నాఁడు. అట్టి శ్రమణులగుంపు లెన్నియో 'రాజగృహము' చుట్టు ప్రక్కల నుండెను. ఇట్లని 'దీఘ నికాయము' లోని 'సామంజఫల సుత్తము'నం దున్నది. 'మజ్ఝిమ నికాయము' నందలి (నం. 77) 'మహాసు కులదాయి' సుత్తములోను గన్పట్టును.

బింబిసారుని కుమారుఁ డజాత శత్రువు. అతఁడొక నాఁడు దన మూడువ మేడపై నుండెను. కెలఁకుల నాప్త సచివులుగొలిచి యున్నారు. నాఁడు పున్నమ. చల్లని వెన్నెల నేలపై మల్లెలు బఱచినది. అపు డజాత శత్రుని కొక కోర్కె గల్గెను. ఎవరైన నొక గొప్ప శ్రమణుని దర్శింపవలెనని యతని యాస. 'ఎవరికడకుఁ బోద'మని యమాత్యుల నడిగినాఁడు. మంత్రులలో నొక్కొక్కఁ డొక్కొక పరివ్రాజకసంఘమును బ్రస్తుతించి తన్నాయకుని జూడఁ బోదమనిరి. రా జన్నియు విన్నాఁడు. అజాతశత్రున కింటివైద్యుఁడు - జీవకుఁడు. అతఁ

డింతవరకుఁ బెదవి విప్పనేలేదు. రాజతనినిఁగూడఁ బ్రశ్నయొన ర్చెను. అంతజీవకుఁడు బుద్ధభగవానునిగూర్చి నాల్గుమాటలు పలికినాఁడు. ఆ మాటలతో రాజుమనస్సు జీవకునివైపు మొగ్గెను. నిజమున కితరశ్రమణసంఘ నాయకులకుఁ బోల్చి నపుడు - బుద్ధుఁడు జిఱుతవాఁడు. ఆయన సంఘముగూడ నిన్న మొన్నట నెలవుగొన్నది. అయినను - రాజాతనినే జూడఁదలచెను. సహపరివారుఁడై బుద్ధదర్శనమునకు బయలు దేరినాఁడు. భగవానుఁ డప్పుడు జీవకుని మామిడితోటయం దుండిరి.

అజాతశత్రుఁడు గన్నతండ్రిని 'కార' యందుంచెను. ఆ తండ్రి యచ్చటనే జచ్చినాఁడు. ఈ హత్యాకాండ సింహాసనమునకై యొనర్చినది. కాని - శ్రమణులపైని దండ్రి జూపిన యాదరమును గొడుకు గొంచెఁ ఱుపలేదు. బింబి సారుఁడు గతించినపిదప బుద్ధుఁడెన్నఁడోగాని 'రాజగృహము' నకుఁ బోలేదు. ఆ పోయినప్పు డొకసారి జరగిన సన్నివేశమే పైని వివరించిన కత. అజాతశత్రుఁడు గద్దెనెక్కకముం దత నికి దేవదత్తుఁడు నెయ్యుఁడు. దేవదత్తునకు గౌతముఁడన్న గంటగింపు. ఒకప్పుడు రాచవాడయం దొక యేనుగునకుఁ బిచ్చి మెత్తినది. ఆ యేనుగుపేరు 'నాలగిరి'. కపటియైన దేవ దత్తుఁడు -దానిని బుద్ధునిపైకిఁ దోలించినాఁడు. ఈ చెయ్దము 'వినయపిటకము'న వర్ణింపఁబడినది. కాని-యీ కథయందు నిజ మెంతయో జెప్పలేము. కథకు గాళ్ళెట్లున్నను - అజాత శత్రునకు - దేవదత్తుని యిచ్చకములపైఁ గొంత మచ్చిక యుండెను. బుద్ధుఁడు 'రాజగృహము' నకు దూరదూర

ముల నుండుట కిదియొక కారణము. ఇంతయున్నను- బుద్ధుఁ డెప్పుడైన - 'రాజగృహము' నకు వచ్చినచో - నజాతశత్రు డతనిని దరిశింప జంకుటలేదు. బింబిసారుని రాచరికమునందు వలెనే సుతుని పాలనమందును రాజధాని యుపకంఠముననే పెద్దపెద్ద శ్రమణ సంఘములు - వారి నాయకులతోఁ గూడ వసించు చుండినవి. దీనిని గమనించినప్పుడు శ్రమణులపైని యాదరము దంశ్రడికన్న గొడుకున కొక మాత్ర యెక్కువ నుట స్పష్టము. ఇఁకను గొంత సాహసించి చెప్పినచో నజాత శత్రునికాలమున యజ్ఞయాగములు నష్టప్రాయమైనవి. శ్రమణ సంఘముల యదృష్టము 'మూఁడుపూవు లాఱుగాయ' లనవచ్చును.

మగధులరాజధాని రాజగృహము. ఇది నేటి'బీహారు' ప్రాంతమందున్నది. 'తిలయ్యా' స్టేషనునకుఁ బదునాఱు మైళ్ళదూరము. దీనికి నలుదిక్కులను గొండలే. ఆ కొండల కోనలవెంటఁ బట్టణములోనికి వచ్చుటకు రెండేమార్గము లున్నవి. వాని కెప్పుడును 'గాపు' పెట్టి నగరమును సంర క్షించి కొనవలెను. లేకున్న- రాజగృహ మరాతులకుఁ జిక్కి నట్లే. కాని 'యజాతశత్రున' కీ 'జవాబ్దారీ' లేకపోయినది. అతనిపేరు శత్రువులకు గుండెగాలము. బుద్ధుని పరినిర్వాణము నకుఁ గొంచెము ముందుగా నితఁడు 'పాటలీపుత్రము'ను నిర్మించి - యటనే నివసించు చుండెను.

అజాతశత్రునకు వైదేహీపుత్రుఁడని పేరు అగుటచే నాతనితల్లి 'విదేహరాష్ట్రము'నకుఁ జెందినదని తోచును. ఇంతేగాదు. జైనుల 'యాచారాంగ' సూత్రమునందుఁ గూడ

నజాతశత్రుని తల్లి 'వజ్జి' రాజులలో నొకని కన్య యగు నని వ్రాయఁబడినది. కాని - 'కోసలసంయుత్తము'లోని 'యట్ఠకథ'లో నితఁడు 'పసేనది' (ప్రసేనజిత్తు)యొక్క మేనల్లుఁడై నట్లు గలదు. 'వైదేహీపుత్ర'లోని 'వైదేహీ' శబ్దమున కాకథయందు భిన్నార్థమున్నది. 'పండితాధివచనమేతం' అని యీ వ్యాఖ్య. 'పండితాత్థియా పుత్తోతిఅత్థో'యని 'పాలీ' భాషలో నొనర్చిన యుపవ్యాఖ్య. 'లలితవిస్తరము' నందు - మగధ రాజవంశము వైదేహీ కుల మనియే బిలువఁబడెను. దీనినిబట్టి దోచున దిది. "ఈ కులము పితృపరంపరలో నప్రసిద్ధము. ఈ వంశమున - బూర్వరాజున కెవ్వనికో యదృష్టవశాత్తు - నొక విదేహరాజకన్యతో వివాహమై యుండును. నాట నుండి - యీ సంతతి, ఖ్యాతి, తెక్కు వేసి పేరుప్రతిష్ఠలు గడించి యుండును. తర్వాతివారు - గౌరవముకొఱకై 'వైదేహీపుత్రు' లనియే దమ్ము వ్యవహరించుకొనిరి."

అజాతశత్రువు దండ్రినిజంపిన దురంతము - నవనవగా దిక్కులకుఁ బ్రాకినది. ఈ యన్యాయమునకుఁ జండప్రద్యోతుఁడు- రవరవలాడెను. అజాతశత్రునిపై నెత్తివచ్చి - పట్టణ ప్రాంతముల ముట్టడించెను. ఇతనిభయముతో నజాతశత్రుఁడు-'రాజగృహము'దగ్గరనున్న *కోటలోఁ జేరినాఁడు. కొన్ని దినములైన మీఁద 'చండప్రద్యోతను'నకును - బట్టుదల సడలినది. అతఁడు వెన్కకేగెను. అజాతశత్రుఁ డింత దారుణకర్మ జేసినను - నెవఁడో యవంతిరాజునకుఁ గోపము

* 'మజ్ఝిమనికాయము' లోని 'గోపకమోగ్గల్లాన సుత్తము'యొక్క 'యట్ఠకథ'ను జూడుఁడు.

వచ్చినదిగాని మగధలోని ప్రజలు గిక్కురుమనలేదు. మగధయం 'దేకసత్తాక రాజ్యపద్ధతి' యెంతగా వేరులుబారి యుండెనో యీ సంఘటనము దెల్పును.

కాశి

'కాశి'ని 'కాసి'యనియు నుచ్చరింతురు. దీని ముఖ్య పత్తనము వారణాసి. దీనిరాజులనేకులు బ్రహ్మదత్తనాములు. ఈ విషయము జాతక 'అట్ఠకథ' లలో వచ్చును. ఇటఁ జెలామణిలోనుండిన 'రాచరికము'నుగుఱించి మనకెక్కువ దెలియరాదు. కాశిలోనిరాజు (మహాజనులు) లెక్కువయుదారులు. ఆ రాజ్యమున గలాకౌశలము లధికముగ నున్మీలితములయ్యెను. బుద్ధునిసమకాలమునగూడ నేజాతియందైన మంచి వస్తువున్నచో దానిని 'గాశిక' మనెడువారు. కాశికవస్త్రములు 'కాసికచందనము' యిత్యాదిప్రయోగములు 'త్రిపిటక' వాఙ్మయమున గుప్పతిప్పలు. వారాణసియం 'దశ్వసేనుఁ డ'ని రాజుండెను. అతనికి 'వామ'యనియొకరాణి. ఆమె గడుపున బార్శ్వనాథుఁడు జన్మించినాఁడు. పార్శ్వనాథుఁడు జైనుల బదుమూఁడవ తీర్థంకరుఁడు అతఁడు దన యుపదేశమును బుద్ధునికిముందు 243వ వర్షమున గావించినాఁడు. కాశికులు గేవలము గళాకౌశల్యముననేగాక దత్త్వవిచారమందును- నందెవేసిన చేతులని బైదాని పిండితార్థము. కాని - బుద్ధునికాలమునకీ దేశము స్వాతంత్ర్యమును బోగొట్టికొన్నది. అది కోసలమునం దైక్యమై పోయెను. 'అంగ మగధ' వలెనే 'కాశీకోసల' మనుట నాఁడు నల్గురినోట నున్నమాట.

## కోసలము

'శ్రావస్తి' దీనికి రాజధాని. ఇది 'యచిరవతి'(సధ్యా రాప్తి) యను నదియొడ్డున నున్నది. కోసలరాజు ప్రసేనజిత్తు (పసేనది). ఇతనికి వైదిక మతాభిమానము మెండు. అప్పుడప్పుడు - బ్రహ్మాండములైన యజ్ఞములు సేయించెడువాఁడని 'కోసలసుత్తము' లోని యొక్క సుత్తము బలుకును. కాని యా రాజ్యమందు - శ్రమణులకును గౌరవమునకుఁ గొఱఁత లేదు. 'శ్రావస్తి' యందొక పెద్ద 'సెట్టి' యుండెను. ఆయనపే *'రనాథపిండికుఁ' డట! 'సెట్టి' యెక్కువ గణుతి కెక్కినవాఁడు. బౌద్ధభిక్షువులు వసించుటకై యాతఁ డొక విహారమును గట్టించెను. దానిపేరు 'జేతవనము'. ఆయూరనే యొక యుపాసిక యుండెను. ఆమెనామము విశాఖ. విశాఖ భిక్షువులకై యొక ప్రాసాదమును గట్టించి యిచ్చినది. ఈ రెండు తావులను - బుద్ధుఁ డప్పుడప్పుడు - శిష్యులతో వసించెడువాఁడు. భగవానుని 'చాతుర్మాస్యములు' గూడ నాచోటులనే జెల్లెడివి. బుద్ధుప్రబోధలలో ననేకము 'లనాథ పిండికు' ని యారామమునం దుండి యొసఁగినవే. దీనికాధారములు 'త్రిపిటక' వాఙ్మయమునిండ యున్నవి. వైదికాభిమానియైనను ప్రసేనజిత్తు నడుమనడుమ బుద్ధదర్శనమునకై యనాథపిండికుని యారామమునకు వచ్చుట గలదుక. ప్రసేన

* ఇతని నిజమైనపేరు సుదత్తుఁడు. అనాథుల కనేకులకుఁ బిండము (తిండి) నొసఁగుచుండుటచే నాతని కా నామధేయము.

జిత్తునకు బుద్ధుఁడొసఁగిన యనేకోపదేశములు 'కోసలసుత్తము' న సంగృహీతములు.*

ఈ రాజులు మాతంగకులోత్పన్నులు. హీనజాతి వారని 'లలితవిస్తరము' సెప్పును. 'ధమ్మపదము' లోని 'యట్ఠకథ' యందు 'విడూడభు'ని వృత్తాంతమొకటి గలదు. ఆ గాథ గూడ లలితవిస్తరము లోని యభిప్రాయమునే యామ్రేడితము సేయుచున్నది.

ప్రసేనజిత్తునకు బుద్ధునిపై గౌరవ మపారము. చాల దినములనుండి 'ప్రసేనజిత్తు'న కొక కోర్కెయుండెడిది. తానెటులైనను శాక్యుల యల్లుఁడనిపించు కొనవలెను. తమ కన్యను దనకిచ్చి వివాహము సేయవలె నని ప్రసేనజిత్తు శాక్యుల నడిగినాఁడు. వారీతనికి గన్నె నిచ్చుట కిష్టపడలేదు. వీఁడు గులము తక్కువవాఁడు. వారికిఁ దమయయిష్టమును బహిరంగముగఁ దెలుపు దిటవులేదు. శాక్యులపైఁ బ్రసేనజిత్తు పెత్తనముండెను. వారికెట్లు సేయుటకును బాలుపోలేదు. కడ కొక యుపాయము వెదకినారు. 'మహానాము'న కొకదాసి యున్నది. దాసికొకబిడ్డ. బిడ్డపేరు 'వాసభఖత్తియ'. మహానాముఁడడి తనకొమరితయని బొంకాడెను. వాసభఖత్తియ రూపురేకలు గొంతవరకు మహానామునే బోలినవి. అందుకుఁ దోడు మహానాముఁ డెదుటివారు నమ్మునట్లు చాల చాకచక్య

---

* ఈ సంయుత్తములోని మొదటి సుత్తమందు, 'పసేనది' బుద్ధుని యొక్క యుపాసకుఁడైనట్లున్నది. కాని దొమ్మిదవసుత్తమందు 'పసేనది' యొక్క మహాయజ్ఞవర్ణనమున్నది. అందుచే 'పసేనది' సర్వాత్మనా - బుద్ధోపాసకుఁడని జెప్ప వీలులేదు.

ముతోఁ దన ‘ తంత్రడితనము ’ ను బ్రకటించినాఁడు. కోసల రాజమంత్రులీ చాకచక్యమునకు బేలుపోయిరి. ‘ వాసభ ఖత్తియ’ మహానామునిబిడ్డయే యని నమ్మినారు. పెద్దసంబర ములతోఁ – బెండ్లిజరగెను. ‘ప్రసేనజిత్తు’ తృప్తికి మేరలేదు. అతఁడు‘వాసభఖత్తియ’ను బట్టపురాణిఁజేసికొన్నాఁడు. దంప తుల కచిరకాలమున దనయుఁడుగలిగెను. వాఁడేవిడూడభుఁడు పదునాఱేండ్ల ప్రాయమున నొకసారి – మనుమఁడు – దాత గారియింటికివెళ్ళినాఁడు. రాజప్రాసాదమున నేలోపములులేక మరియాదలు జరిగినవి. కాని విడూడభుఁడు – లేచి వెడలిన తర్వాత వానికి వేయఁబడిన యాసనమును బైటవేసిరి. వాని కేమియు నర్థము గాలేదు మరల నిదానముగఁ దాను దాసీ పుత్రుఁడనను నుడి విడూడభుని చెవినోసెను. వానియెదలో ‘నల్లపాము’ పారాడినది. అప్పటి కేమియు ననలేదు. పెరిగి పెద్దవాఁడై విడూడభుఁడు దండినిగాదని ‘కోసలము’ లాక్ర మించెను. ముదుసలియైన బ్రసేనుఁడు ‘శ్రావస్తి’నుండి యష్ట కష్టములతో బైటఁ బడినాఁడు. ప్రసేనుని బంధువు బింబిసా రుఁడు. అతనిని జేరఁబోవలెనని – రాజభటులను కన్ను దప్పించికొనుటకై వేషముమార్చికొని– దారులందుఁ ‘బ్రసేన జిత్తు’ బడినబాధ అంతంతగాదు. కడకెట్లో – రాజగృహము సేరి యూరివెలుపల నొక ‘ధర్మశాల’ యందుఁ బొట్టఁ బోసి కొన్నాఁడు.

రాజ్యము జిక్కినదే తడవు విడూడభుఁడు శాక్యు లపైఁ గత్తిదూసెను. కాని బుద్ధుఁ డడ్డుపడి యాతెగువను మాన్పినాఁడు. మరల రెండవసారి ‘విడూడభుఁడు’ యుద్ధ

యత్నముగావించెను. ఆసారిగూడ బుద్ధునివాక్యము జెలియలికట్టయై దురంతము నాపినది. కాని - వానిమనసులోని ప్రతిహింసాసర్పము - మాటిమాటికిఁ బడగ లెత్తుచునే యుండెను. మూఁడవసారి వాఁడు గత్తి ఝుళిపించినాఁడు. ఈ మాఱు బుద్ధభగవానున కాతని నాదుష్టప్రయత్నమునుండి మఱలించుటకుఁ దీరిక దొఱికినది గాదు. విడూడభుఁడు శాక్యులపైఁ బడెను. వానికత్తి వాదఱ-యువతులను వదలలేదు. శిశువులను దయదలప లేదు. దొరకినవారిని దొరకినట్లే హతమార్చినాఁడు. ఈ కల్లోలమున బ్రదికినవారు రెండు తెగలవారే. చెట్టు-పుట్టయనక గాలికి బుద్ధిసెప్పినవారు; విడూడభుని కాళ్ళవ్రేళ్ళబడి పెనగులాడినవారు. రతనములతో నెట్లున్నను - శాక్యులరక్తముతో విడూడభుని సింహాసనము - సంధ్యారాగరంజితమైనది.

శాక్యులను మర్దించి - సైన్యముతోఁ దిరిగివచ్చుచు గోసలరాజు 'అచిరవతి' యొడ్డున నొకదిన మాఁగినాఁడు. నాటి రేయి యకాలమేఘము లుత్తాలముగ లేచినవి. వాన కాళ్లుగొన్న వర్షము! 'అచిరవతి' గట్టులుభట్టించి యుప్పొంగెను. విడూడభుని సైన్యమంతయు నా ప్రవాహమున నష్టమైనది. పరిమితపరివారముతో - నానాశ్రమలతో - విడూడభుఁ డూఱుఁ జేరికొన్నాడు.

మగధయందువలెనే 'గోసలము' లందును 'యేకసత్తాకరాజ్యపద్ధతి'యే యుండినది. 'మహాజనసత్తాక'మైనచోఁ దండ్రిని వేధించి - రాచరికము నాక్రమించినపుడు - విడూడభుని దుశ్చర్యకుఁ బ్రజ లూరక యుండియుండరుగదా!

వజ్జి

'మహాజనసత్తాక' రాజ్యములపైకి -మూఁడే మూఁడు స్వతంత్రములై యుండినవి. ఒకటి వజ్జి; మఱియొకటి పావ. మూఁడవది 'కుశినార'. 'పావ - కుశినార' యీరెండును - 'మల్ల' వంశజులవి. వీనిలో - 'వజ్జి' రాజ్యము విపులబలాఢ్యమై - దన 'దొరతనము'తో నితరులకన్నులు జేగురింపఁ జేసినది. కాని- దాని 'యస్తమయము'ను దూరమునందుండ లేదు. మఱి - యీయింతకాలములోనే - దాని మెఱుఁగులు- ప్రత్యూషము నందలి -శుక్రనక్షత్ర కాంతులవలెఁ జకజక లాడినవి.

బుద్ధభగవానుఁ డిట్టియొకానొక 'మహాజన సత్తాక రాజ్యమం'దే జన్మించెను. కాని 'శాక్యుల' స్వాతంత్ర్యమంతకుముందే గాలకబలితమైనది. 'వజ్జి' రాజ్య మొక్కటి మాత్రము కేవలము దనబలిమియే యాతగ బుద్ధునికాలమునఁ గూడ స్వతంత్రముగ నుండెను. అందుచే బుద్ధభగవానునకు దానిపై నాదరముండుట సహజము. 'మహాపరినిబ్బాన - సుత్తము'నందు దూరభూముల కేగుచున్న భిక్షువుల నుద్దేశించి బుద్ధుఁడు - 'లిచ్ఛవీ' దేశమువైపు జేయిసాచి యిట్లుబలుకును: "భిక్షువులారా! దేనివైపు త్రిశంద్దేవతలును దేఱిచూడలేరో - యట్టి 'లిచ్ఛవీసముదాయ'పు దిక్కునకుఁ జూడుఁడు !!"

'వజ్జి' రాజధాని వైశాలి. దానికిఁ జుట్టుపట్టుల నున్న 'వజ్జి' కులోత్పన్నులను 'లిచ్ఛవీ' లందురు. జనకునివంటి

యుదారులు రాజ్యమేలిన విదేహరాజ్యము వీరిదే. వీరికి బూర్వపురుషులు - విదేహరాజులలోఁ గడపటివాఁడు సుమిత్రుఁడు. ఇతఁడు - 'విదేహ' యందే రాజ్యమేలెనని 'లలిత విస్తర' మనును. అతనిపిదప 'విదేహము' వజ్జితోఁ జేరి పోయినది.

బుద్ధభగవానుఁడు 'వజ్జి' రాజుల యభివృద్ధికొఱకై యేడు నియమము లేర్పఱచెనట! ఈ విషయము 'మహాపరినిబ్బానసుత్తము' యొక్క యారంభమున వచ్చును. 'అంగుత్తర నికాయము' యొక్క 'సుత్తకనిపాత' మందును గలదు. 'మహాపరినిబ్బాన' సుత్తమందలి యట్టకథలో నీ నియమములపై విపులమైనవ్యాఖ్య యున్నది. దానినిబట్టి 'వజ్జి' రాజ్యమం దొకవిధమైన 'జ్యూరీ' పద్ధతి యుండెననియు, నిరప రాధులను త్వరపడి శిక్షించు దురలవాటు లేదనియుఁ దెలియును. వారిచట్టములన్నియుఁ దొల్తనే జక్కఁగ వ్రాయఁబడి యుండును. వానిని దక్షతతో ననుసరించుటయు నుండెడిది.

## మల్లరాజ్యము

'మల్లుల' రాజ్యము 'వజ్జి' దేశమునకుఁ దూర్పుగాఁ గోసలమునకుఁ బడమరగా నుండెను. దీనియందు 'వజ్జి' రాజ్యమునందు వలెనే 'గణసత్తాక' పద్ధతి యుండెడిది. వారిలో వారికిఁ గలఁత లేర్పడెను. 'పావా'మల్లులనియు, 'కుశినారా' మల్లులనియు నిఱుదెగలుగఁ జీలిపోయినారు,

మగధనుండి 'కోసలము' లకుఁ బోవుదారి 'మల్ల' రాజ్యమున జొరఁబడి పోవును. అందుచే బుద్ధభగవానులిటకు మాటిమాటికి వచ్చుచుండిరి. బుద్ధుఁడు 'పావా' యందుండు 'చుంద' యను కమ్మరి యన్నమును గ్రహించెను. వెంటనే బుద్ధభగవానులు రోగగ్రస్తుఁడై 'కుశినారా' జేరి యారాత్రికే బరి నిర్వాణమందిరి. నేటికిని నచ్చోట నొక చిన్నస్తూపమును మందిరములును గలవు. వానిని దర్శించుట కనేక బౌద్ధులచటికి యాత్రయొనర్తురు. 'పావా' లేక 'పడవణా' యను పల్లెగూడ నచ్చటికిఁ బ్రక్కనే యున్నది. ఆనాఁడు 'పావా' మల్లులు -,'కుశినారా' మల్లులును నిరుగుపొరుగుననే వసించు చుండినట్లు దోచును. ఈరెండు రాజ్యములందును - బుద్ధున కనేకులు శిష్యులుండిరి. ఈ రెండురాజ్యములును స్వతంత్రములే. అయినను - వానిపరిపాలనము 'వజ్జి'-గణసత్తాకపద్ధతి యంత నికరముగ నుండలేదు. ప్రతివిషయముననను - 'వజ్జి' రాజ్యము- వీనికిఁ దోడుపడెడిది. దానిబలముతోనే యివి నిలచియుండెను.

## చేతి

ఈ రాష్ట్రవృత్తాంతము 'చేతియ జాతక' మందుఁ గలదు. 'వేస్సంతరజాతకము'నను యున్నది. దీనిరాజధాని - 'సోత్థివతి' (స్వస్తివతి)యని, 'చేతియ జాతక' మనును (నం. 422). దానియందే యారాజుల పరంపరఁగూడ నివ్వఁబడినది. కడపటిరా 'జుపచరుఁడు.' లేక యుపచరుఁడు. అతఁడు సత్యవాదియై - బురోహితుని శాపముచే - నరకమున గూలెను. వాని యైదుగురుసుతులు బురోహితుని శరణు జొచ్చినారు.

వా రా'రాజ్యము'వదలిపోవలెనని బురోహితునియాజ్ఞ. వారా యానతిమేరకు - రాజ్యపు టెల్లలుదాటి - వేఱువేఱుగ నైదుపట్టణములలో నివసించిరి. ఈ గాథయంతయు చేతియ జాతకమందే వచ్చును.

వేస్సంతరుని రాణి 'మద్ది' (మాద్రి). ఈమె మద్ర రాష్ట్రరాజకన్యక. ఈ రాష్ట్రమునకే 'చేతియరాష్ట్ర' మని పేరు. ఈ విషయముగూడ 'వేస్సంతర'జాతకగాథను బట్టియే దెలియును. వేస్సంతరుని స్వకీయదేశము 'శివి'. ఇది 'చేతి' ప్రక్కనే యున్నది. శివిదేశరాజొకఁడు - బ్రాహ్మణునికిఁ దనకన్నులనుదానమొనర్చినకథ'జాతక'మందుఁ బ్రసిద్ధము. * 'వేస్సంతర' రాజకుమారుఁడును - దన మంగళ హస్తి యిర్వురుగన్నియలు - దనజవరాలు - వీరినందఱిని యొక విప్రునకు ధారాదత్తము సేసెనట! ఈ గాథయు వేస్సంతర జాతకమందే వచ్చును. ఈ కథలనుబట్టి 'శివి' 'చేతి'(చైద్య) దేశములందు భూదేవతలకు మన్నన యెక్కువ యుండెనని యూహింపవచ్చును. ఈ రాజ్యములు గొంచెము బశ్చిమమున నుండెననియు నొకయూహ. బుద్ధునికాలమున 'శివి-చేతి'నామములు రెండును వేఱువేఱుగనే యుండినవి. బుద్ధుఁడీరాజ్యమందుఁ బర్యటించిన శ్లాఘారములులేవు. 'అంగము'నకు మగధయం దంతర్భూతిమైన ట్టీరాజ్యమునకు దేనిలోను చేరికమైనట్లు దోపదు. ఏదియెట్లున్నను బుద్ధభగవానుల చరిత్రతో - నీరాజ్యమున కేరీతిగను సంబంధము లేదు. ఇంతవఱకు నిక్కము.

---

* సివిజాతకము (నం 499 పుట)

## వంసా (వత్స)

కోసంబి(కౌశాంబి)దీని రాజధాని. బుద్ధకాలమున కిచటి గుణసత్తాకపద్ధతి నశించినది. ఉదయనుఁడు దీనిరాజు. ఇతఁడుత్సాహి. 'ధమ్మపద' 'అట్ఠకథ'లలో నుదయనునిగుఱించిన యీ కథ గలదు.

చండప్రద్యోతుఁ డుజ్జయినిరాజు. ఉదయనునకు -నీతనికి రవరవలు. ఉదయనుని యుద్ధమునగెల్చుటకుఁ బ్రద్యోతునికి సాధ్యపడినది గాదు. ఉదయనుఁడు వాడిమిగలవాఁడు. ప్రద్యోతుఁ డొక యుపాయమునుఁ బన్నినాఁడు. ఉదయనున కేన్గులఁ బట్టికొను మంత్రము దెలియును. కాఁగా - నాతని కది యొక చాపల్యమైనది. క్రొత్తయే న్గొకటి జుట్టుపట్టులఁ బొరాడుచున్నదని యాతని చెవి సోకరాదు. దాని వెంటఁబడి పట్టికొనివచ్చునర కాతనికి నిద్రరాదు. ఈ చాపల్యము ప్రద్యోతునికిఁ దెలియును. ఆతఁ డొకయంత్రసహాయమున గృత్రిమగజమును దయారుచేసి యుదయనుని రాజ్యపుటెల్లలలో వదలిపెట్టించెను. దానిలోపల మనుష్యులు దాగియున్నారు. ఆ యేన్గు వత్సదేశపు సరిహద్దులయందు దిరుగుచున్నది. ఈ విషయము సేవకులు రాచవారి కెఱింగించిరి. ఉదయనుఁ డా కరివెంటఁ బడినాఁడు. కృత్రిమగజమునందు దాగిన మనుష్యులు - ఉదయను నెలయించుకొని, యేన్గు 'నుజ్జయిని' తలపొలములకు నడపిరి. ఉదయనుఁడట్లే వెంటాఁడెను. చెట్టులఁబుట్టల దాఁగికొన్న ప్రద్యోతుని సైనికులుదయనుని బంధించి - యుజ్జయినికిఁ గొనిపోయిరి.

చండప్రద్యోతున కీగజముంబట్టు మంత్రమును దస్కరింప వలెనని యాశ. అతం డన్నాండు.

"ఏన్గులంబట్టు మంత్రమును నాకిమ్ము. నిన్ను వదలుదును. లేనిచో నీయూరియందే నీ యుసురులకు స్వస్తి"

ఉదయనుండు వాని కఠోరవచనములకు బెదరలేదు. అతని ప్రతివచన మిది.

"నాకు నమస్కరించి శిష్యుండైన వానికే యీరహస్యమును వచింతును. నీవునాకు శిష్యుండవై నేర్చికొనవచ్చును. అట్లుగాకున్న నామంత్రము నూరక యుపదేశింపను. నీకిష్టమైన శిక్ష విధింపుము."

చండప్రద్యోతనుండు దుర్యోధన దురభిమాని. వానికుదయన శిష్యత్వమంగీకరింప సమ్మతిలేదు. కాని యుదయనుని జంపి - మంత్రమును నష్టమొనర్చికొనుటయు గుచించినది గాదు. వాం డనెను:

"నేను నీశిష్యుండను గాలేను. వేఱొకరిని నీశిష్యునిగ జేయుదును. వాని కామంత్రమిమ్ము. లేనిచో నిన్నిక్కడనే బంధింతును."

"ఎవరికైననుగాని - యుపదేశించుటకు నేను సర్వసిద్ధమే. స్త్రీపురుషవివక్షగూడ నాకులేదు. నేనుగోరున దింతే నీ యొప్పించు వ్యక్తి నాకు నమస్కరించి నాశిష్యత్వ మంగీకరింప వలెను."

ఈమాటలకుం బ్రద్యోతనుండు దన పాచికపారినది పొమ్మనుకున్నాండు. ఇతని కొక గూతు రున్నది. ఆమె పేరు

వాసలదత్త (వాసవదత్త). ఆ తెలివ మివుల జుఱుకైనది. ఆమె నొప్పింతమనుకొనెను. కాని - యుదయనునితో నామె నేకాంతముండుంచుటకుఁ బ్రద్యోతనున కిష్టము లేదు. దాని కొక బదక మల్లెను. అతఁ డుదయనునితో ననెను.

"నాయింట నొకగూనిదాసి యున్నది. అది 'పరదా' మఱుఁగుననుండి నీకు నమస్కరించును. నీశిష్యత్వమునుగూడ నంగీకరించును. దానికి నీవు నేర్పుము. ఆవిడకుఁ గొంత మంత్రసిద్ధి యేర్పడి నంతనే - నీ బంధమును వదలింతును. నీరాజ్యమునకుఁ బోవచ్చును."

ఉదయనుఁ డందు కంగీకరించినాఁడు. ప్రద్యోతుఁడు గుమార్తెతో నిట్లనెను: "అమ్మా! ఒకని కేన్గులమంత్రము దెలియును. వాఁడు శ్వేతకుష్ఠు. వాని మొగముజూడక నమస్కరించి దన్మంత్రోపదేశము సందుము." వాసవదత్త 'కాని మ్మ' న్నది. ఆమె జవనిక మఱుఁగునుండి యుదయనునికి నమస్కరించెను. మంత్రోపదేశ మారంభమైనది. మంత్రము నందలి గొన్నియక్షరము లావిడకు స్ఫుటముగఁ బలుక వలను గాలేదు. ఉదయనుఁడు విసుగుతోఁ గోపముఁ గొన్నాఁడు. అతఁడు వలికెను.

"ఓసీ! నీకు గూనియొక్కటియేగాదే! నాల్కగూడఁ జాలలావుగ నున్నట్లున్నది." యని గసరించెను. దీనితో రాజకుమారి యహంకారము దెబ్బతిన్నది. 'ఇంతటి యసత్యాధిక్షేపమా!' ఆమె యోర్చికొనలేదు. "ఓరీ! రాజకుమారిని గూనియందువా!" యన్నది.

ఉదయనున కీతతంగ మర్థమైనదిగాదు. అతఁడు వెంటనే యవనికను దొలఁగించెను. ఇంకేమున్నది! విచ్చిన పూవువంటి రాచకన్నె. ఇరువురిచూపులును నిముసము సేపు మేలమాడుకొన్నవి. ప్రద్యోతనుని యెత్తుగడ యిరువురకు నర్థ మయ్యెను. ఇఱు మనసులందు నొకేసారి వలపుఁ బులకలు. వారిరువు రటనుండి దప్పించికొని పోఁదలఁచిరి. వాసవదత్త-మిగుల నేర్పుగలదిగదా! ఆమె యొక యుపాయ మల్లెను. ఒకానొక శుభముహూర్తమందుఁ దండ్రికి విన్నవించినది: "మంత్రసిద్ధికై- విధియుతముగ నేఁడొక మూలిక దేవలెను. అందుకై 'భద్రవతి' యను గజముగావలెను." రాజు - వల్లె యన్నాఁడు. తండ్రి యుద్యానక్రీడయందు మున్గియున్న సమయము వాసవదత్త గనిపెట్టినది. ఆ యుదయమున, యుదయనునితోఁగూడ 'భద్రవతి' పైఁ దానును గూర్చుండి యుఁకిఁ బోద మన్నది. ఉదయనుఁడు గజచోదనమునందు సమర్థుఁడు గదా! కాని - గొందఱుసైనికులా మదహస్తిని వెనుదవిలినారు. వాసవదత్త దండ్రి భాండాగారమునుండి - గొన్ని బంగారునాణెముల మూటలంతకుముందేఁ బదిలపరచికొన్నది. ఆ మూటలలో నొక్కటివిప్పి విసిరివేసెను. సైనికులానాణెముల కెగఁబడినారు. ఇంతలో గజము గొంతదూరమేగినది. బంటులు మఱల వెన్నాడిరి. వాసవదత్త మఱియొకమూట మూతి విప్పెను. ఇట్లు సైనికులు వెన్నాడినపు డెల్ల నాణెములు వెదజల్లుచుఁ బ్రేమికులు 'కౌశాంబి' జేరికొన్నారు.

ఉదయనుఁ డొకనాఁ డుద్యానక్రీడకు వెడలి యటనే నిద్రించెను. 'పిండోలభరద్వాజ భిక్షువు' సమీపముననే

యొక జెట్టునీడయం దుండెను. రాజునకు నిద్రవట్టినదని 'వాసవదత్త' దగ్గరనేయున్న 'భరద్వాజు'ని దగ్గరి-యాతని యుపదేశములు వినుచుండినదట! ఇంతలో రాజు గన్నులు విప్పెను. వాసవదత్త యటలేదు. ఆయనకుఁ గోపము వచ్చినది. రాజమహిషిపైని గాదు. దిక్కులేని భరద్వాజుని పైన. అప్పుడా రాజు - భరద్వాజుని శరీరముపై నెఱ్ఱజీమలు వదలుటకుఁ బ్రయత్నపడినాఁడట! ఈకథ- 'సంయుత్తనికాయము' నందలి 'యట్ఠకథ'లో వచ్చును. కాని పిదప యుదయనుఁడే 'భరద్వాజుని' యుపదేశముతో బుద్ధోపాసకుఁ డయ్యెను.

'కౌశాంబి' లోని ఘోషిత- కుక్కుట - పావారికులను ముగ్గురు వర్తకులు బౌద్ధభిక్షువులకై మూఁడు విహారములు గట్టించి యిచ్చిరి. అవి వరుసగా ఘోషితారామ-కుక్కుటారామ-పావారికారామములు. ఈయుల్లేఖ సంయుత్తనికాయములోని 'యట్ఠకథ' యందును - 'ధమ్మపథ' అట్ఠకథలోను గలదు. ఉదయనుని ప్రముఖరాణి 'సామావతి' యనునది. ఆమెదాసి 'ఖుజ్జుత్తర' (కుబ్జోత్తర). వీరిరువురును బుద్ధునకు ముఖ్యోపాసికలు. ఈ వివరములఁబట్టి యుదయనుఁడంత శ్రద్ధాళువు గాకున్నను - 'కౌశాంబి' యందు 'బుద్ధభక్తు' లనేకులుండిరనియు - వారు భిక్షువుల యోగక్షేమములు గమనించుటయం దెక్కువ యాతురతగలవారనియుఁ దెలియును.

## కురుదేశము

దీని నృపధాని 'యింద్రప్రస్థము'. బుద్ధునికాలమున దీనిని కౌరవ్యుఁడను రాజు పాలించెడువాఁడు. ఇంతకుమించి

యీ రాజ్యమును గుఱించి - మనకుఁ దెలియదు. ఉచ్చట- 'రాజ్య వ్యవస్థ' యెట్టిదో! ఈ రాజ్యమున 'బుద్ధవిహార' మొక్కటియు లేదు. బుద్ధుఁ డెప్పుడైనను యీ భూములకు ధర్మప్రచారమునకై వెళ్ళిననాఁ డేదేని యొక పరిశుభ్రస్థల మున వసించి-పనిజూచికొని వెళ్ళెడువాఁడు. కాని యీ దే శమున 'బుద్ధోపదేశము' లపెఁ ప్రీతిమాత్రము సమృద్ధిగ నుండెడిది. 'రాష్ట్రపాలుఁడ'ను పేరుగల ధనికుఁడైన యువకుఁ డొకఁడు భిక్షువైన గాథయు 'మజ్ఝమనికాయము'న విపుల వర్ణనముతోఁ గలదు. కురుదేశములోని 'కమ్మాసదమ్మ' (కల్మాషధర్మ) నగరసమీపముననే బుద్ధుఁడు 'సతిపట్ఠానా' వంటి కొన్ని యుత్తమ సుత్తముల నుపదేశించెను. ఈ విష యము 'సుత్తపిటకము'న వచ్చును. ఈవృత్తాంతములఁబట్టి దేలునదేమి? ఆ దేశమునందలి సామాన్య జనత బౌద్ధధర్మ ములపై నాసక్తము. పెద్దలు దీని నాదరించినవారు గారు. వారు వైదిక మతానుయాయులు.

## పాంచాల - మత్స్యములు

జాతక 'అట్ఠకథ' లలో నుత్తరపాంచాల రాజధాని 'కంపిల్ల' (కాంపిల్యము) మైనట్లు గలదు. మత్స్యదేశ రాజ ధాని యేదో? ఆనాఁడీ రెండు దేశముల కంతప్రాబల్యమున్నట్లు లేదు. ఈ దేశముల బుద్ధభగవానుఁడు ప్రవసించినట్లు లేదు. అందుచే నీ జనులు యీ నగరములకు బౌద్ధగ్రంథములం దెక్కువ ప్రసక్తి రాదు.

## శూరసేనము

దీని ముఖ్యపట్టణము 'మధుర'. దీని రాజు అవంతీ పుత్రుఁడు. 'మజ్ఝమనికాయము'లోని 'మధురస్తుతము' నందు వర్ణాశ్రమధర్మములపై నవంతీపుత్రునకును - మహాకాత్యాయనునకు జరిగిన సంవాదము గలదు. ఈ దేశమునకు బుద్ధుఁడెన్నఁడో బోయెడువాఁడు. 'మధుర' బుద్ధుని కంతగా రుచించినట్లు లేదు. క్రింది యుల్లేఖము జూడుఁడు—

"పంచిమే భిక్ఖవే ఆదినవా మధురాయం, కతమే పంచ ?
విసమా, బహురజా, చండసునఖా, వాళయక్ఖా, దుల్లభ
పిండా, ఇమే ఖో భిక్ఖవే పంచ ఆదినవా మధురా యంతి."
(అంగుత్తనికాయ - పంచక నిపాతము)

"భిక్షువులారా! మధురయం దీ యైదుదోషము లున్నవి. అచటి దారులు విషమములు, వానియందు ధూళి యధికము. ఆ నగరములోని కుక్కలు దుష్టములు. యక్షులు క్రూరులు. ఆ దేశమున భిక్షదొరకుటఁ గష్టము. భిక్షువులారా! మధురయం దున్న యీ యైదుదోసఁగులు.

## అశ్మకము

సుత్తనిపాతములోని 'పారాయణవగ్గా' రంభము నందలి 'వత్థుగాధ'లచేత నశ్మకరాజ్య మించుమించు గోదావరీ సమీపమున నున్నట్లు దెలియును. 'బావరి' యనెడు 'శ్రమణి' యట నివసించెడు బ్రాహ్మణునితోఁగూడఁ దన పదునాఱు శిష్యులతో నివసించుచుండెను.

"సో అస్సకస్స విసయే, అళకస్స సమాసనే
వసీ గోదావరీ కూలే, ఉంఛేనచ ఫలేనచ"

ఆమె యశ్మకరాజ్యమందు 'అళకా' రాజ్యసమీపమున - గోదావరీతీరమందు భిక్షతో-ఫలములతో నిర్వాహమొనర్చికొనుచు వసించుచుండెను. "అశ్మకము - అళకము" రెండును నాంధ్ర రాజ్యములు. బావరి వీనియందుఁ - దనపదునాఱు శిష్యులతోఁ గొంతకాలముః వసించి యుత్తరదిక్కునకుఁ బ్రయాణించెనని "యట్ఠకథా" కారుని దలఁపు. వైదిక ధర్మప్రచారకుల దొల్లిటినివాసము దక్షిణమునందుఁ గూడ నుండె ననుటలో నేవిరోధమును లేదు. బుద్ధుఁడుగాని దత్సమకాలీనుఁడైన మఱియొక భిక్షువుగాని యింతవరకు వచ్చినట్లు లేదు. అందుచే నీరాజ్యముల విషయ మెక్కువగా - బౌద్ధవాఙ్మయమునగానరాదు. కాని బుద్ధునికీర్తి యీదేశములవరకనుగతమై యుండును. ఆకీర్తి నాలించి 'బావరి' దనశిష్యులతో బుద్ధదర్శనమున కేగెను. ఆమె ప్రయాణములు సేయుచు మధ్యదేశము నుత్తరించి 'రాజగృహము' జేరినది. అట బుద్ధునిదర్శించి - వారిశిష్యత్వమును స్వీకరించెనని బైఁ జూపబడిన 'పారాయణవగ్గము' నందే యున్నది. కాని తరువాత నామె తిరిగివచ్చి గోదావరీప్రదేశముల నిల్చి మత బోధ గావించెననుట కాధారములు లేవు.

అవంతి

ఈదేశము రాజు చండప్రద్యోతుఁడు. దీని రాజధాని యుజ్జయిని. ఈ రాజు రోగగ్రస్తుఁడైనాఁడు. చికిత్సకై యతఁడు మగధనుండి 'జీవక' వైద్యుని బిలిపించెను. అతఁడును వచ్చినాఁడు. చండప్రద్యోతనుఁడు దనపేరు సార్థకము

జేసికోఁగలవాఁడు. మహాక్రూరుఁడు. ఈ విషయము 'జీవకుని' కిఁ దెలిసెను. ఔషధమొసఁగుటకు ముందే 'జీవకుఁడు' 'వనమూలికలు' దేవలెనని యొకయేన్గును రాజు నడిగి దీసికొనెను. దాని పేరు 'భద్ధవతి'. మూలికలు దెచ్చి రాజున కిచ్చినదే తడవు – జీవకుఁడు 'భద్రవతి' పై నొక్కఁ జేపరుగు. ఔషధమును దీసికొన్న రాజునకు వాంతులెత్తికొన్నవి. అమితముగఁ గళవళించినాఁడు. జీవకుని బట్టుకొని రావలెనని 'హుకుము' జారీయైనది. కాని – జీవకుఁ డేడీ? రాజు వానిని బట్టికొని వచ్చుటకు 'కాక' నామకుని సేవకు నంపెను. 'కాకుఁడు' గౌశాంబివరకు వచ్చి జీవకుని బట్టుకొన్నాఁడు. వాఁడు వీని కనుమరపి తినుట కొక యౌషధము నొసఁగెను. వాఁడు దిన్నాఁడు. అది తీవ్రరోగమున కాహ్వానము. జీవకుఁడు 'భద్రవతి'పై నెక్కి రాజగృహము సేరికొన్నాఁడు. చండప్రద్యోతనునకు రోగము నయమైనది కాకుఁడును సుఖియై యుజ్జయిని జేరెను. రోగము గుదురుటచే రాజుకు 'జీవకుని' పై ననుగ్రహము గల్గినది. జీవకుని కిచ్చుటకై జండప్రద్యోతనుఁడు 'సివేయ్యక' మనెడు 'జోడువస్త్రము'లను రాజగృహమున కనిపెను. *

పై కథకును – 'ధమ్మపథము' దలి 'యట్ఠకథ' లోని విషయమునకును జాల పోలిక యున్నది. రెండుగాథలును నొకకేసమయమందు వ్రాయఁబడినవా? లేక భిన్నకాలము లందా! యనునది మాత్రము వింగడించుట కష్టము. ఈ

* మహావగ, ౮ వ భాగము జూడుఁడు.

రెంటిని బట్టి చూచినను చండప్రద్యోతనుఁడు క్రూరుఁడనియు, సర్వసత్తాధికారి యనియుఁ దేలును.

బుద్ధుఁ డీ రాజ్యమం దడుగుపెట్టనే లేదు. కాని బుద్ధశిష్యులలో నొక ప్రధానశిష్యుఁ డున్నాఁడు. అతఁడు మహాకాత్యాయనుఁడు. వాఁడు ప్రద్యోతుని పురోహితునియొక్క కుమారుఁడు. తండ్రి యనంతరము మహాకాత్యాయనునకుఁ బౌరోహిత్యము సంక్రమించినది. కాని దానితో నాతనికిఁ జిత్తశాంతి దొరకలేదు. మధ్యదేశమునకు వచ్చి బుద్ధుని దర్శించి భిక్షువైనాఁడు. మహాకాత్యాయనుఁడు దిరిగి తన యూరికి వెళ్ళినపుడు రాజును ప్రజయు నతని నెక్కువ గౌరవించిరి.* అతనికిని, మధురరాజు 'అవంతి పుత్రు'న కును జాతిభేదవిషయమై దొడ్డ సంవాదమైనది. ఆవిషయము 'మజ్ఝమనికాయము' నందలి 'మధుర' లేక 'మధురియ' సుత్తమున వచ్చును. మధురలోను, ఉజ్జయిని యందును మహాకాత్యాయనుఁడు జాల ప్రసిద్ధుఁడైనాఁడు. బుద్ధునికాలమున నయ్యెడ బౌద్ధమెక్కువ ప్రచారమునకు వచ్చినట్లు లేదు. అక్కడ భిక్షువులు గొలఁదిగ నుండుటచేతనే యాప్రదేశమునం దైదుగురు భిక్షువుల తోడ్పాటుతోనే వేఱొకని కుపసంపద నొసఁగి 'సంఘము'న జేర్చికొనుటకు బుద్ధుఁ డనుమతించినాఁడు.♦ మధ్యదేశమం దైనచో నీ కార్యమునకుఁ బదుగ్గురు గఁ దక్కువ నిఱువదిమంది గావలెను.

---

* దీనిని గుఱించి విపులవిషయము 'బౌద్ధసంఘాచా పరిచయ' పుట 165-168 చూడుఁడు.

♦ మహావగ్గ, 8 వ భాగము, 'బౌద్ధసంఘాచా పరిచయ' 30-31 చూడుఁడు.

గాంధారము

రాజధాని తక్షశిల. దీనిరాజు 'పుక్కుసాతి'. అతఁడుత్తరవయస్సు వచ్చిన వెంటనే రాజ్యము త్యజించెను. రాజగృహపర్యంతము గాలినడకతో వచ్చి, భిక్షుసంఘమున జేరినాఁడు. ఒకనాఁడు 'పాత్రచీవరము'లను శుద్ధిపఱచుటకై దిరుగుచుండెను. ఒక యున్మత్తమైన యావు పైనిపడి క్రుమ్మినది. అతఁడు మరణించెను. ఈ వృత్తాంతము 'మజ్ఝిమనికాయము'లోని 'ధాతు విభంగ సుత్తము'న గలదు. ఇతఁడు 'దక్షశిల'కు రాజైనట్లును-బింబిసారునితో నీతని కెక్కువ మైత్రి యున్నట్లును నా సుత్తములోని 'యట్ఠకథ'యందే యున్నది. దాని సారాంశ మిది:

'తక్షశిల' నుండి గొందఱు'వ్యాపారులు' రాజగృహమునకు వచ్చిరి. వాడుక ననుసరించి బింబిసారుఁడు వారి నాదరించి వారి రాజునుగురించి ప్రశ్నించినాఁడు. వారతఁడు జాల సజ్జనుఁడనియు, బింబిసారునికన్న వృద్ధుఁడనియు నివేదించిరి. ఆతనిపై బింబిసారున కాదర మేర్పడినది. రాజా 'వ్యాపారుల' పై సుంకమును దీసివేసినాఁడు. 'పుక్కుసాతి' రాజును దన మైత్రి కాహ్వానించి కబురంపెను. 'పుక్కుసాతి' సంతసమునకు మేరలేదు. మగధదేశమునుండి వచ్చువ్యాపారులపై నాతఁడు సుంకమును దొలఁగించెను. అంతేగాక యావర్తకులవెంటఁ దనసేవకులలో నెన్మిది 'సేల్వ' లంపినాఁడు. అవియన్నియుఁ బంచరంగులవి. చాలవెలగలవి. వానిని సగౌరవముగ గ్రహించిన బింబిసారుఁడు మేలైన యొక సువర్ణపటము నుత్తమకరండకమునం దుంచి మా అంపినాఁడు. ఆ బంగారు పుట్టముపై

'బుద్ధధర్మ' సంఘగుణములు మంచి యింగిలీకముచే వ్రాయఁబడి యుండెను. వానిని జదివిన 'పుక్కుసాతి' కన్నులు విచ్చికొన్నవి. కడకు రాజ్యమును వదలి రాజగృహము వరకుఁ గాలినడకతో వచ్చెను.

ఒకానొక 'కుమ్మరి' యింటియం దాతనికి బుద్ధదర్శన మైనటు లైనది. బుద్ధభగవానుఁ డాతనికేమి యుపదేశమిచ్చినది, కడ కాతఁ డున్మత్తగోవుతో నెట్లుమరణించినది మొదలగు విషయము లన్నియుఁ బైనిజెప్పఁబడిన 'ధాతువిభంగసుత్త'ము నందే వచ్చును.

గాంధారము-తక్షశిల వీని యుల్లేఖ 'మట్టకథ 'లలోఁ జాలతడవలు వచ్చును. ఒక 'కళాకౌశలము'ననే గాదు. 'తక్షశిల' పాండితీవిలసనమునను బేరుగన్నది. వేదాభ్యాసమునకై బ్రాహ్మణులు, ధనుర్విద్య-రాజకీయములు వీనికై క్షత్రియులు 'శిల్పకల' యితరవిద్యలు గ్రహించుటకై వైశ్యులు - దూర దూరములనుండి 'తక్షశిల'చుట్టును మూఁగుచుండిరి. 'రాజగృహము' లోని ప్రసిద్ధవైద్యుఁడు జీవకుఁడు'గుమారభృత్య' యనెడు నాయుర్వేదశాఖ నభ్యసించిన దిచ్చటనే. హిందూస్థానమందలి ప్రాచీన విశ్వవిద్యాలయములలో 'దక్షశిల'యే మొదటిది.

కాంభోజము

ఈ రాజ్యము వాయవ్యదిక్కున నుండెననియు, దీని రాజధాని ద్వారకయనియు 'హ్వాస్‌డేవిడ్స్' యభిప్రాయపడినాడు.* కాని'మజ్ఝిమనికాయమున' 'అస్సలాయన' సుత్తము

* Buddhist India P 28.

నందు 'యోనకంభోజేసు' అని గలదు. ఈ దేశము యవను లలోఁ జేర్పఁబడి యుండెను. అందుచే 'గాంధారము'న కంటె నికను బైగా నీదేశముండెనా యని యూహ. ఆ సుత్తమందే యవన కాంభోజములం 'దార్యులు-దస్యుల'ను రెండు తెఱఁగుల జాతులు నున్నట్లు జెప్పఁబడినది. దస్యుఁ డార్యుఁడౌట యు-నార్యుఁడు దస్యుఁడుగా మాఱుటయుఁగూడఁ గల్గుచుండెనని యందేగలదు. గాంధారమున వర్ణాశ్రమధర్మములు వేరులుబాదుకొని యుండెననుటయుఁ గొన్ని జాతక కథలఁబట్టి దెలియవచ్చెడు విషయము. తక్షశిలయందే యనేకులు బ్రాహ్మణాచార్యు లుండిరి. కాంభోజమందుమాత్రము జాతుర్వర్ణ్యసిద్ధాంతము వాడుకలోనికి రాలేదు. అందుచే నీదేశము గాంధారమున కికను బైగా నుండెనని యూహింప వీలున్నది.

'కుణాలజాతకము'లోని 'యట్టకథ'నుబట్టి కాంభోజు లడవిగుఱ్ఱములఁ బట్టుటయందు నేర్పరు లని దెలియును. గుఱ్ఱములఁబట్టుటకు వా రనుసరించెడువిధానము జిత్రమైనది. అది నీరు ద్రావవచ్చుపడియలలో-బాచిలో నణఁగి పీగు దాఁగి యుందురు. లేక బ్రక్కనున్న గడ్డి నోరగాఁ జేసికొని డాఁగుదురు. గుఱ్ఱములు గడ్డిని దినుచు దినుచు వారు దయారు జేసిన పెద్దకంచెలలోఁ జిక్కుకొనును. అది బడినదే తడవు-వీరు వాకిండ్లు మూయుదురు. తరువాత వానిని దిన్నఁగా మచ్చికకుఁ దెచ్చికొందురు. (నేఁడిదియే యుపాయము-నేన్గుల బట్టుకొనుటకై మైసూరు బ్రాంతముల బన్నెదరు. ఈ విషయ మందరెఱిఁగినదే.) ఆ యడవిగుఱ్ఱములను గళ్ళెముల కలవాటుపరచి వానిని కాంభోజమందలి వర్తకుల కమ్మెడువారు.

వ్యాపారులు వానిని 'మధ్యదేశము' గాంశీ మొదలగు చోటుల నమ్మెట *వాడుక.

పురుగులు - మిడుతలు, మొదలైనవానిని జంపిననే మనుష్యున కాత్మశుద్ధి గల్గునని కాంభోజులు దలఁచెడువారు.

♦ కీటా పతంగా ఉరగా చ భేకా
హన్త్వా కిమిం సుజ్ఝతి మక్ఖికాచ
ఏతేహి ధమ్మా అనరియ రూపా
కంభోజకానం వితథా బహూన్నం.

(కీటములు, మిడుతలు, బాములు, గప్పలు, దోమలు మొదలగువానిని జంపిననే యాత్మశుద్ధిగల్గునను నాచార మచ్చట గలదు. ఈ ధర్మ మకార్యము. వితథమైనది. కాని కాంభోజమున దీని ననేకులు నమ్మెదరు.) దీనినిబట్టి నేటివలెనే నాఁడుఁ గూడ నీజనులు సరిహద్దుల కావలనుండినవారే యని దేలును.

'మనోరథపూరణి' 'యట్ఠకథ'లో 'మహాకప్పిను'ని వృత్తాంత మున్నది. అతఁడు సరిహద్దులకుఁ బైనున్న 'కుక్కుటవతి' రాజధానియందు రాజ్యమేలుచుండెనట. తర్వాత - బుద్ధుని గుణగణములను విని 'మధ్యదేశము'నకు వచ్చెను. చంద్రభాగ నదియొడ్డున 'మహాకప్పిను'నకు బుద్ధదర్శనమైనది. అక్కడ భగవానుఁ డారాజు నమాత్యులతోఁ గూడ భిక్షుసంఘమున జేర్చికొన్నాఁడు.§

* ఉదాహరణమునకై 'తండులనాలి జాతకము' జూఁడుడు.

♦ 'భూరిదత్త జాతకము' లోని శ్లోకము.

§ 'బౌద్ధసంఘాచా పరిచయ' 203 పుట జూడుము.

మహాకప్పినుఁడు 'కుక్కుటవతి'యందు రాజ్యపాలన మొనర్చుచుండెననుట కాధారములు - 'సంయుత్తనికాయ' మందలి 'యట్ఠకథ'లోఁ గలవు. కాని - యీ 'కుక్కుటవతి' కాంభోజమునం దుండినదో లేక - దానిసమీపమున నేదేని యారణ్యక సంస్థానమందుండెనో నికరముగఁ దెలియుట లేదు. కాని - యొక విషయము నిశ్చయము. బుద్ధుని కాలముననే యాతని కీర్తిప్రభావములు సరిహద్దులకు బైనున్న యాటవిక ప్రజలలోను వ్యాపించి యుండినవి. ఇందులో నాశ్చర్య మేమియు లేదు. గాంధీమహాత్ముని యుపదేశప్రభావము ఆయన కాలమందే - పంజాబులోని ఛాందసులందు కంటె నెన్నియో రెట్లెక్కువగ సరిహద్దులలోనున్న 'పఠాను'లందు వ్యాపింప లేదా? ఇట్టి సంఘటనమే బుద్ధభగవానుని కాలమందును జరిగియుండుటలో విడ్డూరమే మున్నది?

**ం లలితవిస్తరమునందుఁ బదునాఱురాజ్యములు**

ఈ రాజ్యముల ప్రసక్తి 'లలితవిస్తరము'న వచ్చునని ముందే దెల్పితిమి. బోధిసత్త్వుఁడు 'తుషిత'దేవుని యాలయ మందుండి దా నే రాజ్యమునజన్మించి లోకోద్ధార మొనర్ప వలెనని యోచించుచుండును. అపు డొక్కొక్క దేవపుత్రుఁ డొక్కొక్క రాజవంశమును బొగడును. కొంద ఱా రాజకుల ములలోని దోషము వక్కాణింతురు.

మగధరాజకులము

ఒక దేవపుత్రుఁడ నెను. "మగధదేశమధ్యమున వైదే హికులము జాల సంపన్నమైనది. బోధిసత్త్వులు జన్మించుట

కాస్థానము దగినది.” దానిని వేఱొక దేవపుత్రుఁడిట్లు బూర్వపక్షీకరించెను. “ఈ కులము యోగ్యముగాదు. వారికి మాతృశుద్ధి లేదు. పితృశుద్ధియును సున్న. కడుఁగడుఁ జంచలులు. విపుల పుణ్యాభిషిక్తులు గారు. ఉద్యాన తటాకాదులచే నా రాజ్యము సుశోభితముగాదు. అడవిమనుష్యులు నివసింపఁ దగినట్టిది.”

## గోసలరాజకులము

వేఱొకఁ డిట్లు వలికెను “కోసలరాజకులమునకు సేన విస్తారము. వాహన ధనాదులు బుష్కలములు. బోధిసత్త్వాని జన్మ కావంశము ప్రతిరూపము.” మఱియొకని దృష్టి యిది. “వారు మాతంగ కులోత్పన్నులు. మాతృశుద్ధి - పితృశుద్ధులు శశశృంగము. హీనధర్మమునందు శ్రద్ధగలవారు. యోగ్యులు గారు.

## వంశరాజకులము

అన్యుఁడు “వంశరాజకులము జాల వైభవోపేతము. రాజ్యము సుభిక్షము. సుసంపన్నము. అది మీాబుట్టుకకుఁ దగినది,” యనెను. వెంటనే మరియొక దేవపుత్రుఁ డిట్లు బూర్వపక్షించినాఁడు. “భగవన్ ! వారు ప్రాకృతులు. పరుసఁదనము గలవారు. ఆ కులమునందుఁ బరపురుషజనితులయిన రాజు లనేకులు. మరియు నావంశమునందు నేఁ డున్న రాజు ‘ఉచ్ఛేదవాది’ (నాస్తికుఁడు). అందుచే మీా పుట్టుక కది దగదు.”

## వైశాలీరాజు

"స్వామీ! వైశాలీనగరము జాల వైభవోపేతమైనది. క్షేమకరమైనది. సుభిక్షమైనది. అందచందములు గల మనుష్యులు గలది. గృహములు – వాటికలు వీనిచే నలంకృతము. పూలతోటలు, నుద్యానవనములు, నెచ్చటజూచినను గనులపండువొనర్చును. వైశాలి యమరావతితో సమానమైనది. మీంపుట్టుట కాచోటు దగినది." అని యొక దేవపుత్రుండు ప్రసంగించెను. వేఱొక డద్దానిని విమర్శించినాండు. "స్వామీ! ఆ రాజులు దమలోదాము న్యాయముగ బ్రవర్తించికొనరు. ధర్మముపై వారి కాసక్తిలేదు. పెద్ద – చిన్న తారతమ్యము, వయోవృద్ధులనెడు గౌరవము యిత్యాదులందా రాజకులములకు నాదరము సున్న. ప్రతియొకడును దానే ఘనుండనని యెంచికొనును. ఎవ్వ డెవ్వనికిని శిష్యత్వ మంగీకరింపండు. పరస్పరప్రేమలు శూన్యములు. ఆ నగరము మీ పుట్టుకకుం దగినదిగాదు.

## అవంతి రాజకులము

దేవపుత్రుం డన్నాండు. "భగవన్! ప్రద్యోతుని కులము మిగుల బలముగలది. అతండు మహా వాహన సంపన్నుండు. శత్రుసేనలను జులుకనగా జయించును. తమరచ్చట జన్మింప వచ్చును." వెంటనే వేరొక దేవపుత్రుం డందికొనెను. "ఆరాజులు క్రూరులు. కఠోరులు. పరుసనిమాటలు గలవారు. దుస్సాహసులు. కర్మపై వారికి విశ్వాసము లేదు. మీ రచ్చట జన్మింపరాదు."

### మధుర రాజ కులము

ఒక దేవపుత్రుని వాక్కు లివి. "స్వామీ! మధురా నగరము సమృద్ధము. నరనారీ సంకులము. కంస కులమువా రైన శూరసేనులరాజు, సుబాహుఁడు. అతని కిది రాజధాని. అది బోధిసత్త్వులకు యోగ్యమైనది." ఒకఁ డిట్లు బూర్వపక్షించినాఁడు. "భగవన్! అతఁడు మిథ్యాదృష్టిగల కులము నందు జన్మించుటచే ననర్హుఁడు. అందులోను ధస్యురాజు. మీ పుట్టుకచే నావంశము నలంకరింపఁ దగదు."

### కురు రాజ కులము

దేవపుత్రుఁ డనెను. "హస్తినా పురమునందుఁ బాండవకులోత్పన్నుఁడైనరాజు బాలించుచున్నాఁడు. అతఁ డందముగలవాఁడు. అందమునకుఁ జందమైన చల్లని డెందము. శూరుఁడుగూడ. పరసైన్య పరిభావకమైన ఈ కులము మీ జన్మకు దగినది." వేఱొకఁ డిట్లు పలికెను. "పాండవకులము నందలి రాజులు దమవంశమును వ్యాకుల మొనర్చికొన్నారు. యుధిష్ఠిరుఁడు ధర్మదేవతకు, భీమసేనుఁడు వాయుదేవునకు, గవ్వడి యింద్రునకు, నకులసహదేవు లశ్వినీదేవతలకుఁ బుత్రులని ప్రతీతి. ఈ కులముగూడ బోధిసత్త్వున కర్హమైనదిగాదు."

### మైథిల రాజ కులము

ఇంకొక దేవపుత్రుఁ డారంభించినాఁడు. "మైథిలరాజు సుమిత్రుఁడు. అతని రాజధాని 'మిథిల' అతి రమణీయము. ఏనుగులు, గుర్రములు, కాలిబంటులు, ఈ సైన్య మారాజునకు సుసంపన్నము. బంగారు, ముత్తెములు, సొమ్ములు,

నా రాజుకడ గొల్లలు. సామంతులకు, ఆ రాజు సైన్యమును జూచిన వెఱపు. అతఁడు మిత్రవంతుఁడు. ధర్మవత్సలుఁడు. ఆ కులమున మీరు జనింపవచ్చును." వేఱొక దేవపుత్రుఁ డిట్లు వచించినాఁడు. "పై చెప్పిన గుణములన్నియు నా రాజున కున్నది నిజమే. కాని, యతని కిప్పుడే సంతతి యెక్కువ. చాల వయసుమళ్ళినవాఁడు. అందుచే మరల, పుత్రోత్పాదన కర్హుఁడుగాడు. కాన యా కులము బోధిసత్త్వుల కయోగ్యము."

ఈ రీతి యా దేవపుత్రులు జంబూద్వీపము నందలి పదునాఱు రాజ్యములయందును, (షోడశ జానపదేషు) జిన్నదనక బెద్దదనక సర్వకులములను బర్యవేక్షించికొన్నారు. కాని వానిలో నొక్కటియు దోసఁగులేనిది గానరాలేదు.*

## ఎనిమిది కులముల విషయము

పదునాఱు రాజ్యములలోఁ బైని వివరించిన దెనిమిది రాజకులముల వర్ణన మాత్రమే. వీనిలో సుమిత్రుని కులము వానివెన్కనే నష్టమైనది విదేహులు, వజ్జిరాజ్యమందుఁ గలసిపోయినారు. ఇఁక మిగిలినవి యేడు. వీనియందును బాండవ పరంపరలో నేరాజు రాజ్యము చేయుచుండెనో చెప్పఁబడలేదు. ఇతర బౌద్ధగ్రంథములలోఁ గూడ నాతనిగురించి యేమియుఁ దెలియదు. 'కురుదేశమునందు కౌరవ్యుఁడనురాజు బాలించుచుండెను' యనునంత మాత్రమే - రట్ఠపాల సుత్తమున గలదు. ఇతఁడు పాండవులవంశము వాఁడనుటకు నొక

* ఇవి మూలమునకు సంక్షిప్త రూపాంతరములు.

యాధారమును లేదు. తక్కిన యాఱుకులముల గుఱించిగూడ నింతకుమించి, యెక్కువ విషయము దొరకదు. 'త్రిపిటక' గ్రంథములందు గొంచె మించు మించుగ నింతటి విషయమే గలదు.

శాక్య కులము

బౌద్ధ గ్రంథములలో నీ కులవిషయ మతివిపులముగ వర్ణింపఁబడి యున్నది. ఇంతయున్నను, పైని జెప్పిన బదు నాఱు రాజ్యముల పట్టికలో దీనిపేరే లేదు. దీనికి కారణ మేమి? ఈ పట్టిక తయారగుటకు ముందే శాక్యుల స్వాతం త్ర్యము లోపించినది. ఆదేశము గోసలమందు గలిసిపోయెను. పై పట్టికలో శాక్యులు జేరకుండుటకు కారణ మిదియే.

బోధిసత్త్వుఁడు గృహత్యాగమొనర్చి రాజగృహము నకు వచ్చెను. అపుడు బింబిసారుఁ డతనిఁ గలిసికొని 'నీవెవ్వ డవు?' అని ప్రశ్నించెను. దాని కాయనయొసఁగిన సమాధాన మిది.

"ఉజుం, జనపదోరాజా - హిమవంత స్సపస్సతో
ధనవిరియేన సంపన్నో, కోసలేసు నికేతినో
ఆదిచ్చానామ గోత్తేన సాకియానామ జాతియా
తుమ్హాకులా పబ్బజితోమ్హిరాజ ! న కామే అభిపత్థయం"

(సుత్తనిపాతము - పబ్బజ్జాసుత్తము)

"ఓరాజా! హిమాలయముల పార్శ్వమునందుఁ గోసలదేశములలో నొక జనపదమున్నది. అట నున్నవా

రాదిత్య గోత్రులు. వారిజాతి శాక్య కులము. రాజా! నేను కామోపభోగములందు నిచ్ఛవదలి సన్యాసినై వచ్చితిని. ”

ఈ గాథలో ‘ కోసలేసు నికేతినో ’ యనెడు పదము జాల ముఖ్యమైనది. ‘ కోసలదేశమునం దెవని యిల్లుగలదో ’ యని దానియర్థము. అనఁగా ‘నేరాజ్యము గోసలదేశమునం దంతర్భూతమో’యని దాత్పర్యము. కనుక శాక్యస్వాతంత్ర్య మంతకు ముందే నష్టమైనదని దెలియునుగదా !

శాక్యులు గోసలరాజునకుఁ గప్పమునొసఁగుచుండిరి. దాని యంతర్గతమై దమరాష్ట్ర వ్యవస్థ దామే సొంతముగఁ జూచికొనుచుండిరి. మహానాముని యొక్క దాసీకన్యతో ప్రసేనజిత్తునకు జరిగిన వివాహకథ మనము పైన జెప్పికొన్నాము గదా! ఆ విషయమునందు ప్రొ॥ హ్రీస్ డేవిడ్స్ యి ట్లాక్షేపించుకొన్నాఁడు. కోసలరాజులకు సర్వాధికారము శాక్యులపై నున్నచో దమకూతురు నతని కిచ్చుటకై శాక్యులు వెనుదీక్కవలసిన యవసరమేమి? ఇదియాతని సందేహము.* భారతమునందు జాతిభేద సమస్య యెంత దీవ్రమైనదో యాతనికిఁ దెలియదు. ఉదయపుర రాజైన ప్రతాపసింహుఁ డక్బరు సార్వభౌమత్వము నంగీకరించెను. కాని దన తనయ నిచ్చుటకు సమ్మతింపలేదు. కోసలరాజకులము ‘ మాతంగ చ్యుత్యుత్పన్న’ మని ‘ లలితవిస్తరము ’ నం దున్నదిగదా! దీనితో నాకులము మాతంగజాతినుండి పుట్టినదని తోచును. ఇట్టి రక్తముతో శాక్యరక్తము నకుఁ బొత్తుగుదురదని వా రెంచుటలో నాశ్చర్య మేమున్నది ?

* Buddhist India P 11-12.

## గణరాజ్యముల వ్యవస్థ.

ఈ రాజ్యము లొకనాఁడు 'గణసత్తాకములు లేక మహాజనసత్తాకము'లని యంటిమి గదా! 'వజ్జి-మల్ల-శాక్య' రాజ్యములందు ప్రతిపల్లెకును నొక నాయకుఁ డుండెను. అతనికి 'రాజ'నిపేరు. ఈ విషయము 'త్రిపిటకగ్రంథము'లనుబట్టి తెలియును. ఈ రాజులొకచోటఁ జేరి దమలో నొకని నధ్యక్షునిగ నెన్ని కొందురు. ఆ యధ్యక్షుని యధికారము వానిజీవితపర్యంతమా! లేక గొంతకాలమా! యని నిర్ణయించుటకాధారములు లేవు. 'వజ్జి' రాష్ట్రమునం దెవఁడుగాని మహారాజయినట్లు సూచనలు లేవు. అప్పుడప్పుడు 'సేనాపతి' యనుమాట వినబడును. మహారాజశబ్ద మెక్కడను వాడఁబడలేదు. ఏదైన నవసర మేర్పడినపు డొక యధ్యక్షుని నిర్ణయించుటయు, వాఁ డాకార్యమును నిర్వహించినదరువాత నాపదవి ముగియుటయు, జరగుచుండెనేమో! ఈ గణరాజ్యమునందు న్యాయవ్యవస్థ, రాజ్యవ్యవస్థ వీని విషయమున గొన్నినియమములు ముందే లిఖింపఁబడి యుండెడివి. వానిననుసరించుచు 'గణరాజులు' బాలన మొనర్చుచుండిరి.

## గణరాజ్య నాశనమునకు గారణములు

ఈ పదునారు జనపదముల యొక్క గణరాజులు నశించి 'మహారాజసత్తాకము'లైన రాజ్యములు నెలకొనెను. రెండు చిన్న మల్లరాజ్యములు, యొక బలాఢ్యమైన 'వజ్జి' రాజ్యము, యీ మూఁడు మాత్రమే గణసత్తాక స్వతంత్రములు. వీనియందును నేకసత్తాకపద్ధతి వ్యాపించుభయ ముండి

నది. దీనికిఁ గారణమేమి ? నాకుఁ దోచున దిది. గణరాజుల యొక్క భోగలాలసతయొకటి; విప్రులకు రాచరికమున బలు కుఁబడియొకటి. తక్కినగారణములుగొన్ని యున్నను నీరెండును ముఖ్యములని నా యూహ. గణరాజుల నెవరుగాని యెన్ని కొనుట లేదు. వారి యధికారము వంశాగతము. తండ్రి మరణించినచో వెంటనే గణరాజ్యాధికారము గుమారునకు సంక్రమించును. అందుచే, వారు స్వార్థపరులుగ - కర్తవ్య విముఖులుగఁ బ్రవర్తించుటలో నబ్బురమేమియు లేదు. వాఁ డింకను గొంత-యాక, తెక్క వేసినచో నితరగణరాజులనుగూడ లెక్కింపక యొక స్వతంత్రునివలెఁ బ్రవర్తించును. ఈ భావము క్రమక్రమముగ నందరిలోను బ్రవేశించునుగదా ! వారెవరికి వారేయై, నిశ్శంకటముగ బ్రవర్తింతురు. 'లలిత విస్తరము'లోని 'వజ్జి'వర్ణనలో నీసూచనలన్నియుఁ గనఁబడు చునే యున్నవి. బుద్ధుని పరినిర్వాణము జరిగినపిదప నజాత శత్రుఁడు 'వజ్జి'లోని యీ యవకతవకల నవకాశముగఁ జేసి కొని, యనాయాసముగ దానిని గబళించివేసెను.

సామాన్యజనులకు గణరాజుల నెదిరించు సత్తువ యుం డదు. ఒకానొక రాజు, దన యూరిలోని జనులను బాధించి నపు డాబాధనుండి దప్పించుకొనుటకు బ్రజల కధికార మేదీ? పోని యితరరాజైనను గల్పించుకొను ననుకొందము. వానికి మాత్రము శక్తిసామర్థ్యము లేవీ ? వీని యంతటివాఁడు వాఁడు; వానియంతటివాఁడు వీఁడు. అట్టి స్థితిలో నీరాజుల యరాజకతపోయి, యెవఁడో యొకసర్వాధికారి యేర్పడినచో సుకరముగ నుండుననుభావము బ్రజలలో సహజముగ

వ్యాపించి యుండును. మహారాజు మాత్రము వీరిని, బూజ పెట్టడు. కాని వాని దుండగములు రాజధాని చుట్టుపట్టుల యందు మాత్రమే నడచును. వాని కెవ్వతెయైన నందగత్తె గన్పించినచో వెంటనే వాని జనానాలో చేరవలసినదే. కాని, వాఁడెన్ని జేసినను గణరాజు లంతగాఁ జేయలేఁడు. కారణ మేమనఁగా నీ గణరాజులు యూరికొక్కఁడు. అందు వలన వాఁడు దుర్మార్గములు జేయమొదలుపెట్టినచో, వాని బారికెవ్వఁడును దప్పలేదు. పన్ను - వానియధికసుఖములపై మాఱుపన్ను- ప్రతియొక్కఁడు నచ్చుకోవలసినదేకదా ! ఏక సత్తాక మహారాజుతో నింత బాధలేదు. వాని సుఖసౌఖ్యము లకు ధనము, నియమితమై బన్నులమూలమున నెప్పటికప్పుడు వచ్చుచునే యుండును. కనుక 'గ్రుడ్డికంటెను, మెల్ల మే' లన్నట్లు సామాన్యజనులకు, యేకసత్తాకరాజ్యమం దాదర మే ర్పడుటలో నాశ్చర్యములేదు.

మహారాజుల రాజ్యమందు పౌరోహిత్యము, వంశ క్రమాగతము. లేక బదిమంది బ్రాహ్మణులు జేరి, యొకనిని రాజపురోహితునిగా నంగీకరింతురు. ఎటులైనను, నీ యధి కారము బ్రాహ్మణులదే. ఇంతేగాదు. ముఖ్యప్రధాని మొద లైన పదవులుగూడ విప్రులపాలే. అనఁగా నేకసత్తాక రాజ్య పద్ధతియందు బ్రాహ్మణుఁడు మొదటి భోక్తయైనాఁ డని యర్థము. బ్రాహ్మణ వాఙ్మయములో గణసత్తాక రాజ్యముల పేరుగూడ లేదు. కారణమేమి? వారి కా వ్యవస్థపై నభిమాన మున్నను. దానిపే రన్నను వారికి గంటగింపే. శాక్యులవంటి గణరాజులు, బ్రాహ్మణులను గౌరవించెడువారు గారు.

'అంబట్ఠసుత్త'మందు నంబష్ఠబ్రాహ్మణుఁడు నీ యారోప మును శాక్యులపై స్పష్టముగఁ జేసినాఁడు.* గణరాజ్యము లందు - యజ్ఞయాగములు నడపుటకై - మహారాజులు, బ్రాహ్మణుల కగ్రహారము లిచ్చుచుండిరి. బింబిసారునిరాజ్య మునందు - 'శోణదండుఁడు - కూటదంతుఁడు' మొదలైన బ్రాహ్మణులు పెద్దపెద్ద యినాముదారులు. అట్లే - కోసలము నందును 'పోక్ఖరసాతి' (పౌష్కరసాది) తారుక్షుఁడు (తారు క్షుఁడు) మొదలైన విప్రులుండెడివారు. 'సుత్తపిటకము' వీరి దర్జాను గొప్పగ వర్ణించినది. కాగా 'పరస్పరం భావయంతః శ్రేయః పర మవాప్స్యథ' యన్న గీతావచనప్రకారము - రాజులు - విప్రులు వీరు బరస్పర సహాయములతో నభివృద్ధు లకుఁ బునాది వేసికొనుచుండిరి.

బుద్ధుని కాలమందు శ్రమణులకు (పరివ్రాజకులకు) గారవమెక్కువ యుండెను. బ్రాహ్మణులకంటెను - వారు వర్చస్వు లగుచుండిరి. ఈ విషయము పై ప్రకరణమునం దింకను స్పష్టమగును. వీరికి గణసత్తాకములందు ప్రీతి. దీనికి గారణము రాజ్యములందు యజ్ఞయాగముల కెక్కడను నవకా శము లేకుండుటయే. శ్రమణు లెప్పుడును, నాత్మవిచారము లందు మునిఁగియుండెడివారు. వారికి రాజకీయములతో సంబం ధము లేదు. అందుచే గణరాజ్యములలోని లోతుపాతులను దర్కించి చక్కఁబరచుటకుఁ బ్రయత్నింపనే లేదు. ఏకాల

---

* చండా భో గోతమ సక్యజాతి .... ఇబ్భా సంతా ఇబ్భా సమానా న బ్రాహ్మణే రుంగకరోంతి, న బ్రాహ్మణేమానేంతి, ఇత్యాది (దీఘ నికాయ, అంబట్ఠసుత్త)

మున కేది యపరిహార్యమై వచ్చునో దానిని వచ్చినట్లే యను భవింపవలయునని వారి యూహ.

గణరాజులపైఁ బుద్ధున కాదరముండె ననుట స్పష్టము. వజ్జరాజుల యభ్యున్నతికై యేడునియమముల నాతఁడు దయారుచేసెనని ముందే జెప్పితిమిగదా! కాని యతఁడు గూడ నీ ప్రాచీనమైన సంప్రదాయములోని దోసఁగులు దొలంగించుట యెట్లు? ఒక సువ్యవస్థితమైన రాజ్యాంగము నెట్లేర్పరుచవలెను? యను విషయములను నిమ్మళముగ నాలోచించినట్లు దోపదు. 'గణరాజు'లలో నొకఁడు బాధకుఁ డైనచో నితరరాజులందరు జేరి వానియధికారమును దొలఁ గింపవచ్చునా? లేక, గణరాజు నధికారము వంశాగతమును సేయక లోకు లెప్పటికప్పు డెన్నుకొనునట్లు జేయుటా! యనెఁడు నిర్దిష్టవిచారము బౌద్ధవాఙ్మయమున గనుపింపదు.

బుద్ధుని యనుయాయులుమాత్రము గణసత్తాకరాజ్యముల కల్పనపై నభిమానము దొలఁగించి కొన్నట్లున్నది. 'దీఘనికాయ'మందు 'చక్కవత్తి' సుత్త మొకటి గలదు. 'మహాసుదస్సనసుత్త' మొకటియు నున్నది. ఈ రెండును రాజ్యపద్ధతులను వర్ణించును. వీనిలో జక్రవర్తియొక్క గొప్పతనము యతిశయోక్త్యలంకారములతో వర్ణింపఁబడినది. బ్రాహ్మణసమ్రాట్టులకు – జక్రవర్తులకు, నడుమనున్న భేద మంతే. బ్రాహ్మణసమ్రాట్టు సామాన్యజనుల భావములను లెక్కింపక – నిరంతర యజ్ఞయాగములతో – విప్రులను మాత్రము దృప్తిపరచెడువాఁడు. చక్రవర్తి యట్లుగాక – సామాన్యజనుల సుఖముచు విచారించి న్యాయముగఁ బరిపా

లించెడువాఁడు. రాజ్యమందు శాంతి నెలకొన్నంతనే - యా చక్రవర్తి జనుల కిట్లుపదేశించును.

"పాణో న హంతబ్బో. అదిన్నం నాదాతబ్బం
కామేసు మిచ్చా న చరి తబ్బా, ముసాన భాసితబ్బా
మజ్జం న పాతబ్బం."

"ప్రాణహత్య జేయకుము. దొంగతన మాచరింపరాదు. వ్యభిచారము కూడనిది. అసత్యము పలుకుట అన్యాయము. మద్యపాన మక్రమము."

అనఁగా - బౌద్ధులు గృహస్థులకు నే 'పంచశీల' నియమముల నుపదేశించుచుండిరో యా నియమములనే చక్రవర్తియు నామ్రేడించెను. అందుచే బ్రాహ్మణులేమి-బౌద్ధమతానుయాయులేమి యేకసత్తాకమునే యభిమానించిరి. బ్రాహ్మణులకు యజ్ఞయాగములు జక్కఁగ జరగునని యేకసత్తాకముపై నభిమానము. పంచశీలముల ప్రచారము జరగునని బౌద్ధుల కభిమానము. దృష్టులెట్లున్నను వా రభిమానించిన దొకవిధమైన రాజ్యాంగమే.

పీరిగతి యెట్లున్నను బోధిసత్త్వుఁడు మాత్ర మాదరించినది గణసత్తాకమునే. ఆతఁడు గావించిన సంఘనిర్మాణము గణసత్తాక రాజ్యపద్ధతిలోని సూత్రమును మనస్సులోఁ బెట్టుకొనియే. గణసత్తాకరాజ్యమును గురించి దొరకువిషయ మెంత యల్పమైనను దానికిఁ గల వెలమాత్రము గొప్పది.

# మూడవ ప్రకరణము

# సమకాలీన ధార్మిక పరిస్థితి

## భ్రమ

"బ్రాహ్మణులు మొదట వేదాధ్యయనాదులం దెక్కువఁ బరిశ్రమించుచుండి యటుతర్వాత యజ్ఞయాగాదుల ప్రచారమున నిమగ్నులైరి. పిదప నుపనిషత్తత్త్వజ్ఞానమును వ్యాప్తిసేసిరి. బుద్ధుఁ డుపనిషత్తులయందలి దత్త్వజ్ఞానముల లోని విషయములలోఁ దనకుఁ గావలసినవి సేకరించికొని యొక నూతన సంప్రదాయమును స్థాపించినాఁడు." ఇది నేఁ డనేక విద్వాంసు లనుకొనుపద్ధతి. కాని యీవిచారము భ్రమ మూలకము. ఈ తలఁపు మలపిననేదప్ప బుద్ధునిచరిత్రలోని యదార్థము గోచరింపదు. కనుక నీప్రకరణమునందు బుద్ధ సమకాలిక- ధార్మికపరిస్థితి యెట్లుండెనో సంక్షేపముగ వివ రింతుము.

## యజ్ఞసంస్కృతియొక్క ప్రవాహము

ఆర్య-దాసుల సంఘర్షముచే సప్తసింధువులందు యజ్ఞ యాగముల సంస్కృతి యుద్భవించెననియు, బరీక్షి జ్జనమేజ యుల కాలమం దీ సంస్కృతి కురుదేశమున ధ్రువపడెననియు ముందే వివరించితిమి. కాని యీ వెల్లువ గురుదేశమున కా వైపు బూర్వదిక్కును బూర్తిగ నాక్రమించుకొనలేదు. దాని గతి కురుదేశమంధే గుంఠితమైనది. దీనికిఁగారణము ముఖ్య

ముగాఁ బూర్వదిగ్దేశములందు ఋషి-మునుల యహింస-దప శ్చర్య, వీనిని గౌరవించు జను లెక్కువ యుండుటయే.

## తపస్వులైన - ఋషులు, మునులు

జాతకముల 'యట్ఠకథ'ల యందు వీరికి సంబంధించిన విషయము లనేకములు వచ్చును. దానినిబట్టి యీ వివరములు దెలియును. వీరి నివాస మడవులందే. తపస్సు ముఖ్యవృత్తి. వీరితపస్సు ముఖ్యముగా నహింసయే. ఏ ప్రాణికిగాని బాధ్ధిక ముగ, దైహికముగ దుఃఖము నొసఁగుటకు వీరు సమ్మతింపరు. ఒకొ్కక్క సంఘమునం దైదుగురు పరివ్రాజకు లుండెడివారు. ఈవిషయము జాతకకథలబట్టియే దెలియును. కాననమునందుఁ గాయ కసురులు వీరికాహారము. అప్పు డప్పుడు జావ, పిండి (లోణ, అంబిల, సేవ, నత్థం) యంబలి మొదలైనవి దినుటకు గ్రామములోనికి వత్తురు. వీరిపై జనుల కెక్కువ మక్కువ. గౌరవమును. వీరికిఁ గావలసిన పదార్థము లిచ్చుటకు వారు జంకెడువారు గారు. వా రే ధర్మమును బోధించుట లేదు కాని, వారిప్రవర్తనమును బట్టి జను లహింసను మన్నించు చుండిరి.

## ఋషులు - మునులు వీరి యమాయకత

ఈ తపస్వులకుఁ గంటకమైన లోకవృత్తి దెలియదు. అందుచే నపుడపుడు సిలుగుల బడెడువారు. ఋష్యశృంగుడు స్త్రీలకు వశుఁడగుట, బరాశరుఁడు సత్యవతి వలలోఁ దగు ల్కొనుట మున్నగుగాథలు బురాణములందే యున్నవి. ఇంతేగాక 'జాతకఅట్ఠకథ' లలో వీరిబాధ లనేకచోట్ల వర్ణింపఁ

బడినవి. 'నమూనా' కొక్కటి జూపింతును. ప్రాచీనకాలమున వారణాసియందు బ్రహ్మదత్తుఁడను రాజుండెను. అపుడు బోధిసత్త్వుఁడు గాశీరాష్ట్రమునందలి యొాదిత్య బ్రాహ్మణ కులమున జన్మించి గొంత వయస్సు గడచినతర్వాత సన్న్యసించినాఁడు. అతని కైదుగురుశిష్యు లేర్పడిరి. వారితో గూడ బోధిసత్త్వుఁడు హిమాలయపాదములందు వసించుచుండెను. ఇంతలో వానకాలము వచ్చెను. శిష్యు లాతనితో ననిరి: "స్వామీ! గ్రామములలోనికి వెళ్ళి యుప్పును నంబలియు సేవించివత్తుమా!" ఆచార్యులన్నారు: "చిరంజీవులారా! నే నిక్కడనే యుందును. మీారు బోయి రండు. మీాశరీరముల కనుకూలములైన పదార్థములు భుజించి మరలివత్తురు గాక!"

వారు వారణాసికి వచ్చిరి. వీరికీర్తి రాజుచెవుల సోకినది. అతఁడు జాతుర్మాస్యము దన యుద్యానమునందే జరుపవలె నని ప్రార్థించినాఁడు. బ్రహ్మదత్తుఁడు వారిభోజనమునకుఁ గూడఁ గొంత యేర్పాటు చేసెను. ఒకనాఁడాయూర సురాపానోత్సవము జరుగుచున్నది. అడవులందు పరివ్రాజకులకుఁ జక్కని మద్యము దొరుకదుగదా! ఆ రాజు వీరిని గనికరించి నట్లుఁ జక్కనిమద్యముగొంత యుద్యానవనమున కంపినాఁడు. తపస్వులు మద్యమును ద్రావిరి. వెంటనే వారికి వివేకము దప్పినది. ఆటలు, బాటలు నారంభమయ్యెను. ఇట్లెంతో ప్రొద్దు గడిచినది. వారికిఁ దెలివి వచ్చెను. తపస్వులు దమ ప్రవర్తనమునుఁ దలఁచి యెంతయో జీకాకుపడిరి. ఆనాఁడే రాజోద్యానమును వదలి హిమాలయములకు బయలుదేరి

నారు. కొన్నిదినముల కాశ్రమము ప్రవేశించి యాచార్యు నకు నమస్కరించి యొకవైపు నిలచికొనిరి. చిరునవ్వుతో బోధిసత్త్వుఁ డడిగెను. "నగరములందు మీకు భిక్షదొరకుట గష్టముగ లేదుగదా!" వా రుత్తరమిచ్చిరి: "ఆచార్యా! సుఖముగనే వసించితిమి. కాని యేపదార్థమును ద్రావరాదో దానిని ద్రావితిమి."

"అపాయిమ్హ అనచ్చిమ్హ అగాయిమ్హ రుదిం హచ
విసంజ కిరణింపత్వా దిట్ఠా నాహుం హ వానరా"

"మేము ద్రాగి యాడితిమి, పాడితిమి, ఏడ్చితిమి, తెలివి బోగొట్టుకొంటిమి. మద్యమును ద్రావి, సర్వవిధముల వాన రులవలెఁ బ్రవర్తించినాము.*

## ఋషులు - మునులు, వీరియందు జాతిభేదములేదు

ఋషులు – మునులు, వీరియందు జాతిభేదము బొత్తిగ లేదు. ఏ జాతివాఁడే యగుగాక, దపస్వియైనచో వానికి సమా జమునం దమితగౌరవము. జాతకమునందు వచ్చు నీ మాతంగ ఋషికథ♦ వినదముగాక !

మాతంగుఁడు వారణాసి యందలి యొక మాదిగ. వీరి యిల్లు యూరిబయట. వానికి వయసు వచ్చినది. ఒకనాఁడు మాతంగుఁడు వీధియందుఁ బోవుచుండెను. అపుడు 'దృష్ట మంగలిక' యను నొకయువతి వానికంటఁ బడ్డది. ఆమె గాశి యందుఁ బ్రసిద్ధుఁడైన యొక సెట్టి కూతురు. ఆమెను జూచిన

* సురాపాన జాతకము (సంఖ్య 81)

♦ మాతంగ జాతకము (సంఖ్య 497)

మాతంగుఁడు యొక ప్రక్క కొదిగి 'దృష్టమంగలిక' వైపుఁ జూచుచుండెను పరిచారికాసహితయై బోవుచున్న యా కన్యక 'యా నిల్చున్నవాఁడెవ్వఁడ'ని బరిచారికల నడిగెను. వారు 'వాఁడు చండాలుఁడ'న్నారు. ఆమె కపశకున మయ్యెను. ముందు కడుగిడక వెనుకకేఁ గదలిపోయినది.

దృష్టమంగలిక నెల, రెండునెలల కొకసారి యుద్యాన వనమునకుఁ బోయెడిది. అపుడు త్రోవలోనున్న బీదలకు నాణెములుబంచుట వాడుక. ఆనాఁడామె వెనుదిరిగిపోవుటతో బీదల కా యదృష్టము దప్పినది. వారు మాతంగునిపైఁ గవిసి కొనిరి. తెలివిదప్పువరకు మర్దించి దారియందే బడవేసి పోయినారు. మాతంగునకుఁ దెలివివచ్చెను. వాఁడు నేరుగ 'దృష్టమంగలిక' యింటివైపు నడచినాఁడు. అటఁబోయి ద్వారమునందలి సోపానముల కడ్డముగఁ బడెను. వాఁడు బట్టినది ప్రాణాచారము. ఎందఱు జెప్పినను లేవఁడు. ఎన్నిమారులు జెప్పినను లేవఁడు. సెట్టికీవార్త దెలిసి భయమయ్యెను. అతఁడు బయటికి వచ్చెను.

"నీ వీ హఠము నెందుకు బట్టితివి?"

"దృష్టమంగలికను దీసికొనిపోవువరకును, మీరెంత జేసినగాని యిటనుండి గదలను."

సెట్టి లోనికి వెడలిపోయెను. ఏడుదినములు గడచెను. సెట్టికి దిక్కుదోచక దృష్టమంగలిక నిచ్చివేసినాఁడు. మాతంగుఁడామెను గైకొని చండాలవాటికకు వెళ్ళెను.

దృష్టమంగలిక వానికి బత్నియగుటకు సమ్మతించినది. కాని, వాని కేమిదోచినదో యామె నక్కడనేవదలి యరణ్య

ములకేగి తపస్సు నారంభించెను. ఏడుదినములమీద వాఁడు దిరిగివచ్చి దృష్టమంగలికతో నన్నాఁడు. "నా పతి జండాలుఁడు గాఁడు. అతఁడు మహాబ్రాహ్మణుఁడైనాఁడు. ఈ రాబోవు పున్నమయందు నాపతి జంద్రమండలమునుండి దిగి వచ్చును. ఈరీతి యూరి యందు జాటింపుము." దృష్టమంగలిక యట్లే చేసినది. పున్నమనాఁడు జనులు దండోపతండములుగ వాని యింటిముంగిట జేరిరి. అపుడు మాతంగ ఋషి జంద్రమండలమునుండి యందరు జూచుచుండగా దిగెను. వాఁడు దన గుడిసెయందు బ్రవేశించి దృష్టమంగలిక యొక్క బొక్కిలిని దన బొటనవ్రేలితోఁ గాకినాఁడు.

అచ్చట జేరిన జను లీ యద్భుతమునుజూచి దృష్టమంగలిక నెంతయో గారవించిరి. కాశీనగరములోని కామెను దీసికొనివచ్చి నగరమధ్యమం దొక మంటప మేర్పరచి యామె నందు బూజించిరి. తొమ్మిదినెలలు గడచినవి. ఆ మండపమునందే యామె కొక కుమారుఁడు గలిగెను. మండపమునందు జన్మించుటచే వాఁడు 'మాండవ్య' నామధేయుఁడైనాఁడు. జను లామండపముదగ్గరనే యామె కొక గొప్పహర్మ్యము గట్టియిచ్చిరి. తల్లియుఁ గొడుకును నందు వసించుచుండిరి. ఊరిలో వారిపై నాదరమెక్కువ.

పెద్దపెద్ద వైదిక పండితు లందరు మాండవ్యునివద్దకు వచ్చిరి. వాఁడు మూఁడువేదములందును బండితుఁడైనాఁడు. మాండవ్యుఁడు బ్రాహ్మణులకెక్కువ సహాయకారిగనుండెను. ఒకానొకనాఁడు మాతంగఋషి వాని ద్వారమునకువచ్చి నిలచెను. మాండవ్యుఁ డాతని బ్రశ్నించెను. "చిరిగినగుడ్డలతోఁ

బిశాచమువలె వాకిట నిలచిన నీవెవ్వరవు?" మాతంగుఁ డనెను: "నీయింట నన్నపానములు దండిగ నున్నవి. అందుచే నాకు గొంత భోజనము దొరకునని వచ్చితిని. మాండవ్యున కెంతయో జిడిముడిపాటు గదిరినది.

"మా యింటి యన్నము బ్రాహ్మణయోగ్యమైనది. నీ యట్టి నీచజాతివాని కిట నన్నము దొరుకదు" యని గసరించి వేసినాఁడు. మాతంగుఁడు గదలలేదు. మాండ వ్యుఁడు దనయింటనున్న ముప్వురు సేవకులచే నాతనిని ద్రోయించెను. వెంటనే మాండవ్యుని నో రెండెను. కన్నులు దెల్లనై యీడ్చుకొని పోయినవి. తెలివిదప్పి పడినాఁడు. వాని వెంట నున్న బ్రాహ్మణులకుఁ గూడ దా దావు యీ స్థితియే గలిగెను. వారినోరు లీడ్చుకొని పోయెను. మాటలు సరిగా రా లేదు. ఒక దరిద్ర తపస్వి ప్రభావముచేతఁ దనకొడుకునకును - దక్కిన విప్రులకును బ్రమాదస్థితి యేర్ప డిన దని దృష్టమంగలిక విన్నది. ఆమె బయటికి వచ్చెను. మాతంగఋషి యొకచోట నిలబడి తిరిపెమున దొరికిన యన్న మును దినుచున్నాఁడు. దృష్టమంగలిక యాతని సమీపించి నమస్కరించి, క్షమింపఁ బ్రార్థించెను. వాఁడు దన యెంగిలి యన్నము గొంత నిచ్చి-'దానిని గుమారుని నోటియందును, విప్రులనోళ్ళను వేయు'మని వచించినాఁడు. ఆమె యట్లే యొనర్చినది. వా రందరికిని దెలివి వచ్చెను. కాని - 'వీరు జండాలుని యెంగిలి దిన్నా ర'ను వార్త గాశి యంతయు బ్రాకెను. ఆ బ్రాహ్మణులు సిగ్గుతో గాశిని విడచి మధ్య దేశమును జేరిరి. మాండవ్యుఁడుమాత్ర మందే యుండెను.

మాతంగుఁ డూరూర దిరుగుచు మధ్యదేశమునకు వచ్చినాఁడు. అట నీతని యెంగిలి దిన్న బ్రాహ్మణు లున్నారు గదా! వారందర కీతనిపైఁ గుట్ర. రాజుకడకుఁ బోయి గ్రొత్తగవచ్చిన యీ భిక్షువు మాయావి యనియు - వాని నక్కడనుండనిచ్చినచో రాష్ట్రము నాశమగు ననియుఁ బలికిరి. ఆ మాటలు దలకెక్కినరాజు దనసైన్యముతో నా భిక్షువును వెదకించినాఁడు. ఒకనాఁడు మాతంగుఁ డొకగోడవద్ద నిలుచుండి భిక్షమున దొరికిన యన్నమును దినుచుండెను. రాజసైనికులు మాతంగు నచ్చోటనే జంపివేసినారు. దానితో దేవతలు క్షోభించిరి. ఆ రాష్ట్రమునందు భయంకరమైన కఱవు వచ్చినది.

మాతంగహత్యతో మధ్యదేశమున గాటకమువచ్చిన ట్లనేక జాతక కథలందు వచ్చును. మాతంగుని యీ వృత్తాంత మెంతవరకు సత్యమో జెప్పలేము. అయినను మాతంగుఁడు జండాలుఁడైనట్లును, వానిపూజ బ్రహ్మక్షత్రియులుగూడఁ జేయుచుండినట్లును 'వసలసుత్త' లోని క్రింది గాధవలన దెలియును.

1 "తదమినాపి జానాథ యథామేదం విదస్సనం
చండాలసుత్తో సోపాకో మాతంగో యితివిస్సుతో॥
సోయసం పరమం పత్తో మాతంగోయం సుదుల్లభం॥

2 ఆగచ్ఛుం త స్సుపట్ఠానం, ఖత్తియాబ్రాహ్మణా బహూ
దేవయానం అభిరుయ్హవిరజం సో మహాపథం

3 కామరాగం విరాజేత్వా బ్రహ్మలోకూ పగో అహు
న నం జాతి నివారేసి బ్రహ్మలోకూపత్తియా

(1) ఇప్పుడు నే నొకయుదాహరణ మిత్తును. కుక్కల మాంసమును భక్షించు జండాలున కొక గొడుకుండెను వాని పేరు మాతంగుడు.

(2) ఈ మాతంగున కత్యంత శ్రేష్ఠమై దుర్లభమైన గీర్తి లభించెను. అతని సేవయందు బ్రాహ్మణులు, క్షత్రియులు వేలకొలది నిబద్ధులై యుండిరి.

(3) విషయవాసనల నిర్మూలించు గొప్పమార్గముచే నాతడు దేవయానము (సమాధి) నవలంబించి బ్రహ్మలోకమున కేగెను. బ్రహ్మలోకమును బొందుటకు వానిజన్మ యడ్డంకి గాలేదు."

**౦ శంబూకునికథ కాల్పనికము**

శంబూకుఁ డరణ్యమున దపమాచరించు చుండెను. వాఁడు శూద్రుఁడు. అందుచే నొక బ్రాహ్మణకుమారుఁడు జచ్చెనట! రాముఁ డీవృత్తాంతమును విని, యడవుల కేగి శంబూకుని తల ఖండించెను. వెంటనే బ్రాహ్మణబాలుఁడు బ్రదికినాఁడు. ఈ కథ రామాయణమునందు బుష్పితముగ వర్ణితము. ఈ సన్నివేశమునకుఁ గొంచెము సౌమ్యరూపము నిచ్చి భవభూతిగూడఁ దన యుత్తరరామచరిత్రమునందు వ్రాసినాఁడు. కాని, యిట్టి యాచారము హిందూస్థానము నందు బౌద్ధధర్మమునకు ముందు లేదు; వెనుకగాని యుండెనని జెప్పుట కాధారములు లేవు. 'రాజు లిట్లుండఁ దగు' నని యుపదేశించుటకే యీ కథ రచింపఁబడినట్లుఁ దోచును.

## శ్రమణులు

అడవులయందుండు మునులను-ఋషులను, శ్రమణులు లేక బరివ్రాజకు లనుచుండిరి. 'వీరితపశ్చర్య లెట్టివి' యను విషయమునుగురించి మన కెక్కువగఁ దెలియుట లేదు. ఈ తపస్విసంఘములోనుండి- శ్రమణులనెడుఁ గ్రొత్తగుంపొకటి బయలుదేరెను. వారు జనపదములందే యుండి-జనుల కుపదేశము సేయుదురు. 'శ్రమణ' శబ్దము 'శ్రమ' ధాతువునుండి బుట్టినది. అనఁగాఁ గష్టపడువారని యర్థము. నేఁడు గాయకష్టముసేసి కూలి సంపాదించుకొనువారికి దినదినమునకుఁ బలుకుఁబడి పెరుగుచున్నట్లే నాఁడు శ్రమణులకుఁ బలుకుబడి యుండెను. నేటి కూలీలు సమాజమున కుపయోగపడు వస్తువులఁ దయారు సేయుచున్నారు. నాటి శ్రమణులు సమాజమునందలి యాధ్యాత్మిక జాగృతికొఱకుఁ బనిసేసిరి. వీరిద్దరకుఁ గల భేదమింతే. తపశ్చర్యతో నొక్కొక్కప్పుడు శరీరమును గష్టపెట్టుచుండిరి. గనుక శ్రమణు లని వారినిఁ బిలచిరేమో. అట్లైనచో నడవుల యందుండెడి ఋషులుగూడ దపస్సుతో శరీరమును గ్లేశపరచికొనెడువారే. వారిని శ్రమణు లని బిలుచుటలేదు. అందుచే లోకహితమునకై శ్రమించువారు శ్రమణులన్నయర్థమే సంభావనీయముగ నున్నది.

## త్రిషష్టి శ్రమణపంథలు

బుద్ధునికాలమునందుఁ జిన్నవియు బెద్దవియు జేరి యఱువదిమూఁడు శ్రమణసంఘము లుండెనట! 'యానిచ తీణి-యానిచసట్ఠి' యను వాక్య మీ యర్థమును దెల్పుచున్నది. వీనిలో బౌద్ధము చేరినదని చెప్పుటకు వీలులేదు. ఇట్లు

లెక్కించిననే పాలీవాఙ్మయమునం దనేకచోట్ల గన్పడు బాషష్ఠ (ద్వాసట్ఠి దిట్ఠిగతాని) మతముల యుల్లేఖముల కర్థము సరిపోవును. అనఁగా నాకాలమందు బుద్ధుని శ్రమణపంథయే గాక యితరములు 'బాసష్ఠ' శ్రమణ మార్గము లుండెనని తేలును 'దీఘనికాయము' యొక్క మొదటనున్న 'బ్రహ్మజాలసు త్తము' నందు నీబాసట్ఠ శ్రమణమార్గముల వివరము దెల్పుటకై ప్రయత్నము సేయఁ బడినది. కాని యీ ప్రయత్నము కృత్రిమముగఁ గన్పడుచున్నది. పై సుత్తము లభించు వేళకు 'బాసట్ఠమార్గములు' అనెడు పేరు మాత్రమేగాని యీ సంప్రదాయములు ప్రచారమునందెక్కడను గన్పించుట లేదు. అందుకై యీసుత్తమును రచించిన వ్యక్తి బాసట్ఠ సంఖ్యయొక్క కడుపునిండించుట కున్నవి లేనివి వివరములు వ్రాసినాఁడు. ఈ 'సుత్తము' యొక్క కాలమునకు బూర్వమే బాసట్ఠ శ్రమణమార్గము లంతరించినవి. చిన్నచిన్న సంప్రదాయములు బెద్దవానిలో నైక్యమైపోయి యుండును. నేఁడుగూడ 'బువా' గోసాయీల సంప్రదాయములను - యీష ద్భేదముల నుబట్టి వేలువేలుగ లెక్కించినచో నాలెక్క కంతుండదు. కాని ముఖ్యముగ మనకుఁ గనపడునవి - దాదూ, ఉదాసీన, కబీరాదులైన కొన్ని సంప్రదాయములే గదా!

## తపశ్చర్యాప్రకారములు

బుద్ధుని కాలమునందుఁ బ్రబలములైన శ్రమణసంఘము లాఱే. వీనిలోఁ గూడ నిర్గ్రంథశ్రమణుల సంప్రదాయమే మొట్టమొదటిది. దీనిని స్థాపించిన యైతిహాసిక పురుషుఁడు పార్శ్వముని. ఇతఁడు బుద్ధునకుముందు 193 వ సంవత్సరము

నందుఁ బరినిర్వాణ మందినాఁడు. ఈ నిర్వాణమునకు నలుఁబది - యేఁబది వర్షములకుఁ బూర్వము పార్శ్వముని దన సిద్ధాంతము నుపదేశించెను. ఈ శ్రమణ సంఘముల వివరములు పైనిఁ దెల్పఁబడును. ఇప్పు డా శ్రమణసంఘము లొనర్చుచుండిన - దపస్సును మాత్రమే వివరింతును. శ్రమణుల దపశ్చర్యావివరము లనేకసుత్తములందు వచ్చును. అందును - 'మజ్ఝమనికాయము'లోని 'మహాసహనాద' సుత్తము నందుఁగన్పడు దపశ్చర్యావర్ణన మతిముఖ్యమగుటచే దాని నిక్కడ వివరింతను.

బుద్ధభగవానుఁడు 'సారిపుత్తు'నితో నన్నాఁడు: "ఓ సారిపుత్తా! నేను నాలుగుదెఱఁగులైన దపస్సుల ననుసరించితిని. ప్రవివిక్తుఁడనైతిని."

తపస్వితత

ఓ సారిపుత్రుఁడా! నా తపస్వితత యెట్టిదోఁ దెల్పెదను. నేను దిగంబరుఁడనై యుంటిని. లౌకికాచారములు పాటించుట లేదు. కరపాత్రమునందే భుజించుట. 'భదంతా! యిటు రమ్ము' అని యెవరైన బిలచినచో దానిని వినుట లేదు. నేనున్న యెడకుఁ గొని తెచ్చిన యన్నమునుగాని - నన్నుద్దేశించి వండిన యన్నమునుగాని, నిమంత్రణమునుగాని, స్వీకరించుట లేదు. ఏ పాత్రయందు దన్నమును వండిరో యా పాత్రనుండియే యన్నమును గొనివచ్చినచో దినుటలేదు. పొలమునుండి భోజ్యపదార్థములు దెచ్చినచో ముట్టుటలేదు. ఇంటిగడపకు గాని ద్వారమునకుఁ గాని గడపకు లోపలనుండి పెట్టినయన్నమునుగాని గ్రహించుట లేదు. ఇద్దరు భుజించుచుండి

వారిలో నొకఁడు లేచి యొసఁగినకూడు దినుటలేదు. గర్భిణులు, బిడ్డలకుఁ బాలిచ్చుచున్నవారు, బురుషులతో నేకాంతమందున్నవారు – నగు స్త్రీలు బెట్టినయన్నముఁ దిని యెఱుఁగను. ఉత్సవములు, జాతరలు మొదలగువానియందు వండిన భోజనము గ్రహణయోగ్యముగ నుండదు. కుక్కలు నిలచినచోట, నీగలు మూఁగినచోట, జనుల సద్దున్నచోట యన్నముఁబెట్టిన గ్రహించుట లేదు. మత్స్య, మాంస, మద్యాదులను గ్రహింపను. ఒక యింటియందే భిక్షఁగైకొని యొక ముద్దనుమాత్రమే గ్రహించెడువాఁడను. రెండిండ్లలో రెండు ముద్దలను గ్రహించు చుంటిని. ఈ రీతిగ నేడుదినములవరకు నెచ్చించుచుబోయి – యేడవదినమున నేడిండ్లలో నేడుముద్దలను గ్రహించుచుంటిని. ఒక 'పలము' యన్నమును దినెడివాఁడను. ఈ రీతిగ నేడుదినములవరకు నెచ్చించుచు నేడవదినమునం దేడు 'పలములు' భుజించుచుంటిని. ఒక దివసముపవసింతును. రెండుదినము లుపవసింతును. ఈ రీతిగ నుపవాసముల సంఖ్య హెచ్చించుచుబోయి, యేడు దినముల కొకసారి భుజించెడువాఁడను. పక్షమున కొకసారి భుజించెడువాఁడను.

శాకము, శ్యామాకము, నీవారధాన్యము, మాదిగవానిచే బాఱ వేయబడిన చర్మముయొక్క ముక్కలు, ధాన్యముపై నిపొట్టు, నల్లగాఁ గాల్చఁబడిన యన్నము, నూనె దీసివేసిన యాముదపువిత్తులు మొదలైనవాటిచెక్క, గడ్డి, యావుపేడ, మొదలైనవానిని దిని బ్రదుకుచుంటిని. లేక యరణ్యములలో సహజముగ లభించు ఫలమూలములు దినెడి

వాఁడను. నారచీరలు ధరింతును. మిశ్రవస్త్రముల ధరించుట లేదు. పీనుగులపైఁ గప్పిన గుడ్డలను గట్టికొనుచుంటిని. త్రోవలందుఁబడిన పేలికలను వస్త్రముగ నొనర్చి, ధరించుచుంటిని. అజిన మృగచర్మములఁ దాల్చుచుంటిని. దర్భలతో నల్లిన చీవరములను గట్టికొనెడివాఁడను. కొన్నిచెట్ల పైని నారలచేఁ దయారుజేసిన వస్త్రములను ధరించువాఁడను. మనుష్యుల వెంట్రుకలు – గుఱ్ఱముల వెంట్రుకలు – వీనితో నల్లిన కంబడులను గట్టికొనుచుంటిని. గూబల యీకలతో గుడ్డలు దయారుచేసుకొనుచుంటిని.

గడ్డము, మీసములు, వీనిని జేతులతో బీకివేసికొనెడి వాఁడను. నిల్చికొని దపము చేయుచుంటిని. కూర్చుండి దపము జేయుచుంటిని.

ముండ్లపఱపుపై బండుకొనుచుంటిని. దినమునకు మూఁడుసారులు స్నానముచేయుట వాడుక. ఈ రీతి – ననేక విధములుగ దేహదండన మొనర్చితిని. సారిపుత్రా! ఇది నా తపస్విత.

రూక్షత

సారిపుత్రా! నా 'రూక్షత' నెల్లిన విధములు వినుము. అనేకవర్షముల ధూళి నాయొడలపై నిండి తిందుకవృక్షము యొక్క బెరడువలె యుండెడిది. ఆ ధూళి నేను స్వయముగఁ దీసివేసికొను తలఁపు నాకులేదు. ఇతరులచేఁ దీయించికొనుటయు లేదు. ఇదే నా రూక్షత.

## జుగుప్స

నా జుగుప్సా తపస్సు వినుము. నే నెంతో జాగ్రత్తగ నడచుట వాడుక. నీటిబిందువుపైన గూడ నాకెంతో దయ బుట్టెడిది. విషమముగ జీవించు సూక్ష్మప్రాణులు 'నా చేతులలో మరణించునేమో'యన్న భయముతోఁ జాల జాగ్రత్తగ నా చేతిలోఁ బదార్థమును బట్టుకొని గ్రహించెడివాఁడను. ఇదే నా జుగుప్స. జుగుప్స యనఁగా హింసపై ద్వేషము.

## ప్రవివిక్తత

సారిపుత్రా! నా ప్రవివిక్తతా తపస్సు వినుము. నే నేకాంతముగ నరణ్యములలో నుండుచుంటిని. పసుల గాపరులుగాని, గడ్డిఁగోయువారుగాని, గట్టెలు దెచ్చికొనువారుగాని యొకరేమి? మనుష్యప్రాణి నా కంటఁ బడరాదు. వారిని జూచినదేఁ దడవు - గహనారణ్యములలోనికి - గోనలలోనికిఁ బర్వెత్తెడు వాఁడను. వారు నన్ను జూడరాదు. నేను వారిని జూడరాదు. అడవిజింకలకు మనుష్యులను జూచిన నెంత బెదరో నా కంత బెదరుండెడిది. ఇది నా ప్రవివిక్తత.

## వికట భోజనము

గోవులను గట్టియుంచెడు స్థలములకును - వానిని మేపెడు పొలములకును, నడచి వెళ్లెడువాఁడను. ఆ నడచుటయుఁ జేతులు - గాళ్ళు భూమిపైన మోపి పశువులవలె నడచుట. నేనుభక్షించుటయు వానిపేడనే. నాకు మలమూత్రము

లెంతవరకు వచ్చుచుండినవో - యంతవరకు నిట్లే నా నిర్వాహము. ఇదే నా వికట భోజనవ్రతము.

## ఉపేక్ష

నే నొంటిగ భయంకరారణ్యములం దుండెడివాఁడను. ఎవఁడైనను సంసారి యటఁ బ్రవేశించినచో వానిని జూచి నంతమాత్రముచే నా శరీరముపై ముండ్లు గ్రుచ్చుకొన్నట్లుండెడిది. శీతకాలములందు - భయంకరముగ మంచు గురియునప్పుడు నేను బయల దిరుగుదును. పగటివేళల నడవులందును, యెండకాలములందు నెట్టటి యెండలలో వసించెడు వాఁడను. రాత్రులం దడవిని దిరుగుట వాడుక. స్మశానములందు మనుష్యులయెముకలు బలుపుగా వేసికొని పవ్వళింతును. అపుడు నాకడకు జనులు వచ్చెదువారు. వారు నాపై నుమియుదురు. మలమూత్రములు విడుతురు. కాని వారిపై నా కెట్టి పాపబుద్ధియుఁ గలుగలేదు.

## ఆహారవ్రతము

ఆహారముచే నాత్మశుద్ధి గల్గును. ఈ విశ్వాసము గొందరు శ్రమణులకును, బ్రహ్మనిష్ఠులకు నుండెడిది. కొందరు కేవలము రేగుపండ్లను మాత్రము దినుచుండిరి. కొందరు వానినే బొడిచేసి భుజించుచుండిరి. మరికొందరు-దాని కషాయమును బుచ్చుకొనుచుండిరి. ఇతరబదార్థములఁగూడఁ జూర్ణముగావించుకొని తినెడు నలవాటుండెడిది. సారిపుత్రా! ఒక్క-రేగుపండుమాత్రమే దినుట - నాపరిపాటి. ఆ నాళ్ళలో రేగుఁలు జాలపెద్దవి యని యనుకొనకుము. ఆ నాఁడును -

నేటివలెనే యీ పండ్లు జిన్నవి. దినమున కొక్క-టేరేగు దినుటచే నా శరీర మత్యంతము గృశించెను. 'అసీతకవల్లి' లేక 'గాలవల్లి' వీనియొక్క- గంట్లు స్పష్టముగఁ గన్పడునట్లు నా శరీరసంధులు స్పష్టముగఁ గనబడెడివి. నా కటిప్రదేశము యొంటె కాలంత చిక్కి-పోయినది. నా వెన్నెముక చిన్నని 'పరువంజా' యంత యయ్యెను. మీగాళ్ళు బాడువడిన యింటిపై వ్రేలాడు వాసములవలె నయ్యెను. లోతుగల బావిలోఁ బ్రతిఫలించిన నక్షత్రకాంతివలె నీ కనులలోని గ్రుడ్లు యెక్క-డనో మిణుకు మిణుకు మనుచుండినవి. పండిన చేదు సొరకాయను గోసినచో - నందుండి రసము జొటజొట గారునట్లు నా కాళ్ళలోని చర్మము బలముదప్పి వ్రేలాడు చుండెను. అపు డపుడు 'నాకడు పేదీ' యని నాకే సందేహము. దానిని దడవుకొందును. నాచేతికిఁ దగులునది వెన్నెముక మాత్రమే. దానిపై జేయి వేసినచోఁ గడుపుయొక్క- చర్మము చేతి కందెడిది. ఇట్లు నాకడుపును - వెన్నెముకయు నొకటియై పోయినది. మలమూత్రములు విడచినచో నచ్చటనే బడియుండెడివాఁడను. ఒడలిపై జేయి వేసినచో దుర్బలములైన రోమములు జేతులలోనికి యూడి వచ్చెడివి. సారిపుత్రా! యుపవాసములతో నాశరీరము యిట్లయ్యెను.

కొందరు శ్రమణులు 'ముద్గముల' దిని బ్రతికెదరు. నూగుల దినిజీవింతురు. కొలఁదిగా బియ్యమునుదిని వసింతురు. ఈ పదార్థములచే నాత్మశుద్ధి గల్గు నందురు. సారిపుత్రా! నే నొక్క- నూగుగింజనో - బియ్యపుగింజనో - యొక్క-ముద్గమునో దినెడువాఁడను. ఆ నాళ్ళలో నీ ధాన్యము దండిగ

దొరకుచుండెనని యనుకొనకుము. ఈనాటివలెనే యీ ధాన్యముండెడిది ఈ యుపవాసములతో నా యొడలు ముందు చెప్పినట్లే యైనది.

బుద్ధఘోషాచార్యులు యీ తపస్సులన్నియు బోధిసత్త్వులు బూర్వజన్మమునం దొనర్చిన వన్నారు. ఆకాలమునందు రేగులు మొదలగు పదార్థములు నేటివలెనే యుండెడివి యను బుద్ధభగవానుని వాక్యముచే బుద్ధఘోషాచార్యుల తలఁపు సయుక్తికముగనే దోచును. బుద్ధునికాలమునం దుండెడి భిన్నభిన్నతపశ్చర్యలు నిరర్థకములని జూపుటకై సూత్రకారుఁ డీ తపోవిధానము లన్నియు బుద్ధుని నోటినుండి బలికించెను.

టిప్పణియం దిచ్చిన భేదములుదప్ప సుత్తములందు మాత్రముఁ జెప్పఁబడిన దపశ్చర్య నిర్గ్రంథు (జైనసాధువులు) లనుసరించుచునే యున్నారు. ఈనాటికిని గేశ లుంఛనము, నుపవాసాదులు, ఆహారియం దుండనే యున్నవి.

కేవలము 'సుత్తము'నందుఁ జెప్పఁబడిన దపశ్చర్యలు–యితరసంప్రదాయములలోని శ్రమణులు, బ్రాహ్మణులు, గూడ జేయుచుండిరి. నేటికిని – గోసాయీలు, బైరాగులు మొదలగువారు యీపద్ధతుల నవలంబించుచున్నారు.

## మల మూత్రములఁ దినెడు వాడుక

తమయొక్క మలమూత్రములనే భక్షించు పద్ధతి నేఁడుగూడ 'యఘోరపంథ' మొదలగువానియందు గలదు. కాశియందు 'తెలంగస్వామి' యని యొకరుండిరి. వారు

ప్రసిద్ధులు, నగ్నులు. వారివలెనే దిగంబరులై దిరుగు పరమహంసలు గాశియం దనేకులు. ఆనాఁడు గాశియందు 'గోడ్విన్' యని పేరుగల కలెక్టరుండెను. వారిని జనులు 'గోవిందసాహెబ్' యని బిలచెడువారు. ఆ కలెక్టరు జాల లోకప్రియుఁడు. హిందూసంప్రదాయములను సానుభూతితో గమనించి యర్థము జేసికొన బ్రయత్నించెడు వాఁడు. ఈ దిగంబరులైన బైరాగులతో గుడ్డగట్టించు టెట్లని యాతని కాలోచన. గోవిందసాహెబొక యుక్తి బన్నెను.

నగ్నులై దారులందు దిరుగు బైరాగులపైఁ బోలీసుల 'నిగా' బెట్టినాఁడు. నగ్నులు గనబడిన వెంటనే వారిని పోలీసు లీతని కడకుఁ దెత్తురు. ఆయన వారి నడిగెడువాఁడు.

"మీరు పరమహంసలా!"

ఈ ప్రశ్నకు బైరాగు 'లౌ' నందురు. వెంటనే కలెక్టరడుగు మఱియొక ప్రశ్న.

"మీరు మాయన్నమును భుజింపుఁడు."

అట్లు భుజించుట బైరాగుల కిష్టముండదు. అపుడు గోడ్విన్ బదులిచ్చును. "పరమహంస యెందును భేదమును వీక్షింపఁడు. ఇట్లు శాస్త్రము బలుకును. మీ మనస్సునందు భేదబుద్ధి యున్నది. కనుక మీరు దిగంబరులై దిరుగ రాదు." ఈ యుక్తితోఁ జాలమంది దిగంబరులు గుడ్డగట్ట నారంభించిరి.

ఒకనాఁడు తెలంగస్వామి గూడ పోలీసులకుఁ జిక్కినాఁడు. వా రాతనిని గలెక్టరు కడకు గొనితెచ్చిరి. ఈ సమాచార మూరిలో దెలిసినది. తెలంగస్వామి కనేకులు

శిష్యులు. వారిలో గొప్పపండితులుగూడ నుండిరి. పెద్ద మనుష్యు లనేకు లుండిరి. వా రంద రాతురతతోఁ గలెక్టరు గారి బంగళాకు వచ్చినారు. 'గోడ్విన్' వారిని మర్యాదగాఁ గూర్చొనబెట్టెను. తెలంగస్వామిని - యితరులను తా నడుగు చుండినట్లే ప్రశ్నించెను. తెలంగస్వామి దాను 'పరమహంస' యనెను. 'అయినచో మాయన్నమును భుజింపుఁ డ'ని కలెక్టరు రెండవప్రశ్న.

"మీరు గూడ మా యన్నమును భుజింతురా" యని తెలంగస్వామియడిగిన మాఱుప్రశ్న. కలెక్ట రనెను: "నేను బరమహంసనుగాను. కాకున్నను బరవాలేదు. మేము జాతి భేదము నంతగాఁ బాటింపము. ఎవరి యన్నము నైనను దిందుము."

స్వామి వెంటనే దన చేతియందు శౌచవిధి గావించి- చేతిని ముందుకుజాచి - "ఇదే మా యన్నము. దిను"మనెను. కలెక్టరు గాబరా పడినాఁడు. "ఇది మనుష్యులు దినుయన్న మేనా" యని ప్రశ్నించెను. వెంటనే స్వామి దానిని తిని వేసెను. కలెక్టరాస్వామిని వదలిపెట్టినాఁడు. మరల నతని జోలికి పోలేదు.

నేను 1902 లోఁ గాశియం దుంటిని. అపుడు గాశిలో నీ వృత్తాంతమును జను లెంతయో గౌరవముగఁ జెప్పికొనెడి వారు. అంతకుముందు గూడ 'గాశీయాత్ర' యనెడు పుస్తక మునం దీ కథను జదివి యుంటిని.

## ఆధునిక తపశ్చర్య

ఈ తెలంగస్వామి జలికాలమందు - గంగనీళ్ళలో నిలచికొనియుండుట వాడుక. దిన మంతయు నిలచికొనును. ఎండకాలములందు గంగానదిసైకతములందు నిలచియుండును. సామాన్యు లచ్చట నడుగువెట్టినచో గాళ్ళు బొబ్బలుపోవును.

ఇనుపముండ్లతోఁ జేసినమంచముపైఁ బండుకొనెడు బైరాగు లనేకు లున్నారు. ఇట్టి బైరాగియొకఁడు 1902 లో బిందుమాధవస్వామి మందిరము వద్ద నుండెను. కట్టెతోఁ దయారుచేసిన లంగోటీని ధరించిన బైరాగుల నప్పుడప్పుడు జూతుము గదా !

## తపశ్చర్యపై శ్రమణుల యాదరము

పైని జెప్పఁబడిన తపశ్చర్యాప్రకారములలో శాక శ్యామాక భోజనము, యరణ్యము లందలి గాయగసురులు దినుట యను సంప్రదాయములు ఋషులు-మునులు వీరి కిష్టమైనది. వారిలో ననేకులు వల్కలములు ధరించు చుండిరి. అగ్నిహోత్రమును సేవించుచుండిరి. కాని - నవీన శ్రమణ సంప్రదాయములు బయలుదేరి యగ్నిహోత్రమును వదలి పెట్టెను. అరణ్యవాసులైన ఋషులు, మునులు వీరివలెనే దపశ్చర్య సేయుచున్నను - జర్మముల తునకలు దినుట మొద లైన యలవాటులను బ్రవేశపెట్టిరి.

బుద్ధునికాలమునందు నిర్గ్రంథ సంప్రదాయము ప్రబల ముగ నుండెనని జెప్పితిమి గదా! ఇవియేగాక 'బూరణకాశ్యపుఁడు - మఖ్ఖలిగోసాలుఁడు - యజితకేశ కంబలుఁడు - పకుధ

కాత్యాయనుఁడు - సంజయ బేలబట్ఠ పుత్రుఁడు' యనెడు నైదుగురు శ్రమణనాయకుల సంప్రదాయములు జాల బ్రసిద్ధములుగ నుండినవి. వీని వాదములు సంక్షేపములుగఁ బైని వివరింతును. వీరిలోఁ బరస్పర భేదములు దత్త్వవిషయమం దున్నమాట నిజమే. కాని రెండు విషయము లందుమాత్రము వీ రందరి దొకటే యభిప్రాయము.

(1) వీరందరికిఁ గూడ యజ్ఞయాగములపై నాదరము లేదు.

(2) తపశ్చర్యావిషయమందుఁ గొద్దిగనో, గొప్పగనో వీరి కాదర ముండెడిది.

## శ్రమణుల ప్రచారకార్యము

వీరిపైఁ బ్రజలకు గౌరవమెక్కు- వని జెప్పితిమిగదా! ఈ శ్రమణులు దూర్పున జంప (భాగల్‌పూర్), పశ్చిమమున గురుదేశము, దక్షిణమున వింధ్యము వీనినడుమ వానకాలము నాలుగు నెలలును గడపుదురు. తక్కిన యెనిమిది నెలలును దేశమునందు దిరుగుచు దమతమ యభిప్రాయములను లోకులకుఁ బ్రకటించుచుండెడువారు. అందుచే, జనులకు యజ్ఞయాగములపై నాదరము దగ్గినది. తపశ్చర్యవైపు అభిమానము హెచ్చినది.

## యజ్ఞ యాగముల వ్యాప్తి

రాజులు యుద్ధములందు జయప్రాప్తికై యజ్ఞయాగములు సేయు టావశ్యకమని దలఁచిరి. ఇందుకై 'పసేనది' 'పోక్ఖరసాతి' బ్రాహ్మణునకు 'ఉక్కట్ఠా' గ్రామము

నొసంగెను 'లోహిచ్చ' బ్రాహ్మణునకు 'సాలవతిక' యనెడు గ్రామము నిచ్చెను. మగధమునందలి బింబిసారుఁడు 'శోణ దండు' నకు 'జంపానగరము'ను, గటదంతునకు 'ఖాణుమత' గ్రామమును యీనాముగా నిచ్చెను. ఈ విషయములు 'దీఘనికాయము'న వచ్చును. ఇంతేగాదు. ప్రసేనజిత్తు స్వయముగ యజ్ఞయాగము లొనర్చెడువాఁడని గోసలసుత్తమునందలి దొమ్మిదవ సుత్తమున గలదు. కాని యీ యజ్ఞయాగముల వ్యాప్తి గోసల మగధములందు మాత్రమే యుండెనది. హేతువేమన, వీనిని జిన్నచిన్న మనుష్యులు జేయలేరు. అటు రాజులో-యిటు యినాముదారులో గావలెను. దొడ్డ యజ్ఞములు - యాగములు వీనిని సేయుట సామాన్యశక్తికి మించిన దగుటచే యవి లఘుస్వరూపమును స్వీకరించినవి. 'ఒకానొకరకపుఁ గట్టెచేఁ దయారైన యొక రకపు దర్వీచే హోమముచేసిన నీఫలము గద్దు. ఈ ఫలమున కిట్టి బియ్యము గావలెను. ఇట్టి ప్రాణి రక్తము హోమమునకు గావలెను.' అని బలుకుచు బ్రాహ్మణులు సామాన్య జనులను హోమము లొనర్చుటకై ప్రేరేపించిరి. కొందరు శ్రమణులు గూడ నీగుంపులలో జేరెడువారు.* ఈ వృత్తాంతము 'దీఘనికాయము'న వచ్చును. కాని యివన్నియు, గామ్యకర్మముల క్రిందికి లెక్క. ధార్మికకర్మములలో వీనికి గణనలేదు. ఇట్టి హోమములు గావించు బ్రాహ్మణులపైనను శ్రమణులపైనను జనుల కెక్కువ గౌరవ ముండినది గాదు.

---

* దీఘనికాయము బ్రహ్మజాల, సామంజఫల, మొదలైన సుత్తములు జూడుఁడు.

౦ దేవతలపూజ

నేటి హిందువులు దేవతలు, యక్షులు, పిశాచములు మొదలగువానిని నమ్మి పూజించుచున్నారుగదా! వారినుద్దేశించి బలులొసఁగుటయుఁ గూడ జూచుచున్నాము. బుద్ధుని కాలమునఁ గూడ నింతే. కాని భేద మిది. నేఁడు సాధారణముగ 'సొంతపూజారి' లేని దేవతయుండదు. ఆ పూజారులలోఁగూడ నెక్కువవిప్రులే యుందురు. బుద్ధుని కాలమునందు వలె నేటికినీ నీ 'చిల్లర దేవత' లనేకులు మానవుని కల్పనలేయైనను జాలమంది బురాణములలోని దేవతలే. బుద్ధుని కాలమం దట్లుగాదు. ప్రోదిగాఁబెరిగినపొదపై నీదేవత యుండును. 'ఆ కొండకొమ్మపై నాదేవతగలదు. ఈ వనమునం దీ దేవి గలదు.' యని వారే గల్పించికొని యీ దేవికి బూజసేసిన నీఫలముగునని దామే నిర్ణయించుకొనుచుండిరి. మేకలు, గొర్రెలు మొదలైనవి బలు లిచ్చెడువారు. 'ఫలాసజాతక' మందలి 307వ కథచేత నీ దేవతల పూజలు బ్రాహ్మణులును జేయుచున్నట్లు దోచును. కాని యా దేవతల కొకపూజారి యేర్పడి దానిని దన యాస్తిగాఁ బ్రకటించికొనుట నేటివలె నాఁడు లేదు. ఈనాఁడుగూడ 'నెల్లమ్మ' 'పోతులయ్య' మొదలైన దేవతలకు సొంతపూజారులు లేరుగదా! ఇట్లే నాఁడన్ని దేవతలకును లేరు. లోకు లే దేవతలను బూజించి సొంతముగనే నైవేద్యాదుల నిచ్చెడువారు. బలులు గూడ నొసఁగుచుండిరి. సుజాత, వటవృక్షవాసియైన యొక దేవతకుఁ బాలపాయసము నైవేద్యమిచ్చెను. ఆ చెట్టుక్రింద నివసించు బోధిసత్త్వునకు సుజాత యాపాయసము సమర్పించి

నది. బౌద్ధవాఙ్మయమం దీకథ ప్రసిద్ధమైనది. బౌద్ధుల చిత్రకళయం దీసన్నివేశ ముత్తమమైన పరిణతిని గైకొన్నది. ఇంతకును - నానాఁడు దేవతలకు బ్రాహ్మణ పూజారుల యావశ్యకత యుండలేదని తేలినది.

శ్రమణుల యుత్కర్ష

ఆ నాటి యా దేవతల కాధారములుగ బురాణములు లేవు. పూజారులును లేరు. అందుచే వానిని నాటి ధార్మిక స్వరూపము లనుటకు వీలులేదు. జనులు దమ విపత్తులుబోవుటకై దేవతలకు బలిదాన మొసఁగుచుండిరి. కాని బలులు మొదలైనవానికి ధార్మికకృత్యములక్రింద లెక్కలేదు. యజ్ఞయాగముల కథ యట్లుగాదు. వానికి వేదముల 'వత్తాసి' యుండినది. తక్కిన వాఙ్మయముగూడఁ బుష్టి యొసఁగినది. అందుచే నవి ధార్మికకృత్యములుగఁ బరిగణింపఁబడెను. కాని యజ్ఞయాగము లొనర్చుట - సామాన్యుల శక్తి కందనిది. వానికిఁ గావలసిన సంభారము గొండంత. ఇది జాలక - గోవులు, యెద్దులు దిక్కులేనన్ని బలులకుఁ గావలెను. ఈ పశువులు గర్షకులకు ముఖ్యమైనవి. అవిలేక వారికిఁ బని జరుగదు. కాని - రాజులు, రౌతులు, యజ్ఞయాగములకై యా పశువులను, ద'మ్ముడాయించి' బెరికికొని పోవుచుండిరి. ఎన్ని దినము లోర్చికొందురు? మెల్లగాఁ గర్షకుల మనస్సులలో యజ్ఞములపైఁగూడ ద్వేష మారంభమయ్యెను. వారు శ్రమణుల నాదరించెడువారు. చాతుర్మాస్యములకు గుడిసెలు మొదలైనవి దయారుజేసెడువారు. వారి యుపదేశముల కాసక్తి

పడుచుండిరి. అందుచే శ్రమణుల పలుకుబడి యెక్కువగ నుండెను.

## ఉపనిషత్కాలీన ఋషులు

'వేదములనుండి యుపనిషత్తులు, వానినుండి బౌద్ధ జైనములును యుద్భవించినవి. అందుచే నివి యన్నియుగూడ వైదికములే' యనెడు భావము నేటిప్రజలలో నున్నది. కాని బౌద్ధ జైన పరంపర – వేదములు, నుపనిషత్తులు వీనినుండి రాలేదు. వేదకాలమునకుముందు మధ్యహిందూస్థానమం దుండిన ఋషిమునుల సంప్రదాయమునుండి యావిర్భవించి నది. ఈ విషయమింకను విపులముగ బైని విమర్శింపఁబడును. ఉపనిషత్తులయందు వర్ణింపఁబడిన బ్రాహ్మణుల స్థితిగతులు బుద్ధుని కాలమం దెట్లుండెనని గొంత పర్యాలోకింతము.

ఆరణ్యకములు – నుపనిషత్తులు బుద్ధునికాలమున కెంతో వెనుక రచింపఁబడినవి. ఈ విషయము నేను 'హిందీ సంస్కృతి, మరియు, నహింస' యను పుస్తకమున (పేజీ: 49-50) నిర్ధరించితిని. కాని – బుద్ధ సమకాలికములైన యుపనిషత్తులయందు వర్ణింపఁబడిన బ్రాహ్మణులవలె గొందఱు విప్రులును, క్షత్రియులును జీవించుచుండిరని నమ్ముటలో గొప్పబాధ యేమియు లేదు. వీరిలోను జాలమంది హోమహవనములు వదలిపెట్టి శుద్ధశ్రమణులైనవారే. జాతకముల బట్టి యీ విషయము 'నిక్కచ్చి' గాఁ దెలియును. 'నంగుట్ఠజాతకము'లోని యీ కథ (114) జూడుఁడు.

బ్రహ్మదత్తుని కాలమున వారణాసియందు 'ఔదిత్య కులము'న బోధిసత్త్వుఁడు జన్మించెను. అతని జన్మదినము నందే దల్లిదండ్రులు జాతాగ్ని నెలకొల్పినారు. బోధిసత్త్వుఁడు బదునాఱేండ్లవాఁడైనపిదప నతనితో వారన్నారు: "నాయనా నీజన్మదినమం దీయగ్నిని నెలకొల్పితిమి నీవు గృహస్థుఁడవైనపుడు మూఁడువేదములు జక్కఁగా నేర్చి యీ యగ్ని నర్చింపుము. బ్రహ్మలోక పరాయణుఁడవుటకు నిచ్ఛ యున్నచో నీ యగ్నినిగైకొని యడవుల కేగి దీనిని శ్రద్ధతోఁ బూజించుచు బ్రహ్మలోకము లందుము."

బోధిసత్త్వునకు గార్హస్థ్యము రుచింపలేదు. అతఁడు దన జాతాగ్నిని గైకొని యరణ్యమును జేరెను. ఆశ్రమమును గట్టికొని యగ్నిసేనాపరుఁడైనాఁడు. ఒకనాఁడు బోధిసత్త్వున కొకరైతు యెద్దును దక్షిణగా నిచ్చెను. దానిని బలియొసఁగి యగ్నిని బూజింపవలెనని బోధిసత్త్వుని యిచ్ఛ. కాని యా శ్రమమునం దుప్పులేదు. ఉప్పు గొనివచ్చుటకై యతఁడు గ్రామమున కేగెను. ఇంతలోఁ గొందఱు దొంగ లచ్చటికి వచ్చిరి. వచ్చి యాయెద్దును జంపి, యా యగ్నియందే గాల్చి కొని దిన్నంత తిని తక్కినదానిని దీసికొని వెడలిపోయిరి.

బోధిసత్త్వుఁడు దిరిగి వచ్చెను. ఆశ్రమమునం దెద్దు యొక్క యెముకలు, గొమ్ములు, గిట్టలు బడియుండినవి. బోధిసత్త్వుఁ డిట్లనుకొనెను. 'ఈయగ్నిహోత్రునకుఁ దనబలిని రక్షించుకొనుటకే యోగ్యతలేదు. ఇక నన్ను రక్షించునా!' బోధిసత్త్వుఁ డా యగ్నిహోత్రు నెత్తి నీటిలో వేసెను. ఋషుల మార్గము ననుసరించి తపశ్చర్యకు మొదలుబెట్టినాఁడు.

బుద్ధుని యీ యుపదేశములువిని 'యురువేలకాశ్యప' 'నదీకాశ్యప' 'గయాకాశ్యపు'లు ముగ్గురు బ్రాహ్మణులు శ్రమణులైనారు. వారు దమ యగ్నిహోత్రములను నదిలోఁ బాఱవేసిరి.

## ఉపనిష ద్రుషులు

కొందరు బ్రాహ్మణులకు, శ్రమణధర్మము బాహాటముగ నంగీకరించు ధైర్యములేదు. వారు వైదిక యజ్ఞయాగములకును శ్రమణుల తత్త్వజ్ఞానమునకును నడుమ నూగిసలాడు చుండిరి. అశ్వమేధము మొదలైన వానిపై రూపకాలంకారములు గావించి వానినుండి దత్త్వజ్ఞానమును లాగుటకు బ్రయత్నించిరి. బృహదారణ్యకము యొక్క మొదటి యధ్యాయమునందలి రెండవ బ్రాహ్మణమున నొక ఋషి యిట్లనుకొనెను: "ఈ జగత్తున నుత్పత్తికి బూర్వ మేదొకటియు లేదు. భుజించు నిచ్ఛతో సర్వజగత్తును మృత్యువే యాక్రమించును. భుజించు నిచ్ఛకే మృత్యు వని పేరు. దానికిఁ దానాత్మవత్తు గావలెనని 'కామన' బొడమెను. 'పెద్ద యజ్ఞముచే నేను మరల యజింతును' ఇట్లామృత్యువు దలఁచినది. ఈ కామనతోనే యది యలసెను. మృత్యువు దపము సేయ మొదలిడినది. తపస్సుతో తప్తమైన మృత్యువు నుండి యశోవీర్యము లుత్పన్నమైనవి. ప్రాణమే యశోవీర్యములు. ప్రాణము శరీరమునువదలి వెడలుచుండగా నా ప్రజాపతి శరీరి ముబ్బినది. అయినను దాని మనస్సు శరీరమందే యుండెను. 'నా యీ శరీరము మేధ్యమగుగాక. దానితో, నే నాత్మవంతుఁ డగుదును.' అని యతడు కామించెను. ఏ

కారణముచే నీశరీరము యశోవీర్యము లెగిరిపోవుచున్నప్పుడు జలించెనో, యుబ్బెనో, యా కారణమున నది యశ్వమైనది. ఏ కారణమున నది మేధ్యమైనదో, యా కారణమున నశ్వమేధమున కశ్వమేధత్వము సిద్ధించినది. ఈ యశ్వ మిట్టిదని యెఱిఁగినవాఁడే యశ్వమేధజ్ఞుఁడు."

దీనిలో నశ్వమేధ మిషచే తపశ్చర్యా ప్రధానమైన యహింసాధర్మము వివరించు ప్రయత్నములు గోచరించును. తినుటకై గలుగు కామనయే మృత్యువు. అది యాత్మవంత మయ్యె ననగా, వ్యక్తిత్వమునుబొందె ననుట. దానికి యజ్ఞము సేయ కోరిక బొడమెను. ఆ యిచ్ఛనుండి యశోవీర్యము లను గుణములు గల్గినవి ఇవియే ప్రాణము. ఇవి లేచిపోయి నప్పుడు శరీరము చచ్చి యుబ్బిన ట్లుండును. అపు డది గాల్చి వేయుటకే యర్హము. ఈ తత్వ మెఱిఁగినవాడే యశ్వ మేధజ్ఞుఁడు.

ఛాందోద్యోగమునందు 'ప్రవాహణ జాబాలి' యరుణ పుత్రునితో నిట్లనెను: "గౌతమా! ద్యులోకమే యగ్ని. దాని కాదిత్యుఁడే సమిధ. కిరణములే ధూమములు. దివసమే జ్వాల. చంద్రుఁడే నిప్పు. నక్షత్రములే స్ఫులింగములు.(ఛా.ఉ.5,4.) బ్రాహ్మణఋషుల మనస్సులపై శ్రమణసంస్కృతి యెంతపని చేసినదియుఁ బైయుపనిష ద్భాగములచేఁ దెలియునుగదా! కాని వ్యవహారమునం దీసత్యమును బాహిరముగ సమ్మతిం చుట వారి కిష్టములేదు. అందుకే వారిట్లు రూపకములు గూర్చిరి.

## ఉపనిషద్రుషులుగూడ జాతిభేద మంగీకరింపరు.

పూర్వులైన ఋషిమునులు, శ్రమణులు, నుపనిషద్రుషులు వీరందరి కేకవాక్యతగల విషయ మొకటున్నది. అది జాతిభేదముల గమనింపకుండుట. మాతంగఋషికథ ముందే వచ్చినదిగదా! దానిచే ఋషులు మునులు వీరియందు జాతిభేదములేదని దెలిసినది. శ్రమణులయందును లేదు. ఉపనిషద్రుషులుగూడ జాతిభేదము నంతగా లెక్కగొన్నవారు కారు.

సత్యకాముఁడు దనతల్లి జాబాలి నడిగినాఁడు: "అమ్మా! బ్రహ్మజ్ఞానమునకై నా కాశయున్నది. నాగోత్ర మేదియో దెలుపుము." అపుడామె పలికెను: "నాయనా! అది నాకుఁ దెలియదు. వయస్సున నే ననేకపురుషులకడఁ జరించితిని. (బహ్వాహం చరంతీ) దానితో నీవు జనించితివి. నీ గోత్రము నా కెట్లుదెలియును? నాపేరు జాబాల. నీపేరు సత్యకాముఁడు. కనుక నీపేరు 'సత్యకామజాబాలుఁడ'ని జెప్పుము.

సత్యకాముఁడు హారిద్రుమత గౌతమునికడ కేగెను. అతఁడనెను: "బ్రహ్మజ్ఞానము దెలిసికొనుటకై మీకడ కరుదెంచితిని."

"నీ గోత్ర మేమి?"

"స్వామీ! నాకది తెలియదు. నాతల్లి నడిగితిని. ఆమె యిట్లన్నది: 'నేను వయస్సున ననేకపురుషులతో నుంటిని. అందుచే నీగోత్రము నే నెఱుఁగను. ఎవరైన నీగోత్ర మడిగిన నాపేరు సత్యకామ జాబాలుఁడ'ని పలుకుము."

గౌతముఁడు సెలవిచ్చెను. నాయనా! నీవు సత్యము నుండి వంచితుఁడవు గాలేవు. అబ్రాహ్మణున కీసత్యము శక్యముగాదు. సమిధలు దీసికొనిరమ్ము. నీ కుపనయనము గావింతును.'' ఆఋషి సత్యకామున కుపనయనముఁ జేసినాఁడు. ( ఛాం. ఉ 4-4 )

## గుప్తులకాలమునుండి జాతిభేద మభివృద్ధమైనది.

ఉపనిషద్రుషులు జాతిభేదమును గొద్దిగఁ బాటించుచున్నను వారు జాతికన్నను సత్యము నెక్కువగ గౌరవించిరి. ఈ విషయము సత్యకాముని వృత్తాంతము దెల్పినదిగదా! కాని యీ యుపనిషద్భాగమును సమన్వయింపఁ జూచిన బాదరాయణవ్యాసులు - భాష్యకారుఁడైన శంకరులు, జాతిభేదమును సమర్థించుట కెంత 'యగచాట్లు' బడిరో గమనింపుఁడు.

" శ్రవణాధ్యయనార్థ ప్రతిషేధాత్ స్మృతేశ్చ (అ॥ 1. 3. 38)

వ్యా:- ఇతశ్చ న శూద్రస్యాధికారః. యదస్యస్మృతేః శ్రవణాధ్యయనార్థ ప్రతిషేధో భవతి. వేదశ్రవణప్రతిషేధో వేదాధ్యయన ప్రతిషేధః- తదర్థజ్ఞానానుష్ఠానయోశ్చ ప్రతిషేధః-శూద్రస్య స్మర్యతే. శ్రవణ ప్రతిషేధస్తావత్ "అథాస్య వేద ముపశృణ్వతః త్రపు జతుభ్యాం శ్రోత్రప్రపూరణం" ఇతి. "పద్యుహ వా ఏతత్ స్మశానం యచ్ఛూద్రః తస్మాత్ శూద్రసమీపే నాధ్యేతవ్యం" ఇతి చ. అతయేవాధ్యయన ప్రతిషేధః. యస్య హి సమీపేపి నాధ్యేతవ్యం భవతి, స కథ మశ్రుత మధీయీత ? భవతి చ వేదోచ్చారణే జిహ్వాచ్ఛేదో ధారణే శరీర భేద ఇతి. అతఏవ చార్థా దర్థజ్ఞానానుష్ఠానయోః ప్రతిషేధో భవతి. "న శూద్రస్య మతిం దద్యాత్" ఇతి.

(బ్రహ్మసూత్ర శాంకరభాష్యము. ॥ అ॥ 1. 3. 38)

(దీనిచే శూద్రునకు బ్రహ్మజ్ఞానమం దధికారము నిషేధింపఁ బడినది. శ్రవణాధ్యయనములందు వానియధికారమును స్మృతి నిషేధించినది. కనుక దాని యర్థజ్ఞానమును, ననుష్ఠానమును శూద్రునకునిషేధింపబడినట్లే, 'వేదవాక్యమునువిన్నచో వానిచెవియందు లక్క, సీసము వీనిని గఱిగించిపోయవలెను.' యను స్మృతిపంక్త్యము చేత వేదమును వాఁడు వినరాదని శాసింపబడ్డది. 'శూద్రుఁడు గాళ్ళుగలిగిన స్మశానము. వాని దగ్గర వేదాధ్యయనమే సేయరాదు. చేసినచో వాఁడు వినును గదా!' అనువాక్యముచేత వాని కధ్యయనము నిషేధింపబడ్డది. 'ఎవనిదగ్గర వేదము నితరులుగూడ నధ్యయనము సేయరాదో యట్టివాఁడు స్వయముగ వేదాధ్యయనమున కర్హుఁ డగునా! 'శూద్రుఁడు వేదము నుచ్చరించిన వానినాల్కఁ గోయవలెను. వేదమును ధరించిన శరీరమును ఛేదింపవలెను.' యనిజెప్పఁ బడినది. దీనిచే శూద్రునకు వేదానుష్ఠానము, తదర్థజ్ఞానము గూడ నిషేధింపఁబడినది.)

శంకరులచే శూద్రులను మోసగించుట కాధారముగ నివ్వఁబడిన గౌతమధర్మసూత్రము మొదలైన గ్రంథములు గుప్తకాలము నాటివి. అనఁగా సముద్రగుప్తుఁడు (క్రీ॥ శ॥ 4 వ శతాబ్దము) మొదలు శంకరుల కాలము (క్రీ॥ శ॥ 9 వ శతాబ్దము)వరకు. ఈ కాలమునందు బ్రాహ్మణులు శూద్రుల యధికారమునణంచి దమ వర్చస్వీత్వమును స్థాపించికొనుటకుఁ దీవ్రముగఁ బ్రయత్నించిన ట్లున్నది. ధర్మసూత్రకారుని కాలమునకు, ముసల్మానులు మనదేశమునందుఁ బ్రవేశింపనే లేదు. శంకరుల కాలమునకు వారు భారతదేశమున బ్రవేశించి సింధు

ప్రాంతముల నాక్రమించికొన్నారు. ఆ నేలలలో వారిధర్మము ప్రచారమగుచుండెను. నిజముగఁ జూచినచో జాతిభేదములు బోవిడిచి మానవ సమానత్వమును బోధింపవలసిన కాలమది. కాని శంకరాచార్యాదు లట్లు సేయక జాతిభేదమనెడు బ్రాఁత గుఱ్ఱముపైననే జోరుగ సవారి సాగించిరి. దాని దుష్పరిణామమును దేశ మెట్లనుభవించినదో జరిత్ర జెప్పుచునేయున్నది.

## స్త్రీల సంఘము

తపస్వులైన ఋషిమునుల కాలమందుఁగాని వైదిక ఋషుల కాలమందుఁగాని ప్రత్యేకముగ స్త్రీలసమావేశములు జరుగలేదు. గార్గి, వాచక్నవి మొదలగుస్త్రీలు జ్ఞానచర్చలలో బాల్గొన్నను* వారికిఁ బ్రత్యేకసంఘములు లేవు. స్త్రీలకు ప్రత్యేకసంఘములు బుద్ధునకు 1,2 శతాబ్దములకు ముందే దయారయ్యెను. వీనిలో మిగుల బ్రాచీనము జైన స్త్రీలసంఘముగఁ దోచును. జైనసాధ్వులు వాదములందు గట్టివారు. ఈ విషయము 'భద్ర-కుండలకేశ'♦ వంటివారి చరిత్రలఁబట్టి దెలియును.

పూర్వఋషు లడవులం దుండి గ్రామముల కెప్పుడో వచ్చెడివారు. అందుచే స్త్రీ సంఘస్థాపనము వారికి శక్యముగాలేదు. శ్రమణులు గ్రామసమీపములందు వసించెడువారు. వారు స్త్రీసంఘములను స్థాపించిరి. ఆ కాలమున కవి యవసరముగఁగూడ నుండెను. బౌద్ధ, జైన వాఙ్మయమును జదివి

---

* బృ. ఉ 3-6-1

♦ 'బౌద్ధసంఘాచాపరిచయ', పుట 214 - 217 చూడుము.

నప్పుడాకాలమునందు స్త్రీలును బురుషులవలెనే యగ్రగా మినులుగ నుండిరని దెలియును. దీనికిఁ గారణము గణసత్తాక రాజ్యములందు స్త్రీలకుఁ జక్కని స్వాతంత్ర్య ముండుటయే. బుద్ధభగవానుఁడు 'వజ్జి' జనులయున్నతికి యేడునియమము లేర్పరచెనుగదా! వానిలో 'స్త్రీలను గౌరవముగఁజూడవ లెను. వివాహితులుగాని యవివాహితులుగాని స్త్రీలపై నేవిధ మైన బలాత్కారమును మోపరాదు.' యనునది యైదవ నియమము. 'వజ్జి' జనులు బుద్ధుని మరణపర్యంతము యీ నియమములనే యనుసరించిరి. మల్లరాజ్యముగూడ నిట్లే స్త్రీల మానమును మన్నించెను. అంగము-కాశి-శాక్యము-కోలీయ యీ గణసత్తాకరాజ్యముల స్వాతంత్ర్యము భగ్న మైనది. ఇవి యితరములతోఁ జేరిపోయినవిగదా! కాని యంత ర్గతరాష్ట్రవ్యవస్థ వారిచేతులందే యుండెను. అందుచే నచ్చట గూడ స్త్రీల స్వాతంత్ర్య మెక్కువగ దెబ్బదినలేదు.

మగధ కోసలములందేక సత్తాకపద్ధతి దృఢమూల మయ్యెను. కాని యీ రాజులు గణసత్తాక నియమములను సమూలముగ విసర్జించినవారు కారు. బింబిసారుఁడుగాని ప్రసేనజిత్తుగాని స్త్రీలను బలాత్కరించి యవరోధములఁ జేర్చి కొనినట్లు నిదర్శనములు లేవు.

## కొన్ని యేకసత్తాకములలో స్త్రీలకున్న గౌరవము

గణసత్తాక పద్ధతినశించి యేకసత్తాకము నెలకొన్న కొలఁదియు స్త్రీస్వాతంత్ర్యము బంధితమై పోయెను. కాని గొన్ని రాజ్యములందు మాత్రము వారి గౌరవము పీసరవోవ లేదు. ఈ క్రింది యున్మాదయంతి కథ జూడుఁడు.

*బోధిసత్త్వుఁడు 'శివి' రాజకులమున జన్మించెను. అప్పు డతనికి 'శివికుమారుఁడ'నియేఁ బేరు. శివిరాజ సేనాపతికి గూడ నొకపుత్త్రుఁ డుండెను. వానిపేరు 'అభిపారకుఁడు'. శివికుమారుఁడు - నభిపారకుఁడు వీరిర్వురు సవయస్కులు. ఇర్వురును దక్షశిలయందే జదివిరి. తండ్రి యనంతరము 'శివికుమారుఁడు' రాజై నాఁడు. తండ్రివెనుక 'నభిపారుఁడు'ను సేనాపతి యయ్యెను. అభిపారకుని భార్య 'యున్మాదయంతి'. ఆమె యొక సెట్టిబిడ్డ. చక్కని యందచందముగలది. ఒక నాఁడు రాజు నగరపు దక్షిణమునకు వెడలెను. గవాక్షము నందు నిలువఁబడిన 'యున్మాదయంతి' వానికంటఁబడినది. చూచినది దడవు రాజున కామెపై చిత్తము హత్తెను. రాఁగ రాఁగ వలపు గొలఁదికిమీఱి యాతఁడుమంచము వట్టినాఁడు. సేనాపతి కీ వర్తమానముఁ దెలిసినది. వాఁడు రాజతో 'మీరునాభార్యనుగ్రహించి యీదైన్యమును విడువుఁడ'ని మొఱపెట్టెను. ఈ మాటలతో రాజునకుఁ దెలివి గల్గినది. "అభిపారకా! నా నడత శివికుల ధర్మము గాదు. నేను శివి వంశ జాతుఁడను. ఆధర్మమును బాలించుట నా విధి. నా చిత్త వికారమునకు నేను వశుఁడనై పోరాదు." యని పలికినాఁడు. ఈ కథ చాలపెద్దది. ఈ కథనువ్రాయునాటికి గణసత్తాక పద్ధతి యెంతో నశించినది. కాని శివికుమారుని వంటివారు మాత్రము గణసత్తాకమందున్న స్త్రీలగౌరవమును సంపూర్ణ

* ఉమ్మదంతీజాతకము, సంఖ్య 527

ముగ రక్షించుచునే యుండిరి. 'సర్వసత్తాధికారము' వారి యెడఁదలందుఁ బశుత్వమును బ్రేరేపింపలేదు. శివికుమారుని యుత్తర మీఁక్రింది 'గాథా' రూపముగఁ దెల్పఁబడినది.

"నేతాపితా ఉగ్గతో రట్ఠపాలో
ధమ్మం శివీనం అపచాయమానో।
సో ధమ్మ మేవాను విచింతయంతో
తస్మా సకే చిత్తవసే న వత్తే॥"

"నేను శివివంశనేతను. పితను. రాష్ట్రపాలకులలో నగ్రగణ్యుఁడనుకనుక శివివంశీయుల ధర్మమును నేను గౌరవింపవలెను. చిత్తవికారములకు వశుఁడనై పోరాదు."

## బాల్యవివాహముల ప్రథ

పైని వివరించిన యీధర్మదృష్టి బౌద్ధరాజులయందును గొంతవర కుండెను. కాని దీనితో వేరొక దురాచారముఁ గూడఁ బ్రబలినది. బ్రహ్మదేశమునందలి రాజులు వివాహితలైన స్త్రీలజోలికి వచ్చెడువారుగారు. వారు వివాహితలను శుద్ధాంతములలోఁ జేర్చికొనుటలేదు. ఒకపురుషుఁడు స్త్రీని వివాహమాడి వదలిపెట్టినచో నాతగవు రాజువద్దకు వచ్చినమగవాఁ డొనర్చిన తప్పిదము ఘోరముగ నెంచఁబడెడిది. కాని యవివాహితస్త్రీలనుమాత్ర మెత్తుకొనిపోవుట సహజముగ నుండెను. పెండ్లి గాకున్నచోఁ దమబిడ్డ నెత్తుకబోవునేమో యను భయముతోఁ దల్లిదండ్రులు జిన్ననాటనే పెండ్లి యొనర్చి మంగళసూత్రములు గళమున బూన్పించుచుండిరి.

ఈ లగ్నములు నిజమైనవి గావు. ఆడపిల్ల లత్తవారిం డ్లకు బోవుటలేదు. ఇంతేగాదు. వయసువచ్చినపిదపఁ దొలుత జరిగిన లగ్నమాయెకు సమ్మతము గాకున్నచో వేఱొకలగ్నమునుఁ జేసికొనవచ్చును. కేవలము రాజుల గండమునుండి దప్పించుకొనుటకే దొలుతటి లగ్నము. హిందూస్థానము నందు మాత్రము బాల్యవివాహములు వాడుకలోనికి వచ్చుటకు యిదియే కారణమని జెప్పలేము. కాని, బాల్యవివాహ పద్ధతి బుద్ధునికాలమున సార్వత్రికము గాదనియు 'నేకసత్తాక పద్ధతి' బలిసిన పిదప నిది ధర్మమయ్యెననియు నూహింప వచ్చును. హిందూస్థానమునందు గణసత్తాకపద్ధతి ప్రబలముగ నున్నప్పుడు బాల్యవివాహము లుండలేదు.

## నాలుగు దెఱఁగుల శ్రమణబ్రాహ్మణులు

బుద్ధునికాలమందు శ్రమణబ్రాహ్మణులు నాల్గుదెఱఁగుల వా రుండిరి. వీఱిసిగురించి బుద్ధుఁడొక రూపకాలంకార మల్లెను. ఈ విషయము 'మజ్ఝిమనికాయము' లోని 'నివాప సుత్తము'న వచ్చును. దానిసారాంశ మిది:

బుద్ధభగవానుఁడు శ్రావస్తినగరమునం 'దనాధ పిండికు'ని యారామమం దుండెను. అపుడుభిక్షువుల నుద్దేశించి యాతఁ డిట్లనెను. "నాయనలారా! పచ్చనిగడ్డిగల పొలము లను-బెంచుమనుష్యుఁడు మృగములపైని గరుణతో వానిని బెంచుటలేదు. ఆ పొలములందలి గడ్డిని దిని మృగము లున్మత్తములై దనకులోఁబడునను నూహతోనే బెంచుచున్నాఁడు"

భిక్షువులారా ! కొన్నిమృగము లాపొలములందు గడ్డి దినుచు మదించి మతిదప్పి యామనుష్యునకు దొరకినవి. దీనిని జూచి గొన్ని మృగము లిట్లుదలఁచెను. 'ఈ పొలమున గడ్డి దినుట మంచిదిగాదు.' వెంటనే యామృగములు బొలమును విడచి యరణ్యమును జేరెను. ఎండకాలము వచ్చినది. వాని కడవులందు గడ్డిదొరకుట లేదు. నీరుగూడఁ గఱవైనది. అవి బక్కచిక్కిపోయినవి. చేయునది లేక వెనుకకువచ్చి యాపొలమున గడ్డిఁదినుచు వానికిఁజిక్కిపోయినవి. మరికొన్నిమృగము లీరెండుదెఱఁగుల మృగములయవస్థను జూచినవి. అవి యాపొలముప్రక్కనే యడవియందు వసింపఁ దొడఁగెను. అప్పుడప్పుడు పొలమునకు వచ్చి జాగ్రత్తగ మేయుచు వానికి జిక్కక పారిపోయెడివి. కొన్నిదినములకు వాని కామృగములున్నయడవిజాడ దెలిసెను. వాఁడు వలపన్నివానిని గ్రహించినాఁడు. మరికొన్ని మృగము లుండినవి. అవి వీనియన్నిటికంటెను జాల'హుషారై'నవి. ఆ మృగములు దమ నివాసమును బొలమునకు దూరముగ నట్టడవిలో నేర్పఱచుకొన్నవి. దినమును బొలమునకు వచ్చి గడ్డిదినుచు జాగ్రత్తగఁ జెంగిపోయెడివి. వాని 'పత్తా' యామనుష్యునకుఁ దెలియనేలేదు.

నాయనలారా ! యీయలంకారమున కర్థమేమి? వివరించెదనువినుఁడు. పొలమును బెంచిన మనుష్యుఁడేమారుఁడు. ఏ శ్రమణులు విషయ సుఖములందే యానంద మున్నదని యూహించిరో వారు మొదటిమృగములు. విషయసుఖములకు భయపడి యడవులబట్టినవారు రెండవగుంపులోని మృగములు. వారు సర్వసుఖములచేతను వంచితులు. ఏశ్రమణులు,

విషయములు జాగ్రత్తగ ననుభవించుచు 'నీ జగము శాశ్వతమా! యశాశ్వతమా! ఆత్మ యమరమా! నాశవంతమా!' యనెడు ప్రశ్నలతో వాదవివాదములోనర్చుచు గాలము వ్యర్థ మొనర్తురో వారు మూఁడవగుంపు. వాద వివాదములకు లోఁబడక దమ యంతఃకరణములను శుద్ధముగ నుంచుకొను టలో నెవరు నిరంతర జాగరూకులో యట్టి శ్రమణులు నాల్గవ గుంపులోని మృగములు.

ఈ సుత్తమునందుఁ జెప్పఁబడిన మొదటి శ్రమణ బ్రాహ్మణులు వైదికులు. వారు యజ్ఞయాగములే, సోమపానమే ధర్మసర్వస్వమని భ్రమించుచుండిరి. వైదికహింసను, సోమపానమును నిరసించి యడవులకు వెడలి కాయగసురులు భుజించువారు రెండవ తెగవారు. వారరణ్యములందు ఫల మూలములు సదా లభింపకుండుటచే యంబలికై, యుప్పుకై గ్రామముల కరుదెంచి ప్రపంచపు వలలోఁ దగుల్కొను చుం డిరి. దీని కుదాహరణ మింతకుముందే యొకకథను జెప్పి తిని. కాయగసురులు దిను నీ ఋషుల మార్గమును విడచి యెవరు భిన్నభిన్నశ్రమణసంప్రదాయముల నాశ్రయించిరో వారు మూఁడవ తెగవారు. ఈ పరివ్రాజకులు నట్టడవులలో నుండక నగరములందే వసించుచుండిరి. కాని వీరికున్నపిచ్చి యొకటి. 'ఆత్మయున్నదా!' లేదా! యను వివాదములతో వీరికిఁ దెరపియుండదు. అందుచే వారి కాత్మశుద్ధి యేర్ప

డెడిదిగాదు. వారు మారునివలలోఁ దగుల్కొన్న వారే.
బుద్ధుఁడీ నిరర్థకవాదము లనన్నిటిని ద్యజించి యధ్యాత్మ
శుద్ధికి మార్గమును శోధించెను. అతఁడు భిక్షువులను నాల్గవ
శ్రమణ బ్రాహ్మణులలోఁ జేర్చినాఁడు. ఇతర శ్రమణ
బ్రాహ్మణుల యాత్మవాదమునకు బుద్ధుని యాత్మవాదము
నకు భేదమేమియో పైని వివరింతును. ఈ నాల్గువిధములైన
శ్రమణబ్రాహ్మణులలో నుపనిషద్రుష్టులు జేరలేదు. అందుచే
నుపనిషత్తులనుండి బౌద్ధధర్మ మావిర్భవించె ననెడు కల్పన
కేవలము నిరాధారము.

# నాల్గవ ప్రకరణము

# గౌతమ బోధిసత్త్వుఁడు

## ౧ గౌతముని జన్మతిథి

గౌతముని జన్మతిథికి సంబంధించి యర్వాచీనపండితులలో ననేకములు మతభేదములు. 'దివాన్ బహదూర్ స్వామి కన్నూపిళ్లె' గారు బుద్ధుని పరినిర్వాణము క్రీ॥ పూ॥ 478 వ వర్షమని నిర్ణయించిరి. మరికొందరు క్రీ॥ పూ॥ 436-87 వ వర్షమం దనిరి. కాని నేడు బయలుపడిన విషయములనుబట్టి దీపవంశ, మహావంశములందు జెప్పఁబడిన పరినిర్వాణతిథియే సరిగాఁ దోచుచున్నది.* ఈ గ్రంథములఁబట్టి బుద్ధుని బరినిర్వాణము క్రీ॥ పూ॥ 543 వ వర్షమునందని దెలియును. ఈ వర్షమున బుద్ధుని నిర్వాణము జరిగియున్నచో నతని పుట్టుక క్రీ॥ పూ॥ 623 వ వర్షమునం దగును.

## బోధిసత్త్వుఁడు

జన్మమొదలు 'సంబోధి' పర్యంతము గౌతముని బోధిసత్త్వుఁడని బిలచుటయే ప్రాచీనుల బరిపాటి. పాలీవాఙ్మయమందు జాల ప్రాచీనమైనది 'సుత్తనిపాతము'. దానిలో

"సో బోధిసత్తో రతనవరో అతులో
మనుస్సలోకే హితసుఖతాయ జాతో
సక్యానం గామే జనపదే లుంబినేయ్యే"

---

* The Early history of India, by V. A. Smith (Oxford 1924) P 49-50

శ్రేష్ఠరత్నమువలె నతుల్యుఁడైన బోధిసత్త్వుఁడు 'లుంబినీ' జనపదమున మానవుల సుఖముకొఱకై జన్మించెనని గలదు. బోధియనఁగా మానవుల నుద్ధరింపవలెనను జ్ఞానము. దానికై యత్నించువాఁడు సత్త్వుఁడు. మొదట మొదట గౌతముని జన్మనుండి యతనికి 'సంబోధి' జ్ఞానము గలుగువరకు, బోధి సత్త్వుఁడను విశేషణము వాడఁబడుచుండెను. రాగ రాగ గౌతముఁ డీ జన్మకుముం దనేకజన్మలు గైకొనెనను గల్పన బయలుదేరినది. అటుపిదప, నతని పూర్వజన్మవృత్తాంతములు వివరించు నెడలఁగూడ నాతనిని బోధిసత్త్వుఁ డనియే బిలిచి నారు. అతనిపూర్వజన్మకథలు జాతకములందు సంగ్రహింపఁ బడినవి. ఆకథలలో నెవ్వఁడు ప్రధాన పాత్రముగ నుండునో వానిని బోధిసత్త్వుఁడని బిలతురు.* ఒకవేళ నా కథయందు యోగ్యపాత్ర యేదియు లేకున్నచో, నేవన దేవతకో- యట్టి మరియొక వ్యక్తికో-బోధిసత్త్వుఁడని పేరు వెట్టి యేదో యొకరీతి యతుకులబొంత దయారు సేతురు. గౌతముని జన్మ మొదలు కొని బుద్ధత్వపర్యంతము బోధిసత్త్వుఁడని బిలచుటలోఁ గొంత న్యాయ ముండవచ్చును. కాని, పూర్వజన్మములతోఁగూడ నీవిశేషణము ముడివెట్టు టంతజక్కగ నుండదని నాయూహ.

## బోధిసత్త్వుని కులము

బోధిసత్త్వుని కులము, బాల్యము, వీనినిగురించి, 'త్రిపిటకము' లందుఁ జాలగొలఁదిగ గలదు. ఈ మాత్రముగూడ ప్రసంగవశమున నుపదేశింపఁబడిన సుత్తములం దక్కడక్కడ వచ్చునదే. ఈ విషయములకును, 'అట్ఠకథ'ల యందు వచ్చు

* బౌద్ధ సంఘచా పరిచయ, పుట 154 జూడుఁడు.

వానికి నప్పుడప్పుడుఁ జాల యనన్వితస్థితి యేర్పడుచున్నది. కాన, నీ పరస్పర విరుద్ధ విషయములు జక్కఁగ వితర్కించికొని నిగ్గు దేల్చికొనుట మంచిది.

'మజ్ఝిమనికాయము' యొక్క 'చూళదుక్ఖక్ఖంధము' లోని సుత్తమునకు సంబంధించిన యట్ఠకథలో గౌతమ కుటుంబ విషయ మిట్లున్నది.

శుద్ధోదన, శుక్లోదన, శాక్యోదన, ధోతోదన, యమితోదనులు యేగురన్నదమ్ములు. అమితాదేవి వీరి యనుంగుఁ జెల్లెలు. తిష్యస్థవిరుఁ డీమె గారాబు కొడుకు. తథాగత, నందులు శుద్ధోదనుని గొమరులు. శుక్లోదనుని కొమరులు మహానామా నిరుద్ధులు. ఆనందస్థవిరుఁడు అమితోదనుని కొడుకు. ఇతఁడు బుద్ధునికన్న జిన్నవాఁడు. మహానాముఁడు బెద్దవాఁడు.

ఈ యనుక్రమణికను బట్టి, యమితోదనుఁ డందర కన్నను జిన్నవాఁడు. అతనికొడు కానందుఁడు. బుద్ధునికంటె జిఱుతయగుట దగినదే, కాని 'మనోరథపూరణి' యట్ఠకథ యందనిరుద్ధుని గుఱించిఁ జెప్పుచు 'అమితోదన సక్కస గేహే! పటిసంధింగణ్హి' (అమితోదనుఁడు శాక్యులయింటి యందు బుట్టెను.) యని యున్నది. ఒక్క బుద్ధఘోషాచార్యునిచేతనే రచింపఁబడిన రెండట్ఠకథలయందు నీ రీతి వైరుధ్య ముండుట వింతయే. మొదటియట్ఠకథలో నానందుఁ డమితోదనుని గొడుకైనట్లును రెండవదానిలో ననిరుద్ధుఁ డాతని గొడుకైనట్లును గనపడుచున్నది. ఈ విరోధమునుబట్టి

జూచినచో 'శుక్లోదనాది నామములుగూడ గల్పితములేనా' యని దోపకమానదు.

## బోధిసత్త్వుని జన్మస్థానము

పైని చెప్పిన సుత్తనిపాతముయొక్క యవతరణికలో బుద్ధుని జన్మస్థానము 'లంబినీజనపద'మని జెప్పంబడినది. నేడుగూడ నాస్థలమును 'లుంబినీదేవి' యని బిలతురు. అట నొక శిలాస్తంభ మున్నది. ఈ నడుమనే దానిని భూమినుండి త్రవ్వి యెత్తిరి. దాని నశోకుడు దయారు చేయించెను. ఆ స్తంభముపై నీ రీతిం జెక్కంబడియున్నది. 'లుంమ్మిని గామే, ఉబాలికే కతే.' దీనితో బోధిసత్త్వుని జన్మస్థలము లుంబిని యనెడు పల్లెయని స్పష్టముగదా!

ఇతరసుత్తములలో ననేకచోట్ల మహానామ శాక్యుడు గపిలవస్తువునం దుండెనని చెప్పంబడుచుండెను. కాని శుద్ధోదనుడు కపిలవస్తువున నివసించెనని 'మహావగ్గము'నందు దొడ్డ యుల్లేఖముగలదు. 'లుంబినీగ్రామము' 'కపిలవస్తువు' వీని నడుమ 14–15–మైళ్ళ దూరమున్నది. శుద్ధోదను డప్పుడప్పుడు దన 'జమీందారీ' యైన లుంబినియం దుండెడివాం డేమో! అట్లొకసారి యున్నప్పుడు లుంబినిలో బోధిసత్త్వుడు జన్మించియుండును. కాని 'యంగుత్తరనికాయము'నందలి తికనిపాతములోని 124 వసూత్రముచే నీ యూహకుంగూడ బాధగలుగుచున్నది. అది యీ క్రింద నిచ్చుచున్నాను.

## కాలాముని యాశ్రమము

ఒకసారి భగవానుఁడు గోసలమునందు దిరుగుచుఁ గపిలవస్తుపునకు వచ్చెను. అతని రాక విని మహానాముఁడు బుద్ధుని దర్శించినాఁడు. అతనితో బుద్ధుఁడు 'తనకొకరాత్రి వసించుటకుఁ దగినచోటు జూప' మన్నాఁడు. కాని బుద్ధుఁడుండుటకుఁ దగినచోటు మహానామున కెక్కడను దొరుక లేదు. బుద్ధునితో మహానాముఁడు "భదంతా! మీరు నివసింప నర్హమైన స్థానము నాకుఁ దోచుట లేదు. పూర్వము మీకు సబ్రహ్మచారియైన భరండు కాలాముని యాశ్రమమునం దీరాత్రి వసింపుఁడు" యనెను. బుద్ధుఁడు సమ్మతించి యా యాశ్రమమున దనయాసనము వేయుఁడని జెప్పినాఁడు. అతఁ డారాత్రి యచట వసించెను.

రెండవదినమందు మహానాముఁడు భగవానుని దర్శనమునకు వచ్చెను. అపుడు బుద్ధుఁ డిట్లనెను. "మహానామా! యీ లోకమున ముత్తెఱఁగుల ధర్మగురువు లున్నారు. మొదటిగురువు కామోపభోగములసమతిక్రమము(త్యాగము) నుపదేశించును. కాని రూపములు, వేదనలు, వీనినుండి విడివడు తెరువుజూపలేదు. రెండవవాఁడు గామోపభోగములు, రూపములు వీని సమతిక్రమమార్గమును దెల్పును. కాని వేదానా త్యాగమును జూప వలఁతిగాఁడు. మూఁడవవాఁడీ మూటిని దాటజేయును. ఈ ధర్మగురువులయొక్క ధ్యేయ మొకటియా! భిన్నమా!"

భరండు కాలాముఁడు మహానామునితో నన్నాఁడు: "ఓయీ ఈ సర్వులయొక్క ధ్యేయ మొక్కటియే నని

చెప్పుము." భగవంతు డిట్లుపలికెను. "మహానామా! వీరి ధ్యేయములు భిన్నములని చెప్పుము." కాలాముఁడు రెండు మూఁడుసారులు దనయుత్తరమునే యామ్రేడించెను. భగవంతుఁడు వారిధ్యేయములు భిన్నములనియే పలికెను. మహానామునివంటి శాక్యుని యెదుట బుద్ధుఁడు దన్నగౌరవపఱుచెనని గాలామునకు గోపమువచ్చెను. అతఁడు గపిలవస్తువును విడచిపోయెను. మరల దిరిగి రానేలేదు.

## ౬ రెండు కాలామసుత్తముచేఁ గలిగినచిక్కులు

ఈ సుత్తముయొక్క సమగ్రభాషాంతరీకరణ మీఁక్రింద నిత్తుము. దీనిచే బుద్ధచరిత్రమందు రెండుమూఁడు జిక్కు లేర్పడుచున్నవి. బుద్ధుఁడైన తరువాత గౌతముఁడు భిక్షువులతోఁ గపిలవస్తువునకు రానేలేదు. అతనిని శాక్యులు సన్మానము సేయలేదు. ఆతఁ డొంటిగనే వచ్చెను. ఆయనకొఱకు యోగ్యస్థలము వెదకుటలో మహానామునకు జిక్కు వచ్చినది. శుద్ధోదనుఁడు బోధిసత్త్వునికొఱకు మూఁడు ప్రాసాదములు గట్టించెనట! దానిలో నొక్కదానిని ఖాళీ చేసి బుద్ధునకెందుకివ్వలేదు? కపిలవస్తువునందు శాక్యుల కొక సంస్థాగారముండె నని (నగరమందిరము) యనేకచోట్ల యుల్లేఖింపబడినది. బుద్ధునియుత్తరవయస్సునందు శాక్యులీ సంస్థాగారమును బాగుపఱచిరి. అపుడు దానియందు తనభిక్షుసంఘముతో బుద్ధుఁ డొకరాత్రి వసించి తమ కుపదేశింపవలెనని ప్రార్థించి తోడ్కొనివచ్చిరట.* కాని యింతకు

* సళాయతన సంయుత్త, ఆసీవిసవగ్గ, సుత్తము 6 చూడుము.

ముందు జెప్పిన ప్రసంగమునుబట్టి బుద్ధునకా సంస్థాగారము నందు వసింప జోటు చిక్కదు. దీని యర్థమేమి? బుద్ధుఁడు శాక్యకులమునం దొక సామాన్యయువకుఁడు. అతనికి గపిల వస్తువునందుఁ బెద్దగౌరవము లేదు.

గౌతముఁడు గృహత్యాగ మొనర్చుటకుముందే గపిల వస్తువునం దీకాలాముని యాశ్రమ ముండినది. కాలాముని ధర్మము దెలిసికొనుటకై బుద్ధుఁడు మగధనుండి రాజగృహ పర్యంతముఁ బోవలసిన యవసరము లేదు. కాలాముని తత్త్వ జ్ఞానము నతఁడు కపిలవస్తునందే దెలిసికొని యుండెను. ఈ విషయ మా సుత్తమునుబట్టియే సిద్ధమగును.

మూఁడవ విరోధ మీ క్రిందిది. మహానామశాక్యుఁడు బుద్ధుని పినతండ్రి కొడుకంటిరి. ఈ విషయమే నిజమైనచో బుద్ధుఁడుండుటకుఁ గాలాముని యాశ్రమమందు స్థలము నెందు కేర్పాటు జేసెను! తన యింటియందే యుంచుకొని యుండ వచ్చును. శ్రమణులు గృహస్థుల యిండ్లయందు మూఁడుదిన ముల కెక్కువ యుండఁగూడదు. బుద్ధుఁ డొక రాత్రికి మాత్రమే గదా జో టడిగినది! ఇంత చిన్నపనికి మహానా ముఁడు గాలామునికడకుఁ బోవలసిన పని లేదే! తన యింటి యందో- లేక దన యతిథి గృహమందో యేర్పాటుఁజేసి యుండవచ్చును. మరి యాపని నేలసేయ లేదు? మహానాముని యిల్లు జాల చిన్నదిగనుండి యుండవచ్చునా? లేక బుద్ధుఁడు మహానామునికంత సన్నిహితుఁడు గాఁడా!

ఈ సర్వమును విమర్శింపఁగా మహానామునకును, బుద్ధునకును దగ్గరి సంబంధము లేదనియే దోచును. శుద్ధోద

నుఁడు గపిలవస్తువునుండి బదునాల్గుమైళ్ళలో నుండె నంటిమి గదా! ఆతనికిఁ గపిలవస్తువుతో గొద్దియో గొప్పగనో సంబంధ ముండి యుండవచ్చును. శాక్యు లెన్నఁడైన సభదీరి నపుడు వారితో శుద్ధోదనుఁడుగూడఁ జేరెడువాఁడేమో!

### భద్దియరాజు కథ

'మహాపదానసుత్తము'ను బట్టి శుద్ధోదనుఁ డొకరాజు. అతని రాజధాని కపిలవస్తువు. కాని 'వినయపిటకము'లోని 'చుల్లవగ్గ'లో భద్దియునికథ యొకటి యున్నది. దానికి బై కథతో వైరుధ్య మున్నది.

అనిరుద్ధుని పెద్దయన్న మహానాముఁడు దండ్రి యనంతరము గృహవ్యవస్థను జూచికొనుచుండెను. అనిరుద్ధునకు లౌకికజ్ఞానము శూన్యము. బుద్ధుఁడు ప్రసిద్ధుఁ డైనపిదప గౌరవనీయులైన యనేక శాక్యయువకులు భిక్షువులుగా నై యాతని సంఘమున జేరుచుండిరి అది జూచి మహానాముఁడు యనిరుద్ధునితో బలికెను. 'మనవంశమునుండి యొకఁడును భిక్షువుగా లేదు. కావలెను. నీవైనను భిక్షువుగమ్ము. లేక నన్నైనను గానిమ్ము.' అనిరుద్ధుఁ డన్నాఁడు: 'నాచేత నాపనికాదు. నీవే భిక్షువు గమ్ము.'

మహానాముఁ డంగీకరించెను. నాటనుండి దమ్మునికి ప్రపంచ వ్యవహారములు దిద్దవలె ననుకొన్నాఁడు. వాఁ డనెను. 'ఓయీ! మొదట పొలము దున్నవలెను. తర్వాత విత్తవలెను. కాలువలోని నీరు బారింపవలెను. కొంచె మెదిగినతర్వాత నీరు లేనప్పుడు గలుపు దీయవలెను. పండినపుడు

గోసి యింట వేసికొనవలెను.' అనిరుద్ధునకీ గొడవ యేమియు సరిపోలేదు. 'అన్నా! యీ పెద్దఱికము నాచేతగాదు. నీవే యిల్లు జూచికొమ్ము. నేను భిక్షువునౌదు'నన్నాడు. కాని యనిరుద్ధుఁడు సన్యాసి యౌటకుఁ దల్లి యంగీకరించినదిగాదు. వాఁడు హఠము వేసెను. అపుడామె పలికినది. "శాక్యరాజు భద్దియుఁడుఁగూడ నీతోడ భిక్షువైనచో నేను సన్యాసిత్వము నంగీకరింతును."

'భద్దియరా జనిరుద్ధునికి నెచ్చెలి. కాని వాఁడు రాజ్యమును విడచి తిరిపెమునకు వచ్చునా! ఇదెట్లును జరగు పనిగాదు' ఇదియామెతలఁపు. అనిరుద్ధుఁడు భద్దియునియొద్ద కేగి "నీవు భిక్షువు గావలెన"ని బలవంతపెట్టినాఁడు. "ఏడువర్షము లాగినచో భిక్షువునౌదు" నని భద్దియుని యుత్తరము. అనిరుద్ధుఁ డంతకాల మాఁగలేడు. వాఁడు దినదినమునను నిర్బంధింపఁజొచ్చెను. వర్షములు మాసములై, మాసములు దినములైనవి. వారిరువురిమైత్రి యట్టిది. అనిరుద్ధుని బలవంత మాతెఱఁగున్నది. ఏడుదినములు దాటిన తర్వాత భిక్షువునౌదునని భద్దియరా జన్నాఁడు. ఏడుదినములు గడచెను. ఎనిమిదవనాఁడు భద్దియుఁడు, ననిరుద్ధుఁడు, నానందుఁడు, భగవు, కింబిలుఁడు, దేవదత్తుఁడు అను నీయార్గురు శాక్యపుత్రులు ప్రయాణమైరి. వీరిని 'ఉపాలి' యనెడు మంగలిగూడ వెన్నంటినాఁడు: ఈ యేడుగురు జతురంగిణిసేనతోఁ బయలుదేరి కపిలవస్తువును దాటి దూరముగ వెళ్ళిరి. సైన్యమును వెనుక కంపి శాక్యదేశపు పొలిమేరల గడచినారు. భగవానుఁ

డప్పుడు మల్లులదైన 'అనుప్రియ' యనెడు పల్లెయం దుండెను. వీరందరటకేగి సన్న్యాసమును స్వీకరించిరి.

## భద్దియుని కథలోని సారాంశము

బుద్ధభగవంతుని కీర్తిని విని శాక్య లనేకులు భిక్షువులైనారు. అంతవరకును శాక్యుల గద్దెపై భద్దియ రాజుండెను. మరి యీ శుద్ధోదనుఁడు రాజైన దెప్పుడు? శాక్యులెల్లరును జేరి రాజు నెన్నుకొను చుండెడివారో, లేక గోసలరాజే యాతనిని నియమించుచుండెనో-సరిగా దెలియుటలేదు. శాక్యులే నియమించు నాచారమున్నచో, భద్దియరాజుకంటెఁ బెద్దవారు మహానాముఁడు మొదలైనవారుండగా భద్దియుని నియమించుట జరుగదుగదా! అంగుత్తర నికాయము లోని 'మొదటినిపాత'మం 'దుచ్చకులమున జన్మించిన నాభిక్షుశ్రావకుల యందు గాలిగోధుని పుత్రుఁడు భద్దియుఁడు శ్రేష్ఠుఁడ'ని బుద్ధుఁ డన్న ట్లున్నది. పెద్దకులమునందు జన్మించినాఁ డను నొక కారణమాత్రము చేతనే శాక్యులవంటి గణరాజులు భద్దియుని రాజుగ నెన్నుకొని రనుట నమ్మఁదగినదిఁ గాదు. కోసలరాజైన ప్రసేనజిత్తే యితనిని రాజుగా నియమించియుండ వచ్చు ననుటయే సంగతముగ దోచును. ఈ విషయ మెట్లున్నను శుద్ధోదనుఁ డెన్నఁడును శాక్యులరాజు గాలేదు. ఇది స్పష్టము.

## శాక్యుల ముఖ్యవృత్తి కృషి

త్రిపిటక వాఙ్మయమునందు గనపడు విషయములును 'లుంబినీదేవి' దగ్గరనున్న యశోకుని శిలాశాసనమును

బోల్చి చూచినచోఁ దెలియు విషయ మిది: 'శుద్ధోదనుఁడు శాక్యులం దొకఁడై లుంబినీ గ్రామమున వసించుచుండెను. అక్కడనే బోధిసత్త్వుఁడు బుట్టినది.' పైనిజెప్పిన మహానాముఁడు-ననిరుద్ధుఁడు వీరిసంవాదముచేత శాక్యుల ముఖ్యవృత్తి 'కృషి' యని దెలిసినదిగదా! మహానామునివంటి శాక్యులు సొంతసేద్యము జేసికొనెడివారు. శుద్ధోదనుఁడుగూడ నంతే. జాతకములలోని నిదానకథలో శుద్ధోదనుని మహారాజుగ వర్ణించిరి. కాని యాతఁడు సేద్యమొనర్చుఘట్ట మిట్లు వర్ణింపఁబడినది. "శుద్ధోదనుఁడు రాజై యుండెను. ఒకనాఁడు విత్తనములు విత్తునుత్సవము (వప్పమంగలము) వచ్చినది. ఆదినము నగర మంతయు దేవతావిమానము వలె నలంకరింపఁ బడి యుండెను. సేవకులు గ్రింది యుద్యోగులు గ్రొత్తబట్టలు గట్టికొని గంధమాలాదికము లలంకరించికొని రాచనగరికి వచ్చిరి. రాజు పొలమునందు వేయినాగళ్లు నిలచియున్నవి. ఏడునూర్లపై తొంబది తొమ్మిది నాగళ్ల పగ్గములు, యెద్దులు, వానిముకుద్రాళ్లు నివి యన్నియు వెండి మలాము జేసినవి. రాజు బట్టుకొనెడు హాలము మొదలగునవి బంగరు మలాము గలవి శుద్ధోదనుఁడు బంగారుదాపిన హాలమును ధరించినాఁడు. వెండి దాపిన హాలములను మంత్రులు బట్టికొన్నారు. తక్కిన యినూ్నటి నితరులు బట్టిరి. రాజు మెలమెల్లగా నాగలి నిటునటు ద్రిప్పినాఁడు."

దీనియందలి యుత్ప్రేక్షలన్నియు దీసివేసిన శుద్ధోదనుఁడు స్వయముగ సేద్యము జేసెడివాఁడని దెలియును. నేటికిని మహారాష్ట్రము-గుజరాతు మొదలగు ప్రాంతములలో

జిన్నచిన్న జమీందారులు గూలీలనెంటc దామును సేద్యము సేయుదురు. శాక్యులు నట్లే సేయుచుండిరేమో! నేటి జమీం దారులకు రాజకీయములైన యధికారములు జాల యల్ప ములు. శాక్యుల కది యధికముగ నుండెను. వీ రిరువురికి గల భేద మింతే. తమ జమీనులోని రాబడి పోబడులను, కూలి-నాలి మొదలైన పద్ధతులను గులవివాదములను దామే స్వయ ముగ నిర్ణయించెడువారు. తమదేశముయొక్క యంతర్గత వ్యవస్థను సంస్థాగారమునం దొకచోట జేరి చూచుకొనెడు వారు. తమభూములం దొకరితో నొకరు గలహించినచో వానిని విచారించు నధికారము వీరిదే. ఏ వ్యక్తినైనను బొలి మేరలు వెళ్ళగొట్టవలసి నప్పుడు, ఉరిశిక్ష విధించునపుడు మాత్రమే గోసలరాజు సమ్మతిని సంపాదించికొనెడువారు. ఈ విషయము 'చూళసచ్చకసుత్తము' లోని యీక్రింది సం వాదమునుబట్టి దెలియును. బుద్ధభగవానుc డనును. "ఓ యగ్గివేస్సనా! కోసలరాజైన ప్రసేనజిత్తు, మగధరాజైన యజాతశత్రుcడు వీరివంటి మూర్ధాభిషిక్తరాజులకుc దమ ప్రజలలో నొకనికి దండన విధించుట కధికార మున్నదా! లేదా! దండించుట కధికారము కద్దా! లేదా! పొలిమేరల వెడలించుట కధికారము కలదో! లేదో!"

సచ్చకుcడు బలికెను. "గౌతమా! వజ్జి - మల్ల దేశము లందలి గణరాజులకుగూడ-తమరాజ్యములందలి ప్రజలను దం డించు నధికార మున్నదట. మఱి, గోసలరాజ, మగధరాజుల కుండుటలో నాశ్చర్య మేమున్నది!"

ఈ సంవాదముచే గణరాజులలో 'వజ్జి, మల్ల' దేశములవారికి వారి భూములందు సంపూర్ణ స్వాతంత్ర్య ముండెనని దెలియును. శాక్యము, కోలియము, అంగము, కాశి, ఈ రాష్ట్రముల గణరాజులకపరాధమునకు మరణశిక్ష విధించు నధికారము లేదు. దొడ్డ దండనగూడ విధించుటకధికారము లేదు. సీమవెడలనడచు నధికారమును లేదు. ఈ దండనలు విధింప వలసివచ్చినపుడు, శాక్య, కోలియ, కాశీ, గణరాజులు, గోసలరాజుయొక్క యనుమతిని బొందవలసి యుండెను. అంగము, మగధరాజు సమ్మతికై వేచియుండవలెను.

## మాయాదేవి విషయము

ఈమెను గురించి యెక్కువగఁ దెలియదు. బోధిసత్త్వుని తల్లి మాయాదేవియే. ఇందుకు సందేహము లేదు. కాని శుద్ధోదనున కేవయస్సున వివాహమైనది ? ఎప్పుడీమె బోధిసత్త్వుని గన్నది? యను విషయముల వివరములు జెప్పలేము. అపదాన గ్రంథమునందు మహాప్రజాపతి గౌతమియొక్క యొక యపదాన మున్నది. అందులో నామె యిట్లనును.

"పచ్ఛిమే చ భవే దాని జాతా దేవదహే పురే
పితా అంజనసక్కో మే మాతా మమ సులక్ఖణా !
తతో కపిలవత్థుస్మిం శుద్ధోదన ఘరం గతా"

"పిదప నీ కడపటిజన్మమందు నేను దేవదహా నగరమున బుట్టితిని. నాతండ్రి యంజనశాక్యుఁడు, తల్లి సులక్షణ. పిదప (యుక్తవయస్సువచ్చినతర్వాత) నేను గపిలవస్తువు

నందు శుద్ధోదనుని యింటికి వచ్చితిని. (నేనతనిని వివాహ మాడితిని)."

గౌతమియొక్క యీ పలుకులలో సత్యమెంతయో జెప్పలేము.* 'కపిలవస్తువున శుద్ధోదనుని యింటిని బొందితిని' యనుమాటకుం బైనిజేసి వివేచనలో నైక్యత లేదు. ఈమె తల్లిదండ్రులు సులక్షణాదేవియు నంజనశాక్యుడును గారనుట కెక్కడను నాధారములు లేవు. మాయాదేవి యీమె పెద్దక్క. ఆమె దల్లిదండ్రులుగూడ నంజనశాక్య సుదక్షిణా దేవులే. వారిరువురిని శుద్ధోదనుడే పెండ్లాడెను. కాని యేక కాలమున బెండ్లాడెనో, భిన్నకాలములందో చెప్పలేము. బోధిసత్త్వుడు బుట్టినతర్వాత యేడవదినమున మాయాదేవి గతించినది. ఈ విషయము బౌద్ధవాఙ్మయమున బ్రసిద్ధము. మాయాదేవి మరణించినపిదపం దల్లిలేనికుమారుని జూచికొను 'నాసరా' లేక, శుద్ధోదనుం డామె చెల్లెలిని బెండ్లాడి యుండును. ఆమె మాతృనిర్విశేషముగ బోధిసత్త్వుని బ్రేమతోం బెంచి పెద్దసేసినది. బోధిసత్త్వునకు మాయాదేవి తలంపునకే రాలేదు.

## బోధిసత్త్వుని జన్మము

మాయాదేవి బదిమాసముల గర్భిణి. అపు డామె బుట్టినింటికిం బోవలెనని గోరినది. శుద్ధోదనుడు గపిలవస్తువు నుండి దేవదహపర్యంతము మార్గమునంతయు శుద్ధిజేయించి

* భరంటుని కథనుంచి 'శుద్ధోదనుడు' గపిలవస్తువునం దుండ లేదని దెలుచున్నది

ధ్వజ పతాకాదులతో నలంకరింప జేసినాఁడు. ఆమెను బంగారు పాలకియం దుంచి, గొప్పసంభ్రమముతోఁ బుట్టినింటి కంపెను.

మార్గమధ్యమున, 'లుంబినీవనము'న నొక యశ్వత్థ వృక్షముక్రింద నామె ప్రసవించినది. 'జాతకనిదానకథ'లోని వర్ణనయొక్క సారాంశ మిది. శుద్ధోదనుఁడు సామాన్యమైన జమీందారే యైనచో మార్గము నంతయు శృంగారింపఁ జేయుట పొసఁగదు. పదిమాసముల గర్భిణీస్త్రీని యెవ్వఁడును బుట్టినింటికంప సాహసింపఁడు. ఇవి యన్నియు నాలోచించినచోఁ బై కథయందు సత్యము జాలస్వల్పమని దోచును !

'మహాపదాన సుత్తమున బోధిసత్త్వుఁడుఁ దల్లికడుపున ప్రవేశించిన తిథి మొదలు జన్మించినపిదప నేడుదినముల లోపల పదునాఱు లోకోత్తర విశేషములు గలుగు' నని వర్ణింపఁబడెను. వానిలో (9) బోధిసత్త్వుని తల్లి పదిమాసములు గడచినవెనుక ప్రసవించుట (10) ఆమె నడచునప్పుడే కనుట (8) బోధిసత్త్వుని జన్మానంతర మేడుదినములకే యామె మరణించుట యనెడు నీ విశేషములు గోతమ బోధిసత్త్వుని జీవితమందే జరిగెను. తక్కిన వన్నియుఁ గల్పనములుగనే గన్పించును. కాలము గడచిన కొలఁదియు, మెల్లమెల్లగా బుద్ధునిచరిత్రలోనికిఁ దొంగిజూచినవి. మాయాదేవి నడచుచునే కనుట, ప్రసవించిన యేడవ దినముననే మరణించుట యీ రెండును సత్యములని నమ్ముటలో బాధలేదు. జాతకములోని నిదానకథలో నీమె శాలవృక్షముక్రిందఁ ప్రసవించినట్లున్నది. 'లలితవిస్తర'మందు ప్లక్షవృక్షముక్రిందఁ గనెనని

గలదు. 'లుంబినీ' గ్రామమునందు శుద్ధోదనుని యింటి ముందున్న తోటలోఁ దిరుగుచున్నప్పు డీమె బ్రసవించెను. ప్రసవించినది శాలవృక్షముక్రింద నైనను గావచ్చును; రావిచెట్టుక్రిందనైనను గావచ్చును. నడచుచున్నప్పుడు బ్రసవించె ననునంత మాత్రమే యీ వర్ణనను నందలి సత్యము.

## బోధిసత్త్వుని భవిష్యత్తు

బోధిసత్త్వుని గన్న తరువాత శుద్ధోదనుఁడు దల్లిని-శిశువును నింటికిఁ గొనితెచ్చెను. అతఁడు గొప్పగొప్ప పండితులైన బ్రాహ్మణులను బిలిపించి బాలకుని భవిష్యత్తు నడిగినాఁడు. వా రాశిశువు యొక్క ముప్పదిరెండు లక్షణములు చూచి 'ఇతఁడు జక్రవర్తి యైనను గావచ్చును. లేక సమ్యక్సంబుద్ధుఁ డైనను గావచ్చున'ని భవిష్యత్తును దెలిపిరి. ఈ విస్తృతివర్ణనము 'జాతకములోని నిదానకథ'యందును-'లలితవిస్తర'మందును గూడ నున్నది. బుద్ధచరిత కావ్యమునను గలదు. ఆనాటి జనులకీ సాముద్రికలక్షణములం దెక్కువ విశ్వాస ముండెను. 'త్రిపిటకవాఙ్మయమం' దిట్టి ఘట్టములనేకములు. 'పోక్ఖరసాతి' బ్రాహ్మణుఁడు దరుణుఁడైన యంబష్ఠుని జూచి 'యీ లక్షణములన్నియు బుద్ధుని యందు నున్నవో, లేదో, చూచిరమ్మ'ని బంపెను. వాఁడు బరీక్షించి ముప్పది లక్షణములను గన్గొనగల్గినాఁడు. తక్కిన రెండును గానరాలేదు. బుద్ధుఁ డద్భుత చమత్కారములు గావించి, వాని కా రెండును జూపించినాఁడు.* బుద్ధచరిత్రలో నీ వర్ణన

* 'దీఘనికాయ,' అంబట్ఠసుత్తము,

మున్నది. ముప్పదిరెండు లక్షణముల నెట్లో యొకరీతి బుద్ధున కతికింపవలెనని యీ కవిబాధ. బుద్ధుని నెక్కువగాఁ బొగడవలె నను నొక యభినివేశపూర్వకమైన ప్రయత్న మీవర్ణనములయం దుండుటచే వీనిలో సత్యము విశేషముగ నుండునని నమ్మవలసిన బనిలేదు. బోధిసత్త్వుఁడు జన్మించినవెనుక 'అసితఋషి' యరుగుదెంచి యీ శిశువు భవిష్యత్తును దెల్పెను. అసితుని యీ కథ జాల ప్రాచీనమైనది. దీనివర్ణనము 'సుత్తనిపాతము'లోని 'నాలకసుత్తము' యొక్క ప్రస్తావనలో వచ్చెను. ఆ భాగ మిది. "దేవతలు మంచివస్త్రములు ధరించిరి. ఇంద్రుని సత్కరించిరి. తమ యుపవస్త్రములను గగనమున విసరుచు, నుత్సవమొనర్చికొను చుండిరి. దాని నసితఋషి జూచెను. 'ఈ యుత్సవ మెందుకొఱకే'ని విచారించినాఁడు. 'లుంబినీ గ్రామమున శాక్యకులమునందు బోధిసత్త్వుఁడు జన్మించెను. అందుకై యీ యుత్సవము'ని దేవతలసితునకుఁ జెప్పిరి. అనంతర మసితుఁడు వినీతుఁడై శుద్ధోదనుని గృహమున కరుదెంచెను. కుమారుని జూపింపవలసిదని శుద్ధోదనుని యాచించినాఁడు. శాక్యులాశిశువు నసితుని యెదుటికి దెచ్చినారు. ఆ శిశువు లక్షణములఁ బరికించిన యసితుఁడు 'యీమనుష్యుఁడు ప్రాణులలో సర్వశ్రేష్ఠుఁడ'నుచునే గంఠము గద్గదమై గన్నులనీరు నిల్పినాఁడు. తనకు ముసలితనము వచ్చినందుచే 'నీబాలుని వైభవమును జూచి యానందించు యదృష్టము లేదుగదా!' యని యతని పరితాపము. అసితుని గన్నీరును జూచిన శుద్ధోదనునకు భయమైనది. 'పిల్లవాని కేభయమును లేదుగదా!' యని శాక్యుఁడు

ఋషిని ప్రశ్నించెను. అపు డసితుఁడు 'నీకుమారుఁడు ముందు ముందు సంబుద్ధుఁడు గాఁబోవును. కాని, నా యాయు వం తయు ముగిసినది. స్వల్పమే యవశిష్టముగ నున్నది. నా కీతని ధర్మ శ్రవణములు విని యానందించు యోగములేదు గదా! యని పరితాపమ'ని బదులువల్కెను. ఈ యుత్తరమును విన్న శాక్యుని సంతోషమే సంతోషము. అసితఋషి యటనుండి వెడలెను

## బోధిసత్త్వుని యభిధానము

"స శాక్యసింహ స్సర్వార్థ సిద్ధ శ్శౌద్ధోద నిశ్చ సః
గౌతమ శ్చార్క బంధుశ్చ మాయాదేవీ సుతశ్చసః॥"

అమరకోశమునందు బోధిసత్త్వున కీ యాఱు పేరులును జెప్పఁబడినవి. వీనిలో 'శాక్యసింహ, శౌద్ధోదని, మాయాదేవీ సుత' పదములు విశేషణములు మాత్రమే. అర్కబంధు వను నది యాతని గోత్రనామము. ఇక మిగిలినవి రెండు. సర్వార్థ సిద్ధ, గౌతమ పదములు. వీనిలో నతని నిజమైన నామమేది? లేక రెండును వేరులేనా?

బోధిసత్త్వునకు 'సర్వార్థసిద్ధుఁ డ'ను పేరు 'త్రిపిటక' వాఙ్మయమునం దెచ్చటను గానరాలేదు. జాతకములోని నిదానకథలో కేవలము సిద్ధత్థ (సిద్ధార్థ) పదము గనబడుచు న్నది. కాని యదిగూడ లలితవిస్తరమునుండి గ్రహింపబడ్డదే. లలితవిస్తరమున నిట్లుగలదు:

"అస్యహి జాతమాత్రేణ మమ సర్వార్థా స్సంసిద్ధాః
యన్న్వహ మస్య సర్వార్థ సిద్ధయితి నామకుర్యాం.

> తతోధి రాజా బోధిసత్త్వం మహతాసత్కారేణ సత్కృత్య
> సర్వార్థసిద్ధోఽయం కుమారో నామ్నా భవతు, ఇతి
> నామా స్యాకార్షీత్"

'సర్వార్థసిద్ధ' నామ మమరకోశమునందు మాత్రమే గలదు. లలితవిస్తరమున మాటిమాటికిని 'సిద్ధార్థకుమారుఁడ'ని యుల్లేఖింపఁబడినది. దానియందే 'సిద్ధత్థ' యనెడు 'పాలీ' రూపాంతరముగూడ నివ్వఁబడెను. సర్వార్థసిద్ధ శబ్దమునకు పాలీవాఙ్మయమున 'సబ్బత్థసిద్ధ' యగును. ఇది గృతకముగఁ గనబడుటచేఁ గాబోలు 'జాతక అట్ఠకథాకారుఁడు' సిద్ధత్థ నామముననే వాడినాఁడు. కాని, 'సర్వార్థసిద్ధ' 'సిద్ధత్థ' శబ్దములు రెండును 'లలితవిస్తరకారుఁడు' ప్రచారము సేసిన ట్లున్నది.

బోధిసత్త్వుని నిజమైననామము గౌతముఁ డనుటలో సందేహము లేదు. థేరగాథలో మహాప్రజాపతి గోతమిని గురించి కొన్ని గాథ లున్నవి. వానిలో

> "బహూనం వతా అత్థాయ మాయాజనయి గోతమం
> యాధిమరణ తున్నానం దుఖ్ఖఖంధం వ్యపానుది "

"అనేకజనుల కల్యాణముకొఱకు మాయాదేవి గోతముని బ్రసవించినది. వ్యాధిమరణములచేతఁ బీడితులైన జనుల దుఃఖరాశి యాతనిచే నిరాకృతమయ్యెను."

యనుటయొకటి. కాని, 'మహాపదానసుత్తము' న బుద్ధుని గుఱించి 'గోతమోగోత్తేన' అని యున్నది. ఇట్లే 'యపదానగ్రంథ' మందును, 'గోతమో నామ నామేన' యనియు

'గోతమో నామ గోత్తేన' యనియు నుల్లేఖములు గలవు. వీనిని బట్టి 'బుద్ధుని నామగోత్రములు రెండును, గూడ నొక్కటియేనా?' యను సంశయము గలుగును. కాని సుత్తనిపాతములోని యీ క్రింది గాథచేత నాభ్రమ దూరమగు చున్నది.

"ఉజుం జానపదోరాజా, హిమవంత స్సపస్సతో
ధనవీరి యేన సంపన్నో కోసలేసు నికేతినో,
ఆదిచ్చా నామగోత్తేన, సాకియానామ జాతియా.
తమ్హాకులా పబ్బజితోమ్హిరాజ నకామే అభిపత్థయం"
(పబ్బజ్జాసుత్తగాథ 17. 18)

"బోధిసత్త్వుఁడు బింబిసారునితో ననుచున్నాఁడు: "మహారాజా! సరళమైన హిమాలయప్రాంతములందు, ధనశౌర్య సంపన్నమైన యొక ప్రదేశము గలదు. దానికిఁ గోసలరాజ్యమం దంతర్భావము. అట నున్నవారు శాక్యులు. వారి గోత్రమాదిత్యము. ఆకులమునుండి నేను బర్రివ్రాజకుఁడ నైతిని. ఆ యగుట గామోపభోగముల యందలి యిచ్ఛచే గాదు."

ఈ గాథయందు శాక్యుల దాదిత్యగోత్రమని చెప్పఁబడినది. ఒకేకాలమం దాదిత్యము, గోతమ మని, రెండు గోత్రము లుండుటకు వీలులేదు గదా! 'సుత్తనిపాతము' ప్రాచీనతమమైన గ్రంథమగుటచే నాదిత్యగోత్రమే శాక్యుల దని నమ్మవచ్చును. అమరకోశమునందలి యర్కబంధు శబ్దము, నాతనిగోత్రమునుబట్టి, యతనికి వాడఁబడిన. విశేష

ణమై యుండును. అప్పుడే యది 'ఆదిచ్చాగోత్తేన' యనువాక్యముతో సమన్వయ పడుచున్నది. బోధిసత్త్వుని నిజమైనపేరు గోతముఁడు. తరువాత బుద్ధుఁడనుపేర నతఁడు ప్రసిద్ధుఁడయ్యెను. 'సమణో ఖలు భో గోతమో సక్యకులా బ్బజితో' యిట్టి యుల్లేఖము సుత్తపిటకమునందు గొన్ని తడవలు గన్పించును.

## బోధిసత్త్వుని యొక్క సమాధిప్రేమ

జాతకమునం దొక కథ గలదు. దానిసారాంశ మిది. "పైని జెప్పఁబడిన శుద్ధోదన రాజుయొక్క కృషి సమారంభ కాలమందు బోధిసత్త్వుఁడు శిశువు. అతనిదాది యాశిశువు నొక జంబూవృక్షముక్రిందఁ బడుకొన బెట్టినది. దాదిగూడ యావేడుక జూచుటకుఁ బోయెను. శిశువు నిద్రించుచున్నాఁ డని యామెతలఁపు. ఇంతలో బోధిసత్త్వుఁడు లేచి కూర్చొని బద్ధాసనస్థుఁడై ధ్యాననిష్ఠుఁ డయ్యెను. చాలసేపటికి దాది తిరిగివచ్చినది. ఆమెవచ్చువేళ కితరవృక్షములయొక్క నీడ ప్రక్కకు జరగియుండె నట! ఈ జంబూవృక్షము క్రీనీడ మాత్రము పూర్వమువలెనే యుండెను. ఈ యద్భుత చమత్కారమును జూచి, శుద్ధోదనుఁడు, బోధిసత్త్వునకు నమస్కార మొనర్చెను. బోధిసత్త్వునిజీవితమం దీకథ మహత్త్వపూర్ణమైనది, కాని, దీనిని మాయమంత్రములక్రిందఁ జేర్చినచో దానిప్రయోజనమే జెడును. బోధిసత్త్వుఁడు దండ్రితోఁ గూడఁ బొలమునకు వెళ్ళుచుండెను. మడక దున్నుట మొదలైన పనులం దాతనికిఁ దోడుపడెడువాఁడేమో! కొంతదీరిక

జిక్కినచో నటనున్న జంబూవృక్షమునీడ ధ్యానస్థుఁడై గూర్చొనెడివాఁడు. ఇంతమాత్రము పిండితార్థమును మనము నమ్మవచ్చును. 'మజ్ఝమనికాయము'లోని మహాసచ్చకసుత్తమందు, బుద్ధుఁడు సచ్చకునితో నిట్లనుచున్నాఁడు. 'నాతండ్రి పొలమున బనిజేయునపుడు జంబూవృక్షముయొక్క శీతల చ్ఛాయయందు కూర్చొని, కామోపభోగములనుండియు, నకుశల విచారములనుండియు, విముక్తుఁడనై, సవితర్కము, సవిచారము, వివేకోత్పన్నము నగు ప్రీతి సుఖము దేనినుండి గలుగునందురో, యట్టి ప్రథమధ్యానావస్థను బొందెడు వాఁడ ననుట నా జ్ఞాపకము. ఇదియే బోధను బొందుటకు సరియైన మార్గమని నాకుఁ దోచెడిది. అగ్గివేస్సనా! నేను, నాలో ననుకొనెడు వాఁడను. ఏ సుఖము కామోపభోగములతో నలిప్తమో యాసుఖమునకు నే నెందుకు భయపడవలెను! అట్టి సుఖమునకు నేను భయపడఁగూడదని జక్కగా విచారించి నిర్ణయించుకొంటిని. కాని యట్టిసుఖము దేహదండనముచే, దుర్బలమైన శరీరముచే సాధింప సాధ్యముగాదు. అందుచే మరల ముందువలె భుజింపఁ దగును."

బోధిసత్త్వుఁ డేడువర్షములు దేహమును దపస్సుతో శుష్కింపఁ జేసెను. అటుతరువాతఁ దండ్రియొక్క పొలము నందు జంబూవృక్షపు క్రీనీడ, ప్రథమ ధ్యానానుభవము లాతనికి గల్గినవి. అదియే తత్త్వబోధకు సరియైనమార్గమని యాతనికిఁ దోచెను. శరీరమును గృశింపఁ జేసికొనుపద్ధతి నాతఁడు వదలిపెట్టి యాహారమును భుజింపసాగెను.

చిఱుతప్రాయమందే బోధిసత్త్వుఁడీధ్యానము నెవ్వారి కడ నేర్చెను? ఎవరును జెప్పకయే యాతనికి సహజముగ బ్రాప్తమైనదా! 'జాతకట్ఠకథాకారుఁడు' 'లలితవిస్తరకర్త' 'బుద్ధఘోషుఁడు' వీరు ముప్వురును బుద్ధునకీధ్యానస్థితి బాల్యమందే ప్రాప్తమైనట్లు సవాలుజేసిరి. 'ఇది యాతనికి సహజస్ఫురణము. ఎరువుసొమ్ము గాద'నుచు దీనినిగూడ నొక యలౌకిక కృత్యముక్రింద జమగట్టిరి. కాని యింతకుముందు జెప్పిన 'భరండుకాలామసుత్తము'ను బట్టి చూచినచో నీ యద్భుతము లోకసహజమే యనిపించును. కాలాముని యాశ్రమము కపిలవస్తువం దుండెనుగదా! అనఁగా శాక్యులందా సంప్రదాయమును నమ్మినవారు, సాధించినవారనేకులుండిరి. కాలాముఁడు ధ్యానమార్గము ననుసరించెడువాఁడు. సమాధిమార్గమునం దేడుసోపానముల యనుభవమును, దాను సాధించినదే గాక, యితరులతో సాధింపఁ జేయగల శక్తి యాతనిది. ఈ విషయముపైన నింకను విపులముగ వచ్చును. కనుక సమాధిలోని ప్రథమ ధ్యానావస్థ బోధిసత్త్వున కున్నయూరనే ప్రాప్తమైన దనుటలో నద్భుత మేమి? కాకున్న నొక విషయమద్భుతమైనది.

పొలమునందుఁ బని జేసికొనుచున్న బోధిసత్త్వున కాచిన్నతనమందు మనస్సు లోకవృత్తముపైఁగాక ధార్మిక విషయములపై బ్రవర్తించు టొకవింత. కేవలము ధార్మిక పిపాసయే గాక యామార్గమున సమాధి లబ్ధివరకుఁ బ్రవర్తించుట వింతలో వింత.

## బోధిసత్త్వుని సమాధివిషయము

బోధిసత్త్వుని ధ్యానమునకు విషయమేది? దీనిని నిర్ణయింపలేము. ప్రథమధ్యానమునకులక్ష్యములిరువదియారట*. వీనిలో బోధిసత్త్వుఁడు వేని పైన ధ్యానమును కేంద్రీకరించెనో! కాని, ప్రేమ కోమలమైన యాతనిస్వభావమునుబట్టి, మైత్రి, కరుణ ముదిత, యుపేక్షలను నీ నాలుగింట నేదో యొక విషయముపై నాతని హృదయము లగ్నమై యుండునని యూహింప వచ్చును.

ఈ నాల్గు గుణములు లాలిత్య ప్రధానమైన యామనస్సునకు దగ్గరవి. దీని కింకొక యాధారముగూడ గలదు. అది యీ క్రిందిది:

బుద్ధభగవానుఁడు 'కోలియ' దేశమందు 'హరిద్రవసనమ'నెడు గ్రామసమీపమున నుండెను. ఈ గ్రామము కోలీయులదే. ఒకనాడు కొందఱు భిక్షువులు ప్రాతఃకాల భిక్ష గ్రహించుటకు పూర్వమే యితర పరివ్రాజకుల యారామములకు వెళ్లిరి. అపుడా పరివ్రాజకులు వారితో నన్నారు: "మేముగూడ మాశ్రావకులకు చిత్తముయొక్క యుపక్లేశములను, హృదయమును దుర్బలమొనర్చు నైదునీవరణములను♦ వదలుమనియే చెప్పెదము. మైత్రీ సహగతమైన చిత్తముతో

---

* బుద్ధఘోషాచార్యుడు, అభిధర్మఁడు, వీరిమతమున సమాధి విషయము లిరువది యైదే. 'ఉపేక్ష,' పైనగూడఁ బ్రథమధ్యానము సాధ్యమగునని దలఁచినచో, నివి యఱువదియాఱు.

♦ 'సమాధిమార్గ' పుట 31-5 చూడుము.

నాలుగుదిక్కులను జూచుడని బోధింతుము. అట్లే భూమి, యాకాశము, చతుర్దిక్కులు - ఒకటి యననేల, నీ సర్వజగత్తును, విపులమై - శ్రేష్ఠమై - నిస్సీమమై - యవైరమై-ద్వేషరహితమైన మైత్రీసహాగత చిత్తముతోఁ జూచుడని యుపదేశింతుము. కరుణాసహాగతచిత్తముతో ముదితా సహాగత చిత్తముతో ఉపేక్షాసహాగతచిత్తముతో వీక్షింప నానసేయుదుము. శ్రమణగౌతములుగూడ నుపదేశించున దిదియే. కనుక వారి యుపదేశములకును, మా యుపదేశములకును గల భేదమేమి? *

శాక్యులును, కోలియులును, గర్షకులే. వారిరువురికును జాల దగ్గరి సంబంధ ముండెడిది. అపుడపుడు రోహిణి నదియొక్క నీటి పంపకముల కై వారిలో వారు గలహించుచుండిరి. ఈ యుల్లేఖములు 'జాతకఅట్ఠకథల'లోను, యితరములలోను వచ్చును. కోలీయుల రాజ్యమందు యితర మార్గములకు జెందిన పరివ్రాజకులు కొంద ఱుండిరి. వారు బౌద్ధభిక్షువులపై నపుడపుడు బూర్వపక్షములు వేసెడువారు. ఈ పరివ్రాజకు లాప్రాంతములలో జాలకాలమునుండి యుండిరి. ఈ యాశ్రమములు, బుద్ధుఁడు ధర్మోపదేశము సేయ నారంభించిన తర్వాత నిర్మితములుగావు. అంతకుముందే యుండెను.

ఈ పరివ్రాజకులు మైత్రి, కరుణ, ముదిత, యుపేక్ష యనెడు నాలుగు బ్రహ్మవిహారములను బాలింపవలె నని

* బోజ్ఝంగ సంయుత్తము, వగ్గ 6 సుత్తము 4

బోధించుచుండిరి.* వీరందరును గాలామునియొక్క మార్గము ననుసరించిన వారే. దీనికి సందేహము లేదు. ఈ బ్రహ్మవిహార ములు బోధిసత్త్వుని బాల్యమునందే యాప్రదేశములందు వ్యాప్తములై యుండెను. బుద్ధుఁడు వీనిపై మనస్సు లగ్నము సేసి ప్రథమధ్యానమును సంపాదించె ననుటలో నమ్మఁగూడని విషయ మేమున్నది?

## బుద్ధుఁడిల్లువదలుటకు గారణము లేవి?

బుద్ధచరిత్రలో మరియొక గొప్పఘట్టము - యాతఁడుద్యానవనమునకు బోవునప్పటిది. శుద్ధోదన మహారాజు-బుద్ధుని దారియందు ముదుసలిగాని, శవముగాని, కానరాకుండుటకై యెన్నో 'బందోబస్తులు' సేసెనట! ఇంత జేసినను యొకానొక దేవత ముదుసలి నొకని నిర్మించి దారి యందు బుద్ధునకుఁ గన్పడఁ జేసెనట! బుద్ధుఁడనుత్సాహియై, ప్రాసాదమునకు మరలినాఁడు. రెండవ తడవ వ్యాధితుని, మూఁడవ తడవ మృతుని, నాల్గవ తడవ యొక బరివ్రాజకుని బుద్ధుని కండ్లఁ బడసేసినది యా దేవత. దీనితో బుద్ధుఁడు విరక్తుఁడై యిల్లు వదలి తత్త్వబోధకుఁగల మార్గమును వెదుక నారంభించెను. లలిత విస్తరాది గ్రంథములలో నీ ప్రసంగము జాల రసభరితముగ వర్ణింపఁబడినది. కవితా హృదయమున కీ కథ యెంత బాగున్నను, దార్శనిక దృష్టి కిది యంత సత్యముగాఁ దోచుట లేదు.

* ఈ బ్రహ్మ విహారములు-'సమాధిమార్గము'యొక్క, యైదవ ప్రకరణమున స్పష్టీకరింపఁబడినవి.

బుద్ధుఁ డపుడపుడు దండ్రితోఁగూడఁ బొలమునకు వెళ్ళెడివాఁ డంటిమి. అడపదడప నొంటిగఁ గూడ బోయెడి వాఁడు. నడుమ'నడుమ గాలాముని యాశ్రమమునకు వెళ్ళు టయు, నతనినుండి దత్త్వబోధ నందుటయు మనకు దెలిసినదే. ఈ నడుమ నెన్నిసారు లాతఁడు ముదుసలిని, వ్యాధితుని, శవమును, జూచి యుండగూడదు! ఇందులో వింత ఏమున్నది?

కడపటి దినమునందు బోధిసత్త్వుఁ డుద్యానవనమునకు బోవుచుండె నట. దేవత యొక యుత్తమ పరివ్రాజకుని నిర్మించి బుద్ధునకు గాన్పింపజేసెను. అపుడు 'ఇతఁడెవ్వర'ని బోధిసత్త్వుఁడు సారధి నడిగినాఁడు. బోధిసత్త్వుఁ డప్పటికి బుద్ధుఁడు గాలేదు. పరివ్రాజకులు, వారి గుణములు, వీనిని గురించి సారధి కేమిదెలియును? కాని దేవతల ప్రభావముచే 'నతఁడు పరివ్రాజకుఁడ'ని వెంటనే సారధి బదులిచ్చినాఁడు. అంతేగాదు, ప్రవ్రజ్యయొక్క గుణములను గూడ వర్ణించె నట! ఈ విషయములు గౌతమునకును జక్కగా నర్థ మయ్యెను. ఇది జాతక యట్ఠకథలోని వ్రాత. కపిలవస్తువు నందే గొందఱు బరివ్రాజకు లుండిరని ముందే దెల్పితిమి గదా! ఆ చుట్టు ప్రక్కలఁగూడ ననేకు లుండిరి. మరి బోధి సత్త్వునకు, నతని సారధికి బరివ్రాజకుల గురించి యేమియు దెలియదనుట యాశ్చర్యము గాదా!

'అంగుత్తరనికాయము'లోని 'చతుక్కనిపాతము'న (సుత్తము. నం. 195) 'వప్ప' శాక్యుని విషయ మున్నది. అతఁడు నిర్గ్రంథ(జైన) శ్రావకుఁడు: ఒకనా డతనికిని 'మహా

మోగ్గలు'నకును సంవాదము జరుగుచుండెను. అప్పుడే సరిగా బుద్ధుఁ డక్కడకు వచ్చినాఁడు. 'నిర్గ్రింధోపాసనతో దన కేమియు లాభము గలుగ లేదనియుఁ దన్ను బౌద్ధమున జేర్చి కొనవలెననియు' వప్పఁడు ప్రార్థించెను. భగవానుఁ డుపదేశ మొసఁగినాఁడు. అట్టకథాకారుఁడు 'వప్పడు బుద్ధుని పినతండ్రి కొడుకు'కనెను. 'మహాదుఃఖఖందసుత్తము' లోని యట్టకథకును బై విషయమునకును గొంత భేదమున్నది. ఎట్లైనను వప్పనాముఁ డైన యొక శాక్యవృద్ధుఁడు జైనుఁడై యుండె ననుటలో సందేహము లేదు. అనఁగా, బోధిసత్త్వుఁడు బుట్టకముందే శాక్యదేశ మందు జైనధర్మ ప్రసారము జరిగెనన్నమాట. అట్టిచో బోధిసత్త్వునకుఁ బరివ్రాజకుల విషయమే దెలియ దనుట యసంభవము గాదా !

మఱి యీ యద్భుత వృత్తాంతము బోధిసత్త్వుని చరిత్రలో నెటనుండి వచ్చి దూరినది! 'మహాపదానసుత్తము'*

---

* 'అపదానము' (సం. అవదానము) అనఁగా సచ్చరిత్ర. గొప్పవారైన సత్పురుషులచరిత్ర లెందువర్ణితములో యది, మహాపదానసుత్తము. ఈ గ్రంథ ప్రారంభమున బూర్వ యుగీనులైన బుద్ధులు, యీ యుగమునందలి 'గౌతమబుద్ధుఁడు' వీరి చరిత్రలు సంగ్రహముగ వర్ణింపఁబడినవి. పూర్వ యుగీను లార్గురు. గౌతమబుద్ధునితోఁ జేరి యేడుగు రన్నమాట. సంగ్రహ వర్ణనానంతర మొక 'విపస్సిబుద్ధు'ని కథ మాత్ర మీ గ్రంథమున విపులముగఁ జెప్పఁబడెను. 'విపస్సి' బుద్ధుని చరిత్ర మొక యుదాహరణమున 'మహాపదానసుత్తకారుఁడు' వర్ణించెననియు, నిట్లే దక్కినవి జెప్పవలెనని యాతని యభిప్రాయమనియు 'నట్టకథాకారు'ని తలఁపు. ఈ వర్ణనములోని యనేక భాగములు 'మహాపదాన సుత్తము'ల రచనకు

నుండి ముదుసలిని జూచినతర్వాత బోధిసత్త్వుఁడు సారథి నేమని యడిగెనో యావృత్తాంతమును జెప్పినపుడు, జాతక అట్ఠకథాకారుఁడు 'మహాపదానే ఆగతన యేన పుచ్ఛిత్వా' (మహాపదానసుత్తమునందు జెప్పఁబడినట్లు ప్రశ్నించి) అని యన్నాఁడు. అనఁగా నీ యభూతకల్పన 'మహాపదాన సుత్త ము'న నారంభమై యితర గ్రంథములలోని కోరతలుపున ప్రవేశించెను. ఇది యంతయు సరే. మరి గృహత్యాగమునకుఁ గారణమేమి? గృహత్యాగకారణ 'మత్తదండ సుత్తము' నందు భగవానుఁడే యిట్లు వివరించుచున్నాఁడు:

---

ముందుగనో వెనుకనో 'గౌతమబుద్ధ చరిత్ర' లోనికిఁ దొంగిచూచెను. ఇవే విషయములు 'త్రిపిటకము'లలో భిన్నభిన్న స్థలములలో వచ్చును. ఉద్యాన దర్శనగాథ మాత్రము 'త్రిపిటకము'లలో లేదు. 'జాతకట్ఠ కథా కారుఁ'డే దీనిఁ బ్రవేశపెట్టెను. దీనికి ముందు 'లలితవిస్తర' 'బుద్ధచరిత్ర' కారు లీ ఘట్టమును వర్ణించిరి.

గౌతమబుద్ధుని కొఱకై, శుద్ధోదనుఁడు మూఁడు ప్రాసాదములను గట్టించిన గాథ యైతిహాసికముగఁ గనపడును. అట్లయినను నిది కాల్పని కమే. శుద్ధోదనుఁ డొక చిన్న జమీందారు. అతఁడే స్వయముగఁ బొల ములో బని జేసెడువాఁడనియుఁ దెల్పఁబడెనుగదా! అట్టివాఁడు దన కుమారుని కొఱకై మూఁడు ప్రాసాదములను గట్టించి యిచ్చెనను టసంభవము.

కీ॥ శే॥ చింతామణి వైజనాథరాజవాడేగారు, 'దీఘనికాయము,' రెండవ భాగమును బ్రకటించిరి. (ప్రకాశకులు, గ్రంథసంపాదకులు: "ప్రకాశకమండలి, నంబరు 380 ఠాకుర్ ద్వార్ రోడ్డు, బొంబాయి-2) ఈ గ్రంథము మొదట 'మహాపదానసుత్తము' యొక్క మరాఠీ భాషాంత రము గలదు. జిజ్ఞాసువులు దానిని జదువవలెను.

"అత్తదండా భయంజాతం, జనంపస్సథ మేఘకం,
సంవేగం కిత్తయిస్సామి యథా సంవిజితం మయా
ఫందమానం పజం దిస్వా, మచ్ఛే అప్పోదకే యథా
అఞ్ఞమఞ్ఞే హి వ్యారుద్ధే దిస్వా మంభయ మావిసి
సమంతమసరో లోకో, దిసా సబ్బా సమేరితా
ఇచ్ఛం భవనమత్తనో నాద్దసాసిం అనోసితం
ఓసానే త్వేవ వ్యారుద్ధే దిస్వా మే అరతీ అహు"

"1. శస్త్రధారణము భయంకరముగ భాసించెను. ఈ జనత యెంతగాఁ గలహించుచున్నదో జూడుము! నాకు సంవేగ మెట్లుగలిగెనో వివరింతును వినుము.

2. అల్పోదకమైన నదియలోఁ బరస్పరము గలహించుకొనుచున్న చేపలవలెఁ దములోఁ దాము గలహించుకొనుచున్న జనులనుజూచి నా కెంతయో భయమైనది.

3. నాల్గువైపులను జగ మసారముగఁ గన్పడెను. దిక్కులన్నియు గంపమానములవుచున్నట్లు దోచెను. ఈ కల్లోలమందు సమస్త భూమియందును యెంత వెదకినను నిర్భయ స్థానము గోచరింపలేదు. కారణ మేమనఁగా నీ జగత్తునెక్కడ జూచినను గలహము లే. కట్టకడవరకు జనులు బరస్పర మొనర్చు కొనెడి యధిక్షేపములే. వీనితో నా మనస్సు విసుగెత్తినది."

రోహిణీనది నీటి పంపకమునకై శాక్యులు, కోలీయులు గలహించుచుండిరి. ఇర్వురును దమ సైన్యములు సేర్చికొని రోహిణీనదీ తీరములకు వచ్చినారు. అపుడు బుద్ధభగవానుఁడు

రెండు సైన్యముల నడుమ నిలవఁబడి యీ సుత్తము నుపదే శించెనని జాతకట్టకథ చెప్పుచున్నది.

ఇది నాకు సరిగఁ దోచుటలేదు. శాక్య కోలీయుల రగడయం దీసుత్తములనే బుద్ధుఁడు జెప్పియున్నచో వాంజగడములు బూర్తిగ నిలచిపోయి యుండెడివి. కాగా యా సందర్భమున నీసుత్తములు జెప్పవలయుటకు సరియైన గారణము గన్పడలేదు తనకు వైరాగ్యోదయ మెట్లుగలి గెనో దా నిల్లువదలి యెందుకువెడలెనో భగవానుఁ డీసుత్త మందు వివరించుచున్నాఁడు. రోహిణి నదియొక్క నీటి కొరకో మఱి యేదేని క్షుద్రవిషయమునకో శాక్య-కోలీయులు జగడమూడుచున్నారు. 'తా నాయుధము పట్టుటా! లేక యూరకుండుటా!' యను నదాసమయమున బుద్ధునకుఁ గలి గిన ప్రశ్న. శస్త్రము చేత జగడమును మాన్పుట సాధ్యము గాదు. శాక్య-కోలీయు లప్పు డాపనినే జేయుచుండిరి. ఇపుడు శస్త్రముతో నొకవేళ కోలీయులు జయింపబడినను మరల వా రూరకుండరు. సమయమునకై వేచియుందురు. శస్త్ర యుద్ధమునం దొకయెడ జయమును, నొకయెడ నపజయ మును దప్పనిది. దీనిచే శాశ్వతశాంతి యవతరింపదు. కోసలుఁడైన ప్రసేనజిత్తునకును, మాగధుఁడైన బింబిసారు నకు వారిపుత్రులే శత్రువులైరి. ఆయుధ మంత భయంకర మైనది. మరి యీ శస్త్రగ్రహణముతో లాభమేమి? కడపటి వరకు నిట్లే బోట్లాడుచుండవలసినదే. ఈ శస్త్రప్రవృత్తిని బోధిసత్త్వుఁడు నిరసించెను. దయాళువైన యాతఁడు శస్త్ర నివృత్తిమార్గమును స్వీకరించినాఁడు.

'సుత్తనిపాత'మందు పబ్బజ్జాసుత్తముయొక్క మొదటనే యీ క్రిందిగాథ గలదు.

'పబ్బజం కిత్తయి స్సామి, యథా పబ్బజి చక్ఖుమా
యథా వీమంస మానోసో, పబ్బజం సమరోచయి
సంబాధోఽయం ఘరావాసో, రజస్సాయతనం యితి
అబ్భోకాసో, చ, పబ్బజ్జా, యితి దిస్వానపబ్బజి'॥

1. చక్షుష్మంతుఁడైన బోధిసత్త్వుఁడు ప్రవ్రజ్యనెందుకు స్వీకరించెను? ఈ సన్న్యాస మాతని కేల రుచించినది? ఈ విషయము జెప్పి తరువాత, ప్రవ్రజ్యను వర్ణింతును.

2 గృహస్థాశ్రమముఁ గలఁతలకుఁ గారణమైనది. సరజస్కము. ప్రవ్రజ్య స్వతంత్రమైన గాలివంటిది. ఇది యెఱిఁగి బోధిసత్త్వుఁడు బరివ్రాజకుఁ డయ్యెను.

ఈ విషయమే 'మజ్ఝమనికాయము'లోని మహాసచ్చక సుత్తములోను వచ్చును. భగవంతుఁ డిట్లనెను: "అగ్గివేస్సనా! సంబోధిజ్ఞానము గలుగుటకుఁ బూర్వము బోధిసత్త్వుఁడుగా నుండుటయే నాకు రుచించెను. గృహస్థాశ్రమము సోపద్రవము. సరజస్కమైనచోటు. ప్రవ్రజ్య గాలివంటిది. గృహస్థాశ్రమమం దుండి పరిశుద్ధ, పరిపూర్ణ బ్రహ్మచర్యమాచరించుటకు సాధ్యముగాదు. అందుకై ముండన మొనర్చికొని గాషాయమును ధరించి యింటినుండి బయట బడి పరివ్రాజకుఁ డౌటయే యుక్తము."

కాని 'పరియ పరి యేసన సుత్తము'ందు గృహత్యాగము నకుఁ గొంచెము భిన్నమైన కారణము జూపఁబడ్డది. బుద్ధుఁ

డిట్లనెను: "భిక్షువులారా! సంబోధి జ్ఞానము గలుగుటకుఁ బూర్వము బోధిసత్త్వుఁడుగా నుండుటయే నాకు జన్మధర్మముగ నుండినది. జన్మముయొక్క వలనఁ బ్రాప్తములగు వస్తువులే (పుత్రదారాదికములు) నాకు రుచించెను. అనఁగా నా సుఖము వారిపైననే యాధారపడిన దని నేను దలంచితిని. స్వభావముగ, జరా ధర్మములై, వ్యాధి ధర్మములై, మరణ ధర్మములై, శోక ధర్మములై యున్నవస్తువులే నాకు రుచించెను. అపుడు నా మనస్సునం దిట్లు విచారము గల్గినది. 'నేను స్వతః జన్మ, జరా, మరణ, వ్యాధి, శోక సంబద్ధుఁడను. పుత్రదారాదికములును, దానిచే సంబద్ధములు. మఱి వానివెంట నేను బర్వెత్తుట సరిగాదుగదా! జన్మజరాదికములచే నేర్పడు గష్టనష్టముల గమనించి యజాతమై, యరుజమై, యమరమై, యశోకమైన పరమశ్రేష్ఠనిర్వాణ పదమును వెదుకవలెను. అదినాకు దగినది.'

బోధిసత్త్వుని ప్రవ్రజ్యకు సాధారణముగ మూఁడు గారణము లివ్వఁబడినవి. 1. తనయాప్తులైనవారే బరస్పరము గలహ మొనర్చికొనుచుండుటచే శస్త్రధారణము సేయుట కాతనికి భయమయ్యెను. 2. గృహస్థాశ్రమ మనేకబాధలతోఁ బంకిలమైనదిగ నాతనికిఁ దట్టెను. సరజస్కముగఁ దోఁచెను. 3. తాను స్వయముగ జన్మ, జరా, మరణ, వ్యాధి, సంబద్ధుఁడైయున్నప్పు డట్టివేయైన వస్తువుల యం దాసక్తుఁడై వాని వెనువెంట బోవు టాతని కసహ్యమయ్యెను. ఈ మూఁడు కారణములు సమ్మిళితములై యాతని గృహత్యాగమునకుఁ గారణమైనది.

'శాక్య-కోలీయులు' బోధిసత్త్వునకు రక్తబంధువులు. వీరినడుమ రగడ లేర్పడినవి. ఈ జగడములలో దాను దగుల్కొనుటా; లేదా? యను ప్రశ్న బుద్ధునియెదుట నిలచెను. శస్త్రముతో శస్త్రమును జయించుట సాధ్యముగాదని యాతని విశ్వాసము. కాబట్టి యీ జనులకు సమాధానము జెప్ప టతికష్టము. ఈ కలహములోఁ దాను జేరక పోయినచోఁ దోడివారు దన్ను బిరికివాఁ డందురు. గృహస్థాశ్రమధర్మమును బరిపాలింపక ద్రోసిపుచ్చె నందురు. ఇన్ని చిత్తక్షోభములకుఁ గారణ మీ పాడైన గార్హస్థ్యమే. దీనికంటె సన్యాసియై, నిరపేక్షతో వనములందుఁ దిరుగుచుండుట యుత్తమముగ గన్పట్టెను. కాని దన హృదయమునకు హృదయమైన బత్నిని విడచు టెట్లు? ప్రేమగృహమునకు మాణిక్యమైన కుమారుని ముద్దుమొగమును వదలి వెళ్లుటా! బోధిసత్తుని మనస్సు 'యుస్సురు' మన్నది. ఇంతలోఁ దన్నినది మరియొక యూహాతరంగము. జాతి, జరా, వ్యాధి, మరణాది ధర్మములచేతఁ దానే స్వయముగ బద్ధుఁడు. అట్టిచోఁ దనవలెనే బద్ధులైన పుత్రదారాదికముల వెంటఁ దగిలి వారికొఱకై గల్లోలితమై, సరజస్కమైన, గృహస్థాశ్రమమునందుఁ జిక్కుబడవలెనా! తన మనస్సును గలఁచిన యిన్నియాలోచనలతో బోధిసత్త్వుఁడు బరివ్రాజకుఁడైనాఁడు. గౌతముఁడు విరక్తుఁ డగుటకు మూఁడు కారణము లంటిని. వీనిలో ముఖ్యమైన కారణమేది? రక్తబంధువుల కలహములే ముఖ్యమైన కారణము. దీనిబారినుండి

దప్పించికొనుటకై భగవానుఁడు విరక్తుఁడై జ్ఞానమార్గమును వెదకి యనుభవించి బుద్ధుఁడైనాఁడు.

## ౧ రాహులుఁడు

బోధిసత్త్వునకుఁ జిన్నవయసునందే వివాహమైనది. అతఁడు గృహత్యాగము సేయునాటికి 'రాహులుఁడ'ను నొక కొడుకుండెను. ఈ విషయము 'త్రిపిటకముల'లో ననేకచోట్ల గలదు. జాతకముయొక్క నిదానకథలో 'రాహులుఁడు' జనించిన నాటి రాత్రియే బోధిసత్త్వుఁడు గృహత్యాగ మొనర్చెనని యున్నది. వేఱొక యట్టకథలో రాహులుఁడు జన్మించిన యేడవనాఁడు గౌతముఁడు గృహత్యాగ మొనర్చెనని గలదు. ప్రాచీన వాఙ్మయ మందీ రెంటికి నాధారములు లేవు. బోధిసత్త్వుఁ డిల్లు విడచుటకు ముం దాతనికి రాహులుఁ డను కుమారుఁ డుండెననుట నిజము. 'మహావగ్గము'నందును మఱికొన్నియెడలను గౌతముఁడు బుద్ధుఁడై కపిలవస్తువునకు విచ్చేసి రాహులునకు దీక్షనిచ్చిన ట్లున్నది. అపుడు కుమారున కేడేండ్ల వయస్సు. అట్టకథలుగూడ నీ సన్నివేశమును జాల తావుల వర్ణించెను. బుద్ధభగవానుఁడు రాహులున కెందుకు దీక్షనొసఁగెను? అపు డాకుమారుని వయస్సెంత? ఈ విషయము లేడవప్రకరణమున వివరముగ జర్చింతుము.

## రాహుల మాతృదేవి

మహావగ్గ యందును, జాతకట్టకథల యందును రాహులునితల్లి 'రాహులమాతాదేవి' యనియే జెప్పఁబడినది.

'యశోధర' యనెడుపేరు 'అపాదాన' గ్రంథమునందు మాత్రమే వచింపఁబడెను. జాతకముయొక్క 'నిదానకథ' యందు యిట్లుగలదు. "ఎపుడు మా బోధిసత్త్వుఁడు లుంబినీ వనమున జన్మించెనో యపుడే, రాహులమాతృదేవి 'ఛన్న' యమాత్యుఁడు, కాళుదాయి యమాత్యుఁడు జన్మించిరి. 'కంథక' మను నశ్వరాజము, బుద్ధగయయందు మహాబోధివృక్షము, నాల్గునిధులును బుట్టినవి. బుద్ధునిజన్మకాలము ననే వృక్షనిధులు జన్మించె ననుట కేవలము కట్టుకథ. అట్లు గానిచో బోధిసత్త్వుఁడు, రాహులమాత, ఛెన్నుఁడు, కాళుదాయి, యీ నల్గురును నేకకాలమున జన్మింపకున్నను, సవయస్కులై యుండి రనుట నమ్మవచ్చును. రాహులమాత డెబ్బది యెనిమిదవ వయస్సున గతించినది. అనఁగా బుద్ధుని మహాసమాధికి రెండేండ్లకుఁ బూర్వమన్నమాట. అపదానము (584) నం దామె యనుచున్నది:

"అట్ఠసత్తతి వస్సాహం పచ్ఛిమో వత్తతిభవో;

........................................................

మహాయవోగమిస్సామి కతంమే సరణమత్తనో"

"నే నిపుఁడు డెబ్బదియెనిమిది వర్షముల దానిని. ఇదే నాకుఁ గడపటిజన్మ. మిమ్ము నేను వదలిపోవుచున్నాను. నా ముక్తిని నేను సంపాదించుకొంటిని"

ఈ కడపటి జన్మమందు, శాక్యకులమున తా నుద్భవించిన ట్లామె దలఁచుచున్నది. కాని, యామె వంశము యొక్క వివరము లేమియు దెలియుటలేదు. ఆమె భిక్షుణియై యుండి డెబ్బది యెనిమిదవయేట బుద్ధుని సన్నిధానమున కేగి

పై శ్లోకమునగల యర్థమును జెప్పినట్లు 'అపదానకారుఁడు' దలఁచుచున్నాఁడు. కాని యామె భిక్షుణియైన తర్వాతి నెవరికి నే యుపదేశము నిచ్చినట్లుగాని - యే విధముననైన బుద్ధసంఘముతో సంబంధ ముంచికొన్నట్లుగాని, యాధార ములు గానవచ్చుటలేదు. అసలామె భిక్షుకియైనదో? లేదో? గూడ జెప్పలేము. ఈమె నామము 'యశోధర' యని 'యప దాన' గ్రంథమున గలదు. లలితవిస్తరమున 'గోప' యని యున్నది. ఈ రెంటిలో నేది యామె నిజమైనపేరో? లేక రెండునుగూడ నామె నామధేయములే నేమో!

## గృహత్యాగ ప్రసంగము

బోధిసత్త్వుఁడు గృహత్యాగముఁ గావించునాటిరాత్రి దన ప్రాసాదముననే యుండెనట. అతని పరివారములోని స్త్రీలు గీతవాద్యములతో, బోధిసత్త్వుని రంజింపఁ జేయుటకై బుహ్కలముగ శ్రమించిరి. కాని బోధిసత్త్వుని హృదయ మాకృష్టము గాలేదు. వారు గడకు విసిగి నిద్రించిరి. వారిలోఁ గొందరు గలవరించుచుండిరి. కొందరి నోళులనుండి జొల్లు గాఱుచుండెనట! ఆదృశ్యమును జూచిన బోధిసత్త్వున కెంతయో యసహ్యమైనది. తిన్నగా నాతఁడు చెన్నసారధిని నిదుర లేపెను. ఆ సారథి 'కంథక' మనెడు గుఱ్ఱమును సజ్జక మొనర్చి తెచ్చెను. దానిపై బోధిసత్త్వుఁ డెక్కెను. వాఁడు గళ్లెమును బట్టుకొని వెంటనడచెను. దేవతలు నగరద్వార మును దెఱచియుంచిరి. వారిద్దఱును నగరమునుండి బయట బడి 'అనోమ' యను నదియొక్క తీరమును జేరినారు. అచట బోధిసత్త్వుఁడు దనకేశములను దానే గరవాలముతో ఖండించి

కొనెను. వస్త్రాభరణాదులు సారథి కిచ్చివేసి రాజగృహము వైపు నడచినాఁడు. బోధిసత్త్వుని వియోగముతో 'గంధక' హయ మా నదీతీరముననే జచ్చినది. ఛెన్నుఁడు వస్త్రభూష ణాదులతో వెనుకకు వచ్చినాఁడు.

పై జెప్పినది 'నిదానకథ' లోని సారాంశము. నిదాన కథ, లలిత విస్తరము, బుద్ధచరిత్రి, యీ మూఁటియందును, నీ సన్నివేశము జాల రసభరితముగ వర్ణింపఁబడినది. ఈఘట్టము నకు బౌద్ధుల చిత్రకళయందుఁ గలిగిన పరిణామము వర్ణనా తీతము. కాని పై కథలో సత్య మేమాత్రమును లేదు. ఒక వేళ యున్నచో నేదో గొద్దిగ యుండును. ఈ యనుమానము నకుఁ గారణ మేమనఁగాఁ బ్రాచీనములైన సుత్తములలో నీ యసంభావ్య దంతకథ కాధారములు లేకుండుట.

'అరియపరియేసన' సుత్తములో బుద్ధభగవానుఁడే దన గృహత్యాగఘట్టమును గురించి చెప్పుచున్నాఁడు. ఆ జెప్పాట యిది:

"సో ఖో అహం భిక్ఖవే? అపరేన సమయేన, దహరో సమానో సుసు కాళకేసో, భద్రేన యోబ్బనేన సమన్నాగతో పఠమేన వయసా అ కామకానం, మాతాపితున్నం, అస్సుముఖానం రుదంతానం, కేస మస్సుం, వోహారేత్వా, కాసావానివత్థాని అచ్ఛాదేత్వా, అగారస్మా, అనగారియం పబ్బజి"

"భిక్షువులారా! యిట్లు విచారము సేయుచునే గొంత కాలము గడచెను. అపుడు నేను మంచి యవ్వనమునం దుం టిని. నా వెంట్రుకల యొక్కటియు నెరియలేదు. చక్కని

తరుణుఁడను. నాతల్లిదండ్రు లేమియు సమ్మతింపలేదు. కన్నుల నుండి వెడలునీటితో వారిమొగములు బూర్తిగ నావరింపఁబడి యుండినవి. బిగ్గరగ నేడ్చుచుండిరి. అయినను నేను (వారినెవ్వరిని లెక్కింపక) శిరోముండన మొనర్చికొని కాషాయవస్త్రములు గప్పికొని యింటినుండి బయటబడితిని.

ఇదే యనుక్రమణిక 'మహాసచ్చకసుత్తము' నందు గలదు. దీనినిబట్టి బోధిసత్త్వుఁడు రహస్యముగ 'ఛన్న, కంథకు' లతోఁగూడ గృహమునుండి నిర్గమించె నను కథ కల్పనగఁ గన్పడుచున్నది. బోధిసత్త్వుని సొంతతల్లియైన మాయాదేవి యాతఁడు జన్మించిన యేడవనాటనే మరణించినదిగదా! నాటనుండి మహాప్రజాపతి గౌతమియే యాతనిని సొంత కొడుకువలెఁ జూచికొన్నది. బుద్ధుఁడు జెప్పిన పైకథలోని తల్లి యీమెయే. శుద్ధోదన గౌతములకు బోధిసత్త్వుఁడు బరివ్రాజకుఁడుగాఁ బోవు వృత్తాంతము జాలదినములకు ముందే గొంతకొంత దెలియును. వారియిచ్ఛకు విరుద్ధముగ వారి యెదుటనే బుద్ధుఁడు సన్యసించి యిల్లు వదలి పోయెను. ఈ సిద్ధాంతమునకు బుద్ధుఁడే స్వయముగ వచించిన కథయే ప్రబలాధారము.

# ఐదవ ప్రకరణము

# తపశ్చర్యయుఁ దత్త్వబోధయును

## ఆళార కాలామునితోడి సంగతి.

"ఇల్లు వదలిన బోధిసత్త్వుఁడు నేరుగా రాజగృహమునకుఁ బోయెను. అక్కడ బింబిసారుఁ డాతని గలిసికొన్నాఁడు. అటనుండి గదలి యాళార కాలామునిఁ జేరి తత్త్వజ్ఞానమును నేర్చెను. ఈ విషయము జాతకములోని 'నిదానకథ'యందుఁ జెప్పఁ బడినది. అశ్వఘోషుఁడును 'నిదానకథ' యొక్క క్రమమునే యనుసరించెను. 'లలిత విస్తర' మందు 'బోధిసత్త్వుఁడు' మొదట వైశాలి కేగెను. అక్కడ నాళార కాలాముని శిష్యుఁడైనాఁడు. పిదప రాజగృహమునకు వచ్చెను. బింబిసారుని గలిసికొన్న యనంతరము యుద్దకరామ పుత్త్రేక్షత్రియుని కడఁ జేరెను" యని సవిస్తరముగ వర్ణింపఁ బడినది కాని యీ రెండు వృత్తాంతములకుఁ గూడఁ బ్రాచీన సుత్తములతోఁ బొత్తు గలియుట లేదు. ఇంతకుముందు 'ఆర్య పరియేసన సుత్తము' నుండి యొక ఘట్టము నుద్ధృతీకరించి బోధిసత్త్వుఁడు దలితండ్రుల యెదుటనే సన్యసించె నని దెలిపితిని. ఆ గ్రంథ మందే దాని తరువాత నీ యనుక్రమణిక యున్నది.

'సో ఏవం పబ్బజితో సమానో కిం కుసల గవేస్సీ అనుత్తరం సంతి వర పదం పరి యేసమానో యేన ఆళారో, కాలామో తేనుప సంకామి' (భగవంతుఁ డనుచున్నాడు:

'ఈ ప్రకారము సన్యసించి హితకరమైన మార్గ మేదియో దెలిసికొనగోరి : శ్రేష్ఠమై, లోకోత్తరమై, శాంతమైన తత్త్వమును శోధించుచు నే నాళార కాలాముని కడఁ జేరితిని.')

పై పాలీయుద్ధృతీ కరణముచేత బోధిసత్త్వుఁడు రాజగృహమునకు నేరుగా వెడలక దొలుతనే యాళార కాలామునిని సమీపించినట్లు, దెలియును. ఆళార కాలాముఁడు 'గోసలదేశవాసి'. 'అంగుత్తర నికాయము'లోని 'తిక నిపాత' మందు (సుత్తము॥ నం॥ 65) గాలాము డను క్షత్రియునికిఁ గేసపుత్త నగరమున జరిగిన యొక సంఘటన యుల్లేఖింపఁ బడినది. దీనితోఁ గాలాముల యందు నాళార కాలాముఁడును నొకఁడని దెలియును. శాక్య-కోలియ రాజ్యములం దతనికి గొప్ప ప్రతిష్ఠ యుండెడిది. ఇతని శిష్యుఁ డొక్కడు 'భరండు కాలాముఁడు'. ఇతని యాశ్రమము 'గపిలవస్తు' వం దుండెనని ముందే జెప్పితిమి గదా! 'ఉద్దక రామపుత్తు'ని శిష్యుఁ డొకడు 'కోలీల' సమీపముననే యుండెను. అందుచే నీ సంప్రదాయము శాక్య, కోలియ, రాష్ట్రములలో బాగుగా వ్యాపించి యుండె ననుటకు సందేహము లేదు. బోధిసత్త్వుఁడు ప్రథమధ్యానపద్ధతి నీ పరివ్రాజకుల కడనే నేర్చెను. సన్యాస దీక్షయును, వారినుండియే స్వీకరించినాఁడు.

కాని శాక్య, కోలియ, దేశములందే యొక్క యాశ్రమము గట్టుకొని కాలము గడుపుట బోధిసత్త్వున కిష్టములేదు. శ్రేష్ఠ శాంత లోకోత్తరం తత్త్వమును దనకుఁ దెలిసిన దాని నితరులకుఁ జెప్పుచు వారికడ నేదైన విశిష్టత యున్న దాను

గడించుచుఁ దిరుగవలెనని యాతని యాస. ఈ తలఁపుతో నాళార కాలాముని సమీపించెను. అపు డతఁడు గోసల దేశమం దుండెను. బోధిసత్త్వున కాయన నాలుగు ధ్యాన ప్రకారములు, వాని తరువాతి మూఁడు సోపాన పద్ధతులు నేర్పినాఁడు. కాని, బుద్ధున కీ సమాధి యొక్క సోపాన సప్తకముతో శాంతి గలుగలేదు. ఇది మనోనిగ్రహమునకు మార్గమే. కాని దీనినుండి మనుష్య జాతికి మే లేమి? ఈ తలఁపుతో నతఁడు ముందుకుఁ గదలెను.

## ఉద్దక రామ పుత్తుని సమీపించుట

ఆళార కాలాముఁడు, 'ఉద్దక రామపుత్తుఁడు' వీరిరువురు గూడ నొక్కే సమాధి మార్గమును బోధించు చుండిరి. కాలాముఁడు సమాధియొక్క సోపానసప్తకమును బోధించు చుండెను. ఉద్దక రామపుత్తున కెనిమిది సోపానములు దెలియును. వీ రిరువుర కింతే భేదము. వీరిరువురి కొక్కఁడే గురు వుండి యుండును. శిష్యదీక్ష ముగిసిన పిదప వా రీ రెండు పంథలను బ్రచారమునకుఁ దెచ్చి యుందురు. కాలాముని సెలవుగైకొని బోధిసత్త్వుఁ డుద్దకుని సమీపించినాఁడు. కాని యా మార్గము నందుఁగూడ బోధిసత్త్వునకు విశేష సత్యము గానరాలేదు. అటనుండి రాజగృహమునకుఁ గదలి యక్కడి ప్రసిద్ధ శ్రమణ పంథల తత్త్వజ్ఞానమును దెలియుటకై బోధిసత్త్వుడు నిశ్చయించుకొనెను.

## బింబిసారుని మైత్రి

రాజగృహమునందు బోధిసత్త్వుని యాగమనము 'సుత్త నిపాతము'నందు. 'పబ్బజ్జి' సుత్తములో వర్ణింపఁబడినది.

వర్ణించిన వాఁ డెవఁడో యజ్ఞాతుఁడు. దాని భాషాంతరీకర ణమే క్రిందిది.

1. చక్షుష్మంతుఁడైన బోధిసత్త్వుఁడు ప్రవ్రజ్య నెందుకు స్వీకరించెను ? ఏ తలఁపుతో నాతని కిది రుచించినది? దానిని వర్ణించి పిదప నాతని ప్రవ్రజ్యా ప్రకారమును జెప్పెదము.

2. గృహస్థాశ్రమ మడ్డంకులతోఁ గూడినది. సరజస్కము నైనది. ప్రవ్రజ్య స్వతంత్రమైన వాయువు వంటిది. దీనిని దెలిసి యతఁడు సన్యసించినాఁడు.

3. సన్యసించిన బోధిసత్త్వుఁడు శారీరక పాపకర్మములు వదలెను. వాచికమైన దుర్వచనములు మానివేసినాఁడు. తన యుపజీవిక శుద్ధమార్గమున నడపికొన్నాఁడు.

4. బుద్ధుఁడు మగధుల 'గిరివ్రజము' (రాజ గృహము) నకు వచ్చెను. శరీరమం దెల్లఁడ నుత్తమ లక్షణములు గలిగిన యాతఁడు భిక్ష నడుగుటకై రాజగృహమున బ్రవేశించెను.

5. తన ప్రాసాదము నుండి బింబిసారుఁ డాయనను జూచినాడు. ఆతని లక్షణ సంపత్తియు బింబిసారునకుఁ గన్పడెను. బింబిసారుఁడు దనలో ననుకొన్నాఁడు.

6. ఈ వ్యక్తి సుందరుడు. భవ్యుఁడు. శుద్ధుఁడు. ఆచారవంతుఁడు. ఇన్ని యుండియుఁ దన పాదములవైపు జూచికొనుచుఁ బోవుచున్నాడు. ఆ చూపుగూడ రెండు చేతుల పొడవు మాత్రమే దారి యందు బడుచున్నది. (యుగ మత్తంచ పేక్ఖతి)

7. పాద పరిసరములనే జూచికొనుచుఁ బోవుచున్న యీ జాగృతి గల భిక్షువు నీచుకుల జనితుఁడుగఁ గన్పడుట లేదు. ఇతఁ డెక్కడ వెళ్లుచున్నాఁడో దూతల నంపి గను గొనవలెను.

8. ఈ భిక్షు వెక్కడ వెళ్లుచున్నాఁడో, యెట నివసించు చున్నాఁడో గనుగొనుటకై బింబిసారుఁడు దూతల నంపెను. వా రతని వెనుక వెనుకనే వెడలిరి.

9. ఇంద్రియముల రక్షించుకొనుచు, నింటింట భిక్షిం చుచు, జాగృతుఁడై వివేకమును వదలకున్న బోధిసత్త్వుని భిక్షాపాత్ర వెంటనే నిండిపోయినది.

10. భిక్షాటనమును బూర్తి యొనర్చిన యాముని నగర మును దాటిపోయెను. ఎట నివసింత మను నుద్దేశముతో 'పాండవ పర్వతము'ను సమీపించినాఁడు.

11. అది యాతని నివాసముగఁ గనుగొన్న దూతలు గొంద ఱచ్చటనే యుండి, యొకరిని రాజుకడ కంపిరి. వాఁడు వచ్చి రాజుతో నన్నాఁడు.

12. మహారాజా ! యా భిక్షువు 'పాండవ పర్వతము' నకుఁ దూర్పు వైపున వ్యాఘ్రమువలె, వృషభమువలె, గిరి గహ్వరముల వసించు సింహమువలె వసించుచున్నాడు.

13. దూతల వచనమును విన్న యా రాజుత్తమ యానమునెక్కి త్వరగా 'పాండవ పర్వతము' వైపు గదలెను.

14. ఎంతవరకు యానముపైఁ బోవచ్చునో యంత వరకు వెళ్ళి, పిదప వాహనమును దిగిన బింబిసారుఁడు గాలి నడకతో బోధిసత్త్వుని సమీపించెను.

15. రాజు కుశలప్రశ్నలు విచారించెను. అనంతర మాతఁ డిట్లు బలికెను.

16. నీకు నిండు యౌవనమున్నది. తరుణుఁడవు. కౌమారదశ యింకను దాటలేదు. నీ తనుకాంతి క్షత్రియుని కాంతివలె రోచకమై యున్నది.

17. నీవు గజపాలుఁడవై నా సేనకు గౌరవము దెమ్ము. నేను నీకు సంపత్తి నిత్తును. దాని ననుభవింపుము. నీ జాతి యేదో యిపుడు దెల్పుము.

18. బోధిసత్త్వుఁ డనెను: "రాజా హిమాలయ పాదము లందు, ధన, వీర్య, సంపన్నమై యొక ప్రదేశ మున్నది. దానికిఁ గోసల రాజ్యమం దంతర్భాతి. అది నా దేశము.

19. అచ్చటి జను లాదిత్యగోత్రులు. వారిని శాక్యులం దురు. రాజా! వారియందు, జన్మించిన నేను సన్యాసి నైతిని. ఆ యగుట గామోప భోగము లందలి యిచ్ఛచే గాదు.

20. కామోపభోగములందు, నాకు దోషమే గన్పట్టినది. ఏకాంతవాసము నాకు సుఖ మయ్యెను. నే నిపుడు దపశ్చర్యకై వెళ్ళుచున్నాను. ఆ మార్గమునకు నా హృదయ మత్రులు సాచుచున్నది.

ఈ సుత్తము యొక్క మూడవ గాథయందు బోధిసత్త్వుడు 'గాయము,' 'వాక్కు', 'ఉపజీవిక' వీనిని సంస్కరించుకొన్నట్లుగా నుల్లేఖింపబడినది. ఇల్లు గదలిన బోధిసత్త్వుడు మార్గమధ్యమందే యీ మూటిని సంస్కరించుకొనెనా? అది యసాధ్యము.

'ఆళార కాలాముడు,' 'ఉద్దక రామపుత్తుడు' వీరి కడ నివసించి, వారి యాచార విచారములు జాగ్రత్తగఁ గనిపెట్టి యాతఁ డీ సంస్కరణ మొనర్చు కొనెనని యూహింప వచ్చును. కాని వారి పంథలతో నాతనికి సమాధానము చిక్కినది గాదు. అందుకై ప్రసిద్ధ శ్రమణ నాయకుల తత్వ జ్ఞానముల దెలిసికొనుటకు రాజగృహమునకు వచ్చినాఁడు. వారి సర్వ సంప్రదాయము లందును గొద్దియో- గొప్పయో దపశ్చర్య యుండనే యున్నది. తాను నట్లే దపశ్చర్య గావింపవలెనను తలఁపు బోధిసత్త్వునకుఁ గలిగెను. ఆ నిర్ణయ మునకు వచ్చినవాఁడు గనుకనే బింబిసారునితో 'నేనిప్పుడు దపశ్చర్యకై బోవుచున్నాను' యని పలికెను. కామోపభోగ ములనుండి యాతని హృదయ మింతకుముందే విరక్తమైనది. కనుక మగధరాజు 'యిచ్చెద'నన్న యధికారము బోధిసత్త్వు నకు రుచించినదిగాదు.

## ఉరువేలకు వచ్చుట

రాజగృహము నుండి యతఁ డురువేలకు వెడలి నాఁడు. ఆ చోటాతనికిఁ దపోయోగ్యముగాఁ గనఁబడినది. దాని వర్ణనము 'అరియ పరియేసన' సుత్తమం దిట్లున్నది.

భగవానుఁ డనెను : 'భిక్షువులారా ! కుశలమార్గము నన్వేషించు నేను దపోయోగ్యమైన స్థానమును వెదకుచు నురువేలకు వచ్చితిని. ఆ చోటు లోకోత్తరమై శాంతమై శ్రేష్ఠమై యుండెను అచ్చోట నొక రమణీయ భూమి భాగమును జూచినాను. అక్కడ సుశోభితమైన యొక వనము, దాని ప్రక్కన మందమందముగఁ బారుచున్న నది.

నది కిరువైపుల మెఱయు సైకతము. ఆ సైకతము లున్నతములైన యాసనముల వలె నుండెడివి. వనమునకు నలువైపుల భిక్షాటన మొనర్చికొనుట కనువయిన పల్లె లుండెను. ఈ రమణీయ భూభాగము గులీనుఁడయిన మనుష్యునకుఁ దప మొనర్చుట కర్హమైనదని దోచి నే నటనే గూర్చుంటిని.

రాజగృహమునకుఁ జుట్టు పట్టులనే జిన్నచిన్న కొండ లుండెడి వనియు, వానియందు నిర్గ్రంథులు మొదలయిన శ్రమణులు దప మొనర్చుకొనెడువా రనియు, ననేకతావుల వర్ణింపఁబడియున్నది. బోధిసత్త్వున కీ రూక్షపర్వతములు తపోయోగ్య మనిపించ లేదు. ఆయన కురువేలయే రుచించెను. అతని సృష్టి సౌందర్యప్రీతి యంత కోమల మైనది.

మూఁడుపమలు

తపశ్చర్య నారంభించుటకు ముందు బోధిసత్త్వుని మనస్సున మూఁడుపమానములు దట్టెనట. వాని వర్ణనము "మహాసత్యక సుత్త"ము నందు వచ్చుచు. భగవానుఁ డను చున్నాఁడు: "అగ్గివేస్సనా! కొన్ని కట్టెలు దడిసిన నీటియందే యున్నవి, ఒకానొక మనుష్యుఁడా కట్టె నొకదానిని గైకొని యుత్తరారణితో దానిపై రుద్దె ననుకొందము. వాఁ డగ్నిని బుట్టింప దలచినాఁడు. కాని యగ్ని జనించునా?

సచ్చకుఁడు :- గౌతమా! ఆ కట్టెలో నగ్గి బుట్టదు. అది దడిసినది. అందుచే నా మనుష్యుని పరిశ్రమ వ్యర్థము. వానికి పరిశ్రమయే గాని ఫలము శూన్యము.

గౌతముడు :- అగ్గివేస్సనా! అట్లే యే శ్రమణుఁడైనను, బ్రాహ్మణుడైనను శరీర మనస్సులతో గామోప భోగములం దలిప్తుఁడు గాఁడో, ఎవని కామవికారము శాంతముగా లేదో, వాఁ డెంత శ్రమించినను జ్ఞాన దృష్టి లభింపదు. లోకోత్తరమైన సంబోధము, ప్రాప్తము గాదు. ఓయీ! అగ్గివేస్సనా! నా కింకొక యుపమానమును దట్టినది. ఒక తడిసిన కట్టె నీటినుండి దూరమం దున్నదే యనుకొనుము. ఒకానొక డుత్తరారణితో దాని ఘర్షించి యగ్గి బుట్టింప యత్నించెను. అగ్గి కలుగునా?

సచ్చకుడు :- గౌతమా! గలుగఁ బోదు. వాని ప్రయత్నము వ్యర్థమై ప్రయత్నమే మిగులును. ఆ కట్టె దడిసినది గదా!

గౌతముడు :- ఓయీ! అట్లే య్యేశ్రమణుఁడు గాని బ్రాహ్మణుఁడు గాని కామోప భోగములు వదలి శరీరముతో మనస్సుతో వాని నుండి యలిప్తుడగ నున్నను యెవని మనస్సు నం దా వికారములు మూలమట్టముగఁ బోలేదో వాఁ డెంత గష్టపడినను జ్ఞాన దృష్టి గలుగదు. లోకోత్తర సంభోధ మేర్పడదు. ఓయీ! నాకు మరియొక యుపమ దట్టినది. ఒక శుష్కమైన కట్టె నీటినుండి దూరమం దున్నదనుము. ఒకానొకఁడు దానిపై నుత్తరారణి ఘర్షించి యగ్గి బుట్టింపఁ దలచెను. అగ్గి పుట్టునా? పుట్టదా?

సచ్చకుడు :-పుట్టి తీరును. ఆ కట్టె యెండినది, నీటి నడుమఁ గూడ లేదు.

గౌతముడు:- ఓ యగ్గివేస్సనా! అట్లే యే శ్రమణ బ్రాహ్మణులు, గాయముతోఁ, జిత్తముతోఁ, గామోపభోగము లందుండి దూరముగ నుండిరో, యెవరి మనస్సునందుఁ గామవికారములు సంపూర్ణముగ నశించెనో, యట్టివారు శరీరము నత్యంతము శ్రమింప జేసినను, జేయకున్నను, వారికి జ్ఞాన దృష్టి లభించును. లోకోత్తర సంబోధము ప్రాప్తించును.

ఈ మూఁడలంకారములును బోధిసత్త్వులు తపశ్చర్య యెందు కారంభించిరో దెలుపును. ఏ శ్రమణ బ్రాహ్మణులు యజ్ఞ యాగము లందే నిమగ్నులై దృప్తి బొందుదురో, వారా మార్గమున శరీరమును శ్రమింప జేసినను, వారికిఁ దత్త్వజ్ఞానము దూరమైనది. వేరొక తెగవారు, యజ్ఞయాగముల మార్గమువదలి యరణ్యములఁ జేరి వసింతురు. కాని వారి యంతఃకరణములందుఁ గామవికారములు నష్టములు గాలేదు. వారి తపస్సునుండి గలుగు ఫలమేమియు లేదు. వారి ప్రయత్నము తడిసిన కట్టెపై నుత్తరారణి ఘర్షించి యగ్నిబుట్టింపఁ బ్రయత్నించుట వంటిది. ఎవఁడు గామోపభోగములనుండి దూరముగ నున్నవాఁడై మనస్సునందుఁ గూడ గామవికారముల నాశమొనర్చుకొనునో వాఁడు గాయమును క్షోభపెట్టవలసిన బనిలేదు. తత్త్వబోధ వాని సొమ్ము.

## హఠయోగము

బోధిసత్త్వునకుఁ బైయలంకారములు దట్టినవి. వాని ననుసరించి శ్రమణు లొనర్చినట్లు తీవ్ర తపశ్చర్యను జేయవలెనని యాతఁడు నిశ్చయించెను. తొలుత నాతఁడు హఠ

యోగమును సాధించినాడు. తన యనుభవమును సచ్చ కునితో నిట్లనుచున్నాడు. "ఓయీ! అగ్గివేస్సనా! దంత ములపై దంతముల నొత్తి నాల్క తాపులతో హత్తి నా చిత్తమును దమించితిని. అపుడు నా కక్షములనుండి చెమట కాఱ నారంభించెను. ఒకానొక బలవంతుడైన పురుషుడు దుర్బలుడైన మనుష్యుని తలంబట్టికొని గాని, లేక భుజముల బట్టికొనిగాని క్రిందికి యెత్తునో యట్లు నేను నాచిత్తమును దమించితిని.

ఓయీ! పిదప నుచ్ఛ్వాస నిశ్వాసములు బంధించి ధ్యానము సేయ మొదలు పెట్టితిని. అపుడు నా చెవులనుండి శ్వాసము బయలుదేరు శబ్దము వినపడ నారంభించెను. కమ్మరి కొలిమి తిత్తి యూదినట్లుగా నా శబ్ద ముండెను. ఎవడో నాపాదములయొక్క చర్మమును గట్టిగా మెలివెట్టి త్రిప్పి పట్టుకొన్నట్లయ్యెడిది. కాని నాధ్యానమును వదల లేదు. కడుపునందు భరింపరాని వేదన. కసాయి వాఁడావు యొక్క కడుపుఁ గోయునట్లు యెవరో నాపొట్టను గోసిన ట్లయ్యెడిది. ఈ సర్వానుభవము లందును నా యుత్సాహము దగ్గలేదు. స్మృతి స్రగ్గలేదు. కాని శరీరము నందలి త్రాణ మాత్రము నెగ్గినదిగాదు. అయినను గష్ట ప్రదమైన యీ వేదన నా చిత్తమును బంధింపఁ జాలకపోయెను.

మూడవ ప్రకరణమునందు, శ్రమణుల నానావిధ తపశ్చర్యలను గురించి గొంత జెప్పితిమి. దానియందు హఠ యోగమును వివరింపలేదు. కాని యాకాలమునందు, హఠ యోగమును సాధించు తపస్వులు గూడఁ గొంతమంది

యుండి యుండురు. లేనిచో బోధిసత్త్వునకు యీ యోగ మును సాధించు బుద్ధి పుట్టియుండదు.

ఉపవాసము

హఠయోగమును సాధించిన బుద్ధునకు దాని యం దేమియు సత్యము లేదని తెలిసినది అన్నపానములు బొత్తిగ వదలుట, యాతనికి గిట్టలేదు. అందుకై యల్పముగఁ దిన మొదలుపెట్టెను. తన యీ యనుభవమును 'సచ్చకుని' తో నిట్లుఁ జెప్పినాడు "ఓయీ! అగ్గివేస్సనా! నేను కొద్దికొద్దిగ నాహారము దిన మొదలిడితిని. కొన్నిరోజుల కాహారము వదలి వేరులకషాయమును మాత్రమే సేవింప నారంభించి తిని. అదిగూడ జాలకొలఁదియే. నా శరీర మెక్కువగ కృశించిపోయెను. అస్సీతక, కాలవల్లుల, గ్రంథులవలె నా యంగసంధులు స్పష్టముగ గనుపింపఁదొడగెను. నా కటి బంధ మొంటె కాలంత యైనది. పాటువడిన యింటి వాస ముల వలె నా మీఁగాళ్ళయ్యెను. లోతైన చిన్నబావిలో పడిన నక్షత్రముల వలె నా కనుగ్రుడ్లు, కన్నులలో నెక్కడో మెరయుచుండెడివి. చేదుసొరకాయను గోసిన దాని నుండి రస మెట్లు జొట, జొట గారునో యట్లే నా పాదముల నుండి చర్మము వ్రేలాడుచుండెను. కడుపుపైన చేయి వేసికొన్నప్పుడు, వెన్నెముక దగులుచుండెడిది. వెన్నెముక నంటికొన్నప్పుడు పొట్టయొక్క చర్మము చేతికి వచ్చెడిది. వెన్నెముకయు, పొట్ట చర్మమును రెండును యేకమైపోయినవి. మల మూత్రముల విసర్జించుట కేగినప్పుడు, నే నక్కడనే పడి

యుండువాఁడను. నా శరీరముపై చేయి వేసిన, దుర్బలము లగు రోమములు వాని యంతట వే రాలిపడిపోవును.

## వితర్కములపై నధికారము

బోధిసత్త్వుఁ డేడువర్షములు దప మొనర్చిన ట్లున్నది. ఈ ఏడు వర్షములు కేవలము, దేహదండనమున కే యాతఁడు శ్రమించెననియు, మనస్సునందు వేఱుయూహాయే లేదనియుఁ దలచుటకు వీలు లేదు. పై నుదహరించిన మూఁ డుపమలఁబట్టి, కామవికారములు బూర్తిగ నష్టమొనర్చికొనుటకై నానా విధములఁ గాయక్లేశములఁబడవలసిన యవసరము లేదని యాతని కర్థమైనట్లు స్పష్టమేగదా! అవేగాదు. అటువంటి యాలోచన లెన్నో యాతని మనస్సునం దుండెడివి. వానిలోఁ గొన్నిటి నీ క్రింద జేర్తుము.

మజ్ఝిమ నికాయములోని 'ద్వేధావితక్కసుత్త' మందు భగవానుఁ డిట్లనుచున్నాఁడు.

"భిక్షువులారా! నాకు సంబోధముఁ బ్రాప్తింపక మునుపు బోధిసత్త్వుఁడుగనే యున్నప్పుడు నామనస్సునందు, వితర్కముల రెండుభాగములు గావింప విచారముగలిగెను. వెంటనే గామవితర్కము (విషయవితర్కము), వ్యాపాదక వితర్కము (ద్వేషవితర్కము), విహింసా వితర్కము (తనకు గాని యితరులకు గాని హింసగల్గింపకుండుట) యీ మూఁడు వితర్కములను జేర్చి యొకభాగము జేసితిని. నైష్కర్మ్యము (ఏకాంతవాసము), అవ్యాపాదము (మైత్రి), అవిహింస (కష్టము నీకుండు బుద్ధి) ఈ మూఁడు వితర్కములు రెండవ

భాగముగనొనర్చితిని. నే నెంతయో జాగ్రత్తతో, దక్షతతో వర్తించుచుంటిని. అయినను మొదటి మూఁడు వితర్కలలో నేదేని యొకటి నామనస్సును దారాడుచుండెడిది. అపుడు నే నిట్లూహించితిని. "ఈ దుష్ట వితర్కములు నా యెదలోఁ బుట్టుచున్నవి. ఇది నా దుఃఖమునకు గాని, యితరుల దుఃఖమునకుగాని, యుభయుల దుఃఖములకు గాని, గారణములగును. ప్రజ్ఞను నిరోధించును. నిర్వాణ మార్గము నరికట్టును. ఇట్లు నేను విచారించుకొను గొలఁదియు నా వితర్కములు మనస్సునుండి మాసిపోవ నారంభించెను."

"భిక్షువులారా! శరదృతువునం దెక్కడజూచినను సస్యములు బాగుగ ఫలించియుండును. అప్పుడు బసుల కాపరి యెంతో జాగ్రత్తగఁ బసులను గనిపెట్టి యుండును. పశువులు బొలముల సమీపించునపుడు గట్టెతో వానిని దోలుకొని వచ్చును. లేకున్నచోఁ బసులు యితరుల పొలము లందుఁబడును. దానికై కాపరి శిక్ష ననుభవించవలసి వచ్చును. ఈ విషయము వానికి జక్కఁగాఁ దెలియును. అట్లె గామవ్యాపార విహింసాదికము లకుశలమనోవృత్తులనియు, భయావహము లనియు, నా కెఱుకయే.

అపుడు నే నెంతయో జాగ్రత్తగ, సోత్సాహముగఁ జరించుచుంటిని. కాని నామనస్సునందు, నైష్కర్మ్యమో, యవ్యాపాదమో, యవిహింసయో, వీనిలో నేదో నొక వితర్క ముత్పన్న మయ్యెడిది. అపుడు నే నిట్లాలోచించెడువాఁడను. 'ఈ కుశల వితర్కములు నాలోఁ బుట్టు

చున్నవి. ఇవినాకుఁగాని, యితరులకుఁగాని, యుభయులకుఁ గాని దుఃఖములు గలిగించునవిగావు. ప్రజ్ఞ నభివృద్ధినొనర్చునవి. నిర్వాణమునకుఁ గొనుపోవునవి. వీనిని రాత్రియంతయుఁ బగలంతయు యోచించినను భయమేమియులేదు. కాని యవితర మైన యోచనతో దేహ మలసిపోవును. అపుడు చిత్తమునకు స్థిరత దప్పును. అస్థిరచిత్తమునకు సమాధి దొరకదు" ఇట్లు దలఁచి, నా చిత్తము నభ్యంతరముననే స్థిర మొనర్చితిని...... వేసవిదినములు వచ్చును. లోకులు బండిన సస్యముల నిండ్లయందుఁ జేర్చికొందురు. అప్పుడు బసువులకాపరి పశువులను నిర్భయముగ బయళ్ళయందు వదలిపెట్టును. ఏ దేని చెట్టునీడ నున్నవా ? లేక బయలులో సంచరించుచున్నవా ? యనునంత వఱకే యాతఁడు గని పెట్టునది. అట్లే నైష్కర్మ్యాదికములైన కుశలవితర్కములు నాయెదలోఁ దోచినప్పుడు 'యివి కుశలవితర్కములు' యనునంతవఱకే నాస్మృతిని నిలిపి కొంటిని. వానిని నిగ్రహించుటకుఁ బ్రయత్న మొనర్పలేదు.

## నిర్భయము

బోధిసత్త్వుఁడు గుశలవితర్కముల తోడుగొని యకుశలవితర్కముల జయించెను. కాని ధార్మికుఁడైన మనుష్యుని మనస్సునం దెంతవఱకు నిర్భయత గలుగదో యంతవరకు వానికిఁ దత్త్వజ్ఞాన మశక్యము. దోపిడిగాండ్రు, సైనికులు–వీరు దమ శత్రువులపై దెగించి యొక్కుమ్మడిగఁ బడుదురు. కాని వారియందు నిర్భయత యేదీ? వారు బట్టిన యాయుధము లెంత పదునైనను, వా రెంత జాగ్రత్తగ

నున్నను మనస్సులో దిగులే. పగవా రెప్పు డేమార్చి పైఁబడుదురో యను నూహ నిముస నిముసము - దలయెత్తు చుండును. అధ్యాత్మమార్గముచేఁ గలుగు నిర్భయమే నిక్క మైనది. దానిని బోధిసత్త్వుఁ డెట్లు సాధించెనో యీ క్రింది ఘట్టము దెల్పును. బుద్ధభగవానుడు 'జానుశ్రేణి'యను బ్రాహ్మణునితో నిట్లన్నాడు. "ఓయీ! బ్రాహ్మణా! నాకు సంబోధము గలుగునప్పుడు బోధిసత్త్వుఁడుగనే యున్న ప్పుడు శ్రమణుఁడుఁగాని, బ్రాహ్మణుఁడుఁగాని పరిశుద్ధ కాయకర్మల ననుసరింపక యరణ్యమం దున్నను, వాఁడా దోషముచేత, భయభైరవుని నాహ్వానించుకొను చున్నవాఁడే యని శోచెడిది. కాని నా కర్మలు బరిశుద్ధములు. పరిశుద్ధ కాయకర్మలు గలిగి, యే సజ్జనుఁ డరణ్యమునందు వసించునో, నన్ను వానిగఁ దలఁచితిని. ఈ జ్ఞానము నాకు గలిగినదే తడవు యరణ్యము లందు భయము లేకపోయెను. ఎవడేని యొక శ్రమణుఁడు, లేక బ్రాహ్మణుఁ డపరిశుద్ధములైన వాచక కర్మల నాచరించుచున్నవాఁడై, యపరిశుద్ధములైన మానసిక కర్మలు సేయుచుఁ గళ్మలమైన యీ జీవికతో నరణ్య ముల వసించునో, వాఁ డా దోషముచే భయభైరవుని నాహ్వానించికొనును. కాని నా వాచక మానసిక కర్మలు, నుపజీవికయు బరిశుద్ధమైనవి. ఇవి బరిశుద్ధములుగ నుంచి కొన్న సజ్జనులలో నేనొక్కఁడను. ఇది నాకు దోచినదే తడవు కాననములలో నాభయ మంతరించెను.

ఓయీ! బ్రాహ్మణా! యేశ్రమణుఁడుగాని బ్రాహ్మ ణుఁడుగాని లోభియై, ప్రదుష్టచిత్తుడై, భ్రాంతమతియై,

యాలస్యము గలవాఁడై, యరణ్యముల వసించునో, యా దోషములతో వాఁడు భయముల నాహ్వానించుచునే యున్నాఁడు. కాని నామనస్సు, గామవికారములతో నలిప్తము. సర్వప్రాణులందు, మైత్రిగలది. ఎవ్వరి యెడను, దేని యెడను ద్వేషములేదు. హృదయ ముత్సాహపూర్ణము. స్థిరము, నిశ్శంకము - ఈ గుణములు గలిగి యరణ్యముల వసించు సజ్జనులలో నే నొకఁడను. ఈ విశ్వాసము నాకుఁ గలిగెను. నా భయము దొలఁగెను.

బ్రాహ్మణా! శ్రమణుఁడుగాని విప్రుఁడుగాని, యాత్మస్తుతి పరనిందలతోఁ గూడినవాఁడై, బిరికియై, మానాభిమానముల యం దిచ్ఛకలిగి యరణ్యముల వసించునో... లేక జడబుద్ధి యగునో వాఁ డా దోషములచే భయము నాహ్వానించికొను చున్నాఁడు. కాని నా యా నీదుర్గుణములు లేవు. ఆత్మస్తుతి పరనిందలు సేయను. పిరికిని గాను. మానాభిమానములపై యిచ్ఛ లేదు. ప్రజ్ఞావంతుడను. ఏసజ్జను లీగుణములతోఁ గూడికొని, యరణ్యముల వసింతురో వారిలో నే నొకఁడను. ఈ విశ్వాసము గలిగినదే తడవు, యరణ్యవాస భయము నాకు లేదయ్యెను.

బ్రాహ్మణా! చతుర్దశి- పూర్ణిమ - యమావాస్య - యష్టమి - యీ రాత్రులు భయావహములైనవి. ఈ రాత్రులలోనే యుద్యానములందు, నరణ్యములఁ దేచెట్లనీడ, లోకులు దేవతలకు బలిదాన మొనర్తురో యచ్చోట నే నొంటరిగ వసించితిని. ఏ స్థలములు భయంకరము లందురో, యా చోటుల నొంటరిగ నున్నాను. భయమనున నెట్టిదో,

జూడవలె నని నాకోరిక. ఆ సమయములందు నా ప్రక్క నొక జింక బరువెత్తినచో, నొక నెమలి చెట్లలో నురికినచో, చెట్లయాకులు గాలికి గలగలఁ గదలినచో నోహో! 'భయ స్వరూపమిదియ' యనిదలచెడువాఁడను. భయ భైరవుని జూచు, నిచ్ఛచేతనే నే నిట నున్నాఁడను. దానిని జూచు దలఁపుతోనే దాని నాశనము సేయు నిచ్ఛగూడ యున్నదని యనుకొనెడి వాఁడను. నేను సంచరించునప్పుడు భయమైనచో సంచరించుచునే నాశనము సేతును. ఆ భయము నాశమగు వఱకు నిలచుట లేదు. కూర్చొనుట లేదు. పరపుపై బండుట లేదు. నిలుచున్నప్పుడు భయమైనచో నిలచికొనియే దాని నాశనము సేయువాడను. అది నాశమగువఱకుఁ గదలుట లేదు. కూర్చొనుట లేదు; పరుండుట లేదు: పరుండునప్పుడు భయమైనచో, నేను నిలుచుట లేదు కదలుట లేదు; పండి యుండియే యా భయమున నాశనము చేయువాఁడను; పడకపై నున్నప్పుడు భయమైనప్పుడు, పడకపై నుండియే యా భయమును, దీర్చికొందును. ఇతరపనులు జేయుట లేదు.

## రాజయోగము

బోధిసత్త్వుడు కేవలము హఠయోగ తపశ్చర్యలతోను గాలముఁ గడపెననుటకు లేదు. అట్లు గడపుటయే తపస్వికిని సాధ్యముకాదు. నడుమ నడుమ నాతఁడు గొంత యన్నము దినెడివాఁడు. శరీరమునందుఁ గొంత బలము రాగానే మరల నుపవాసాదికములు సేయుట వాడుక. బోధిసత్త్వుఁ డేడు వర్షములు ప్రధానముగఁ దపశ్చర్యయే జేసినను నడుమ నడుమ గొంత యన్నము దినెననుటలో గొంత

శాంతి సమాధి సుఖము ననుభవించె ననుటలో సందేహము లేదు. హఠయోగమును విడచి తాను 'ఆనాపానస్మృతి సమాధుల' భావన నెట్లొనర్చెనో, భగవానుడే 'ఆనాపాన సంయుత్తము' యొక్క మొదటి వర్గలో నెనిమిదవ 'సుత్తము' నం దిట్లు జెప్పు చున్నాఁడు. 'భిక్షువులారా!' ఆనాపాన స్మృతి సమాధుల భావించుచున్నచో గొప్ప లాభము గలదు. వీని నేరీతిగ నైనను సరే భావింపుఁడు. అది లాభకారి. ఒకానొక భిక్షువు వరణ్యమునందుఁ జెట్టునీఁడనో లేక వేఱొక యేకాంతస్థలమందో బద్ధాసనస్థుడై యుండు ననుకొందము. వాడు దీర్ఘములైన యుచ్ఛ్వాసముల దీసికొనుచున్నచో, దీర్ఘోచ్ఛ్వాసములఁ దీసికొనుచున్నాఁడని తెలిసికొందము. దీర్ఘ నిశ్వాసముల విడచుచున్నచో నిడుదయూర్పులఁ విడచుచున్నాఁడని దెలిసికొందుము. హ్రస్వోచ్ఛ్వాసముల దీసికొనుచున్నచో నిత్యాది* ......

ఇట్లు "ఆనాపాన స్మృతి సమాధుల" భావన సేసినచో గొప్ప లాభమున్నది. భిక్షువులారా! నేను గూడ బోధిసత్త్వుడుగ నున్నప్పు డీభావననే బహుధా గావించితిని. దానిచే నా శరీరమునకుగాని, గన్నులకుగాని కష్టము గలుగ లేదు. నా చిత్తము పాప విచారములనుండి విడివడి యుండెడిది.

పై కథచే బోధిసత్త్వుఁడు నిరంతరము హఠమునే సాధింపలేదని దెలియును. నడుమ నడుమ నతఁడు శాంత

* విశేష విషయములకై 'సమాధి మార్గము' పుట 38-48 జూడుఁడు

రాజయోగములఁగూడ నవలంబించెను. దానితో సమాధా
నము గలుగుచుండెను.

## ధర్మమార్గము యొక్క యవలంబము

ఈ రీతి సమయాంతరములతో హఠయోగ – రాజ-
యోగములు, ఉపవాస మితాహార సేవనములు, మొదలైన
సాధనలు, గావించుచున్న బోధిసత్త్వునకు మనస్సు నం
దొకానొక నిశ్చయ మేర్పడెను. తపశ్చర్య నిరర్థకమని
యాతనికిఁ దెలిపోయెను. దీనితో ముక్తి దొఱుకదు వెంటనే
యాతఁడు వీనిని వదలిపెట్టి సంపూర్ణముగ ధ్యానమార్గ మవ
లంబించెను. "మహాసచ్చక సుత్తమం" దా యనుభవ
మిట్లున్నది.

బుద్ధుడు సచ్చకునితో నన్నాడు "ఓయీ! అగ్గి
వేస్సనా! నా తండ్రి పొలమున బని సేయునప్పుడు, జంబూ
వృక్షము యొక్క శీతలచ్ఛాయయందుఁ గూర్చొని ప్రథమ
ధ్యానమును సాధించుచున్నప్పు డదియే తత్త్వమార్గ మని
నాకుఁదోచెను. పదార్థముల యపేక్షలేక వాని యుపభోగము
లేక యకుశల విచారముల లేక లభించెడు సుఖముయొక్క
స్వభావమును నే నెంతని వర్ణింతును? ఈ సుఖమును నేను వదల
రాదని యను కొంటిని. కాని యా యానందము బక్కచిక్కిన
శరీరమునకు లభింపదు. వెంటనే కొంతకొంత యన్నముఁ దిన
మొదలిడితిని. అపుడు భిక్షువు లైదుగురు నాసేవ సేయుచు
నావద్దనుండిరి. నాకు జ్ఞానోదయ మైనపుడు దానిని వారి కుప

దేశింతునని వారి యాశ. నేను తపస్సునువదలి యన్నము దిన మొదలు పెట్టినప్పుడు, వీఁడు దపోభ్రష్టుడై యన్న-పానము లకు మఱగెనని నన్ను నిరసించి వారు వెడలిపోయిరి.

అయినను బోధిసత్త్వుని నిశ్చయము చలింపలేదు. తపశ్చర్యను వదలి ధ్యానమార్గము చేతనే తత్త్వమును సాధింప వచ్చునని యాతని తీవ్రనిశ్చయము.

మారయుద్ధము

బుద్ధ చరిత్రాదిక గ్రంథము లీఘట్టమును జాల రోచకముగ వర్ణించినవి. వానికి మూలము 'సుత్తనిపాతము' లో 'పధానసుత్తము' నందున్నది. దాని భాషాంతరీకరణ మిాక్రిందిది.

1. 'నైరంబన' నదియొడ్డున దపశ్చర్య నారంభించి నిర్వాణప్రాప్తికై గొప్ప యుత్సాహముతో ధ్యానము సేయు చుంటిని.

2. మన్మథుడు గరుణ నొన్నట్లు నాదగ్గఱకువచ్చెను. 'నీవు జాలగృశించితివి. శరీరము కాంతిదప్పినది. నీకు జావు దగ్గఱనే యున్నది.'

3. వేయి యత్నములు సేసినను నీవు జత్తువు. ఓయీ! పెద్దమనుష్యుడా! నీవు బ్రతుకుము జీవించుట యుత్తమము జీవితములోఁ బుణ్యకర్మ లొనర్తువు.

4. బ్రహ్మచర్యమును నడపుట, యగ్నిహోత్రమును. బూజించుట, యీ రెండును బుష్కలపుణ్యమునకుఁ గారణములు. ఈ నిర్వాణమునకైన యత్న మెట్టిదనుకొన్నావు?



5. నిర్వాణమార్గ మత్యంతకఠినము దుర్గమము. యీ మాట లని మారుఁడు బుద్ధుని యెదుట నిలిచెను.

6. మారునితో భగవంతుఁ డన్నాఁడు: 'నీవు గుండెలేని మనుష్యులకు మిత్రుడవు, పాపివి. నీ విట కెందుకు వచ్చితివి?

7. నీవు జెప్పునట్టి పుణ్యము నాకు గాఁబట్టదు. అట్టి పుణ్యముపై యిచ్ఛ యెవరి కుండునో వారికి నీమాటలు జెప్పుము.

8. నాకు శ్రద్ధ గావలెను. వీర్యము గావలెను. ప్రజ్ఞ గావలెను. అందుకై నేను నాధ్యేయముపై చిత్త ముంచియున్నప్పుడు 'జీవింపుమ'ని యెందు కీయుపదేశము ?

9. నదీప్రవాహము నీవాయువు శుష్కింపఁ జేయఁగలను. కాని ధ్యేయమునందు నివిష్టమైన చిత్తముగల నా రక్తము నది శుష్కింపఁ జేయలేదు.

10. కాని నా ప్రయత్నముతో రక్తము శోషింపఁ జేయబడెను. అట్లే నాపిత్త శ్లేష్మము లనెడు వికారములును శుష్కము లగును. నా మాంసము క్షీణమైయుండిగాఁ జిత్త మధిక ప్రసన్నమై స్మృతి, ప్రజ్ఞ, యుత్తరోత్తర మభివృద్ధము లగును.

11. ఇట్లుండి యుత్తమ సుఖమునకై యత్నించుచుండ నా మనస్సు గామోపభోగములవైపు మొగ్గదు. ఇదే నా యాత్మశుద్ధి.

12. ఓయీ ! మారుఁడా ! కామోపభోగమే నీ మొదటి సేన. అరతి రెండవది. ఆకలి దప్పులు మూఁడవ సైన్యము. తృష్ణ నాల్గవసైన్యము.

13. ఆలస్య మైదవది. ఆఱవది భీతి. ఏడవది గుశంక. ఎదమిదవది యభిమానము.

14. లాభము - సత్కారము - పూజ - యివి తొమ్మిదవ సైన్యము. దుష్టమార్గముచేత సాధింపఁబడిన కీర్తి పదవది. దానికి వశుఁడై మానవుఁ డాత్మస్తుతి బరనిందల పాలగును.

15. ఓయీ ! మదనా ! ఇవి యన్నియుఁ జేరి లోకమును బ్రహరించు నీ సైన్యము. భీరువు నిన్ను జయింపలేడు. నిన్నెవఁడు జయించునో వానికే సుఖము.

16. * నా శిరస్సుపై ముంజగడ్డి ధరించుకొని వచ్చినాను. నాకుఁ బరాజయము గలిగినచో నేను జీవించుట వ్యర్థము. పరాజితుఁడై జీవించుటకంటె సంగ్రామమున జచ్చుట మేలు.

17. ప్రతిశ్రమణుఁడను బ్రాహ్మణుఁడును నీసైన్యము నందు జేరి ప్రకాశమును గోల్పోవు చున్నాఁడు. వానికి సాధుపురుషులు సాధించు మార్గము దెలయవచ్చుట లేదు.

18. నాల్గు దిక్కులయందు, మారసేన గ్రమ్ముకొన్నది. మన్మథుఁడు తన వాహనములతో సజ్జుఁడై వచ్చినాఁడు. వానితో యుద్ధముసేయుటకై నేను ముందు నడచుచున్నాను. అందుచే నన్ను వాఁడు స్థానభ్రష్టత నందింపలేదు.

---

* "సంగ్రామమునుండి బరాజితుఁడనై వెనుకకురాను" అనెడు బ్రతిజ్ఞకు స్ఫోరకముగా ముంజ గడ్డిని దలపై ధరింతురు."

19. దేవతలుగాని, మనుష్యులుగాని నీ సేనముందు నిలువశక్తులు గారు. అట్టిది నీ సేన. కాని యొక శిల మట్టి పాత్రను బగులగొట్టినట్లు నా ప్రజ్ఞాబలముతో నిన్ను పరాభవింతును.

20. సంకల్పముల వశీకరించి స్మృతిని జాగ్రుతీకరించి యనేక శ్రావకుల కుపదేశమిచ్చుచు నేను దేశదేశములు దిరుగుదును.

21. ఆ శ్రావకులు, జాగరూకులై నా యుపదేశమును బట్టి నడచి ధ్యేయమునందుఁ జిత్తము లగించి నీయిచ్ఛకు విరుద్ధముగ శోకమున కందుకొనరాని పదమునుఁ బొందుదురు.

22. మారుఁ డనెను 'ఏడు వర్షములు నిన్ను వెంటాడి నడచితిని. కాని స్మృతిమంతుడగు నీ యం దేదోసఁగునుఁ గన్పింపలేదు.

23. ఇక్క డేదియో మృదువైన పదార్థము దొరకును - తీపిపదార్థము దొరకు నను నాశతోఁ గాకి, దినుబండారము వంటి రంగుఁ గల పాషాణమ్ము దగ్గరఁ జేరెను.

24. కాని యాకాకి కేమియు లాభింప లేదు. అది వెను దిరిగి పోయినది. ఆ గాకివలెనే నేనుగూడ గౌతముని కడ నుండి వెడలిపోవు చున్నాను.

25. ఈ రీతిఁ జింతించుచున్న మన్మథుని చేతినుండి వీణ జారిపడెను. దుఃఖితుడైన మారుఁ డటనుండి యంతర్ధానమైనాఁడు.

ఈ సూత్రముల 'భాషాంతరము' లలితవిస్తరమందుఁ బదునెనిమిదవ యధ్యాయమున గావింపఁ బడినది. దీనిచే నీ సూత్రములు ప్రాచీనము లని తెలియును.

పైని చెప్పబడిన 'భయ భైరవ సుత్తము'లోని విషయమును జాగ్రత్తగ గమనించినచో, నీ రూపకముయొక్క యర్థము సులభముగా గోచరించును. మానవజాతియొక్క కళ్యాణము కొఱకై యెవఁడైనను ప్రయత్నము సేసినచో వానిని దొలుత నడ్డగించు మారసేన గామోపభోగముల వాసన. దానిని నిర్జించి ముందుకుఁ బోయి పోకమును పేయరతి యుత్పన్న మగును. తరువాత నొకలి దప్పి లొకటి వెనుక నొకటి యాక్రమించును. ఈ వాసనలు, వికారములు వీటి నన్నిటిని జయించిననేఁదప్ప కళ్యాణప్రదమైనఁ దత్వ సాక్షాత్కార మెన్నఁడును గలుగదు. కనుక బుద్ధుఁడు మరుని జయించె ననగా నీ మనోవృత్తుల నన్నిటిని జయించెనని యర్థము.

## ౦ సుజాత యొసంగిన భిక్ష

బోధిసత్త్వునకు సంబోధిజ్ఞానము వైశాఖపూర్ణిమ నాటి రాత్రి గలిగెను. ఆనాటి పగలు రెండుగంట లప్పుడు 'సుజాత' యనెడు గృహిణి యొకతె యతనికి భిక్ష నొసఁగినది. ఈ యుల్లేఖము 'సుత్తపిటకము'న నొకచోటఁ జేయఁ బడినది.* ఇక్కడదప్ప 'సుజాత' పే రెక్కడను రాలేదు.

* అంగుత్తర నికాయ ఏకకనిపాతము; 'బౌద్ధసంఘాచాపరిచయ' పు. 236 చూ.

కాని బౌద్ధుల చిత్రకళయందామె సంపాదించికొన్న స్థాన మనన్య సామాన్యమైనది. బుద్ధుని దృష్టిలో గూడ నీఘట్టముఁ జిరస్మరణీయమయ్యెను. 'చుందుఁడ'ను గమ్మరి యొసఁగిన భిక్షనుగొని బుద్ధుఁడు రోగగ్రస్తుఁడైనాడు. ఆ రోగముతోనే దనకుఁ 'బరినిర్వాణము' సిద్ధించునని బుద్ధునికిఁ దట్టినది.

తన యనంతరము లోకము 'చుందుని' నిందించునేమో యన్న యాసంకయును గల్గెను. అందుకై బుద్ధుఁ డానందునితో నన్నాఁడు. "ఏ దినమునందు నాకు సంబోధము ప్రాప్తమయ్యెనో, యా దినమున దొఱికిన భిక్షకును నేడు ప్రాప్తించిన భిక్షకును భేద మేమియు లేదు. రెండును సమానమే. ఆనందా! ఈ మాటలు చుందున కెఱిఁగించి, యాతని శాంతింప జేయుము."

## బోధివృక్షము క్రింద యాసనము

'సుజాత' యొసఁగిన భిక్షనుగొని బోధిసత్త్వుఁడు దానిని 'నైరంజన' నదియొక్క గట్టున భుజించెను. ఆ రాత్రి యాతఁ డొక పిప్పలవృక్షము క్రింద నుండెను. ఆ చెట్టు యిప్పుడు లేదు. శశాంకుఁ డను రాజు దానిని నాశన మొన ర్చెనని చెప్పుదురు. కాని యా చోటనే మొలచిన వేరొక రావి చెట్టున్నది. దాని నానుకొనియే యొక దేవళము. ఈ రెండును ప్రసిద్ధములే. ఈ చెట్టుక్రింద బోధిసత్త్వుఁడు గూర్చొని యున్నప్పుడు మరల నొకసారి మారునితో యుద్ధము జరిగెనని 'లలితవిస్తర' మనుచున్నది. 'సంయుత్త నికాయము' నందు 'సగాథావగ్గము'న మదనుఁడు బుద్ధుని మఱపింప జేయుటకై బోధివృక్షము క్రిందఁ దృష్ణ, యరతి,

రాగములను మూఁడు సైన్యముల జేర్చెనట! 'జాతకము నందలి నిదానకథ'లో మారుడు, బుద్ధుని నాలుగు వైపుల నుండి యడ్డగించెనని బ్రహ్మాండ వర్ణన మున్నది. మారుని యీ సైన్యమును చూచి బ్రహ్మాదులు బరువెత్తి పోయిరట! బుద్ధుఁ డొకఁడే నిలచెను. ఆ చోటు దనదని జెప్పుచు బుద్ధు నక్కడినుండి లేచిపోవలసిన దని మారుఁ డన్నాఁడు. ఆ స్థానము దన దనుటకై సాక్షులుగా మార సైన్యమును విని యోగించెను. సర్వదేవతలును బరువెత్తి పోవుటచే బుద్ధున కెవ్వరును సాక్ష్యము జెప్పువారు లేకపోయిరి. అపు డాయన దన కుడిచేతిని క్రింద దట్టి 'ఈ భూమియే నాకు సాక్ష్య' మనెను. వెంటనే భూదేవి విరాట్స్వరూపమును ధరించి మార సేనను బరాభవించి పంపెనని పురాణములలోవలె 'జాతకట్టకథాకారుడు' వర్ణించినాడు.

బౌద్ధ చిత్రకారు లీ ప్రసంగము నెంతయో నాసక్తితో నెన్నుకొన్నారు. రాగద్వేషములు, లోభమదమత్సరములు, యిత్యాది దుష్టమనోవృత్తులకు, మూర్తిమంతము లయిన స్వరూపముల గల్పించిన వారి ప్రజ్ఞయెంతయుఁ బొగడఁ దగినది. మొదలు కవి వర్ణించిన తరువాత యీ చాయల బట్టుకొని చిత్రకారులు జిత్రించిరో, లేక చిత్రకారుల త్రోవనుబట్టి గవి వర్ణించెనో నిర్ణయింప సాధ్యముగాదు; ఏది యెట్లున్నను, దుష్ట మనోవృత్తులకు, మూర్తిస్వరూప మిచ్చుటకై బౌద్ధ చిత్రకారులను, గవులును యత్నించిన మాట వాస్తవము.

## తత్త్వబోధము

వైశాఖ పూర్ణిమనాటి రాత్రి బోధిసత్త్వునకు సంబోధి గలిగె నంటిమి. నాటినుండి యాతఁడు బుద్ధుఁ డయ్యెను. అంతవర కాతడు బోధిసత్త్వుఁడే. బుద్ధునకు గలిగిన తత్త్వబోధ యెట్టిది? నాలుగు ఆర్యసత్యములు- దదంతర్గతమైన యష్టాంగమార్గము. అదియే యతనికిఁ గలిగిన సంబోధి. బుద్ధుఁడు వానినే దనతోడనున్న యైదుగురికి నిచ్చినాడు. ఈ ప్రసంగము పైని వచ్చును.

## విముక్తి సుఖముయొక్క యాస్వాదము

తత్త్వబోధమైన వెనుక బుద్ధభగవానుఁ డావృక్షము క్రిందనే యేడు దినములుండి విముక్తి సుఖాస్వాదము గావించుచుండెను. ఆ యనుభవమునే రాత్రి మూఁడు యామము లందును క్రింద నివ్వఁబడిన ప్రకారము త్రిప్పి త్రిప్పి మనస్సునందు జ్ఞాపకపరచికొనెడివాడని 'మహావగ్గమున' గలదు. కాని సంయుక్త నికాయములోని రెండు సుత్తము లందు బుద్ధుఁడు బోధిసత్త్వావస్థలో నే యీ 'ప్రతీత్యసముత్పాద' మెఱిఁగె నని దెలుపఁబడినది.* ఈసుత్తమునకును, మహావగ్గములోని విషయమునకును మైత్రిఁ గుదురుట లేదు. మహావగ్గను వ్రాయుకాలమున నీ 'ప్రతీత్య సముత్పాదము'నకు గొప్ప గౌరవ ముండెనని దోచుచున్నది. నాగార్జునునివంటి మహాయాన పంథకు జేరిన యాచార్యు

* నిదానవగ్గసంయుత్త, సుత్త 10 మఱియు 65, చూ.

లీప్రతీత్య సముత్పాదమునే దత్త్వజ్ఞానమున కాధారభూత ముగ నొనర్చి కొన్నారు. *

ప్రతీత్య సముత్పాదము

సంక్షేపముగ దీని స్వరూప మిట్టిది. అవిద్యనుండి సంస్కారము — దానినుండి విజ్ఞానము. విజ్ఞానమునుండి నామ రూపములు, వానినుండి షడాయతనము. దానివలన స్పర్శ. స్పర్శనుండి వేదన. వేదననుండి తృష్ణ. తృష్ణనుండి యుపా దానము. దానివలన భవము. భవమునుండి జాతి (జన్మ). జాతినుండి 'జర—మరణము—శోకము—పరిదేవనము — దుఃఖము— దౌర్మనస్యము—ఉపాయాసము' ఇవి యుద్భవించుచున్నవి.

పూర్ణ వైరాగ్యముచే, నవిద్యను నిరోధించిన సం స్కారము. నిరోధింపఁబడును. సంస్కార నిరోధముచే విజ్ఞాన నిరోధము. దీని యడ్డగింత నామనిరోధ హేతువు.

నామరూపముల నిరోధముచే షడాయతనముల యడ్డ గింత సిద్ధించును. షడాయతన నిరోధము, స్పర్శ నిరోధ హేతువు. స్పర్శ నడ్డగించిన 'వేదనఁ దొలగును' — వేదనఁ దొలఁగిన తృష్ణా నిరోధమే. తృష్ణఁదొలఁగిన యుపాదానము వెంటనే దొలఁగును — ఉపాదాన నిరోధము భవ నిరోధ కారణము; భవనిరోధముచే జన్మనిరోధము. జన్మనిరోధ ముచే జరా — మరణము — శోకము — పరిదేవనము — దుఃఖ దౌర్మనస్యములు—ఉపాయాసము వీని నిరోధములు సిద్ధించు చున్నవి.

---

* మధ్యమకారికారంభమున చూ:

దుఃఖము వెనుక నింత దొడ్డకారణపరంపరను జోడించుటచే సామాన్యజనులకు, దీనిని నిగ్రహింపఁ గష్టమయ్యెను. పోను పోను యీ 'ప్రతీత్య సముత్పాదము' గహన తత్త్వజ్ఞానస్వరూపమై కూర్చొన్నది. దీనిపై ననేక వాదోపవాదములు. నాగార్జునుఁడు దన 'మాధ్యమక కారిక' యీ ప్రతీత్య సముత్పాదము నాధారముగఁ గైకొని వ్రాసినాఁడు. బుద్ధఘోషాచార్యులు దన 'విశుద్ధి మగ్గము' నందలి యేక షష్ఠాంశభాగము దీని వివేచనముకై ఖర్చుపెట్టెను. ఈ చర్చనంతయు జదివినచో విద్వాంసులే దిక మక లాడుదురు. ఇక సామాన్యజనుల కీ తత్త్వమేమి తెలియును? బుద్ధభగవానుని ధర్మము, బ్రాహ్మణులు, క్షత్రియులు, మొదలైన యుచ్చ వర్గములయందు కంటె, దగ్గుజాతి జనులయం దెక్కువ వ్యాపించుట యీ తత్త్వముల మూలమున గాదు. నాలుగార్య సత్యముల తత్త్వజ్ఞానము సులభముగ నుండే యర్థమాటచేత నే; ఆర్య సత్యముల తత్త్వము సర్వజనులకు రుచించె ననుటలో వింత లేదు. వాని స్వరూపము పైన వివరింతుము.

## బ్రహ్మదేవుని వినతి

తత్త్వబోధ గలిఁగిన పిదప బుద్ధుఁ డొకసారి బోధి వృక్షము క్రింద కూర్చొనెను. మరియొకతడవ న్యగ్రోధ వృక్షముక్రిందను, మూఁడవసారి ముచిళింద వృక్షము క్రిందను, నాల్గవతడవ రాజాయతన వృక్షముక్రింద కూర్చొని మరల భగవానుడు 'అజపాల' వృక్షముక్రిందికి వచ్చెను. అపు డాయన దలఁచెను. 'నే నీధర్మము నెంతో గష్టపడి

దెలిసికొంటిని. దీనిని లోకుల కుపదేశించుట బహు ప్రయాస సాధ్యమైనది.' ఈ విచారమును బ్రహ్మదేవుడు దెలిసికొన్నాడు - ప్రపంచమునకు బ్రహ్మోపదేశ మొనర్చుటకై యాతఁడు బుద్ధుని ప్రార్థించెను. ఈ కథ 'మహావగ్గ' 'మధ్యమ నికాయ' - అరియ పరియేసన సుత్తములందు సవిస్తరముగ వర్ణింపఁబడినది. బుద్ధున కీ మనోధర్మ మెప్పుడును లేదు. ఎవఁడో ఛాందసుడొకఁ డీ కథను బుద్ధుని జీవితముతో ముడి వెట్టియుండును. అది క్రమక్రమముగా గౌతమబుద్ధుని చరిత్రలో జోటు జేసికొన్నది. ఈ రూపక కల్పనలోని యర్థము నాచే రచింపబడిన 'బుద్ధధర్మము - మఱియు సంఘము'- (Page 16 To 19) యను పుస్తకమున జర్చించితిని. దాని నిట పునరుక్తము సేయబోను.

## పంచవర్గీయ భిక్షుల కుపదేశించు ప్రయత్నము

తనకుఁ బ్రాప్తమైన యీ నాలు గార్యసత్యముల జ్ఞానమును దొట్టదొలుత నెవనికైన యుపదేశింపవలయునని బుద్ధున కిచ్ఛ గలిగెను. 'ఆళార కాలాముఁడు, ఉద్దకరామ పుత్తుఁడు' వీరు జీవించి యుండినచో వారి కీ మార్గ మెంతయో రుచించి యుండెడిది. కాని వారంతకు ముందే గతించిరి. అందుచే భగవంతుఁ డొకప్పుఁడు దన తోడనున్న 'పంచవర్గీయ' భిక్షువులకు దీని నుపదేశింప నెంచెను. ఆ భిక్షువు లప్పుడు గాశీ సమీపములోని 'ఋషిపత్తనము' నం దుండిరి. భగవంతుఁ డచటికి బ్రయాణమైనాఁడు. మార్గమధ్యమున 'ఉపకుఁడ'ను నా జీవిత శ్రమణుని గాంచిన బుద్ధుఁడు దనకు కుఁదత్త్వబోధ గలిగిన దని వచించెను. కాని యాశ్రమణునకు

విశ్వాసము గలుగలేదు. 'కావచ్చును' లెమ్మని వాఁడా మార్గమును వదలి వేఱు త్రోవఁ బట్టినాఁడు. ఈ సందర్భముతో వేరు సంప్రదాయములకుఁ జెందిన శ్రమణులకుఁ దన మార్గ ముపదేశింపఁ బూనుకొనుట నిరర్థక మని బుద్ధునకుఁ దోచినదేమో !

## పంచవర్గీయులకు బోధ

ఆషాఢ పూర్ణిమకు ముందే భగవంతుఁడు గాశిని జేరినాఁడు. ఆతఁడు ఋషి పత్తనమునుఁ బ్రవేశించెను. పంచవర్గీయులు బుద్ధుని దూరము నుండియే జూచినారు. ఆతని కాదరసత్కారములు సేయఁగూడ దని వారు నిర్ణయించుకొనిరి. కాని బుద్ధుఁడు సమీపించుకొలఁదియు వారి పట్టుదలయు సడలిపోయినది. వారు బుద్ధున కాదర సత్కారములు గావించిరి. కాని యాతని నవీన ధర్మమును విని, యనుసరించుటకుఁ దయారు గా లేదు.

"నే నొక నవీన ధర్మమార్గమును గనుగొంటిన"ని బుద్ధుఁడు వారితో నన్నాఁడు. వా రనిరి: "చిరంజీవీ ! గౌతమ ! నీవు కఠోర తప స్సొనర్చిన రోజులు మేము జూచితిమి. అప్పుడే నీకు సద్ధర్మమార్గబోధ గలుగలేదు. నేఁ డన్ననో దపోభ్రష్టుడవై యన్న-పానముల రుచులకు మరగితివి. నీకు సద్ధర్మబోధ యెట్లు గలిగియుండును ?"

బుద్ధుఁ డుత్తరమిచ్చెను: "భిక్షువులారా ! నే నింతకు ముం దెన్నఁడైనను నాకుఁ దెలియనిదానిని దెలియునని నటించి యుంటినా ! ఈ నమ్మకము మీ కున్నచో నా

మాట వినుఁడు. అమృతత్వమార్గము నా కెఱుక పడ్డది. ఆ త్రోవ ననుసరించిన మీకు సులభముగ విముక్తి గలుగును ”

ఈ రీతి యా పంచవర్గీయులకు, బోధించి-బోధించి, కాలక్రమమున దన ధర్మమును విను నట్లొ నర్చికొన్నాఁడు. అపుఁ డాత డొనర్చిన బోధకే 'ధర్మచక్ర ప్రవర్తనమ'ని పేరు. ఈ సూత్రము 'సచ్చ సంయుత్త' మందలి రెండవ వర్గలోను, వినయ గ్రంథములలోని 'మహావగ్గము' నందును వచ్చెను. దీని సంస్కృతీకరణము 'లలితవిస్తర' మందుఁ గూడఁ గలదు. పాలీ సుత్తముల భాషాంతరీకరణ మీ క్రింద నిత్తును.

## ధర్మచక్ర ప్రవర్తన

'ఇట్లు నేను వింటిని'. భగవానుఁడు వారణాసిదగ్గఱ నున్న 'ఋషిపత్తనమం' దున్న మృగవనములో నుండెను. అపు డాయన పంచవర్గీయ భిక్షువుల నుద్దేశించి యిట్లనెను. "భిక్షువులారా ! ధార్మిక మనుష్యుఁడు (ప్రవ్రజితుఁడు) యీ రెండుబంధము లందును బడరాదు ఆ రెండు బంధము లేవి? కామోపభోగములందు సుఖమున్న దనుకొనుట మొదటిది ఇది హీనము- గ్రామ్యము - సామాన్యజన సేవితము. అనార్యము - అనర్థావహము. రెండవది: దేహదండన మొనర్చి కొనుట. ఈ బంధము దుఃఖకారకము. అనార్యము. అనర్థావహము. ఈ రెంటి యందును, దగు లొకొనక తథాగతుఁడు జ్ఞాన చక్షు రుస్మీలన హేతువును, నుపశమము- ప్రజ్ఞ-సంబోధము-నిర్వాణము వీనికి గారణ భూతమైనదియు నగు మధ్యమ

మార్గమును శోధించిగనుగొనెను. అది యెట్టిది ? సమ్యక్దృష్టి-సమ్యక్సంకల్పము - సమ్యగ్వాక్కు - సమ్యక్కర్మాంతము-సమ్యగాజీవము - సమ్యగ్వ్యాయామము- సమ్యక్స్మృతి-సమ్యక్సమాధి యివే యార్యుల యష్టాంగిక మార్గములు."

"భిక్షువులారా! దుఃఖమునకు ముందున్న యార్య సత్యము లివే!! జన్మ, జర, వ్యాధి, మరణములు దుఃఖకారకములు. అప్రియుల తోడి సంయోగము, ప్రియుల తోడి వియోగము దుఃఖకారకము. ఇచ్ఛించిన వస్తువు దొఱకకుండుట దుఃఖకారకము. సంక్షేపముగఁ జెప్పినచో, నయిదైన యుపాదాన స్కంధములు దుఃఖకారకములే.*

"భిక్షువులారా! అది మాటిమాటి కుత్పన్న మవునది. అనేక విషయములందు రమించునది. తృష్ణ మూడు రీతులు. కామ తృష్ణ, భవ తృష్ణ, వినాశ తృష్ణ.

దీనినే దుఃఖ సముదయ మందురు. ఇదే యార్యుల రెండవ సత్యము.

ఈ తృష్ణను వైరాగ్యముతోఁ బూర్ణముగ నిరోధించుట, త్యాగము సేయుట, దానినుండి పూర్తిగ విడివడుట, యిది దుఃఖ నిరోధ మనెడు యార్యుల మూడవ సత్యము.

పైని జెప్పఁబడిన యష్టాంగిక మార్గము దుఃఖ నిరోధగామి. దానికి 'ప్రతిపద' యని పేరు. అది యార్యుల నాల్గవ సత్యము.

---

* స్కంధము లైదు. వాసనామయము లవి. అగుటచే నుపాదాన స్కంధములందురు. 'బుద్ధధర్మ ఆణిసంఘ' 90-91 చూ.

(క) ఇది దుఃఖము కదా! యని దెలిసికొన్నప్పుడే నా కభినవ దృష్టి యుత్పన్న మయ్యెను. జ్ఞాన ముత్పన్న మయ్యెను. విద్య జనించెను. ఆలోక ప్రసార మయ్యెను. ఈ దుఃఖము తెలియుటకు, యోగ్యమైన దని నేను తెలిసికొన్న పుడు నా కభినవ దృష్టి యిత్యాది ... ఈ దుఃఖమును నేను తెలిసి కొంటిని. అందుచే నాకు అభినవ దృష్టి .........

(ఖ) 'ఈ దుఃఖ సముదయ మార్య సత్యము' యని నే నెఱిఁగితిని. ఇది త్యాజ్యమని గ్రహించితిని. ఏది త్యజింపఁ దగినదో యది నే నెఱిఁగితిని. అప్పుడు నా కభినవ దృష్టి...

(గ) నా దుఃఖ నిరోధ మార్య సత్యమని నే దెలిసికొంటిని. దాని సాక్షాత్కరింప జేసికొనుట నాకుఁ దగిన దను కొంటిని. దాని సాక్షాత్కారము నా కయ్యెనని యెఱిఁగితిని. అందుచే నా కభినవ దృష్టి.........

(ఘ) ఇది దుఃఖ నిరోధ గామిని యైన 'ప్రతిపద' యను నార్య సత్యము యని నేను దెలిసికొంటిని. అది యభ్యసింప దగిన దని నే నెఱిఁగితిని. దాని యభ్యాస పద్ధతి నెఱిఁగితిని. అప్పుడు నా కభినవ దృష్టి యేర్పడెను. జ్ఞాన విద్యాలోకము లుత్పన్నము లయ్యెను. ఎంతవరకు మూఁడు ముడులై ప్రత్యేకముగఁ బండ్రెండు విధములైన యార్యసత్యముల జ్ఞానము నాకు లభింపలేదో, యంతవరకు సంబోధము గలుగ లేదు."

బుద్ధుఁ డొసర్చిన యనేకము లుపదేశములు 'సుత్త పిటకమున' గలవు. కాని యాతని ధర్మమున కాధార మే దన్నచో, నీ యార్య సత్యమే. ఒక 'సచ్చసంయుత్త' మందే

యీ నాలు గార్య సత్యముల వివరణమునకై నూటముప్పది రెండు 'సుత్తములు' ఖర్చు పెట్టఁ బడినవి. ఇతర నికాయము లందును, వీని యుల్లేఖము మాటి మాటికి వచ్చును. బుద్ధుని సమస్తములైన యుపదేశములును యీ నాలుఁగు 'ఆర్యసత్యము' లను బునాది పైననే నిలబడినవి. అందుచే వీని మహత్తు గొప్పది. పైని జెప్పబడిన విషయములలో (క) నుండి (ఘ) వరకు వచ్చిన వివరము 'సచ్చసంయుత్త' మందలి యొక సుత్తము లోనిది. 'మహావగ్గ' మందును నిదే గలదు. ఇతర బౌద్ధవాఙ్మయమందు లేదు. కనుక యీ విషయములు తరువాతి వారెవరైన సుత్తముల లోనికిఁ జొనిపిరా! యని సందేహము. కాని యీ విషయములు నాలుగు 'ఆర్యసత్యము' ల యొక్క స్పష్టీకరణమునకుఁ బనికి వచ్చుటచే వాని నిట వివరించితిని.

## నాలుగు ఆర్యసత్యముల స్పష్టీకరణ

ప్రపంచమున దుఃఖమున్నది. ఈ సిద్ధాంతము నెవ్వరు గాదనుటకు వీలులేదు. కాని ప్రతి యొక్కనికి, దన దుఃఖ మెట్లు పోవు ననియే చింత. దాని పరిణామ మెట్లగు ననగా నేదో యొకరీతి ప్రతి యొకఁడును దనకు సుఖము దక్కిన చాలు ననుకొనును. ఇతరులను నొప్పించుటకుఁ గూడ వెను దీయఁడు. కనుక హింసకుఁడైన వాఁడు, బుద్ధిమంతుఁ డైన వాఁడు, యగ్రేసరుఁడై, యితరులను దన వశమం దుంచి కొనును. ఈ హింసక బుద్ధి చేత నగ్రేసరులైన వారిలోను యేకవాక్యత గుదురదు. అందుచే వారిలోఁ గూడ నెక్కువ హింసాత్మక బుద్ధిమంతుఁడు రాజై, దక్కినవారిని దన చేతి

మీఁద నడిపించును. ఆ రాజునకుఁగూడఁ దన రాజ్యము నితరు లెవ్వరైన యాక్రమింతురేమో యను భయము. అందుచేఁ దాను సురక్షితుఁడుగ నుండుటకై, యజ్ఞ యాగాదు లొనర్చును. వాని యందు, బలి దప్పదుగదా! ఈ రీతిగ మనుష్యులకును యితర ప్రాణులకును, నుపద్రవ కారకమైన సమాజ రచన, నాశ మొనర్పవలెను. దాని చోట సర్వులకు హితమై, సుఖకరమైన సమాజమును స్థాపింప వలెను. తన దుఃఖము వంటిదే యితరుల దుఃఖము గూడ నని ప్రతి యొక్కఁడు నవశ్యము దెలియవలెను. ఈ యూహలతో, బుద్ధుఁడు ప్రాచీనములైన యార్య సత్యములందు, సర్వ సాధారణములైన దుఃఖములను జోడించెను.

జన్మ మరణాదికములైన సర్వసాధారణ దుఃఖములను శ్రమణులు గమనించిరి. అంతేగాదు. వానిని నాశ మొనర్చుటకే వారి దపస్సు. కాని దుఃఖ కారణ మేది? యనుట యందే వారి మతభేదము. కొందరు దుఃఖము దానే గల్పించుకొను (సయంకతం దుఃఖం) ననిరి. కొందరు బరులనుండి వచ్చు (పరకతందుఃఖం) నన్నారు. మూఁడవ తెగవారు దన నుండియుఁ, బరులనుండి దుఃఖములు (సయంకతంచ, పరకతంచ దుఃఖం) ప్రాప్తించు ననిరి. నాల్గవ తెగ యొకటి యున్నది. వారి యూహలో దుఃఖ మన్యకృతము గాదు; పరకృతము గాదు. అది యాకస్మికము. (అసయం కారం-అపరం కారం-అధిచ్చ-సముప్పన్నం దుఃఖం).*

---

* నిదానవగ్గ సంయుత్త, వర్గ 2, సుత్త 7 చూ.

వీరిలో మొదటి తరగతి శ్రమణులు జైన నిర్గ్రంథులు మొదలైనవారు. 'పూర్వజన్మమునందుఁ బాప మొనర్చుటచే దుఃఖ ముత్పన్న మైనది. దాని పరిహారార్థమై దేహమును శిక్షించి, యాత్మను గష్టపెట్ట వలెన'ని వారి యూహ. రెండవ తెగవారు, సాంఖ్యాదులు. 'వారు జడప్రకృతి నుండి, దుఃఖ ముత్పన్నమైనద'ని దలఁతురు. ఆత్మను ప్రకృతి యొక్క బాధనుండి విడిపించుటకై కఠిన తపము సేయుదురు. మూడవ తెగ శ్రమణులు. 'ఆత్మ-ప్రకృతి యీ రెండును, మిళితమై, దుఃఖమును గలిగించున'ని ప్రతి పాదింతురు. ఆత్మను ప్రకృతినుండి వదలించుటకై వీరి తపస్సు. నాల్గవ తెగ శ్రమణులు దుఃఖ మాకస్మిక మని దలఁచుటచే వారి దొక రీతిగా, నక్రియావాదము. ఈ రీతి శ్రమణులు - యే సంప్రదాయము ననుసరించినను దపస్సు నంగీకరింతురు. లేక నిష్క్రియు లగుదురు. కాని వీరితో సమాజమునకు గలుగు ప్రయోజనము జాల యల్పము.

'దుఃఖమునకు నిజమైన కారణ మాత్మగాదు.' ప్రకృతియు గాదు. మానవుని తృష్ణయే దుఃఖకారణము. ఈ సిద్ధాంతము బుద్ధునిది. దీనిని మొట్టమొదలుత లేవదీసినవాఁడాతఁడే. పూర్వజన్మము నందలి తృష్ణ, లేక యీ జన్మము లోని తృష్ణ - వీనితోనే సమస్తదుఃఖములు గలుగుచున్నవి. తృష్ణ యెట్లు బుట్టినది? ఈ ప్రశ్న నిరర్థకము. తృష్ణ యెంత వరకుండునో, యంతవరకు దుఃఖ ముండితీరును. ఇది రెండవ యార్య సత్యము.

తృష్ణా నాశముతోనే మనుష్యుఁడు దుఃఖమునుండి విముక్తుఁడగును. ఇది మూడవ యార్య సత్యము.

తృష్ణా నాశమున కుపాయ మేమి? రెండు బంధముల యందును జిక్కికొనక మధ్యేమార్గమున నడచు నార్యమైన యష్టాంగిక మార్గము. ఇది నాల్గవ సత్యము.

## అష్టాంగికమార్గముయొక్క స్పష్టీకరణము

ఈ యష్టాంగిక మార్గమునకు మొదటి సోపానమే సమ్యగ్దృష్టి. సమ్యగ్దృష్టి యనగా, నాలు గార్యసత్యముల యదార్థ జ్ఞానము. జగత్తున దుఃఖము నిండియున్నది. ఆ దుఃఖము మనుష్యజాతియొక్క తీవ్రతృష్ణతో జన్మించినది. తృష్ణను నాశనము సేసిన సర్వులకును, శాంతి దొరకును. పరస్పరము, కాయ - వా-జ్మనస్సులతో సదాచారమున నడచికొనుట-సత్యము బల్కుట-ప్రేమించికొనుట-హితమిత భాషణము లాడుట యీ 'ఆర్య అష్టాంగిక' మార్గమే శాంతి పంథ. ఈ సమ్యగ్దృష్టి, లోకమున వ్యాపింపనిచో నహం కార స్వార్థములు బెరిగి జగత్తున గల్లోల మేర్పడును. అపుడు శాంతి మందునకు దొరకదు.

తన యైశ్వర్యము, బలము, బెంచికొను సంకల్పము ప్రతి యొక్కనికి గల్గినచో, నపు డట్టివారితో నితరులకు, దప్పక హాని గలుగును. వానికిని హానియే. అందుచేఁ గామోపభోగ బద్ధముగాని శుద్ధసంకల్పము మనుష్యునికిఁ గావలెను. ఆ సంకల్పములుఁ బరస్పరమై మైత్రీయుతము గావలెను. పరస్పర సుఖసంపాదనా తత్పరము గావలెను.

అసత్యము, బరుషవాక్కు, బరస్పరనింద, వదరు బోతుతనము, మొదలైన యసద్వాణియే, సమాజము యొక్క గడఁబిడలకుఁ గారణము. వీనితో పరస్పరనింద లారంభమై హింసజనించును. కనుక సత్యభాషణము, పరస్పరసౌఖ్యమును సాధించు ప్రియమిత భాషణము గావించుట యోగ్యము. ఇదియే సమ్యగ్వాక్కు.

ప్రాణఘాతము, దొంగతనము, వ్యభిచారము, యిత్యాదులు, శరీరముతో నొనర్తుము. వీనితో సమాజమున గొప్పయనర్థము గల్గుచున్నది. వీనినుండి విడివడి యలిప్తుడై లోకకళ్యాణ కారకములైన కాయకర్మలే సేయవలెను. ఇదియే సమ్యక్కర్మాంతము.

సమ్యగాజీవనమనగా – సమాజమున కపాయము గలిగింపని రీతితో, జీవనము నేర్పాటు సేసికొనుట. ఒకగృహస్థుఁ డున్నాఁడనుకొందము, మద్యవిక్రయము, బశువులనమ్ముట, వ్యాపారము మొదలైన వ్యవసాయములతో వాఁడు జీవింపవచ్చును. కాని యీ జీవికతో సమాజమున కపకారమున్నది. అట్టివ్యవసాయముచువర్జించి, శుద్ధ సరళవ్యవహారములతోఁ దనజీవనము గడపికొనుటయే సమ్యగాజీవనము.

ఏ విచారములు, దుష్టములో, మనస్సునబారాడఁ గూడనివో, వానికెదలో నవకాశ మివ్వరాదు. ఒకవేళ నవి ప్రసరించినచో వాని నాశనము సేయవలెను. కళ్యాణకారకములైన భావములను, మనస్సున జనింపఁజేసికొనవలెను. జనించిన వానినిఁ బోదిసేసికొనవలెను. వానిని పరిపూర్ణత

నందింపవలెను. ఈ నాలుగు మానసిక ప్రయత్నములకే సమ్యగ్వ్యాయామమని పేరు.

శరీర మపవిత్రమ పదార్థములతోఁ గల్పింపఁబడిన దను వివేకమును సదా జాగ్రత మొనర్చికొనుట, శరీరమందలి సుఖదుఃఖరూపములైన వేదనలను మాటిమాటి కవలోకించుటఁ, దన చిత్తముయొక్క పోకడను గమనించి, యింద్రియములు, యింద్రియార్థములు వీనిలో నేవిషయములు బంధించుచున్నవో, వాని పరాభూతికై యత్నించుట, మొదలైన మనోధర్మములు సమ్యక్స్మృతి.

తనశరీరముపై గాని మృతశరీరముపైఁ గాని మైత్రీ కరుణాదికములైన మనోవృత్తులపైగాని, పృథివ్యాది పదార్థములపై గాని జిత్తమేకాగ్ర మొనర్చి నాలుగు విధములైన ధ్యానగతులను, యనుభవించుట సమ్యక్సమాధి *

ముందుజెప్పిన రెండు బంధములందును, దగులొ్కనక మధ్యమార్గము ననుసరింపవలెను. మొదటిబంధము గామోపభోగములందు సుఖమున్న దనుకొనుట. ఇది హీనము, గ్రామ్యము, సామాన్యజనసేవితము. అనార్యము. అనర్థావహము. (హీనో, గమ్మో, పోథుజ్జనికో, అనర్యో, అనర్థ సంహితో) మనుష్యజాతి దారిద్ర్యము, యజ్ఞానము, వీనికి లోబడి మాల్గుచుండగా దాను సుఖములందు మత్తుడై యుండుటకంటెను హీనస్థితి యేమున్నది? ఈ చిత్తవృత్తి గ్రామ్యము. అనఁగా ననాగరికు లాదరించునది. ఆర్య

* ఈపదార్థములపై మనస్సు నెట్లు లగ్నముసేయుట? ఈవివరణ 'సమాధిమార్గము' నందుఁ జేయఁబడినది.

(ధీరవరులు) లనుసరింపఁ దగినది గాదు. ఇది యనర్థావహము. రెండవ బంధము దేహ దండన మొనర్చి కొనుట. దీనికి హీనము, గ్రామ్య మను విశేషణములు వాడఁ బడలేదు. కాని యిది దుఃఖ కారకము. ధీరులైన యోగ్యులకు శోభ నిచ్చునది గాదు. అనర్థావహము. (దుఃఖో అనర్యో అనర్థ సహింతో) అష్టాంగిక మార్గములోని సర్వాంగములు రెండు బంధములను దూర మొనర్చు చున్నవి.

తిని-త్రాగి 'మజా' సేయుటయే సుఖమనుట లోక దృష్టి. ఉపవాసాదికములతో శరీరమును గృశింపఁ జేయవలె ననుట తపస్వుల దృష్టి. ఈ రెంటికిని లోఁబడక మధ్యే మార్గము ననుసరించుటయే నాలుగార్య సత్యములతోఁ గల్గెడు జ్ఞానము. ఇట్లే-దక్కిన విషయముల యందును మధ్య మార్గమును బుద్ధుఁ డనుసరించె నని తెలియవలెను. *

---

* నాలుఁ గార్య సత్యముల విషయము 'బుద్ధధర్మ ఆణిసంఘ' యను పుస్తకము యొక్క మూఁడవ ప్రకరణమునఁ పుట 95-96 నివ్వఁబడినది. దానిని గూడఁ జూడుఁడు.

# ఆరవ ప్రకరణము

# శ్రావకసంఘము

## పంచ వర్గీయ భిక్షువుల విషయము

బుద్ధుఁడు దొట్టదొల్త ధర్మోపదేశ మొసఁగిన బంచ వర్గీయ భిక్షువుల విషయము 'సుత్త పిట'కమందుఁ జాల కొలఁదిగఁ గన్పడును. మొట్టమొదటి శిష్యుఁడు 'అజ్ఞాత కౌండిన్యుఁడు.' అతఁడు జిరకాలమునకు రాజ గృహమునకు వచ్చి, బుద్ధునకు సాష్టాంగ ప్రణిపాత మొనర్చె నని 'సంయుత్త నికాయము'న వంగీస సంయుత్తములో (9) నున్నది. పంచ వర్గీయులలో రెండవ వాఁడు 'అస్సజి' (అశ్వజిత్తు.) ఇతఁడు రాజ గృహమున రోగార్తుఁడై యున్న ప్పుడు భగవంతుఁ డుపదేశించె నని "ఖంధ సంయుత్తము"న 88 వ. సుత్తమున గలదు. ఇఁకఁ దక్కిన మువ్వు రెవరు? సుత్త పిటకము జెప్పుట లేదు.

జాతకములోని నిదాన కథలోను, నితర 'యట్ఠకథ'ల లోను నీ పంచ వర్గీయుల గురించి గొంత దెలియు చున్నది. దాని సారాంశ మిది——

"రామో, ధజో, లక్ఖణో, చాపి మంతీ,
కోండఞ్ఞో, చ భోజో, సుయామో, సుదత్తో,
ఏతే తదా అట్ఠ ఆహేసుం బ్రాహ్మణా
ఛళంగవా మంతం వ్యాకరిసుం.

రామ, లక్ష్మణ, మంత్రి, కౌండిన్య, భోజ, సుయామ సుదత్తులు - యీ యెనిమిది మందియు షడంగ వేదములను జదివిన బ్రాహ్మణులు. వీరందరును, బోధిసత్త్వుని భవిష్యత్తును నిర్ణయించిరి.

వీరిలో నార్గురు- బోధిసత్త్వుఁడు గృహస్థాశ్రమము స్వీకరించినచోఁ జక్రవర్తి యగు ననియు, సన్న్యాసి యైనచో సమ్యక్సం బుద్ధుఁ డగు ననియు వచించిరి. కాని వీ రెవ్వరు గాని యొక నిర్ణయమునకు రాలేదు. వీరిలోఁ గౌండిన్యుఁడు జిన్నవాఁడు. అతఁడు మాత్రము బోధిసత్త్వుఁడు సమ్యక్సం బుద్ధుఁడే యగు నని నిర్ణయించి జెప్పెను. బుద్ధుని భవిష్యత్తు రెండు పక్షములుగఁ జెప్పిన యార్గురు బ్రాహ్మణులు గృహములకు వెళ్ళిరి. వారు వారి కొడుకులతో నన్నారు. "మే మిప్పటికే వృద్ధుల మైతిమి. సిద్ధార్థ రాజకుమారుఁడు బుద్ధుఁ డైనచో నాతని జూచు భాగ్యము మాకు లేదు. విూ రైనను మఱువక బుద్ధుఁ డైనపు డాతని సంఘమున జేరుఁడు."

బోధిసత్త్వుఁడు గృహత్యాగ మొనర్చు నాటి కొక గౌండిన్యుఁడు మాత్రమే బ్రదికి యుండెను. అతఁడు పై జెప్పిన యారుగురు బ్రాహ్మణుల కొడుకుల కడకేగి "సిద్ధార్థుఁడు బరివ్రాజకుఁ డైనాఁడు. అతఁడు దప్పక బుద్ధుఁ డగును. మన మాతని వెంట బరివ్రాజకు లౌదుము గాక !" యని బలికెను. ఆ బ్రాహ్మణ కుమారులలో నల్గురు మాత్రమే - కౌండిన్యుని వచనమును మన్నించి బరివ్రాజకులై బుద్ధుని వెన్నంటిరి. కౌండిన్యునితోడి యీ యేగురే

బంచవర్గీయులన్న పేరఁ బ్రసిద్ధులు. వీరి పేరులు మహావగ్గలలిత విస్తరములలో నున్నవి. ఆ పేరులివి: కౌండిన్యుఁడు, వప్ప (వాష్పుఁడు) బద్దియుఁడు, (భద్రకుడు) మహా నాముడు, అస్సజి (అశ్వజిత్తు)

ఈ పంచవర్గీయుల విషయము గట్టుకథగాఁ గన్ప ట్టును. గౌతమకుమారుఁడు బుద్ధుఁడై తీరునన్న విశ్వాసము- గౌండిన్యునకున్నచో 'నురువేల'యందు బుద్ధునివదలి 'గాశి' కతఁడెందుకుఁ బోయెను! బోధిసత్త్వుఁడాహారమును గ్రహింప నారంభించినపుడు గౌండిన్యుని శ్రద్ధ నష్టమగుటకు కారణ మేమి? నా అభిప్రాయమిది. ఈ పంచవర్గీయ భిక్షువులు మొట్టమొదట నాళారకాలాముని సంప్రదాయస్థులై యుం దురు. వారు శాక్యభూముల జుట్టుపట్టులనే నివసించుచుండిరి. వారికానాఁడే బోధిసత్త్వునితో మైత్రియుండెడిది. ఆసర్వులు బ్రాహ్మణులు. బ్రాహ్మణులని జెప్పుటకును వీలులేదు. ఆళారకాలముని సంప్రదాయమందును - ఉద్దకరామపుత్రుని సంప్రదాయమందును, శాంతిదొఱకని బోధిసత్త్వుండు యితర మార్గముల నన్వేషించుటకై రాజగృహములకు వచ్చెను గదా! అపు డాతనితోఁగూడ నీపంచవర్గీయభిక్షువులును వచ్చియుండిరి. బోధిసత్త్వునకు, నవీన ధర్మమార్గ బోధ సిద్ధించినచోఁ దాముఁగూడ నామార్గముననే యనుసరింప వలెననుదలఁపు వారి కుండెడిది. అయినను, బుద్ధుఁడన్నము దినుటకు మొదలుపెట్టినవెంటనే యుపవాసదీక్ష విడచిన యాతనిపై వారికి నమ్మకము దప్పినది. అతనినివిడచి వారు వారాణాసి కేగిరి.

## పంచవర్గీయ భిక్షుసంఘము

బోధిసత్త్వుఁడు బుద్ధుఁడై వారణాసి దగ్గర, ఋషి పట్టణమునకు వచ్చెను. అపుడు బంచవర్గీయ భిక్షువులాతనికి సత్కారము సేయగూడదని నిర్ణయించికొన్నారు. ఈ విషయము ముందే జెప్పితిమిగదా! కడకు, వారాతని ధర్మమార్గమును వినుటకంగీకరించిరి. విన్న తరువాత కౌండిన్యుఁడాతని ధర్మ మనుసరించుట కంగీకరించెను. అపుడు భగవానుఁడు "దెలిసికొంటివా కౌండిన్యా!" యని (అజ్ఞాసికొండిఞ్ఞ) యనెను. ఆనాటినుండి గౌండిన్యుఁడు 'ఆజ్ఞాతకౌండిన్యుఁడ'ని ప్రసిద్ధుఁడైనాఁడు. ఈ యొక్క-సన్నివేశముచేతనే గౌండిన్యుఁడు బౌద్ధవాఙ్మయమున ప్రసిద్ధుఁడు. బౌద్ధమును స్వీకరించిన వెనుక, నీతఁ డేఘనకార్యమును జేసినట్లు లేదు. కాని, సాహసించి సత్యప్రేమతోఁ దొట్టతొలుత నవీనధర్మము ననుసరించుటయే యాతని మనస్విత.

అటుపిదప 'వప్ప-భద్దియులకు'ను బోధమొదలైనది. కొన్నిదినములకు వారును నవీనధర్మముల ననుసరించిరి. తరువాత మహానాముఁడు, అశ్వజిత్తు వెంటవెంట బౌద్ధులైనారు. వీరు బోధిసత్త్వున కేకనిష్ఠగలభక్తులు. వీరైదుగురును బౌద్ధమును స్వీకరించుట కెంతకాలము బట్టెనో జెప్పలేము. కాని యీ పంచవర్గీయులే దొట్టతొల్తటి బౌద్ధులు. ఇంత నిక్కము. ఈ యైదుగురితో భిక్షు సంఘ మారంభమైనది. ఈ విషయము 'సుత్త పిటక-వినయ పిటకము'లు రెండును, నేక కంఠమున బల్కెను.

## యశుఁడు-యాతని తోడివారు

'పంచ వర్గీయుల'తో బుద్ధుఁడు ఋషి పట్టణము నం దున్నప్పుడు వేఱొక యేబది ఐదుగురు భిక్షువులు వీరితోఁ జేరిరి. వా రెట్లు జేరిరి ? చాతుర్మాస్యాల యనంత రము రాజగృహమునకు వచ్చిన బుద్ధుఁడు యెంతటి భిక్షు సంఘముతో వచ్చెనో, ఈ వివరము 'మహా వగ్గము'న గలదు. దాని సారాంశ మిది:

వారాణసి యందు యశుఁ డని యొకఁ డుండెను. అతఁడు ధనికుఁడు. తరుణుఁడు. హటాత్తుగ నాతని మనస్సు ప్రపంచమునుండి విరక్త మైనది. శాంత స్థానమును వెదకి కొనుచు 'ఋషి పత్తనము'నకు వచ్చెను. బుద్ధుఁడు ధర్మోప దేశ మొనర్చి యాతని దన సంఘమున జేర్చికొనెను. యశుని వెదకి కొనుచు నాతని తలి దండ్రులు వచ్చిరి. వారును బుద్ధుని యుపదేశముచే నవీన ధర్మ మార్గము నుపాసించిరి.

యశుఁడు భిక్షు వైన సంగతి వారాణసిలోఁ దెలిసి నది. ఆతనికి నల్గురు మిత్రులు. వారు విమల, సుబాహు, పూర్ణజిత్, (పుణ్ణజి) గవాంపతు, (గవంపతు)లు. వారు ఋషి పత్తనమునకు బరువెత్తి వచ్చినారు. వచ్చుటయే దడవు నవీన ధర్మ మార్గము వారిని గాగలించి కొన్నది. వీరందరికి గలసి యేఁబది మిత్రు లుండిరి. వా రందరు దగు ణులే. వారును నక్కడికి వచ్చి బుద్ధోపదేశమును విని సంఘమున ప్రవేశించిరి. ఈ రీతి నఱువది మంది భిక్షువులతో సంఘము బలిష్ఠ మైనది.

## బహుజన హితమునకై ధర్మప్రచారము

చాతుర్మాస్యము యొక్క గడపట భగవానుఁడు దన భిక్షు సంఘముతోఁ బలికెను. "భిక్షువులారా! ప్రాఁంచిక బంధముల నుండి స్వర్గ చాపల్యముల నుండి నేను ముక్తుఁడ నైనాను. ఇట్లే మీరును నీ యిఱు పాశముల నుండి విముక్తులు గండు. ఆ స్థితిని సాధించి, భిక్షువులారా! బహు జనుల హితమునకై సుఖమునకై లోకము పైని దయతో- దేవతలు మనుష్యులు వీరి కల్యాణమునకై, ధర్మోపదేశము మొనర్చుటకు బ్రవృత్తులు గండు! ఊరూర దిరిగి మీ రీ పని సేయవలెను. కాని యొకటే త్రోవ నిర్వురు నడచి పోరాదు. ఈ ధర్మ మార్గము ప్రారంభమున గల్యాణప్రదము. నడుమఁ గల్యాణప్రదము. అంతమున గల్యాణప్రదము. ఈ ధర్మమార్గమును లోకమున కుపదేశింపుఁడు!!"

ఇట్లు హితములు నల్కి బుద్ధభగవానుఁడు దన యిఱువది మంది శిష్యులను నాల్గు దిక్కుల కంపెను వారు గ్రొం గ్రొత్త యువకులను బుద్ధుని కడకుఁ గొని వచ్చుచుండిరి. వారి కాతఁడు సన్యాస మొసఁగి భిక్షు సంఘమున జేర్చికొనుచుండెను. కాని, ప్రతి యొక్క యువకుని బుద్ధుని యొద్దకు దీసికొని రావలె ననుట- యీ నియమము శిష్యులకుఁ బ్రయాస సాధ్యమైనది. ఈ కష్టమును కనిపెట్టిన బుద్ధుఁడు సన్యాస దీక్ష నొసఁగి గ్రొత్తవారిని సంఘమున జేర్చికొను నధికారము నా శిష్యులకే యొసఁగెను. ఆయన యురువేల వైపునకు వెళ్ళిపోయెను.

## భద్రవర్గీయ భిక్షువులు

బుద్ధుఁడు బోవుచుండెను. బాటయందొక యుద్యానము వచ్చినది. దాన నాతఁడు విశ్రాంతుఁడైనాఁడు. అక్కడ నొక సన్నివేశము జరగెను. భద్రవర్గీయులైన యువకు లక్కడ నొక ముప్పదిమంది జేరినారు. వారందరు వారి స్త్రీలతో నట విహరింప వచ్చిరి. వారిలో నొకనికి భార్య లేదు. ఆ కొఱంతను దీర్చుటకై వానికొక వేశ్యను తీసికొని వచ్చిరి. ఆ పురుషుల కీ స్త్రీలతో లోకమే దెలియుటలేదు. ఈ గడబిడలోఁ జేతికి దొరకిన వస్తువు లెత్తుకొని యావేశ్య బరువెత్తినది. కొంతసేపటి కిది వారికిఁ దెలిసెను. 'ఇది యెక్కడవెళ్ళి' న దని యా వేశ్యను వెదకుచుఁ దరుణు లా యుద్యానవనమున గ్రుమ్మరుచుండిరి. వా రట్లు దిరిగి తిరిగి యొక చెట్టునీడ విశ్రాంతి గైకొనుచున్న బుద్ధుని గని "భదంతా! యొక వయసుగల యాఁడుది యీ వైపున నడచి వెళ్ళినదా! తమరు జూచితిరా!" యని ప్రశ్నించిరి.

భగవంతుఁడు వలికెను. "తరుణ గృహస్థులారా! యొక స్త్రీకొఱకై యింతమంది యువకు లింతగా వెదకుచున్నారు. ఆత్మబోధను వెదకుటకొఱకై యొక్కరును ముందుకు రారేమి?"

ఈ పలుకు వారి కెక్కడ దాకినదో! ఆ యువకులు బుద్ధునికడనే వసింపఁ జొచ్చిరి. కొంతకాల మాతని యుపదేశములు విని గృహములు త్యజించి భిక్షు సంఘమున గలసిపోయినారు.

## కాశ్యప బంధువులు

ఆ యుష వనమునుండి బుద్ధభగవానుఁ డురువేలకు వచ్చెను. అక్కడ నురువేల కాశ్యప, నదీకాశ్యప, గయా కాశ్యపు లుండిరి. వీరు మువ్వురును బ్రసిద్ధులే. వీరికి గ్రమ ముగ 500-300-200 రు మంది శిష్యులు. వీరెల్ల రగ్ని హోత్రముల రక్షించుకొనుచు దపశ్చర్య యొనర్చుకొను చుండిరి. బుద్ధభగవానుఁ డురువేల కాశ్యపుని యాశ్రమమున నుండెను. అతని కనేక చమత్కారములు గానుపించి శిష్యులతోఁగూడ నాతనిని భిక్షుసంఘమున జేర్చికొనెను. ఉరువేల కాశ్యపుఁడు భిక్షువైనదే యాతని సోదరులు, వాని యను యాయులు నందరును బౌద్ధులైపోయిరి.

## గొప్ప భిక్షుసంఘముతో రాజగృహమున బ్రవేశము

ఇప్పటికి భిక్షుసంఘ మొక వేయిపై మూఁడైనది. వీరితో బుద్ధుఁడు రాజగృహమునకు వచ్చెను. ఇంతమంది భిక్షువుల జూచిన రాజగృహ ముత్సుకతతో నెదురువచ్చినది. బింబిసారుఁడు దన సర్వోద్యోగులతో బుద్ధు నభినందించుటకై వచ్చినాఁడు. బుద్ధుఁడు, భిక్షుసంఘము మఱునాఁడు ప్రాసాదమందు భిక్షమును స్వీకరింపవలెనని బింబిసారుఁడు వేడికొనెను. భిక్షానంతరము వేణువనోద్యానమును, ధరాధిపుఁడు ధారాదత్త మొనర్చినాఁడు.

## సారిపుత్తమోగ్గలానులు

రాజగృహము దగ్గర సంజయుఁడను బరివ్రాజకుఁడుండెను. అతని కెందఱో శిష్యులు. సారిపుత్త- మోగ్గల్లా

నులు సంజయుని ముఖ్యశిష్యులు. కాని, యాసంప్రదాయము లలో వారి చిత్తములకు శాంతి దక్కలేదు. వారిర్వురుం దమలో నిట్లు సంకేతము నేర్పాటు జేసికొనిరి. 'మన యిర్వు రులో నెవరికేగాని, సద్ధర్మము గానిపింపజేయు గురువు లభిం చినచో, వారా విషయమును దమలోనే దాచికొనరాదు. వేఱొకని కిది దెల్పవలెను. వారిర్వురును గూడి యాధర్మము ననుసరింపవలెను

ఒకనాఁ డశ్వజిత్తు రాజగృహమున భిక్షాటన మొనర్చుచుండెను. అతని రూపురేకలు శాంత గంభీరములై యున్నవి. అతనిని జూచినవెంటనే 'యితఁడు నిర్వాణ పదవిని బొందియుండ వచ్చున'ను తలఁపు సారిపుత్తునకు దట్టెను. సారిపుత్తుఁ డశ్వజిత్తునతో సంభాషించెను. అశ్వ జిత్తు బుద్ధశిష్యుఁడనియు, బౌద్ధధర్మమే సరియైనదనియు సారిపుత్తున కెఱుకైనది. ఈ విషయ మాతఁడు మోగ్గల్లాను లకు దెల్పెను. వారిర్వురు సంజయునినుండి విడివడి భిక్షు సంఘమున బ్రవేశించిరి. వారివెంటనే యేఁబది యిర్వూరు బరివ్రాజకులు బుద్ధుని సమీపించి భిక్షువులై నారు.

## చారిత్రకమైన విమర్శ

యశుఁడు, దక్కిన యేఁబది నల్గురు దరుణ భిక్షువులు బుద్ధునితోఁ జేరినది మొద లింతవరకును నేను చెప్పిన విషయ ములు 'మహావగ్గ' ననుసరించి వ్రాయఁబడినవి.* ఇపుడీ విషయములనుఁ జారిత్రిక దృష్టితోఁ జూతము. బోధిసత్వుఁ

* బుద్ధ లీలాసార సంగ్రహము పు: 160-165 చూడుము, 'బౌద్ధ సంఘాచా పరిచయ' పు. 7-8 చూడుఁడు;

డురువేలయందు దపమొనర్చి, తత్త్వబోధనందెను. అప్పుడురువేలను గురించిన విషయములు జాలవరకు బుద్ధునకు దెలిసియుండును గదా! ఉరువేల కాశ్యపుఁడు తక్కిన యిర్వురు సోదరులు, వేయిమంది శిష్యులతోఁ గూడ నా ప్రదేశమందే యుండిరి. వారికి జమత్కారములు జూపించి శిష్యులుగాఁ జేసికొన్నాఁడుగదా! ఈ పని మొదటనే యెందుకుఁ జేయలేదు? వారిని వదలి బుద్ధభగవానుఁడు బంచవర్గియుల వెదకికొనుచు 'గాశీ' పర్యంత మెందుకు వెళ్లెను? తన ధర్మమును బంచవర్గియులుదప్ప దక్కిన వా రర్థముజేసికొనలేరను నభిప్రాయము బుద్ధున కున్నదేమో! లేక మొట్టమొదటనే జమత్కారములు గనబరచెడు సిద్ధశక్తులు బుద్ధునకు బ్రాప్తింపలేదా! కాశికేగి బంచవర్గియులను బౌద్ధుల నొనర్చిన యనంతరము వీరికి సిద్ధశక్తులు ప్రాప్తించినవా! చెప్పలేము.

'ఋషిపత్తనమం'దు 'పంచవర్గియు' లేగాక యితరు లేఁబది యైదుమంది బౌద్ధమును స్వీకరించిరి గదా! వారిలో నైదుగురి పేర్లు మాత్రమే 'మహావగ్గ' మందుఁ జెప్పఁబడినవి. తక్కిన యేఁబది మందిలో నొక్కరి పేరుగూడ లేదు. అందుచే, భిక్షువుల సంఖ్యను హెచ్చించినచో, నొక గౌరవమని దలఁచి యీ సంఖ్య నిచ్చిరని దలఁప వచ్చును.

మార్గమధ్యమునందు ముప్పది మంది పురుషులు స్త్రీలతోఁ గ్రీడించు చుండిరి. బుద్ధుఁడు వారి మనస్సులుమార్చి సన్యాసులుగ నొనర్చెనట! ఈ కథయును నమ్మ వీలులేదు. భిక్షుకులుగ మార్చుట యింత సులభమైనచో బుద్ధుఁ డింతకు

ముందే యాపని నేల సేయలేదు? ఉరువేలనుండి గాశి కెం దుకు మూటగట్టెను? ఉరువేల పరిసరముల నాతని కట్టి యువ కులు దొరుకక పోయిరా? మఱి, యీ ముప్పది శిష్యుల వృత్తాంతమునకు గతియేమి? ఏ మున్నది? ఇది నడుమ నెవరో జేర్చిన చేర్పు. ఆ పని యొనర్చిన ఘనుఁ డెవఁడో దెలియుట లేదు.

బుద్ధ భగవానుఁడు దన వేయిపై మూవురు శిష్యు లతో భిక్ష గైకొనుచు రాజగృహమునకు వచ్చెను. ఈ వార్త బట్టణమంతయు నిముసములో 'నల్లేరు'వలె బ్రాకినది. మఱి, సారిపుత్తున కెందుకు దెలియలేదు? 'అస్సజి' బంచ వర్గియులలో నొకఁడు. పంచవర్గియులకు దేశముపైకి వెళ్లి ధర్మోపదేశము సేయవలయునని బుద్ధుఁ డాన యిచ్చెనుగదా! 'అస్సజి' ని గూడ 'గాశీ' జుట్టుపట్టుల ధర్మోపదేశములు సేయుటకై బంపించెను. పంపి యటనుండి యురువేలకు,యురువేలనుండి రాజగృహమునకు, వచ్చినాఁడు మఱి హఠాత్తుగ 'నస్సజి' రాజగృహమున నెట్లు వ్రాలెను? దీనినంతయుఁ బట్టిచూడఁ దోచున దిది: 'పంచవర్గియులు' యశుఁడు, నతని నల్గురు మిత్రులు–వీరందరికి బుద్ధుఁడు ధర్మ దీక్ష నిచ్చినంతవరకు 'మహావగ్గ'మున జెప్పినగాథ సత్యమే యైయుండును. పిదప గాశినుండి రాజగృహపర్యంతము జరి గిన బుద్ధుని ప్రయాణమున జెప్పఁబడిన విషయములు గట్టు కథలే.

## లలితవిస్తరమున నిచ్చినపట్టిక

ఇంతకు నీసంఘటనము లెట్లుజరిగెనో 'యిత్థమిత్థ'మని నిర్ణయింప వీలులేదు. 'లలితవిస్తరము' యొక్క యారంభము నందు భిక్షుకులది యొక పట్టిక యివ్వఁబడినది. దానినిబట్టి భిక్షుసంఘముయొక్క దొల్తటి యానుపానులు గొంత దెలిసి కొన వీలవుచున్నది. ఆ పట్టిక నీక్రింద నిచ్చుచున్నాము.

1. జ్ఞానకౌండిన్యుడు (అఞ్ఞాత కౌండిఞ్ఞ) 2 అశ్వజిత్తు (అస్సజి) 3. వాష్పుఁడు (వప్ప) 4. మహానామ. 5. భద్ధిక (భద్దియ) 6. యశోదేవ (యస) 7. విమల. 8. సుబాహు. 9. పూర్ణ (పుణ్ణజి) .0. గవాంపతి (గవమ్పతి) 11. ఉరువేల కాశ్యప(ఉరువేలకస్సప) 12. నదీకాశ్యప. 13. గయాకాశ్యప. 14. సారిపుత్ర. (సారిపుత్త) 15. మహామౌద్గల్యాయన (మహామోగ్గల్లాయన) 16. మహాకాశ్యప (మహాకస్సప) 7. మహాకాత్యాయన (మహాకచ్చాన) 18. కపిల (?) 19. కౌండిన్య (?) 20. చునంద. (చుంద) 21. పూర్ణమైత్రాయణీపుత్ర (పుణ్ణమంతాపిపుత్త) 22 అనిరుద్ధ (అనురుద్ధ) 23. నందిక (నందక) 24. కస్ఫిల (కప్పిన) 25. సుభూతి. 26. రేవత. 27. ఖదిరవనిక. 28. అమోఘరాజ (మోఘరాజ) 29. మహాపారణిక (?) 30. వకుల (బకుల) 31. నంద. 32. రాహుల. 33. స్వాగత. (సాగత) 34. ఆనందులు.

'మహావగ్గము' నందు బేరులివ్వని గేవల సంఖ్యామాత్రోపజీవులు భిక్షువులు కొందరున్నారు గదా! వారిని దొలగించి వేసినచో నీ పై పట్టికలోని బదునైదుగురు భిక్షువుల పరంపరతో మహావగ్గకథకుఁ బొత్తుగుదురుచున్నది. దీనినుండి

దోచున దిది. పంచవర్గీయుల యనంతరము యశుఁడు, వారి నల్గురు మిత్రులు భిక్షువులైరి. ఈ పదమందిలో బుద్ధుఁడురు వేలకు నడచెను. అక్కడ ముప్వురు గాశ్యపబంధులు వీరిలోఁ జేరినారు. ఈ పదమూఁడు మందిలో భగవానుఁడు రాజగృహమునకు వచ్చెను. ఇక్కడి సంజయుని శిష్యులతో సారిపుత్ర, మోగ్గల్లానులు సంజయుని లోన వదలి బుద్ధునకు శిష్యులైరి. ఈ యిద్దరి చేరికచే భిక్షుసంఘగౌరవము పెరిగినది. కారణమేమన - రాజగృహమునందు వీరిద్దరును ప్రసిద్ధులు. బుద్ధుని తత్త్వజ్ఞానముచే - వీరిద్దరు నెట్లు ప్రభావితులైరో 'సుత్తపిటక-వినయపిటక' ములు జెప్పుచునే యున్నవి. అనేకులు 'అభిధమ్మ పిటకము' సారిపుత్తుఁడొసగిన యుపదేశములే యని దలచుచున్నారు.

వీరి తరువాత వచ్చిన యిరువది తొమ్మిది శిష్యుల పరంపర మాత్రము నైతిహాసికముగఁ గన్పడుట లేదు. ఆనందుఁడు- అనిరుద్ధుఁడు, వీ రిద్దరు నేక కాలముననే భిక్షువులైరని 'చుల్లవగ్గ' (భా॥ 7)లో నున్నది. కాని బైపట్టికలో ననిరుద్ధుని సంఖ్య యిరువది రెండు. ఆనందుని సంఖ్య ముప్పది నాలుగు. 'ఉపాలి' యనెడు మంగలి గూడ వీరి వెంటనే సన్యాసియైనాఁడు. అతఁడు వీ రిద్దరికంటె దొలుతనే వినయధరుఁ డయ్యెను. దీనిలో నాతని పేరే లేదు. పట్టికలో గన్పించు జాలమంది భిక్షువుల చరిత్రలు నేను వ్రాసిన 'భిక్షు సంఘముల పరిచయము' యను పుస్తకము నందు మూఁడవ భాగములో గలదు. జిజ్ఞాసువులు జూచికొనవచ్చును.

## భిక్షువుల సంఖ్య

రాజగృహ పర్యంతము బుద్ధుని సంఘములోఁ జేరిన భిక్షువులు బదునైదుగురేనా! యను విషయమును విచారింతము. 'వారాణసి' యందు బుద్ధునితో నేడుగురు భిక్షువులు జేరిరి. 'ఉరువేల' కుఁ బోవు నపుడు జేరిన వారు ముప్పది మంది. 'ఉరువేల' యందు వేయిపై ముప్వరు జేరిరి. అందఱి సంఖ్య జేరి యొక వేయి, తొంబది ముప్వరు. వీరందరితో బుద్ధుఁడు రాజ గృహము ప్రవేశించెను. అక్కడ 'సారిపుత్త – మోగ్గల్లానులు' జేరిరి. వారి తోడుత జేరిన భిక్షువులు – 270 మంది. అందఱును జేరి, యొక వేయి మున్నూటి పైన నలువది యైదుగురు. ఇంతమంది భిక్షువులు బుద్ధునితో నున్నట్లు 'సుత్త పిటకము'న నాధారము లేనే లేదు. బుద్ధుఁడు దన పరినిర్వాణమున కొకటి రెండేడులు ముందు రాజగృహమునకు వచ్చెను. అపుడాతనితో నున్న వారొక వేయి రెండు నూఱుల యేబది మంది (1250).

ఈ విషయము 'సామంజ ఫల సుత్తము'న గలదు. కాని, 'దీఘ నికాయము'లోని రెండవ భాగమందలి యెన్మిది సుత్తములలో భిక్షు సంఘముల సంఖ్య యైదు నూర్లుగాఁ జెప్పఁ బడెను. భగవంతుని గడబటి ప్రవాసము నందుఁ గూడ నాతనితో జేరి భిక్షు సంఖ్య యైదు నూర్లే యని దేలును. బుద్ధుని 'పరి నిర్వాణము' నకుఁ బిదప రాజ గృహము నందు భిక్షువుల తొలిపరిషత్తు జరిగెను. దాని యందున్నవారు.(500) యైదు వందల భిక్షువులే. దీనిని బట్టి

బుద్ధుని పరి నిర్వాణ పర్యంతము, భిక్షువుల సంఖ్య 500 లు మించ లేదనియే దెలియు చున్నది.

బుద్ధ భగవానుని పరి నిర్వాణానంతరము యీ సంఖ్యను హెచ్చించు ప్రయత్నములు జరిగెను. 'లలిత విస్తరము' యొక్క యారంభమున నొక 'శ్రావస్తి' యందే బుద్ధుని వంటి భిక్షువులు బది రెండు వేలు, ముప్పది రెండు వేల బోధి సత్త్వు లుండిరని జెప్పఁ బడి యున్నది. ఈ రీతిగాఁ దమ సంప్రదాయము యొక్క గొప్ప దనమును జాటు కొనుటకై యీ కాలములోని భిక్షువులు, ప్రాచీన భిక్షువుల సంఖ్య హెచ్చింప నారంభించిరి. ఈ పద్ధతిలో మహాయాన పంథకుఁ జేరిన గ్రంథకారులు సవ్యసాచు లైనారు. వారు హెచ్చించిన సంఖ్య యంతు లేనిది. బౌద్ధ ధర్మము యొక్క యవనతికి గల ప్రధాన కారణములలో నిదియు నొకటి. తమ ధర్మము యొక్కయు, సంఘము యొక్కయు గొప్పలు జెప్పికొనుటకు బౌద్ధులు లెక్క లేనన్ని గట్టు కత లల్లుట కారంభించిరి. విప్రు లీ పద్ధతిలో వీరి కంటెను నేడాకు లెక్కువ జదివిరి. బౌద్ధ భిక్షువుల నపహాసించుచు వా రల్లిన యల్లికలకు లెక్క లేదు.

## ప్రసిద్ధములైన యాఱు శ్రమణసంఘములు

బుద్ధుని కాలమం దాఱు శ్రమణసంఘములు ప్రసిద్ధములై యుండెను. ఈ యాఱును, బౌద్ధసంఘముల కంటెను జాలపెద్దవి. వానినాయకులు, 'పూరణకాశ్యప, మక్ఖలిగోసాల, అజిత, కేశకంబిలులు.' మఱియు, 'పకుధకచ్చాయన, సంజయ, బేలట్ఠపుత్త, నిగంఠనాథపుత్తులు' ఈ యాఱుగురును

మివుల నెన్నిక గన్నవారు. వీరిని గురించి 'మజ్ఝమనికాయము'లోని 'చూళసారోపమ' సుత్తమునం దీ క్రింది విషయ మున్నది.

"యేవే భో గోతమ! సమణ బ్రాహ్మణాసంఘినో, గణినో గణాచరియా, ఞాతా, యసస్సినో, తిత్థకరా, సాధుస మ్మతా, బహుజనస్స, సేయ్యథీదం, పూరణోకస్సపో, మఖ్ఖలిగోసాలో, అజితో, కేసకంబలో, పకుధో, కచ్చా యనో, సంజయో, వేలట్ఠపుత్తో నిగంఠో, నాథపుత్తో."

పింగళకౌత్సులు భగవంతునితో ననిరి. 'గౌతమా! ఎవరు సంఘము గలవారో - గుణము గలవారో - గణాచార్యులో - ప్రసిద్ధులై యశస్సు గలవారో - దీర్థంకరులో-బహుజనులకు మాన్యులైనవారో వారెవ్వరు! పూరణకస్సప-మఖ్ఖలిగోసాలులు,పఖుదకచ్చాయన-సంజయ బేలట్ఠపుత్తులు.'

## బౌద్ధసంఘముయొక్క గర్తవ్య నిష్ఠ

ఈ యార్య రాచార్యులును వయస్సున బుద్ధభగవానున కన్నను బెద్దవారు. వారి భిక్షుకుల సంఖ్యగూడఁ బెద్దదియే. బుద్ధుఁడు వారికంటెను వయస్సున జిన్నవాఁడయినట్లే బౌద్ధభిక్షువుల సంఖ్యయుఁ జిన్నది. క్రొత్తగా స్థాపింపఁబడినది. ఇట్లుండియు, నా సర్వశ్రమణుల సంఘములను వెనుక వేసినది. హిందూస్థానమునందేగాక దాని పొలిమేరలు దాటి సర్వ ఆసియాఖండమందును దన ప్రభావమును బండించుకొన్నది. ఇది యెట్లు సాధ్యమైనది?

తక్కిన శ్రమణ సంఘములు జాలపెద్దవే యైనను, వారితో సామాన్య జనసముదాయమున కేమియు బ్రయోజ

నములేదు. వా రెవ్వరును సామాన్య మానవుని స్థితిగతులను యోజించి వాని యభివృద్ధికై యాతన బడినవారుగారు. వారిలో జాలమంది-ధ్యేయ మొక్కటియే. తపస్సు నొనర్చి మోక్షమును సాధించికొనుట. వారు పల్లెలలోనికిఁ బట్టణములలోనికిఁ బ్రవేశించి-గేస్తులను భిక్ష నడుగుదురు. ప్రసంగవశమున నేవైన నాల్గుముక్కలు దమ సంప్రదాయములకు సంబంధించిన మాటలు జెప్పుదురు. అంతేగాని గృహస్థుల హితమునకై -సుఖమునకై వారేమియు బ్రయత్న పడలేదు.

బౌద్ధసంఘ మట్లుగాదు. 'లోకముయొక్క హితము కొఱకై- సుఖమునకై మీరు నాల్గుదిశలఁ బ్రయాణము గట్టుఁడు. ఒక మార్గమునసే యిర్వురు బోరాదు.' యన్నది బుద్ధుని యుపదేశము. ఈ యుపదేశము 'మహావగ్గ' మార సంయుత్తములలో వచ్చును. దానివంటి యుపదేశమే 'సుత్త పిటకమం'దును ననేకచోటులఁ గన్పడును. బుద్ధుని పై యుపదేశమునే బౌద్ధభిక్షువు లనుసరించిరి. దానితో వారు బహుజనప్రియులై మాన్యులైరి. సామాన్యజనులపై వారిప్రభావ మమితముగఁ బడెను.

పరస్పరము గలహించుకొనుచున్నలోకమువైపు జూచి బోధిసత్త్వునకు వైరాగ్యోదయ మయ్యెనని నాల్గవప్రకరణమున దెల్పితిని. ఈ కలహము లెట్లు మాయును? కేవలము రాజబల మొక్కటియే వీనిని దీర్పలేదు.

లోకమం దెంతవరకు హింసాత్మకబుద్ధి యుండునో-యంతవరకు రగడలు - రాద్ధాంతము లుండితీరును. ఈ భావములు మొదలాడిన బోధిసత్త్వుఁడు 'రాజసత్త' నుండి నివృ

త్తుఁడై మనుష్యజాతియొక్క విముక్తిమార్గమును వెదుక మొదలిడెను. ఏడేండ్లు దీవ్రదపశ్చర్య గావించినాఁడు. ఆ తపశ్చర్యలో గలిగిన యనుభవములను జిలికి - చిలికి మధ్యమమార్గ మను వెన్నను దీసికొని వచ్చెను. దానిసారమును బ్రపంచమునకుఁ దెలుపవలెనను దీవ్రసంకల్పమాతనికి గల్గెను. దానిని సాధించుటకే భిక్షుసంఘమును స్థాపించెను. ఈ యుద్దేశ్యముతో స్థాపింపఁబడిన బౌద్ధసంఘము- సామాన్యజనుల హిత, సుఖ సంపాదనకై నడుము గట్టెననుటలో వింతయేమి?

## ఆధ్యాత్మిక పరిశ్రమయొక్క యావశ్యకత

సమాజము కృషి - వ్యాపారము మొదలైనకార్యములు జేయుచున్నది. కాని సమాజమునందు సంఘీభావము లేకున్నచో నీప్రయత్నములచే గల్గులాభ మేమియు లేదు. ఒకఁడు పొలమునందు ధాన్యములు విత్తును. మఱొక్కఁడు దానిని గోసికొనిపోవును. వేఱొక్కఁడు వ్యాపారము సేయును. ఆధనమును మఱియొకఁడు దొంగిలించును. సమాజమం దీరీతి నవ్యవస్థ యారంభమైనచో దానియందలి వ్యక్తులకు విపరీతములైన గష్టనష్టములు గల్గును. మఱి సమాజమునం దేకవాక్యత నెట్లు సంపాదింపవలెను? శస్త్రబలముచే గాదు. ఆ సంఘీభావము స్థిరముగనుండదు. పరస్పరసౌజన్యముచే - త్యాగముచే నుత్పన్నమైన సంఘీభావమే నిలుకడయైనది. జనసమూహమం దీవిధమగు జాగృతిని గలిగించుటయే గౌతముని ధ్యేయము. 'సుత్తనిపాతము' లోని 'గాశి భరద్వాజ' సుత్తమునం దీవిషయము భాసించును. ఆ సుత్తము యొక్క సారాంశ మిది:

ఒకనాఁడు భగవానుఁడు భిక్షాటన మొనర్చికొనుచు భారద్వాజబ్రాహ్మణుని పొలముపైకి వెళ్ళెను. అక్కడ భరద్వాజ బ్రాహ్మణుఁడు దనకూలీలకు గూలి నిచ్చుచుండెను. బుద్ధుఁడు భిక్షకొఱకై యాతని యెదుట నిలచినాఁడు. ఇతనిని జూచి యాబ్రాహ్మణున కెంతకోపము వచ్చెనో! "గింజలూరకరావు. నా వలెనే నీవును, పొలముదున్ని, విత్తి, పండించి, కోసికొని యనుభవింపుము. భిక్షు నెవరు నీకిటబెట్టువారు!" యని గసరించెను.

భగవానుని పెదవులపై మల్లెపూలనవ్వు భాసించినది. వారు మందసుందరముగా ననిరి: "ఓయీ! నేనును నీవలెనే గర్షకుఁడను. శ్రద్ధ యనెడు విత్తులు విత్తెదను. దానిపైఁ దపశ్చర్య యనెడు వాన గురియుచున్నది. ప్రజ్ఞయే నేను బట్టికొన్న మడక. చిత్తమే కొఱ్ఱు. స్మృతి నాగలియొక్క కొన. పాప, లజ్జ నాగలి కట్టె. కాయముతో-వాక్కుతో నేను నియమమును పాటింతును. ఆహార విహారములందు నియమవంతుఁడనై సత్యము నాదరించి మనోదోషము లను గలుపు తీయుదును. సంతోషము నేనపు డనుభవించు విశ్రాంతి. ఉత్సాహము నా వృషభము. నా యెద్దులు యేదిక్కున శోకమున కవకాశములేదో యా దిక్కునకుఁ బర్వెత్తును."

దీని యంతరార్థము బ్రాహ్మణున కవగతమైనది. తన యవివేకమున కాతఁడు బశ్చాత్తాపపడి బుద్ధ శిష్యుఁడై చిత్తశాంతి నందినాఁడు.

ఈ యుపదేశమున బుద్ధుఁడు గృషిని నిషేధింప లేదు. కాని యా కృషి నీతిబలముతోఁ గూడినదై యుండవలెను.

లేనిచో దానిచే సమాజమునకు సుఖమునకుబదులు దుఃఖమే గలుగును. ఇది యాతని బోధలోని యంతరార్థము. ఒకఁడు దున్ని విత్తిన పొలములోని ధాన్యమును మఱియొకఁడు బలవంతముగఁ దీసికొని పోవుచున్నచో వాని కా కృషితో నేమి లాభము? వాఁడా సేద్యమును సేయనే సేయఁడు. అట్టిచో సమాజమం దవ్యవస్థగాక యేమి గలుగును? కనుక ప్రవృత్తులకుఁ దొలుత మానవుఁడు హితదృష్టి నలవాటు సేసి కొనవలెను. ఆ హితదృష్టి యహింసపై నాధార పడినది గావలెను. ఆ రీతిగ మొదలు మన స్సనెడు పొలమును సంస్కరించిన తరువాతనే భౌతికమైన కృషితో నుపయోగము. ఈ యభిప్రాయముతో బుద్ధుఁడు దన శిష్యులను లోకమునందు నైతిక జాగృతి గలిగింప నియమించెను. అందుచే బౌద్ధసంఘ మల్ప సంఖ్యాకమైనను నల్పకాలములోనే జనుల కత్యంత ప్రియమైనది. లోక హృదయమును మలచుట యనెడుఁ దమ కళతోఁ దక్కిన శ్రమణ సంఘముల నన్నిటిని బౌద్ధ భిక్షువులు వెనుకవేసిరి.

## సంఘ-సంఘటన

తన సంఘము గార్యక్షమ మగుటకై బుద్ధ భగవానుఁ డెంతయో జాగ్రత్త దీసికొనెను. తన దరువాతను బౌద్ధ భిక్షువులలో నేకవాక్యత యుండుటకును, వారినుండి లోక సేవ యవ్యాహతముగ ఘటిల్లుటకును దగినట్లు చక్కని నియమము లేర్పఱచి నాఁడు. 'వజ్జి'ల గణరాజ్యమం దా రాజ్యపు బెద్దలు సమావేశమై విచార వినిమయము లొనర్చు కొనుటయు, బరస్పర హితమునకై చట్టము లేర్పరచు కొనుటయు

నుండెడిది. భిక్షు సంఘ నిర్మాణమునందు యీ గణరాజ్య పద్ధతులను సాధ్యమైనంతవరకు గౌతముఁ డనుసరించెను. 'మహాపరినిర్వాన సుత్తము'యొక్క ప్రారంభమం దీవిషయ మున్నది. దాని స్వరూప మిది:

'వస్సకార' బ్రాహ్మణుఁడు బుద్ధునికడకు వచ్చెను. అజాతశత్రుఁడు 'వజ్జి'రాజ్యముపై దాడి వెట్ట నున్నాఁడని బుద్ధున కాతఁడు మనవి జేసినాఁడు. తా నేర్పాటు జేసి యిచ్చిన యేడు నియమములను 'వజ్జి'రాజ్య మెంతవఱ కప్రమత్తతతో ననుసరించునో యంత వఱకు 'వజ్జి'ని జయింప నేరికిని సాధ్యము గాదని భగవానుఁడు బదులిచ్చెను. 'వస్సకారుఁ' డటనుండి వెడలి పోయెను. బుద్ధుఁడు భిక్షువులతో ననాఁడు. "భిక్షువులారా! నే నిపుడు మీ యభివృద్ధి మార్గముల నేడింటి నేర్పఱచు చున్నాను. వినుఁడు. (1) ఎంతవరకు భిక్షువు లనేకసారు లొక చోటఁ జేరు నలవాటు బెట్టికొందురో-యంతవరకు భిక్షువుల కభివృద్ధియేగాని హానిలేదు. (2) ఎంతవరకు భిక్షువు లేకాభిప్రాయముతోఁ జేరుదురో, దమలోని గలఁతలను విచారించుకొని యేకమనస్సుతో వానిని దొలఁగింప యత్నింతురో-యంతవఱకు మీకు వృద్ధియేగాని హానిలేదు. (3) భిక్షుసంఘ మేర్పాటు సేయని నియమమును జేసె ననరాదు. చేసిన నియమమును భంగింపరాదు. ఈరెండు దుష్కార్యములు లేనంత వరకు మీకు భయములేదు. నియమమును గ్రుడ్డిగాఁగాక దాని హృదయ మెఱిఁగి యనువర్తింపుఁడు మీ కభివృద్ధియే గాని హానిలేదు. (4) ఎంతవరకు భిక్షువులు వృద్ధులు, శీల

వంతులు, యాత్రికులు, నయినవారిని గౌరవింతురో - (5) యెంతవరకు-మాటికి నుత్పన్నములగు నాశలవెంట బోవక వశీకరించుకొందురో- (6) యెంతవర కేకాంతవాసము నభిలషింతురో-(7) యెంతవఱకు దమతోఁజేరని బుద్ధిమంతులు జేరుచురుగాక, చేరిన మేధావులు సుఖము నందురుగాక యనెడు శుభకామనతో నుందురో- దానికై యత్నింతురో యంతవరకు భిక్షువుల కభివృద్ధియే యున్నది. హాని లేదు !!!

సంఘమునొకచోట జేర్చుట-వారితో సంఘకృత్యములను జేయించుట-వృద్ధులు, శీలవంతులనగు భిక్షువుల నితరులు గౌరవించున ట్లొనర్చుట మొదలగు 'వినయపిటకము' న జెప్పఁబడిన నియమములన్నియు బుద్ధుఁడు గణరాజ్య పద్ధతులనుండియే గ్రహించెను. ఇది స్పష్టము.

## కొన్ని విషయములు లోకము ననుసరించి-

రాజ్యాను శాసనముయొక్క- సమస్త నియమములను భిక్షుసంఘమున కన్వయించుట - కదుకవుగదా ! భిక్షువులలో నెవఁడైన దప్పు జేసినపు డాతనికి విధించు శిక్ష పెద్దలోఁ బెద్దది సంఘబహిష్కృతి. దీనికిమించిన శిక్ష లేదు. కారణ మేమన - భిక్షుసంఘముయొక్క- నియమము లన్నియు నహింసాత్మకములుగనే యుండవలెను గదా! అందుకై కొన్ని సంఘనియమములను బుద్ధుఁడు లోకరూఢి ననుసరించి గ్రహించెను. ఈక్రింది నియమము జూడుఁడు. బుద్ధుఁడు 'ఆళవి' యందు అగాళవునికడ నుండెను. అపు డాళవక భిక్షుడొక గట్టు గట్టించుటకై నేల ద్రవ్వించుచుండెను. దానిపై లోకవ్యాఖ్య

బయలుదేరినది. ఈ విషయము బుద్ధునకుఁ దెలిసి భిక్షువుల కట్టిపనులు నిషేధించుచు నీ నియమ మొనర్చెను.

"ఏ భిక్షువు నేల ద్రవ్వునో, ద్రవ్వించునో, యాతనికిఁ బాతిత్య మంటుకొనును."*

భిక్షువులు జిన్న కుటిని గాని - లేక యనురూపమైన విహారమును గాని గట్టుకుని దానియందు వసించుటకు బుద్ధుఁ డనుమతించినాఁడు. కనుక వానికొఱకై - భూమిని ద్రవ్వుటయు, త్రవ్వించుటయు, బాపముగాదు. మఱి యీ నియమ మెందుకుఁ జేసెను? లోక సమాధానమునకే. అనేక శ్రమణులు జిన్న, పెద్ద, జంతువులు నాశన మగు నను భయముతో జాగ్రత్తగా వర్తించు చుందురు. రాత్రుల యందు దీపములును గూడ వెలిగింపరు. కారణ మేమన-వానిపై మిడుతలు మొదలగునవి పడి చావవచ్చు నను భయము. మఱి యట్టివారు యీ యాచారములకు బూను కొన్నప్పుడు లోకమునకు వింత. తమ బ్రతుకులపై దండెత్తిరే యను చింత. హఠాత్తుగ నొక నాఁడు శ్రమణుఁడు స్వయముగ గొడ్డలి గొని భూమిని ద్రవ్వ నారంభించినచో సామాన్య జనున కది విడ్డూరముగ దోచుట సహజమే. బుద్ధున కా శ్రమణుని పని యయిష్టము గాకున్నను నింత చిన్న విషయమునకై జనులతో వాద వివాదములు సేసి వారి దృష్టికోణమును మార్ప బ్రయత్నించు టాతనికి గొండను ద్రవ్వి, యెలుకను బట్టుట గాఁ దోచినది. తపశ్చర్యతో వ్యర్థముగ గాలమును గడుపక

* బౌద్ధసంఘాచాపరిచయ, పు: 67 చూ.

సామాన్య జనులకు ధర్మోపదేశము సేయుట, ధ్యాన సమాధులతో స్వచిత్తమును దమనము సేయుట - యింత మాత్ర మొనరించి కొన్నచో భిక్షు సంఘము యొక్క కార్యము సులభ మగు నని యాతని యూహ. అందుకై యే కార్య భాగములు నిరుపద్రవములో యట్టి పనులు సంఘ మొన ర్చుటలో బుద్ధుని యసమ్మతి లేదు.

## భిక్షు సంఘముల సాధుత్వము

ఇతరులలో వలెఁ దీవ్ర తపశ్చర్య బుద్ధున కిష్టము లేదు. కాని దన సంఘములోని భిక్షు లత్యంతము నిరాడంబరులై వర్తింప వలెనని యాతని కోరిక. అందుపై గొన్ని నియమము లేర్పరచినాఁడు. భిక్షువులు బరిగ్రహము లారంభించినచో, నా పరిగ్రహ వస్తువుల భారము బెరిగి, ప్రచార కార్యముల కవి, యడ్డంకు లగును. 'సామంజ ఫలసుత్త' మందు బుద్ధభగవానుఁడు రాజగు నజాతశత్రునితో నిట్లనెను:

"సేయ్యథాపి మహారాజ పచ్చో, సకుణో యేన యేనేవ డేతి సపత్తభారో వ డేతి. ఏవమేవ మహారాజ, భిక్కు-సంతుట్ఠో హోతి కాయ పరిహారికేన, చీవరేన, కుచ్ఛి పరిహారికేన, పిండ పాతేన, సో యేన యేనేవ పక్కమతి సమాదాయేవ పక్కమతి॥"

"మహారాజా! పక్షి యెగిరి యే దిశకుఁ బోవుచున్నదో - యా దిశకుఁ దన రెక్కలతోఁ గూడఁ బోవుచున్నది. తెక్కల నొక్క యెడ బెట్టి, దాను మాత్రము బోవుట లేదు. అజాత శత్రూ! భిక్షువు మానము గప్పెడు చీవరము చేతను, పొట్టకుఁ జాలిన భిక్ష చేతను సంతుష్టుఁ

డగుచున్నాఁడు. అతఁ డెక్కడఁ బోవునో యక్కడికిఁ దన సామానుతోఁ గూడ బోవును.”

ఇట్టి భిక్షుని కడ నెంత యెక్కువగ నున్నను, నీ క్రింది ‘గాథ’లోఁ జెప్పిన యెనిమిది వస్తువు లుండును. అంతకంటె యెక్కువ యుండవు.

“తిచీరవంచ పత్తోచ వాసి సూచి చ బంధనం
పరిస్సావనేన అట్ఠేతే యుత్త యోగస్స బిఖునో.”

“మూఁడుజీవరములు, పాత్రము, జిన్నగొడ్డలి, సూది, నడుముపట్టి, నీరువిండికొనుటకు జిన్నగుడ్డ, యీయెనిమిదివస్తువులు యోగియైన భిక్షువుతోఁగూడ నుండును.”

## పరివర్తనయొక్క నియమములు

భిక్షువులు నిరాడంబరులగుట భగవానుని కిష్టము. అందుకై యాతఁ డన్ని నియమము లేర్పరచెను. కాని, మనుష్య ప్రకృతి చిత్రమైనది. వారు పై జెప్పిన వస్తువుల స్వీకరించుటలోఁ గూడఁ గొన్నిజాపల్యములఁ జూప మొదలు వెట్టిరి. కొందఱు మూఁడు చీవరములకు బదులు నాల్గుగొందురు. మట్టిపాత్రలకు, నినుపపాత్రలకు బదులు-రాగి, యిత్తడి చెంబులు దీసికొందురు. చీవరము లేపరిమాణముచ నుండవలె నని బుద్ధుఁ డనెనో- వానికన్న గొంచెము పెద్దవి గోరి యేరికొందురు.

మఱి యీ చాపల్యములు రిక్కొనుటకుఁ బరిగ్రహము గాకున్నమార్గ మేదీ! భిక్షువుల యీ చాపల్యము

లణచుటకై క్రొంగ్రొత్త నియమము లేర్పడవలసి వచ్చెను. ఆ నియమములసంఖ్య వానరసైన్యమంత యైనది.

'వినయపిటకము' నందు సగటుకు 227 నిషేధాత్మక నియమములున్నవి. వానిని 'పాతిమోఖ్యము' లందురు. వానిపైకి రెండు'యనియతములు', డెబ్బదియైదు-యాహారవిహారములు, మాట, మంతి మొదలగు శిష్టాచారములకు సంబంధించినవి. ఈ రీతి 'జనపు' పోనుపోను, యశోకుని కాలము నాటికిc దక్కిన నూటయేబది నియమములుమాత్రమే 'పాతిమోఖ్య'మని పిలువcబడెడివి. అంతకుముం దిన్ని నియమములు లేవు. ఉన్నవానిలోcగూడ మూలభూత నియమములను మార్చక దక్కినవానిలో మార్పులు-చేర్పులు సేయు నధికారము సంఘమున కుండెడిది. 'పరినిర్వాణము' నకు ముందు భగవంతుc డానందునితో నన్నాcడు. 'ఓయి, యానందా! సంఘమున కిష్టమున్నచో నాయనంతరము గొన్ని నియమములలో మార్పులు-గూర్పులు జేయవచ్చును. కొన్నిటిని తిరస్కరింపను వచ్చును.'

దీనిని బట్టి చిన్నచిన్న నియమములు దిరస్కరించుటకును - దేశకాలానుసారము సామాన్య నియమములలోc గొన్నిమార్పులు జేయుటకును - బుద్ధుcడు సంఘమున కధికార మొసcగి యుండెనని యూహింపవచ్చును.

## శరీరోపయోగి పదార్థములు గ్రహించుటలో జాగ్రత్త

భిక్షుల ముఖ్యావసరములు నాల్గు చీవరములు, బిండపాతము (అన్నము) శయనాసనము, (వసించుచోటు) ఔష

ధము. 'పాతిమోక్షము' లోని నియమానుసారము దీని నుప యోగించు నప్పుడుఁగూడ భిక్షువు విచారపరుఁడై వర్తింప వలెను.

చీవరములు ధరించెడు భిక్షువుతో భగవంతుఁడనుచు న్నాఁడు: 'చీవరమును విచారించి ధరింపుము. ఇది కేవలము శీతోష్ణములు, యీఁగలు, దోమలు, గాలి, సర్పములు మొదలైన వాటినుండి నిన్ను రక్షించుకొనుటకు మాత్రమే ధరింపఁ బడుచున్నది. గుహ్యేంద్రియ రక్షణకార్యము చీవరమునకు.'

పిండ పాతమును సేవించు భిక్షుకునితో బుద్ధుఁ డనెను: 'చక్కఁగా విచారించి యాహారమును భుజింపుము. నీవు భుజించుట శరీరము బలమెక్కి క్రీడించుటకుఁ గాదు. మత్తుఁ డౌటకుగాదు. మండితుఁడై విభూషితుఁడ వౌటకు గాదు. నీ భోజనము కేవలము శరీర రక్షణకే. దుర్బలమైన శరీరము బ్రహ్మచర్యమునకు సహాయము సేయదు. కనుక యన్నము ప్రాఁతదైన వేదన (ఆకలి)ను దొలఁగించి దానిచోటఁ గ్రొత్త వేదనను (యెక్కువ తినుటచేఁ గష్టము) ప్రతిష్ఠింపరాదు. శరీర యాత్రామాత్ర పర్యవసన్నమైన యన్నముచే లోకాప వాదము రాదు. జీవనమును - సుఖకరమై యుండును.'

శయనమును సేవించువానితో ననాన్నఁడు: 'చక్కగా విచారించి శయనమును సేవింపుము. శయనము నిన్ను శీతోష్ణములు, యీఁగలు మొదలైన వానినుండి రక్షించుటకే. ఏకాంతవాసమునందు-విశ్రాంతి కొఱకే'

ఔషధమును సేవించు వానితో ననెను: 'చక్కఁగ విచారించి యౌషధమును సేవింపుము. దీని యుపయోగ

ముత్పన్నమైన రోగమును శమింపఁ జేయునంతవరకే. సహజమైన యారోగ్యమును జేకూర్చు వరకే'*

## దేవదత్తుని కుట్ర

సంఘమునందు సరళత - బరస్పరమైత్రి యుండుటకై బుద్ధుఁ డెంతయో జాగ్రత్తఁ గైకొన్నాఁడు. కాని మనుష్య స్వభావము వక్రమైనది. నలుగురు జేరినచోట నభిప్రాయ భేదములు - వానితోడ బాధలు, సహజము. వీనికి గారణములు రెండు. మొదటిది:- వ్యక్తిగతమైన యభిమానము. రెండవది:- యజ్ఞానము. మనుష్యుఁ డెంత సాధుమార్గమున వర్తింపఁ దలఁచినను - దానొక పెద్ద ననిపించుకొనవలె నను భావము వాని మనస్సున వర్తించుచునే యుండును. దీనితో వాఁ డితరుల గుణముల నవగుణములని, దన గొప్పతనమును స్థాపించికొనుటకు యత్నించును. అట్లు సేయక వానికిఁ దృప్తిలేదు. దీని వలలో స్వభావతః యజ్ఞానులైన జనులు దగుల్కొన్నచో, వారు గ్రొం గ్రొత్త పంథలు దీయుట దప్పనిసరి.

బౌద్ధసంఘమునం దిట్టి ఘనుఁడు మొదటివాఁడు దేవదత్తుఁడు. వీఁడు శాక్యులలో నొకఁడు. బుద్ధునకు బంధువు గూడ. భిక్షుసంఘమునకుఁ దాను బెద్దఁ గావలె నను నొక భావము వాని యెదలోఁ బొరాడెను. తన యీ యాశను

* ఈరీతి నాల్గు-శరీరోపయోగకరములైన పదార్థములను-విచారపరుఁడై సేవించుటకు 'పచ్చవేక్ఖణ' (ప్రత్యవేక్షణ) మనిపేరు. ఈ యలవాటు నేటికిని గలదు.

బుద్ధునితోఁ జెప్పినాఁడు. అతఁడు దీనిని మన్నింపలేదు. వానిలో బ్రతీకార భావము నాటుకొన్నది. అజాతశత్రువు వీనిచేతిలోని గీలుబొమ్మ. వాఁడా రాజుతోఁ జెప్పి, బుద్ధుని జంపుటకుఁ గొంతమంది హంతకుల నంపించెను. వారు వచ్చి యీ మూర్తిని జూచినదే దడవు శిష్యులైరి. దేవదత్తుని ప్రయత్నము నిష్ఫల మయ్యెను. వాఁ డంతతో నూరకున్నాఁడా! ఒకనాఁడు 'గృధ్రకూట' పర్వతమందలి యొక ప్రదేశము నుండి బుద్ధునిపై కొకరాయి దొర్లించెను. అది యాతనికి దప్పి ప్రక్కన బడినది. దాని యొక ముక్క యెగిరివచ్చి గౌతముని గాలిపై బడి గాయమయ్యెను. కొన్ని దినముల కది బాగైనది. ఒకనాఁడు బుద్ధుఁడు రాజగృహము నందు భిక్ష యడుగుటకు బోవు చుండెను. అపు డజాతశత్రుని యాశ్రమమున నున్న దేవదత్తుఁడు బుద్ధుని పైకి 'నాలగిరి' యను మదపు టేనుగును బురికొల్పించెను. అది వచ్చి బుద్ధుని మర్దించుటకు బదు లాయన పాదధూళిని గ్రహించి వెను దిరిగి పోయినది. ఈ రీతి వాఁ డెత్తిన యెత్తుగడ లన్నియుఁ దుత్తునియ లయ్యెను. వాఁ డంతటితో నాగలేదు. బుద్ధుఁడు భిక్షువులకు గొన్ని గఠిన తపశ్చర్యల నేర్పాటు జేసినాఁ డనియు, వానిని దొలిగించ వలసిన దనియు - నొక యభిప్రాయమును బ్రచార మొనర్చెను. వానితోఁ గూడఁ గొంత 'ముఠా' యున్నది. బుద్ధుఁ డా దపశ్చర్యలను సడలించుట కంగీకరింప లేదు. దానితో దేవదత్తుఁడు దిరుగఁబడి, కొంత మంది భిక్షువులతో గయకు వెళ్ళెను. ఈ దేవదత్త వృత్తాంతము 'చుల్లవగ్గ' యందు

విస్తరింపఁ బడినది.* కాని యీ కథలోఁ జారిత్రక సత్య మంతగా నున్నట్లు దోపదు. ఎందుకన - బుద్ధుని జంపింప యత్నించు నంతటి హంతకుఁడు దేవదత్తుఁ డైనచో వానికి భిక్షు సంఘములోఁ బలుకుఁ బడి యేర్పడి యుండునా! మఱి వానికి గొంద రనుయాయు లెట్లు సేరుదురు!

అజాతశత్రుఁడు యువరాజుగ నున్నప్పుడు వానికిని, దేవదత్తునకును బరిచయము గద్దు. వాని బలముతో దేవ దత్తుఁడు, సంఘమునకు నాయకుఁ డౌటకు యత్నించె నని 'లాభ సత్కార సంయుత్త' మందు ముప్పది యాఱవ సుత్తమున గలదు. ఆ సుత్తము యొక్క సారాంశ మిది:

బుద్ధ భగవానుఁడు రాజగృహమందు 'వేళువనము'న నుండెను. అపుడు యువరాజైన యజాతశత్రుఁడు 500 వందల రథములతో-సంధ్య లందు దేవదత్తుని దర్శనమునకై వెళ్లెడు వాఁడు. అయిదు నూర్ల భిక్షువులకు భోజన సామాగ్రి గూడ నాతఁ డొసఁగెడు వాఁడు. కొందఱీ విషయము భగవానుని తోఁ జెప్పిరి. అపు డతఁడ నెను. "భిక్షువులారా! దేవదత్తుని యొక్క లాభ సత్కారమున కాశింపకుఁడు. ఈ లాభముతో దేవదత్తునకు హానియే గలుగును. వృద్ధి లేదు."

ఇంతేగాక దేవదత్తుని గురించి బుద్ధుఁ డీ క్రిందిగాథ యన్నట్లు బౌద్ధవాఙ్మయమున రెండుసార్లు లుల్లేఖింపఁబడినది.

* బుద్ధలీలాసార సంగ్రహము, పు: 179-188 చూ:

"ఫలం వే కదలిం హంతి, ఫలం వేణం, ఫలంనళం,
సక్కారో కాపురిసం, హంతి గబ్భో అస్సతరింయథా"•

"ఫలము గదళిని జంపుచున్నది. ఫలము వేణువును, నాళమును జంపుచున్నది. యెంౘడకాయయొక్క గర్భము దానిసే జంపుచున్నది. అట్లే సత్కారము గాపురుషుని నాశము సేయుచున్నది.

దీనిచే దేవదత్తుఁ డధికారమును హస్తగత మొనర్చి కొనుటకై యజాత శత్రుపు సాయముతో నెంత దీవ్రముగ యత్నించుచుండెనో - మనము రేఖామాత్రముగ నూహింప వచ్చును. అజాతశత్రుఁడు దండ్రిని జంపి సింహాసనము నాక్ర మించినపినపఁ గూడ - దేవదత్తుఁడు వాని చెల్మి పీడలేదు. పైగా - వాని సాయముతో భిక్షుసంఘమున గలఁతలు గొని వచ్చి - తనవంటివారిని గొందరిని దయారుజేసెను. ఈ కృత్య ములు బుద్ధభగవానునకు రుచించలేదు. వారి కుట్రలు ఫలిం పనూలేదు. భిక్షుసంఘ మా దుర్మార్గమును గమనించి యేకీ భూతమై యా కష్టములనుండి గట్టెక్కినది.*

## భిక్షు సంఘమునందు రెండవ తగవు.

కౌశాంబియందు భిక్షుసంఘమున జగడము మొదల య్యె నని 'మహావగ్గమున' నున్నది. 'మహావగ్గ' కర్త యెవఁడో బల్కురో దెలియదు. 'మహావగ్గము'న నీ తగవు

• సంయుత్తనికాయ (P. T. S) 2 వ భాగము, పు: 241, మఱియు 'అంగుత్తర నికాయ' (P- T. S) 2 వ భాగము, పు: 73 చూ:

* 'బుద్ధలీలాసార సంగ్రహము' పు: 187-188 చూ:

కత యెందుకు వ్రాయవలసి వచ్చినది? దీనినిబట్టి యితరులు గుణపాఠము నేర్చికొందురని. ఆ 'మహావగ్గము' గాథయొక్క వివరణ మిది. 'ఇర్వురు భిక్షులు బోట్లాడుకొన్నారు. వారి బోటాట 'వినయము' నందలి యొక క్షుద్రవిషయమును గుఱించి. వారి కందు మతభేద మేర్పడినది. ఇర్వురును బండితులే. అపుడు బుద్ధుఁడు 'దీర్ఘాయువు' విషయమును జెప్పి వారిని సమాధాన పరుపఁ జూచెను. కాని వారు వినలేదు. వారిర్వురిలో నొక భిక్షువు 'భదంతా! మీరూరకుండుఁడు. ఈ రగడను మేమే తేల్చికొందుము' యనెను. సర్వుల మనస్సులును గలుషితములై పోయినవి. బుద్ధుఁడిక నచ్చట నిలువలేకపోయినాఁడు. అతఁడు ప్రాచీనమైన 'వంశద్వావ' మనెడు నుపవనమునుఁ జేరెను. అటననిరుద్ధుఁడు, నందియుడు, గింబిలుఁ డను ముర్వురు భిక్షువులుండిరి. వారిలోఁ జక్కని యేకవాక్యత యుండినది. దానినిగన్న బుద్ధునకు సంతోషమయ్యెను. అటనుండి యాయన 'పారిలేయ్యక' వనమునుఁ జేరినాఁడు. ఆ వనమునం దొక మదహస్తి యుండెను. అది యొక యూథమునకు నాయకుఁడు. తన యూథముతోఁ గలహించి యేకాంతవాస మొనర్చుచుండెను. ఆ మదగజము భగవంతునకు స్వాగత మిచ్చినది. భగవంతుఁ డటఁ గొన్నినాళ్ళుండి 'శ్రావస్తి'కిఁ బయలుదేరెను.

'కౌశాంబి'యందుఁ బండిత భిక్షువులకు రగడలు బెరిగినవి. వీరిర్వురిని సమాధాన పరచుటెట్లు? తక్కిన భిక్షువులు వారిర్వురిని బహిష్కరించిరి. 'ఈ యిర్వురకు నెవ్వరుగాని యాదర సత్కారములు సేయరాదు. భిక్షయొసఁగరాదు.'

యని నిర్ణయమొనర్చికొన్నారు. వారిపై నీమంత్రముఁ బని చేసినది. ఇర్వురును శ్రావస్తికి వచ్చిరి. అట భగవానుఁడు 'ఉపాలి' మొదలైన భిక్షువులతో వారిజగడమును శాంతింపఁ జేసెను. బౌద్ధభిక్షువులందుఁ గలహములు జరగిన -వాని నెట్లాపవలెనో-దానికి గొన్ని నియమము లేర్పరిచెను. 'ఉపాలి' మొదలైన వారితోఁ జెప్పి యాజగడమును మాన్పించెను.*

మజ్ఝిమ నికాయమందు 'ఉపక్కిలేశ సుత్తమం'దు (నం, 128) మహావగ్గములోని వృత్తాంతము జాలమట్టుకు వచ్చినది. కాని దానిలో దీర్ఘాయువు కత గనపడలేదు. ఆ సుత్తము బుద్ధుఁడు 'వంసదావవనము'ను జేరుటతో ముగిసినది. బుద్ధుఁడు 'పారిలేయ్యకవనము' జేరిన వృత్తాంత మాసుత్తమున లేనేలేదు. అది 'యుదానవగ్గము'న వచ్చును.

కోసంబియ సుత్తమం దొక క్రొత్త కథగలదు. దాని సారాంశ మిది:

భగవానుఁడు 'కౌశాంబి' యందు 'ఘోషితారామము' న నుండెను. అప్పుడు కౌశాంబిలోని భిక్షువులు బరస్పరము గలహించుచుండిరి. బుద్ధున కీకథ దెలిసి వారినిఁ బిలిపించెను. పిలిపించి వారితో బుద్ధుఁడు 'భిక్షువులారా! మీరిట్లు గలహించికొన్నచోఁ బరస్పరము గాయిక, వాచిక, మానసికశిక్షలు మైత్రీమయములగుట కవకాశమేదీ?'

'అవకాశము లేదు' యని యొకభిక్షువనెను. బుద్ధుఁడు జవాబిచ్చినాఁడు: 'అవకాశముండదని దెలిసియు మీరేల బరస్పరము గలహించికొనుచున్నారు? నిరర్థకమనుష్యులారా!

---

* బౌద్ధసంఘూహా పరిచయ పు: 37-43 చూ.

యీ కలహములు మీకు దుఃఖకారకములు. హానికరములు. భిక్షువులారా! నేనిపుడుఁ జెప్పబోవు యాఱు నియమముల ననుసరింపుఁడు. అవి మీకలహముల మాన్పుకొనుటకుఁ బనికి వచ్చును. మీలో నేక వాక్యతను బెంపొందించికొనుడు. వానిని జెప్పుచున్నాను-జాగ్రత్తగ వినుఁడు-

1. కాయకర్మలు మైత్రీమయములుగా నుంచికొనుట.
2. మైత్రీమయ వాచిక కర్మలు.
3. చెలికారము పాటించు మానసిక ధర్మము.
4. ఉపాసనల నుండి ప్రాప్తమైన దాన ధర్మములను సంఘమునందలి భిక్షువులందఱు సమవిభాగములుగ ననుభవించుట.
5. తమ శీలమం దొక దోసఁగేనియు రానివ్వకుండుట.
6. ఆర్య శ్రావకులకు శోభఁ గూర్చు సమ్యగ్దృష్టి గల్గి యుండుట."

భగవంతుఁ డీ సమ్యగ్దృష్టిపై గొప్ప వివేచనమును జాల యెడల నొనర్చెను. దాని నిచట విస్తరించుట కెడముఁ జాలదు; అవసరమును లేదు. పై యుపదేశము విని భిక్షువులు భగవంతుని భాషణము నభినందించిరట.

పై ప్రసంగముతోఁ గలహము లెక్కడి వక్కడ యంతరించి యుండును. లేకున్నచో బుద్ధుని భాషణముల నా భిక్షువు లభినందించుట యేర్పడదుగదా! 'మహావగ్గ' మందును 'యుపక్కిలేశసుత్త' మందును నీ భిక్షువులు భగవంతు నభినందించిన వృత్తాంతములేదు. వారు గలహించుచునే

యుండిరి. వారిపై విసుగెత్తిన బుద్ధుఁడు 'వంసదావ వన ము'ను జేరెను. పైకథ యంతయు 'గోసంబియ సుత్తము' లోనిది. మఱి భిక్షువుల గలహము లెట్లుమానినవి?

'అంగుత్తర నికాయము'లోని'చతుక్కనిపాత' మందు (241) వ సుత్తములో నిట్లున్నది:

ఒకప్పుడు భగవానుఁడు 'కౌశాంబి'లోని ఘోషి తారామమున నుండెను. అప్పు డాయుష్మంతుఁడైన యా నందుఁడు వారిని సమీపించి నమస్కరించి యొక వైపున నిలచినాఁడు. భగవంతుఁడు ప్రశ్నించెను. "ఆనందా! ఆ కలహము యింకను దెగలేదా !" ఆనం:-"భదంతా ! ఎట్లు దెగును ! అనిరుద్ధుని శిష్యుఁడు బాహియుఁడు సంఘ భేద మును సేయుటకె బూనుకొన్నాఁడు. మరి యనిరుద్ధుఁ డాతని యొక్కబల్లెత్తు మాటయు ననఁడు." బుద్ధుఁడు :- "ఆనందా! యనిరుద్ధుఁడు సంఘము నందలి గలహమును నివారించుట కెన్నఁడు మాత్రము ప్రయత్నించి నాఁడు ? నీవును, సారిపుత్త, మోగ్గల్లానులునుఁ గలిసి యా రగడను బరిష్కరింప లేక పోయితిరా !"

పై సంవాదముచే దేలున దిది. కౌశాంబిలోని గల హము 'బాహియు'ని మూలమున మొలకెత్తినది. దానికి గొమ్మలు, రెమ్మలు రేగెను. దాని నరికట్టుటకు భగవా నుఁడే ప్రయత్నించెను. సాధ్య పడలేదు. దీనితో బుద్ధునకు విసుగెత్తి 'గొంత కాల మెటనైన యుంద' మని వెడలి పోయెను. ఆ కలహము 'కౌశాంబి' యందే బరిష్కరింపఁ బడినది.

ఈ రీతిఁ గలహ శీలురైన భిక్షులను తెలివికి దెచ్చుట కుపాసకులు వారిని బహిష్కరింప వలెననియు - వారి చిత్త వృత్తులు శుద్ధమైన పిదప నేదో యొక రీతి వారి కలఁతలు దొలఁగింపవలె ననియు-సూచించుటకే 'మహా వగ్గము' నం దీ కథ జేర్చఁ బడినట్లు దెలియును. నిజమునకుఁ జిన్న చిన్న కొట్లాటల కొక పెద్ద సంఘముపై విపరీత పరిణామము లను గల్గించు నంతటి శక్తి యుండునా ?

## భిక్షుణీ సంఘ స్థాపన

భిక్షుణీ సంఘ స్థాపన విషయము 'చుల్లవగ్గ'మున జెప్పఁ బడినది. దాని సారాంశ మిది—

భగవానుఁడు 'కపిల వస్తువు' నందు 'నిగ్రోధారామము'న నుండెను. అపుడు మహా ప్రజాపతి గోతమి భగవంతుని సమీపించి "భదంతా ! మీ సంప్రదాయ మందు స్త్రీలకు సన్యసించుట కవకాశము లేదా !" అవకాశము గలిగింప వలెనని మూఁడు సారులు మనవిఁ జేసెను. మూఁడు సారులును భగవంతుఁడు సమ్మతించిన వాఁడు గాఁడు. ఆయన యట నుండి 'వైశాలి'కి వచ్చి నాఁడు. మహా ప్రజాపతి గోతమి దన కేశములను ఖండించికొని దనవలెనే యున్న కొంతమంది స్త్రీలతో భగవంతుని వెన్నాడి 'వైశాలి' కేతెంచెను. నడకతో నామె కాళ్ళు వాచియుండెను. అంగము ధూళీ ధూసరితమై యుండెను. ముఖము కాంతి దప్పి యుండెను. ఆనందుఁ డామెను, విచారించి 'యామె హృదయ భార మేమ'ని యడిగెను. ఆమె యన్నది:

"బౌద్ధ ధర్మమందు స్త్రీలు జేరుటకును, ప్రవ్రజ్య నాశ్రయించుటకును, భగవానుఁడు సమ్మతించుట లేదు. ఇఁక నాకుఁ జింత గాక సంతస మెట్లుండును!" అనందుఁ డామె నచ్చటనే నిలిపి బుద్ధుని సమీపించి "స్త్రీలు సన్యసించుట కధికార మీయ వలసినద"ని ప్రార్థించి నాఁడు. అతఁడు 'గాద'నెను. అపు డానందుఁడన్నాఁడు. "భదంతా! తథాగతులు వివరించిన ధర్మసంప్రదాయమం దొకానొక స్త్రీ భిక్షుణియై 'స్రోత ఆపత్తిఫలము' 'సకృదాగామిఫలము' 'అనాగామిఫలము' 'యర్హత్ఫలము'* వీనిని సాధించుటకు శక్యమగునా! లేదా!" భగవంతుఁడు బలికెను. 'శక్యమగును' ఆనం:- అట్లైనచో మహాప్రజాపతిగోతమి తల్లిగతించినప్పటి నుండి తమకుఁ బాలుపోసి పెంచి పెద్దజేసినది గదా! ఆమె వినతిని మీారంగీకరించి, స్త్రీలు సన్యసించుట కధికారమీా వలెను."

భగవంతుఁడనెను: "మహాప్రజాపతి గోతమి నేను జెప్పఁబోవు నెనిమిది నియమములు (అట్ఠగురుధమ్మా) జక్కఁగఁ బాలించినచో స్త్రీ సన్యసించుటకు నా యాక్షేపణలేదు. ఆ నియమము లివి:

1. భిక్షుణి సంఘమం దెన్ని సంవత్సరము లున్నను జిన్నయనక బెద్దయనక సర్వభిక్షువుల కామె నమస్కరింప వలెను.

2. భిక్షువులు లేని యూరియం దామె వసింపరాదు.

* ఈ నాల్గుఫలములయొక్క వివరణ మీప్రకరణముందే బైనరా నున్నది. పు: 178 చూ.

3. పక్షముదినములకు పైన యుపవసించిగాని, ధర్మోప దేశమును వినుటకుగాని, యెవరైన వచ్చినచో- యీరెండు సన్నివేశములందును భిక్షుసంఘమును విచారింపవలెను.

4. చతుర్మాసముల యనంతరము భిక్షుసంఘము- భిక్షుణీ సంఘము 'ప్రవారణ' ♦ యొనరింపవలెను.

5. ఏ భిక్షుణియుండి సంఘాదిశేషమైన యాపత్తి ఘటిల్లెనో యామె రెండుసంఘములనుండి పదునైదు దివసములు 'మానత్తమును' * గ్రహింపవలెను.

6. రెండువర్షము లభ్యసించిన తరువాత యట్టి తరుణ భిక్షుణుకి రెండుసంఘములు 'నుపసంపద' నీవలెను.

7. ఏకారణముచే గాని భిక్షుణి-భిక్షుకుని నిందించుటకు వీలులేదు.

8. భిక్షుణి- భిక్షువున కుపదేశింపరాదు. భిక్షు వుపదేశింప వచ్చును.

ఆనందుఁడీ యెనిమిది నియమములను 'గోతమి' కెఱిఁగించెను. ఆమె వీనిని బాలించుట కంగీకరించినది. దీనిపైని కథ 'యంగుత్తరనికాయము' లోని 'యట్ఠకనిపాత' మం దున్నది. ప్రజాపతి గోతమికి సన్యాసమునకు సమ్మతియొసఁగిన పిదప గౌతముఁడానందునితో ననెను. 'ఓయీ! యానందా! మన ధర్మవినయమందు స్త్రీలకధికారము లేకున్నచో

♦ తనదోషమును జెప్పికొనుటకై సంఘమునకు వినతిసేయుట. 'బౌద్ధసంఘాచా పరిచయ' పు 24-26 చూ:

* సంఘసంతోషమునకై విహారమునకు బైటనుండి రాత్రులు గడపుట; బౌద్ధసంఘాచా పరిచయ పు. 47 చూ.

సీధర్మము (బ్రహ్మచర్యము) వేయివర్షములుండెడిది. నేఁడు స్త్రీ ప్రవేశించుట కధికారమిచ్చితిమి. అందుచే సీధర్మమైదు నూఱువర్షములు మాత్రమే మనఁగలదు.

పై కథయంతయు వినయమందు గలదు. 'అంగుత్తర నికాయము'లోఁ గూడ నట్లేయున్నది. అయినను నీగురు ధర్మము లెనిమిదియు నెవరో దర్వాతివారు రచించి యా రెంటి యందునుఁ జొనిపియుందురని నా యూహ. కారణ మేమన వినయనియమములు రచించుటకు భగవంతుఁ డేపద్ధతి నవలంబించుచుండెనో దాని కీ 'గురుధర్మరచనా పద్ధతి' కేవలము భిన్నముగ నున్నది.

బుద్ధభగవానుఁడు 'వేరంజా' యను పల్లెకడ నుండెను. అపు డా పల్లెకు జుట్టుపట్టులఁ గఱవు వ్యాపించినది. భిక్షువులకు వసింపఁ గష్టమయ్యెను. సారిపుత్తుఁ డా విషయము బుద్ధునకు మనవి జేసి – భిక్షువుల యాచార విచార సంబంధమై గొన్ని గట్టుదిట్టముల నొనర్పవేడెను భగవంతుఁ డుత్తర మిచ్చి నాఁడు "సారిపుత్తా! నీ వూరకుండుము. నియమములు రచింప వలసిన యవసరము 'తథాగతునకుఁ' జక్కఁగాఁ దెలియును అది యాతని యక్కఱ. సంఘమునం దెంతవరకు బాపాచారము ప్రవేశింపలేదో యంతవరకుఁ దన్నివారక నియమ నిర్మాణము బుద్ధుఁ డొనరింపఁడు."*

బుద్ధుని యీ వచనము ప్రకారమే, సర్వనియమ రచనయు జరగియుండును. ఒకానొక భిక్షుఁ డొక తప్పో – లేక, పొరపాటునో యొనరించె ననుకొందము. ఈ విషయము

* 'బౌద్ధసంఘాచా పరిచయ' పు 52-53 చూ.

బుద్ధుని జెవికెక్కెను. ఆతఁడు భిక్షువులను జేర్చి యొక నియమము నుపదేశించును. దాని యర్థము భిక్షువులకుఁ దెలియలేదని బుద్ధునకుఁ దోఁచినప్పుడా 'సుత్తము' నాతఁడు వివరించును.

మహాప్రజాపతి గోతమి విషయమందు మాత్ర మీ పద్ధతి యుల్లంఘింపఁ బడినది. భిక్షుణీ సంఘమం దేదేని యొక దోసఁగు గన్పించినప్పుడే 'గురుధర్మములు' రచింప వలసి యుండెను. కాని మొదటనే యీ నియమములు వారితలపై రుద్దుట విలక్షణమైన సంప్రదాయము. దీనినిబట్టి నాకుఁ దోఁచున దిది. "భిక్షువులు సర్వాధికారములు తమ చేతులం దుంచుకొనుటకై - యీ ధర్మములను రచించి, తరువాత 'యంగుత్తర నికాయము'నందుఁ జొనిపినారు."

'వినయపిటకము'న కన్నను 'సుత్త పిటకము' ప్రాచీనము. కాని దానియందుగూడ నన్ని సుత్తములును కేవలము ప్రాచీనములుగనే దోఁచుటలేదు. కొన్ని యితరులు జొన్పించినవియు నున్నవి. వానిలో నిదియొకటి యని నా యభిప్రాయము. క్రీ॥ పూ॥ మొదటి శతాబ్దముననో, లేక రెండవ శతాబ్దముననో 'మహాయానపంథ' గొప్పప్రభ జూపినది. అప్పుడివి రచింపబడి యుండును. 'మహాయాన'మందు సద్ధర్మమనఁగా స్థవిరవాది పంథ. "భిక్షుణీ సంఘస్థాపనచే ధర్మ వినయ మేనూఱు వర్షములు మాత్రమే యుండును. తర్వాత నెక్కడబట్టినను, మహాయాన సంప్రదాయములు వ్యాపించు" నని యీ సుత్తకారుఁ డొక భవిష్యద్వాదమును లేవదీసినాఁడు. ఆ జోస్యముఁ జెప్పుటయే బుద్ధుని తరువాత నేనూఱు వర్షముల కీ సూత్తములు రచింపబడెనసుటకు హేతువు.

భారతవర్షమందుఁ దొట్టదొలుత భిక్షుణీ సంఘమును బుద్ధుఁడే స్థాపించియున్నచో నీ యెనిమిది గురు ధర్మములు నల్ప-స్వల్పముగ నితిహాసములలోనికి దులసూపి యుండెడివి. కాని, వస్తుస్థితి యట్లులేదు. బౌద్ధమున కొకటి రెండు శతాబ్దాలకు ముందే జైనము, మఱికొన్ని సంప్రదాయము లుండినవి. వానిలోఁ బెద్దపెద్ద భిక్షుణీ సంఘములుండెను. కొందఱు స్త్రీలు విదుషీమణులుగఁ గూడ నుండిరి. ప్రజ్ఞావతులకును గొఱవలేదు. ఈ విషయము 'పాలీభాషలో ననేకయెడల వచ్చును. వారిపద్ధతి ననుసరించియే బుద్ధుఁడు భిక్షుణీ సంఘస్థాపనమునకైఁ బ్రవర్తించెను. గణసత్తాక రాజ్యమందును గ్రొత్త క్రొత్తగ నెలకొన్న 'యేకసత్తాకము'లందుఁ గూడ స్త్రీలకెంతయో గౌరవ ముండెడిది. కనుక భిక్షుణీ సంఘము యొక్క రక్షణకొరకై విచిత్రములైన యీ నియమముల నేర్పరుపవలసిన యవసరమే లేదు. అశోకుని తరువాత నీ పరిస్థితి మారెను. మనదేశముపై యవనులు, శకులు, దండెత్తివచ్చిరి. క్రమక్రమముగా స్త్రీలగౌరవము తగ్గితగ్గి సమాజమందు వారికి వ్యక్తిత్వమే లేకపోయినది. ఆకాలమందు భిక్షుణీ సంఘమును గురించి, యీ నియమములు బయలు దేరుటలో వింత యేమున్నది?

## తరుణశ్రమణుఁడు - రాహులుఁడు

భిక్షుసంఘము- భిక్షుణీసంఘము స్థాపింపఁ బడిన తరువాత, తరుణశ్రమణులు- శ్రమణికలు, ప్రవేశింప మొదలుపెట్టిరి. తొట్టతొలుత-బుద్ధుఁడు రాహులుని శ్రమణుని గావించిన కథ 'మహావగ్గ'ము నం దున్నది. అది యిది:—

"బుద్ధుఁడు కొంతకాలము రాజగృహ మందుండి 'కపిలవస్తువు'నకు వచ్చెను. అతఁడచట న్యగ్రోధారామ మందు వసించు చుండెను. ఒకనాఁడు భగవానుఁడు శుద్ధోదనుని యింటిముందటనే భిక్షాటనము సేయుచుఁ బోవు చున్నాఁడు. రాహులమాత యాతనిఁ జూచినది. ఆమె రాహులునితో ననెను. "రాహులా! ఆ పోవువాఁడు నీ తండ్రి. అతనిని సమీపించి, నీ దాయభాగ మడుగుము. పొమ్ము." తల్లి మాటలు విని రాహులుఁడు భగవంతుని సమీపించి నిలచెను. రాహులుఁ డన్నాఁడు "శ్రమణా! నీ కీ నీడ సుఖకరముగ నున్నదా!" బుద్ధుఁడు మౌనియై ముందుకు గదలెను. రాహులుఁడు "నాకు దాయభాగమిమ్ము"నుచు వెంటఁ దగిలినాఁడు. ఇర్వురును విహారమును బ్రవేశించిరి. బుద్ధునకు దాయభాగ మొసఁగ బుద్ధిపుట్టెనేమో! సారిపుత్తుని బిలచి వెంటనే రాహులుని శ్రమణుని గావించెను. ఈ వృత్తాంతము శుద్ధోదనునికి రుచింపలేదు. చిన్నవయస్సులో నున్నవారు సన్యసించినప్పుడు వారి బంధుగులకెంత దుఃఖ ముండునో వివరించి చెప్పి, ఇఁకఁ వారికి శ్రమణత్వ మీయవలదని బుద్ధునకు విన్నవించెను. అల్పవయస్కులకు శ్రమణత్వ మివ్వరాదని బుద్ధుఁడు శాసించినాఁడు."

ఈ కథ చారిత్రకదృష్టి కాగుటలేదు. దానికి కారణములు రెండు. 1. శుద్ధోదనుఁడు కపిలవస్తువునందుఁ గాపురముండలేదు. 2. న్యగ్రోధారామము బుద్ధుని యుత్తర వయస్సున గట్టఁబడినది. ఆ సమయమున, రాహులుఁ డల్పవయస్కుఁడు గాఁడు. ఈ కారణములతో నీ కథ బుద్ధుని

నిర్వాణానంతరము కొన్ని శతాబ్దముల తరువాత రచింపఁబడి 'మహావగ్గ'లో జేర్పఁబడి యుండును.

బుద్ధుఁడు రాహులునకు శ్రమణక దీక్ష నొసఁగెను. అపుడు రాహులుని వయసు యేడేండ్లు. అని 'అంబలట్ఠిక రాహులో వాద సుత్తము'యొక్క యట్ఠకథ యందున్నది. ఇది నిజమని బౌద్ధులు నేటికిని నమ్మెదరు. బోధిసత్త్వుఁడిల్లు వదలునాటికి రాహుల కుమారుఁడు జన్మించి నాఁడు గదా! అప్పుడు శ్రమణక దీక్షనాటి కా కుమారుఁ డేడేండ్ల వాఁడగుట సంభవింపదు. ఎందుకనఁగా నిల్లు వదలిన బోధిసత్త్వుఁ డేడేండ్లు దప మొనర్చెను. తత్త్వబోధ గలిగిన వెనుక మొదటి చాతుర్మాస్యము 'వారణాసి' యందు గడపినాఁడు. తరువాత భిక్షు సంఘ స్థాపన కొక వర్షము బట్టి యుండు నను కొందము. అప్పుడు రాహుల కుమారుఁడు శ్రమణక దీక్ష గైకొను నాటి కే డేండ్ల వాఁ డగుట సాధ్యమగునా!

రాహులునకు శ్రమణక దీక్ష యెట్లొసఁగ బడినది. ఈ నిర్ణయము 'సుత్త నిపాతము' లోని రాహుల సుత్తము నుండి యూహించుట యుక్తము. దాని భాషాంతరీకరణ మీ క్రింద నివ్వఁ బడుచున్నది.

1. బుద్ధుఁడు :- సతత పరిచయముతో నీవు పండితుల కవజ్ఞ సేయవా! మనుష్యులకు జ్ఞాన ఖద్యోతుని గాన్పింపఁ జేయుటకై యోగ్య సేవను నొనర్తువా!

2. రాహులుఁడు :- సతత పరిచయముతో నేను బండి తుల కవజ్ఞ సేయను. మనుష్యులకు జ్ఞాన ఖద్యోతుని గాన్పింపఁ జేయుటకై సద్యోదితమైన సేవ యొనర్తును.

పైనిఁ జెప్పినది ప్రాస్తావిక గాధ.

3. బుద్ధుఁడు ప్రియ భాషణములతో మనసును గరగించు వాఁడా ! నీవు పంచేంద్రియముల పంచ కామోప భోగముల వర్జించి యింటి నుండి గదలుము. దుఃఖమును నాశన మొనర్చికొన్న వాఁడవు గమ్ము.

4. కళ్యాణ కరులైన మిత్రులతో మెలగుము. మనస్సును గలఁగించు-కల్లోలములు లేని యేకాంత స్థానమందు వసింపుము. మితాహారివి గమ్ము.

5. చీవరము, పిండపాతము, ఔషధము, శయనాసనము వీనిపై తృష్ణను ధరింపకుము. పునర్జన్మ నందకము.

6. వినయము యొక్క నియమమును సంయమముతోఁ బాలింపుము. పంచేంద్రియములకు లోఁబడకుము. యకామందు స్మృతి యుంచుకొమ్ము. వైరాగ్య పూర్ణుఁడ వగుము.

7. కామ వికారములచే మిశ్రితము లైన శుభ నిమిత్తముల వదలి పెట్టుము. ఏకాగ్రత, సమాధి, వీనిని సంపాదించిపెట్టు నశుభ నిమిత్తముల మాటి మాటికిని భావింపుము. *

---

* ఆ శుభ భావన గుఱించి 'సమాధి మార్గ' పు. 49-58 చూ:

8. నిర్వాణమును భావింపుము. అహంకారమును వర్జింపుము. అహంకారమును నాశన మొనర్చిననే నీవు శాంతిని బొంద గలవు.

ఈ విధముగ బుద్ధభగవానుఁడు పై గాథలను రాహులునకు మాటిమాటి కుపదేశించుచుండెను.

'సగటు'కు పై గాథ లెనిమిది. వానిలో నొక్కటి రాహులుని యుత్తరము. మొదటి గాథలో బండితునిగురించి ప్రస్తావించినాఁడు గదా బుద్ధుఁడు! ఆ పండితుఁడు సారిపుత్తుఁడే యగునని 'యట్ఠకథాకారుని' యభిప్రాయము కావచ్చునుగూడ. రాహులుఁడు జిఱుతవాఁడుగ నున్నప్పుడే బుద్ధభగవానుఁ డాతనిని సారిపుత్తుని పర్యవేక్షణక్రింద నుంచెను. మఱియొకటి రెండు వర్షములు గడచిన వెనుక రాహులునకు పై యుపదేశము లొసఁగి యుండును. ఎందు కనగా నా 'సుత్తము'న బ్రస్తావింపఁబడిన విషయములు కేవలము జిన్నపిల్లవాని కర్థమగునవి గావు. రాహులుఁడు శ్రమణకుఁడు గాకముందే "నీవు శ్రద్ధాపూర్వకముగ - గృహము నుండి వెడలి దుఃఖముల నాశ మొనర్చువాఁడవు గమ్ము" యని యుపదేశమిచ్చుట బొసఁగదు గదా?

బ్రాహ్మణ కుమారులు గురుగృహములకు వెళ్ళి - బ్రహ్మచర్యా పూర్వకమైన వేదాధ్యయనము గావింతురు. పిదప దమ యభిరుచి ననుసరించి గృహస్థాశ్రమమో, దపశ్చర్యయో యారంభింతురు. అటువంటి పద్ధతియే రాహులుని యెడఁగూడ జరగియుండవలెను. రాహులునకుఁ గొంత జ్ఞానమేర్పడవలెనను నుద్దేశముతో భగవానుఁ డాతనిని సారిపుత్తు

నకు స్వాధీనపరచి యుండును. బ్రహ్మచర్యము నవలంబింప నిది - రాహులునకు సారిపుత్తునితో నుండుట బొసఁగదు గదా! వయస్సు వచ్చిన తరువాత రాహులుఁడు గృహస్థాశ్రమమున బ్రవేశించునేమో యని తలఁచి బుద్ధుఁ డాతనికి బై యుపదేశ మొసఁగినాఁడు. ఈ రాహులుని వృత్తాంతము నాధారముగ దీసికొని 'మహావగ్గ' కారుఁడు శ్రమణక వృత్తాంతము విస్తృతమైన కథలుగాఁ బెంచి వ్రాసెను.

### ౦ ఇతర శ్రమణకులు

బుద్ధుని జీవితమందు - అల్పవయస్సున - సంఘమున జేరిన శ్రమణకులు జాలకొద్దిమంది. ఇతర సంప్రదాయముల నుండి - యేపరివ్రాజకులు బౌద్ధసంఘమున జేరుదురో -వారు నాలుగు నెలలు 'బూర్వసేవ' సేయవలసి యుండెను. శ్రమణకుల విషయమం దీ యాచార మింకను యెక్కువయ్యెనని దోచును. 'దీఘనికాయ'మందు 'మహాసీహానాద సుత్తము' కడపట నొకగాథ యున్నది. కాశ్యప పరివ్రాజకుఁడు భిక్షు సంఘమున జేర నిచ్ఛగించెను. అపుడు భగవానుఁ డాతనితో "గాశ్యపా! యీ సంప్రదాయమునందొక నియమ మున్నది. ఇతర మార్గములనుండి యెవరైనను - దీనియందుఁ జేరఁ దలఁచినచో - వారు నాలుగు నెలలు 'బూర్వసేవ' సేయవలెను. ఈ నాల్గునెలల తర్వాత వారిపై బౌద్ధభిక్షువులకు విశ్వాసము గలిగినచో వానికి 'బ్రవ్రజ' నొసఁగి - సంఘమున జేర్చికొందురు. ఈ నియమమున కపవాద సూత్రమేదియు లేదు"

కాశ్యపుఁడట్లే గాని మన్నాఁడు. నాలుగునెలలు గడచెను. భిక్షువుల కాతనిపై నమ్మకముగల్గినది. కాశ్యపుఁడు బౌద్ధభిక్షు వైనాఁడు.

## శ్రమణక సంస్థయొక్క యభివృద్ధి

శ్రమణకుల సంఖ్య-బుద్ధుని 'పరినిర్వాణా' నంతరము బ్రహ్మాండముగ వృద్ధిజెందెను. కడకుఁ జిన్నతనమున శ్రమణకులై భిక్షులైనవారిసంఖ్యయే యెక్కువైపోయినది. దీనితో ననేకదోషములు గలిగెను. బుద్ధభగవానుఁడు- యాతని ప్రముఖశిష్యులు యెవరికి సంఘదీక్ష నొసఁగిరో వా రెల్లరు ప్రపంచానుభవ మింతకుముందే గడించికొన్నవారు. దాని లోతుపాతులు గ్రహించినవారు. వారి మనస్సులు, మరల లోకమువైపు బరువెత్తుట సులభసాధ్యముగాదు. కాని జిన్నతనమునందే సన్న్యాసదీక్ష నిచ్చి ప్రపంచమునుండి యెవరిని బైటికిలాగిరో, వారి మనస్సులు సంసారమువైపు బరుగిడుట సహజమే. అయినను, బాహిరముగ, ప్రాపంచికములైన పనులొనర్చుటకు వారికి భయము. ఆంతరికములైన మనస్సుల నెవ్వరు నూతురు ?

వారిలో మానసికదోషములు దిక్కులేనన్ని బెరిగెను. బౌద్ధభిక్షు సంఘము లస్తమించుటకుఁ గొన్ని ప్రముఖకారణములున్నవి. వానిలోగూడ నిది ప్రధానమైనది. శ్రమణకుల వలెనే శ్రమణికల సంస్థలుగూడ బెరిగెను. శ్రమణకు లెప్పుడును భిక్షువుల పర్యవేక్షణక్రింద నుండెడువారు. శ్రమణికలు భిక్షుణీసంఘముల యాశ్రమమునం దుండిరి.

## శ్రావక సంఘములయొక్క నాల్గువిభాగములు

బుద్ధుఁడీ భిక్షుసంఘమును నాల్గు రీతులుగ వింగడించెను. ఆ విభాగమందు-శ్రమణకులు, శ్రమణికలు చేరలేదు. దీనిని బట్టి బుద్ధుఁడు జీవించినపుడు వీరిసంఖ్య జాల తక్కువయని తోఁచుచున్నది. భిక్షువులు, భిక్షుణిలు, ఉపాసకులు, యుపాసికలు, యివిమాత్రమే బుద్ధుఁడొనర్చిన శ్రావకసంఘ భేదములు.

భిక్షు సంఘముయొక్క కార్యకలాపము జాలపెద్దది. దీనిలో సందేహము లేదు. కాని- భిక్షుణిలు, నుపాసికలు వీరి జవాబుదారీకూడ జిన్నదిగాదు. వీరు భిక్షుసంఘముయొక్క యభ్యున్నతిని బుష్కలముగఁ బెంచినట్లు 'త్రిపిటక వాఙ్మయము' నం దనేక సాక్ష్యము లున్నవి.

### స్త్రీల పరిస్థితి

బుద్ధుని ధర్మమార్గమందు స్త్రీ-పురుషులకు భేదము లేదు. వారికి ధర్మసాధనమందు బురుషుల కున్నంత 'హక్కుం' డెడిది. సోమాభిక్షుణి మారునితో నొనర్చిన యీ సంవాదము విందము గాక!

రెండు యామముల వేళ 'సోమా' భిక్షుణి శ్రావస్తి దగ్గరి 'యంధవనము'లో ధ్యాన మొనర్చుటకై కూర్చున్నది. అపుడు మారుఁ డామెకడ కరుదెంచెను. మారుఁ డన్నాఁడు.

"యన్తం ఇసీహి పత్తబ్బం ఠానందు రభి సంభవం
నతం ద్వంగుల పఞ్ఞాయ సక్కాపప్పోతు మిత్థియా"

"నిర్వాణము ఋషులకే బొందుటకు సాధ్యమైనది. అది యత్యున్నతమైనది. దానిని స్త్రీలు బొందుటకు సాధ్యముగాదు."

సోమాభిక్షుణి మారున కీ క్రింది యుత్తర మిచ్చెను.

"ఇత్థి భావో, కిం, కయిరా చిత్తంహి సుసమాహితే
ఞాణమ్హి వత్తమానమ్హి సమ్మా ధమ్మం విపస్సతో
యస్స నూన పియా ఏవం ఇత్థాహం పురిసోతివా
కించి వా పన అస్మీతి తం మారో వత్తు మరహతి*"

"చిత్తము సుసమాహితమైనప్పుడు- జ్ఞానము , వర్తమానమైనపుడు-ధర్మము నెఱుఁగ యత్నించు వ్యక్తికి స్త్రీత్వ మెట్లు బాధకము? ఎవ్వరికి నేను స్త్రీ యనిగాని- బురుషుఁడ ననిగాని- నేనిట్టి వాఁడననిగాని యహంకార♦ మున్నచో వారి కడకేగి నీమాటలు జెప్పుము."

తన్ను 'సోమాభిక్షుణి' యోడించిన దని తెలిసికొన్న మారుఁడు విన్ననైన మొగముతో నటనుండి వెడలిపోయెను.

ఈ సంవాదము గావ్యమువలె నున్నది. కాని- బౌద్ధ సంఘమున స్త్రీల పరిస్థితి యెట్టిదో, దానిని స్పష్టముగఁ జూపించు చున్నది.

---

* భిక్షుణీ సంయుత్త, సుత్తము 2.

♦ అహంకారము మూఁడు రీతులు. (1) నేను శ్రేష్ఠుఁడ ననెడు మానము. (2) నేను సదృశుఁడ ననెడు మానము. (3) నేను హీనుఁడ ననెడు మానము. విభంగము (P. T. S) పు: 346 మఱియు 353.

## నిర్వాణమార్గమందు శ్రావకుల నాల్గుభేదములు

నిర్వాణ మార్గమందు శ్రావకులలో నాల్గు భేదము లున్నవి. అవి-'సోతాపన్న-సకదాగామి-అనాగామి- అరహో' యనెడునవి. '1. సక్కాయ దిట్ఠి 2. విచికిచ్చా 3. శీలబ్బత పరమాస'ములు. నాశ మొనర్చి కొనుట తొలుతటి స్థితి యగును 'సక్కాయ దిట్ఠి' యనఁగా నాత్మభిన్నమై నిత్యమైన దనెడు దృష్టి. 'విచికిచ్ఛ' యనఁగా బుద్ధుఁడు-ధర్మము-సంఘము వీనియందలి యవిశ్వాసము. 'శీలబ్బత పరామాస' యనఁగా, స్నానాదిక వ్రతములు- నుపవాసములు- వీనిచేత, ముక్తి గలుగు ననెడు విశ్వాసము. ఈ మూడు బంధములు నాశనమైనచో నట్టి శ్రావకుడు 'సోతాపన్నుఁడు'. ఆ మార్గమందు వాఁడు దిరముగానిలచిన 'సోతాపత్తి ఫలట్ఠుఁ'*డగును. కామ వాసనలు నశించి, క్రోధ బంధము శిథిలమై యజ్ఞానము దక్కువైనచో నా శ్రావకుఁడు 'సకదాగామి'. వాఁ డాస్థితియందే స్థిరుడైన 'సకదాగామి' ఫలట్ఠుఁడు. పైని చెప్పిన యైదు బంధములు సంపూర్ణముగ వీడిన శ్రావకుఁ డనాఁగామి. ఆమార్గమున స్థిరమైనవాఁడు 'అనాగామి ఫలట్ఠుఁడు.' రూపరాగములు-అరూపరాగములు-మానము-ఉదచ్ఛ-అవిద్య-యీ యైదు సంయోజనములు, నాశన మొనర్చి కొన్నచో వాఁ డర్హతుఁడు. రూప రాగమనగా బ్రహ్మలోకాది ప్రాప్తికై యిచ్ఛ; అరూప రాగమనుటకు రూపము లైన దేవ లోకములఁ బొందు నాశ యని యర్థము. రూప మనగా నహంకారము. భ్రాంత చిత్తత 'ఉద్ధచ్ఛ'. 'అవిజ్జ'యే

* ఫలస్థుఁడు;

యవిద్య; అర్హాతుని స్థితి యందే స్థిరముగ నున్న వాఁడు 'అరహాఫలస్థుఁడు'. ఈ రీతి శ్రావకులు నాలుగు లేక యెని మిది భేదము లౌదురు.

చిత్ర- విశాఖులు గృహస్థులు. వీ రనాగాములైరి. ఆనందుడు భిక్షువు. ఇతఁడు బుద్ధుని కాలమందుఁ గేవలము 'స్రోతా పన్నుఁడు' మాత్రమే యయ్యెను. 'క్షేమ' 'ఉత్పల వర్ణ' మొదలైన స్త్రీ 'లర్హాత్ఫలము' నంది కొనిరి. అనఁగా నర్థమేమి ? నిర్వాణ మార్గమందు సాఁగి పోవుటకు స్త్రీత్వము గాని, గార్హస్థ్యము గాని యడ్డంకులు గావనియే గదా !

## సంఘము యొక్క ప్రతిష్ఠ

"బుద్ధం సరణం గచ్ఛామి
ధమ్మం సరణం గచ్ఛామి
సంఘం సరణం గచ్ఛామి"

ఈ మూఁటిని శరణ గమన మందురు. నేటికిని బౌద్ధులీ 'శరణ గమన'మును బలుకుదురు. ఈ పరిపాటి బుద్ధుని కాలమందే మొదలయ్యెను.

తన ధర్మ భార మంతయు బుద్ధ భగవానుఁడు సంఘమునకే యొప్పించెను. ఈ విషయము జాగ్రత్తగ గమనిపఁ దగినది. ఈ పద్ధతి యే ధర్మమందును లేదు. ఏసుక్రీస్తు "కష్టపడుచున్న జనులారా ! భారాక్రాంతులైన జనులారా ! మీ రందఱు నా కడకు రండు. నేను మీకు విశ్రాంతి నిత్తు ననెను.*

* Matthew, 11, 28.

కృష్ణుఁడు భగవద్గీతలో.

"సర్వ ధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ।
అహం త్వా సర్వపాపేభ్యో మోక్ష యిష్యామి మాశుచః"*

"సర్వ ధర్మములను పరిత్యజించి నన్నే శరణు బొందుము. నిన్ను సర్వపాపములనుండి విముక్తుని జేయుదును. శోకింపకుము!"

కాని, బుద్ధుని బోధయే వేఱొక తెఱఁగు. ఆయన "నీవు బుద్ధ ధర్మమును, సంఘము నాశ్రయించుము. నీ యొక్క పరిశ్రమచే సర్వ దుఃఖములును నాశన మొనర్చుము. లోక దుఃఖముల దగ్గింపుము."

ప్రపంచమందు సుజ్ఞానులు - శీలవంతులైన స్త్రీ పురుషులను గొప్పసంఘముగ జేర్చి - వారిని మన మాశ్రయించి నచో-దుఃఖవినాశము యొక్క మార్గము సుగమముగాదా?

సంఘమే సర్వమున కగ్రగామి

బుద్ధుఁడు భిక్షుసంఘమున కొకనాయకు నేర్పాటు సేయలేదు. బుద్ధసంఘ మంతయు గలిసి - సంఘకార్యములు గావింపవలెను. ఇదే యాతని నియమము. 'ఏకసత్తాక రాజ్య పద్ధతి'లోఁ బుట్టిపెరిగిన జనులకు బుద్ధుని యీపద్ధతి వింతగఁ గన్పించుటలో నాశ్చర్యము లేదు.

బుద్ధుఁడు నిర్వాణమందిన కొద్దిరోజులకు జరిగినవృత్తాంతము. అపుఁ డానందుఁడు రాజగృహమం దుండెను. ప్రద్యోత

* భగవద్గీత; అ. 18; శ్లో 66.

నుని వలని భయముతో నజాతశత్రుఁడు రాజగృహము కోట, క్రొత్తడములు బాగుపఱచుట కుపక్రమించినాఁడు. ఈ కార్యము 'గోపకమోగ్గల్లాను'న కొప్పింపఁబడెను. ఒక నాఁ డాయుష్మంతుడైన యానందుఁడు రాజగృహమునందు భిక్షకై వెడలినాఁడు. కాని భిక్షాటనమున కింకను సమయము గాలేదు. అతఁడు మోగ్గల్లానుని సమీపించెను. మోగ్గల్లాను డానందున కాసనమువేసి, దాను క్రింద నధివసించెను వా రిర్వురి సంవాదము జరగినది 'బుద్ధభగవానునితో సమానమైన గుణములు గల భిక్షువు వేఱొకడున్నాడా?'

ఆనందుఁడు:- 'లేదు.'

ఇంతలో 'వస్సకార బ్రాహ్మణుఁ' డచటికి వచ్చెను. అతఁడు మగధదేశ ప్రముఖ మంత్రి. వీరిర్వురికి జరగిన సంవాదము నాతఁడు విచారించి దెలిసికొని యానందు నిట్లు ప్రశ్నించెను. 'బుద్ధులు బరినిర్వాణమైరి గదా! వారు వేరొక్కని దమ స్థానమున కెన్నికొనలేదా? ఎన్నికొనకున్నచో భిక్షు సంఘమెవ్వరిని శరణు జొచ్చుట?'

ఆనందుఁడు:- వారెవ్వరి నెన్నుకొనలేదు.

వ॥ బ్రాహ్మణుఁడు:- తమ యనంతరము దమ స్థానమాక్రమించుటకై యర్హులెవ్వరైన నున్నారని బుద్ధునకుఁ దోపలేదా?

ఆనందుఁడు:- తోపలేదు.

వ॥ బ్రాహ్మణుఁడు:- అట్లైనచో సీకుఁగాని భిక్షుసంఘమునకుఁ గాని నాయకుఁడెవ్వఁడును లేఁడన్నమాట. మఱి యీ సంఘకార్యము లెట్లు సమగ్రముగ జరగును?

ఆనందుఁడు:- మాకెవ్వఁడును నాయకుఁడు లేఁడని భావింపకుము. బుద్ధభగవానుఁ డేర్పఱచిన వినయ నియమములే మా నాయకుఁడు. ఎప్పుడైన భిక్షులొక్కచోఁ జేరినచో వారందరు నియమములను దమలోఁదాము విచారించికొందురు. మా భిక్షువులలో నెవఁడేని యొక దోషమొనర్చినపుడు - వాఁడే దనతప్పును తెలియబరచి ప్రాయశ్చిత్త మొనర్చికొనును ......... ......... అట్లే యెవఁడేని యొకభిక్షువు శీలాది గుణములచేత సంపన్నుఁడైనచో, నతనిని మేమందఱు గలసి యభినందింతుము. గౌరవింతుము.

వస్సకార బ్రాహ్మణుఁ డజాత శత్రుని మంత్రి. ఎవఁడైన నొకఁడు సర్వాధికారి లేనిది 'రాజ్యవ్యవస్థ' సరళముగ జరుగుట సాధ్యము గాదని యాతని విశ్వాసము. ఒకవేళ బుద్ధుఁడు దన స్థాన మెవ్వరికి నేర్పాటు సేయక పోయినను- దక్కిన భిక్షులైననుఁ జేరి యొక వ్యక్తి నాస్థానమున కెన్నికొనవలెనని యాతని తలఁపు. కాని యిట్టి సర్వాధికారి లేకయే బుద్ధుని తర్వాతఁగూడ సంఘకార్యములు సరళముగ సాఁగిపోయినవి. దీనినిబట్టి బుద్ధుఁ డేర్పాటుసేసిన సంఘరచన సమర్థమైన దనుటకు సందేహింపఁ బనిలేదు.

# అనుక్రమణిక

# ఏడవ ప్రకరణము

# ఆత్మవాదము

## ఆత్మవాదులైన శ్రమణులు

నివాప సుత్తమునందు బుద్ధ సమకాలీనులైన శ్రమణ బ్రాహ్మణులు నాల్గు తెఱఁగులవా రని జెప్పఁబడినది. ఈ విభాగము స్థూలముగ మాత్రమే. వారిలో మొదటివారు సోమపాయులు. యజ్ఞయాగ కరణైక తత్పరులు. సోమ పానమున గల్గెడు సుఖముతోనే మోక్షము లభించు ననెడు వారు. ఋషులు, మునులు రెండవ తెగవారు. వీరు సోమ పానమును నిరసించిరి. అడవులలో నివసించిరి. కఠినతర తపశ్చర్యను సాధించిరి. వీ రట్లే యడవులలోఁ జాల కాలము నిలువలేక పోయినారు. మరల జనత లోనికి వచ్చి - యా సుఖమునే యాదరింప దొడఁగిరి. పరాశరుఁడు, ఋష్య శృంగుఁడు మొదలైన వారీ తెగవారే. మూఁడవ పద్ధతి వారు శ్రమణ బ్రాహ్మణులు. పల్లెల చుట్టు పట్టులనే సించుచు మెలఁగు చుండిరి. వీరు మితాహార భోక్తలు. కాని, యాత్మ వాదానురక్తులు. ఆత్మ శాశ్వతమా! గాదా! యనుచు-పనిలేని నిరంతర వాద పరంపరతో వీరి జీవితములు గడచెడివి. అగుటచే వీరును మారుని జాలమునకుఁ జిక్కిన వారే. బుద్ధ భగవానుఁ డీ యాత్మ వాదమును వదలిపెట్టి, తన తత్త్వమును సత్యమునను సరించి నిర్మించెను. కనుక నీ

బౌద్ధ శ్రావకులు మారుని వలలోఁ జిక్కికొన లేదు. వీరు నాల్గవ తెగవారు.

బుద్ధుఁ డీ యాత్మవాదమును నెందుకు వదలి పెట్టెను? ఈ విషయమును విచారించుటకు ముందా కాలములోని యాత్మవాదము యొక్క విభేదము లేవో తెలిసికొనుట మంచిది. బుద్ధుని కాలమందు 62 శ్రమణ పంథ లుండెనని మూఁడవ ప్రకరణమున జెప్పికొంటిమి. వానిలో నేది గూడ నాత్మవాద జాలికనుండి దప్పించి కొన్నదిగాదు. ఈ యఱువదిరెండు శ్రమణపంథల మార్గము లెట్టివో దెలిసికొనుటకు మన కీనాఁడు సామగ్రిసంపత్తి లేదు. కాని - వానిలో ముఖ్యమైనవి యాఱు. వీని వివరములు 'పాలీ' భాషలో నక్కడక్కడ గన్పడును. వాని సాయముతో నితర శ్రమణ బ్రాహ్మణుల యాత్మవాదపుఁ దెరువులు, కొంతవఱకు మన మూహింపవచ్చును.

## అక్రియావాదము

ఈ యాఱిటిలో నక్రియావాదము మొదటిది. దీని పురస్కర్త పూరణ కస్సపుఁడు. ఆ వాదముయొక్క సారాంశ మిది. "ఒకఁ డేమి జేసినను; జేయించినను బాపము లేదు. మరి యొకని నఱికినను, నఱికించినను, గష్టము గలిగించినను, యితరులచేతఁ గలిగింపఁ జేసినను, శోకము నొసఁగినను, మఱియొకనిచే నితరునికి గలిగింపఁ జేసినను - దీనిలో నేపాపమును లేదు. ప్రాణులనుఁ జంపుట, యింటిదోపిడి, దొంగతనము, దారి దోపిడి, పరదారగమనము, యసత్య భాషణము, యివి దాను

జేసినను- జేయించినను గూడఁ బాపము సున్న. తీక్ష్ణధార గల యొకచక్రము - యొకానొకని మాంసము గోసి కుప్పలు వేసె ననుకొందము. లేక ప్రపంచముపై నున్న యన్ని ప్రాణుల మాంసమును గోసి కొండలు వేసె ననుకొందము. దానిలో దోష మెవరిది ? మనుష్యుఁడు గూడ నంతే. గంగా నదియొక్క దక్షిణ తీరమునకు వెళ్ళి, యచట, నొకనిని నఱకి నను, నఱకించినను, భయపఱచిను, భయపఱపించినను, బాపము సున్న. గంగానదియొక్క యుత్తరతీరమందు దాన మిచ్చినను - యిప్పించినను, యజ్ఞము సేసినను, జేయించినను బుణ్యము వీసమంతరాదు. దానధర్మములు - సంయమ సత్య భాషణాదులు వీనితోఁ బుణ్యము లేదు.''

## నియతివాదము

మఖలిగోసాలుఁడు - దీని నాయకుఁడు. దీనికి 'సంసారశుద్ధివాద' మనియు బేరు. ఆతని సిద్ధాంత మిది. ''ప్రాణుల యపవిత్రతకు- హేతుకరణములు లేవు. 'హేతు కర ణములు లేకయే ప్రాణి యపవిత్రము.' అట్లే - దాని శుద్ధికిని హేతువు లేదు. కరణము లేదు. పై రెంటి యపేక్ష లేకయే ప్రాణి శుద్ధుఁడగును. స్వతస్సామర్థ్యముతో నేదియు నగుట లేదు. ఇతరుల సామర్థ్యముతో గూడ నింతియే. బలవీర్యములు, బురుషశక్తి, బురుషపరాక్రమము యివియన్నియు వట్టి పద ములే. సర్వసత్వములు-ప్రాణులు, సర్వభూతములు, నన్నియు నవశములు. దుర్బలములు. నిర్వీర్యములు. ఇవి నియతి, లేక స్వభావము- వీనియొక్క సంబంధముతోఁ బరిణతము లగును. ఆఱింటిలో నేదో యొక జాతియందు జన్మించి, సుఖదుఃఖము

లనుభవించును.... చతురుఁడుగాని, మూర్ఖుఁడుగాని, వీరిర్వు రును, నెనుబదినాల్గు లక్షల మహాకల్పము లనెడు చక్రము లలోఁ దిరిగిన తరువాతనే దుఃఖనాశము నందునది. 'శీల, వ్రత, తపాదులతోఁగాని- బ్రహ్మచర్యముతోగాని - యపరి పక్వకర్మను పక్వమొనరింతును. పరిపక్వమైన కర్మఫలము ననుభవించి దానిని నాశనమొనర్తును' ఇట్లెవఁడైన నన్నచో వాఁడూఱక ననుకొనవలసినదే. ఈ సంసారమున సుఖదుఃఖ ములు బరిమిత ప్రమాణములతో నున్నవి. ఈ ప్రమాణము ముందే నిర్ణీతము. దీనిలో నెచ్చుతగ్గు లొనర్చుట కెవ్వనికిని, నధికారములేదు. చతురుఁడుగాని - మూర్ఖుఁడుగాని యీ సమగ్రభ్రమణముల యనంతరమే దుఃఖనాశమును బొందుట కర్హులు."

ఉచ్ఛేదవాదము

"దానయజ్ఞ హోమాదులలో నేమియు లేదు. చెడ్డ పనులయొక్క ఫలముగాని, బరిణామముగాని హుళక్కి. ఇహ లోక-పరలోకములు, మాతా - పితలు, స్వర్గ - నరకవాసులు, యీ ప్రాణులు గగనసుమము. ఇహలోక పరలోకము లెఱిఁగి సమగ్ర జ్ఞానముతో నితరులకుఁ దెలుపు తత్త్వజ్ఞులు, యోగ్య మార్గ నివిష్టులైన శ్రమణ బ్రాహ్మణులు - వీ అందరును మిథ్యయే. మనుష్యుఁడు నాల్గు భూతపదార్థముల సమ్మేళ నము. వాఁడు మరణించినప్పుడు పృథివీపదార్థము పృథ్విలోఁ జేరును. అట్లే యాపస్తేజో వాయుపదార్థములు వానివానిలో మిళితము లగును. ఇంద్రియము లాకాశమున జేరిపోవును. చచ్చినవాని 'నితరులు' బాడెపై స్మశానమునకు మోసికొని

పోవుదురు. వాని గుణావగుణములగురించి జర్చింతురు. ఆ శవముయొక్క- యెముకలు - మొదలైనవి భస్మమై పోవును. అంతే. ఇఁక మిగులున దేమున్నది? దానములు - మొదలైన గడబిడ మూర్ఖుల విశ్వాసము. ఆస్తికవాదము వ్యర్థము. కేవల శబ్దచాతుర్యము. శరీరము నాశనమైనపిదప మూర్ఖుఁడు లేక చతురుఁడు యిర్వురు నొకేరీతి యుచ్ఛేదింపఁబడుదురు. వినాశమే వారి కడ." ఈ వాద 'మజిత కేశకంబలుఁడు' ప్రచారము సేసెను.

## అన్యోన్య వాదము

'పకుధ కచ్చాయనుఁ' డన్యోన్యవాదకర్త. ఆతని వాద మిది: 'ఏడు పదార్థముల నెవ్వఁడును జేసినది లేదు. జేయించినదియు లేదు. నిర్మించినదియు లేదు. నిర్మింపఁజేసినదియు లేదు. అవి వంధ్యములు. కూటస్థములు. నగరద్వారముపై నున్న స్తంభము* వలె నచలములు కదలవు. మార్పడవు. పరస్పరము బాధించికొనవు. పరస్పరము సుఖదుఃఖములు గూడఁ గల్గించికొనవు. ఇవి పృథి వ్యాప స్తేజో వాయువులు. సుఖ-దుఃఖ జీవములు. ఈ యేడిటిని నాశము సేయువాఁడు- జేయించువాఁడు - జెప్పువాఁడు-వినువాఁడు-దెలిసినవాఁడు - వీనిని యథావత్తుగా వర్ణింపగల వాఁ డెవ్వఁడును లేడు. తీక్ష్ణ

* ఏన్గులు నగరద్వారములను, సులభముగఁ గుంభస్థలములలో భేదింపరాదని, యా ద్వారములకెదురుగా నొక స్తంభమును నాపెడు వారు. ఆ స్తంభమునకు 'పాలీ' భాషలో 'ఏసీఁ' యందురు. 'ఇందఖీల' మనియుఁ బేరు.

శస్త్రముతో నొకని కాలు నఱకినచో వానిజీవము బోదు గదా! అట్లే నీయేడు పదార్థముల నడుమనున్న యవకాశ మును శస్త్రముతో గ్రుచ్చిన ఫలము శూన్యము.

## విక్షేపవాదము

సంజయ బేలట్ఠ పుత్త్రుఁడు విక్షేపవాది. "పరలోక మనగా నేమి? యని విచారించిన - దాని రూపు రేఖలుఁ గొంత యైనను నాకు భాసించినచోఁ బరలోక మున్నదన గలను. నా కట్లు భాసించుట లేదు. పరలోకము లేదనుట కును- నాకుఁ దెలియదు. స్వర్గ-నరక వాసులైన జీవు లున్నారో; లేదో! తథాగతుఁడు మరణాంతర ముండునో; లేదో! వీనిలో నేది గూడ నాకుఁ దెలియుట లేదు."* ఇది యతని వాదము.

## చతుర్యామ సంవర వాదము

'నిగంఠనాద పుత్త్రు'డీ వాద పురస్కర్త. ఈ నాల్గు యామముల విషయము గొంత 'సామంజ ఫలసుత్తము'న వచ్చును. కాని - యది యపరి పూర్ణము. అహింస-సత్యము-యస్తేయము - యపరిగ్రహము యీ నాల్గు యామములు పార్శ్వముని యుపదేశించెనని జైన గ్రంథములలోఁ గలదు మహావీరస్వామి బ్రహ్మచర్యమును గూడ వీనిలోం జేర్చి

* 'సామంజ ఫలసుత్తము'న నిగంఠనాథపుత్తుని 'చతుర్యామ సంవరవాదము' విక్షేపవాదమునకు ముందుజేర్పఁబడినది. కాని 'మజ్ఝిమ నికాయము' 'చూళసారోపమ సుత్తము' మొదలగువానిలోఁ గడపటఁ జెప్పఁబడెను.

నాఁడు. కాని - బుద్ధ సమకాలీనులైన 'నిర్గ్రంథు'లలోఁ (జైన లోకాంతులు) గూడ నాల్గు యామములకు - మన్నన యున్నది. నాల్గు యామములు - దపశ్చర్య - వీనితోఁ బూర్వ జన్మమందుఁ గావించిన పాతకముల నిరసన మొన రించి - కైవల్యమును సాధించుట - జైన ధర్మము యొక్క- మధితార్థము.

## అక్రియావాదము మఱియు సాంఖ్యమతము

పూరణ కాశ్యపుని యక్రియా వాదమునకు, సాంఖ్యుల దత్త్వజ్ఞానముతోఁ జాల పోలిక లున్నవి. "ఆత్మ ప్రకృతి కంటెను భిన్నమైనది. 'చచ్చుట - చంపించుట' యిత్యాది కృత్యముల పరిణామము దానికిఁ గల్గుట లేదు" యని సాంఖ్యులు దలఁతురు. ఈ వాదమునకుఁ బ్రతిధ్వనియే భగ వద్గీతలో వేలు వేలు దావులఁ గన్పడును.

"ప్రకృతేః క్రియ మాణాని - గుణైః కర్మాణి సర్వశః
అహంకార విమూఢాత్మా - కర్తాఽహమితి మన్యతే."

"ప్రకృతియొక్క- గుణములచే సర్వకర్మలు జేయఁ బడు చున్నవి. కాని యహంకార మోహితమైన యాత్మ- నేను గర్త ననుకొనును."

(అధ్యాయము-3. శ్లో. 27)

"య యేనం వేత్తి హంతారం।యశ్చైనం మన్యతేహతం
ఉభౌ తౌ న విజానీతః। నాయం హంతి-నహన్యతే॥"

"తనొక్కఁడు జంపునను గొనువాఁడును, జంపెడనను వాఁడును-యిర్వురును సత్యము నెఱుఁగరు. ఆత్మ జచ్చునది గాదు. చంపఁ బడునదియు గాదు."

(అధ్యా. 2. శ్లో. 21)

"యస్య నాహం కృతోభావో - బుద్ధిర్యస్య నలిప్యతే।
హత్వాపి స యిమాఞ్ లోకాన్ - నహంతి న నిబధ్యతే॥"

"ఎవ్వని కహంభావము లేదో, యెవని బుద్ధి యలిప్తమో- యట్టివాఁ డీప్రాణుల వధించినను - వధింపనివాఁడే. వాఁ డాకార్యమున బద్ధుఁడుగాఁడు."

(అధ్యా. 18, శ్లోకము 17)

ఇత్యాదులు.

## అక్రియావాదము మరియు సంసారశుద్ధివాదము

అక్రియావాద-సంసారశుద్ధి వాదముల కెక్కువభేదము లేదు. ఆత్మ ప్రకృతినుండి యలిప్తమైనను - నది నిర్ణీతము లైన జన్మల ననుభవింప వలిసినదే. తరువాతఁ దనకుఁ దానే ముక్తమగును. ఇది వీరియూహ. ఎనుబది నాలుగు లక్షల జన్మల తరువాతఁ బ్రాణి యున్నత దశను బొందునను విశ్వాసము నేటికిని హిందూ సంఘమున నున్నది. మక్ఖలి గోసాలుని కాలమం దిది తీవ్రప్రచారం దుండెనని దోచును.

కొంతకాలమునకు పూరణ కాశ్యపుని సంప్రదాయము మక్ఖలి గోసాలుని యా 'జీవకపంథ'లో జేరిపోయెనని దెలియును. ఈవిషయ 'మంగుత్తరనికాయ' మందలి 'ఛక్కనిపాతము' యొక్క యేఁబది యేడవ సూత్రము సూచించును.

ఆనందుఁడు భగవానునితో ననును. "భదంతా! పూరణ కాస్సపుఁడు 'కృష్ణ-నీల-లోహిత-హారిద్ర-శుక్ల-పరమ శుక్ల ము'లను నా అభి జాతులను దెలిపెను. కటికలు-వేటగాండ్రు, మొదలలైనవారు, కృష్ణాభిజాతియందుఁ జేరుదురు. భిక్షువులు మొదలైన గర్మవాదులు నీలజాతియందు జేరుదురు. ఒక వస్త్రమును ధరించు 'నిర్గ్రంథు'లు లోహితాభి జాతీయులు. తెల్లని వస్త్రమును ధరించు నచేల శ్రావకులు (ఆజీవకులు) హారిద్రాభి జాతిలోనివారు. ఆజీవకులు - నాజీవక భిక్షుణీలు శుక్లాభిజాతీయులు. నంద, వచ్ఛ, సంకిచ్ఛ, మక్ఖలి గోసాలురు పరమ శుక్ల జాతిలోనివారు.

దీనిచే 'పూరణకాస్సప' సంప్రదాయము, ఆజీవకుల సంప్రదాయము-యించుమించు నొకటేనని స్పష్టముగఁ దెలియును. నంద-వచ్ఛ, మొదలైన ముప్వురాచార్యులు 'నాజీవక' పరంపరలో నగ్రేసరులు. వారి యాత్మవాదమునకు - 'పూరణకాస్సపు'ని వాదమునకు భేదములేదు. వారి దేహదండన పద్ధతి పూరణ కాస్సపునికి సమ్మతమే.

## అజిత కేశ కంబలునియొక్క నాస్తికవాదము

అజిత కేశ కంబలుఁడు బూర్ణ నాస్తికుఁడు. ఇతని - యుచ్ఛేదవాద మింతకుముందే జెప్పఁబడినది. సర్వదర్శన సార సంగ్రహామందుఁ గనపడు చార్వాక మతమున కితఁడు సంస్థాపకుఁడు గాకున్నను నొక దొడ్డనాయకుఁడు గావచ్చును. బ్రాహ్మణుల యజ్ఞయాగము లీతనికి సమ్మతము గానట్లే - యాజీవకాది శ్రమణుల తపశ్చర్యయు మాన్యము గాదు. సర్వదర్శన సంగ్రహామం దిట్లున్నది.

"అగ్నిహోత్రం త్రయోవేదా స్త్రిదండం భస్మగుంఠనం
బుద్ధిపౌరుష హీనానాం జీవికా ధాతృనిర్మితా"

"అగ్నిహోత్రము, మూఁడు వేదములు, త్రిదండధారణము, భస్మావగుంఠనము - యీ నాల్గును బ్రహ్మదేవుని చేత బుట్టింపఁబడిన బుద్ధిహీనులకు - పౌరుష హీనులకు నుపజీవికలు."

ఈ రీతి వాదించినను, 'అజితుఁడు' శ్రమణులలో నొకఁడుగ లెక్కింపఁబడెను. దీనికిఁ గారణమేమి? వైదికమైన హింస యీతనికి బూర్తిగ నిష్టములేదు. శ్రమణులవలెఁ దపశ్చర్యనుఁ జేయకున్నను - వారి యాచార - విచారములకుఁ గొంత సమ్మతి జూపినాఁడు. వారి యాత్మవాదమునకుఁ గూడ నితఁడు బూర్తిగ విముఖుఁడు గాఁడు. 'నాల్గు మహాభూతముల సంకలనముతో యాత్మ బుట్టును. చచ్చినపుడు మరల నా నాల్గు మహాభూతములలోఁ బోయి చేరును.' ఆత్మకు సంబంధించినంతవర కిది యీతని కల్పన. అందుచే;

"యావజ్జీవం సుఖం జీవే - న్నాస్తి మృత్యో రగోచరః
భస్మీభూతస్య దేహస్య - పునరాగమనం కుతః?"

"జీవించువరకు - సుఖముగ జీవింపవలెను. మృత్యువున కగోచర మేదియులేదు. భస్మీభూతమైన దేహమునకు మరలివచ్చుట యెక్కడిది?" అని యీతఁ డభిప్రాయ పడుట సహజమే.

ఈ కేశకంబలుని తత్త్వజ్ఞానమునుండియే లోకాయతుల యర్థశాస్త్ర ముద్భవించెను. దానిని కౌటిల్యునివంటి యాచార్యు లభివృద్ధి పఱచిరి.

## అన్యోన్యవాదము - వైశేషికదర్శనము

'పకుధకచ్చాయను'ని యన్యోన్యవాదము వైశేషిక దర్శనమువంటిదే. కాని - వారి యేడు పదార్థములకును-వైశేషికుల పదార్థములకును బోలిక చాలతక్కువ. 'కచ్చాయను' నికి గొప్ప శ్రమణసంఘ ముండెను. అయినను - నతని పరంపర స్థిరముగ నెలకొనలేదు. అర్వాచీన వైశేషిక దర్శన మీతని తత్త్వజ్ఞానమునుండి బుట్టినదే. కాని - యీ తత్త్వజ్ఞానము నాదరించు శ్రమణ సంప్రదాయము బుద్ధుని యనంతరము లేదు.

## విక్షేపవాదమును, స్యాద్వాదమును.

'సంజయ బేలట్ఠపుత్తు'ని విక్షేపవాదము జైనుల స్యాద్వాదము వంటిదే. కొంతకాలమునకు విక్షేపవాదమును జైనులు - దమ తత్త్వజ్ఞానమందుఁ జేర్చికొన్నారు. 'స్యాదస్తి (ఉన్ననుండ వచ్చును.) 'స్యాన్నాస్తి' (లేకున్నను లేకపోవచ్చును) ఇది స్యాద్వాదము యొక్క స్థూలస్వరూపము. 'బేలట్ఠపుత్తు'ని విక్షేపవాదము గూడ నిట్టిదే. కనుక జైన సంప్రదాయము - విక్షేపవాదము నుండియే దమతత్త్వజ్ఞానమును రూపొందించుకొనె ననుటలో సందేహము లేదు.

## నిర్గ్రంధులు మఱియు నాజీవకులు

బుద్ధ సమకాల జైన తీర్థంకరుఁడు మహావీరుఁడు. ఇతఁడు వారి యిఱువదినాల్గవ తీర్థంకరుఁడు. ఇతనికి 'నిగంఠ నాద పుత్తుఁడ'నియుఁ బేరు. ఇతఁడును - మఖ్ఖలిగోసాలుఁడును నాఱు సంవత్సరము లొకేస్థలమున నుండి తపస్సానరించిరి.

ఈ విషయము జైన గ్రంథములఁ బట్టియే దెలియును. వీరిర్వురును జేరి యాజీవక - నిర్గ్రంథ సంప్రదాయముల నొకటి చేయుదమని యూహించి ప్రయత్నించి యుందురు. పార్శ్వముని యొక్క సన్యాసు లొకటిగాని-లేక మూఁడుగాని వస్త్రముల ధరింతురు. కాని మహావీరుఁడు మఖ్ఖలిగోసాలుని దిగంబర వ్రతమును స్వీకరించెను. అప్పటినుండి నిర్గ్రంథులు నిర్వస్త్రులైరి. ఇంతైనను - వీరి తత్త్వజ్ఞానములు మాత్రము గలిసిరాలేదు. మహావీరుఁడు జతుర్యామముల నంగీకరించెను గదా! అట్టిచో నెనుబదినాలుగు లక్షల జన్మబంధముల నంగీకరించు టెట్లు బొసఁగును? నియతి లేక స్వభావము, వీని సంసర్గముచేఁ బ్రాణి పరిణతమగునని గదా మఖ్ఖలిగోసాలుని వాదము! అపుడు జతుర్యామముల నాతఁడెట్లు సమ్మతించును? ఇంతకును - యీ యిర్వురాచార్యులును - యొక తత్త్వమార్గమును జెప్పలేక యెవరికివారే యైనారు.

ఆజీవకుల 'యెనుబదినాల్గు లక్షల జన్మ' లనెడు తత్త్వజ్ఞానమున కంటెను - నిర్గ్రంథుల చతుర్యామ సంవరణ వాదము లోకప్రియ మయ్యెను. దీనిలో నాశ్చర్యము లేదు. కారణ మేమన - నీవాదము - దపశ్చర్య మొదలైన వాని సాయమున - మానవుఁడు బూర్వజన్మకర్మల గడిగికొని యీ జన్మమందే - ముక్తిని సాధింపగలఁడనును గదా! దుఃఖిత మానవుల కిదియొక తృప్తి. ఒక యాశ్వాసము.

## ౭ నిర్గ్రంథుల గురించి-

నిర్గ్రంథుల గురించి యనేకవిషయములు - 'సుత్తపిటకము'న గలవు. 'మజ్ఝిమనికాయము' లోని 'చూళదుక్ఖక్ఖంద'

సుత్తమున బుద్ధునితో నిర్గ్రంథులకు గలిగిన సంవాదము గలదు. దాని సారాంశ మిది:

రాజగృహసమీపమున గొందరు నిర్గ్రంథులు వసించి తపస్సు జేయుచుండిరి. బుద్ధుఁడు వారికడ కేగెను. అతఁ డిట్లనెఁను. 'బంధువులారా! మీ రెందు కిట్లు శరీరమును గష్ట పెట్టు చున్నారు ?"

వా రనిరి:"నిర్గ్రంథనాథ పుత్త్రుఁడు సర్వజ్ఞుఁడు. నడచు చున్నను - నిలుచున్నను - బండుకొన్నను - మేల్కొన్నను దన జ్ఞాన దృష్టి దొలఁగి పోకయుండు నని యాతఁ డనును. అతఁడు మా కుపదేశించున దిది: 'నిర్గ్రంథులారా! మీరు బూర్వ జన్మమున బాప మొనర్చితిరి. దాని నిపు డీట్టి దేహ దండనమున నాశ మొనర్పుఁడు. ఈ పుట్టున మనోవాక్కా యములతో నే పాపము లొనర్పకుఁడు ఇప్పటి, తపస్సుచేఁ బూర్వజన్మ పాపములు నశించును. ఈ పుట్టువున బాప మొనర్ప కుండుటచే భవిష్యత్కర్మ క్షయ మగును. దీనితో సర్వ దుఃఖములు నశించును' ఈ మాటలు మాకు రుచించి నవి."

"నిర్గ్రంథులారా ! బూర్వజన్మ మున్నదో ! లేదో ! మీ కెట్లు దెలియును?" ఇది బుద్ధుఁడు వేసిన ప్రశ్న.

నిర్గ్రంథులు :- మాకుఁ దెలియదు !

బుద్ధుఁడు :- పూర్వజన్మమున బాప మొనర్చితిరో- లేదో ! అది యైన మీ రెఱుఁగుదురా ?

నిర్గ్రంథులు :- అదియును దెలియదు.

బుద్ధుఁడు :- పోనీ - యిట్టి విట్టివి పాపములని వాని వింగడింపనైన దెలియునా !

నిర్గ్రంధులు :- అదియును దెలియదు.

బుద్ధుఁడు:- ఎంత దుఃఖము నాశన మైనది ? మఱి యెంత మిగిలినది ? యను విషయమైన దెలిసి కొన్నారా !

నిర్గ్రంధులు :- ఆ విషయమును గూడ విచారించినది లేదు.

బుద్ధుఁడు :- అట్టిచో పూర్వజన్మము లందు వేట గాండ్రవలెఁ బాపము లొనర్చితిరనియు - నందుకై యీ జన్మమున నా పాపముల నశింపఁ జేసి కొనుటకుఁ దప మొనర్పవలె ననియు నెట్లు సిద్ధాంతీకరించితిరి ?

నిర్గ్రంధులు :- ఆయుష్మంతుఁడైన గౌతమా ! సుఖముచే సుఖము ప్రాప్తింపదు. దుఃఖము చేతనే సుఖము గల్గును. సుఖముచే సుఖము ప్రాప్తమగుచో - బింబిసారునకు గౌతముని కన్న నెక్కువ సుఖ ముండవలెను.

బుద్ధుఁడు :-నిర్గ్రంధులారా ! మీ మాట విచార సహముగాదు. నాకు - నాతని కేమి పోలిక! బింబిసారుఁ డేడు దినములవఱ కొక మాటయు బలుక నిచ్ఛగింపక - యేకాంత సుఖము ననుభవింప గల్గునా ? ఏడు దినము లేమి ? ఒక దిన మైనను నట్టి సుఖ మనుభవింప గల్గునా ?

నిర్గ్రంధులు :- గౌతమా ! బింబిసారున కిది శక్యము గాదు.

బుద్ధుఁడు :- నే నొక దినమే గాదు. ఏడు దినములైనను నట్టి సుఖము ననుభవింప గలను. బింబిసారుఁ డ (తన వైభవముతో)ధిక సుఖియా? నే నధిక సుఖము గలవాఁడనా?

నిర్గ్రంథులు :- గౌతముఁడే బింబిసారుని కంటె యధిక సుఖము గలవాఁడు.

బౌద్ధము యొక్క గొప్పతనమును జూపుటకై యీ సంవాదము రచింపఁ బడెను. కాని - దీనితో జైనులు మార లేదు. తపస్సు - చతుర్యామముల యభ్యాసము - యీ రెండును పూర్వకర్మముల నాశ మొనర్చు నను విశ్వాసము నేటికిని వారిలో నున్నది.

## ఆత్మకు సంబంధించిన కల్పనలు

పైని జెప్పిన యాచార్యులు - వీరివంటి యితర శ్రమణులు - వీరందఱికిని, యాత్మనుగురించిన యెట్టి విలక్షణమైన విశ్వాసము లుండెనో - వాని సూచనలు గొన్ని యుపనిషత్తులలో దొరకును. ఈ క్రిందియుదాహరణములఁ జూడుఁడు——

"ఏషమ ఆత్మా, అంతర్హృదయే - అణీయాన్, వ్రీహేర్వాయవాద్వా, సర్షపాద్వా, శ్యామాకాద్వా, శ్యామాకతండులాద్వా."

(ఛాందోగ్యము 3-24-3)

"ఈ నా యాత్మ యంతర్హృదయమున నున్నది. ఇది వ్రీహికంటె, యవకంటె, సాసువుగింజ కంటె, శ్యామాకమున కంటె, శ్యామాకతండులమున కంటె సూక్ష్మమైనది."

"మనోమయోఽయం పురుషోభాః సత్యస్తస్మిన్
అంతర్హృదయే, యథా వ్రీహిర్వా, యవోవా..........."

(బృహదారణ్యకము 5-6-1)

"పురుషరూపియైన యాత్మ మనోమయుఁడు. భాస్వంతుఁడు. సత్యరూపుఁడు. హృదయమం దితని యునికి. వ్రీహివలె, యవవలె, సూక్ష్మస్వరూపుఁడు" దీనికిఁ దరువాత నాత్మ యంగుష్ఠ ప్రమాణమన్న కల్పన బయలు దేరినది.

"అంగుష్ఠమాత్రః పురుషో మధ్యఆత్మని తిష్ఠతి"

(కఠ. 2-4-12)

అంగుష్ఠప్రమాణుఁడైన యీ పురుషుఁడు - యాత్మ యొక్క మధ్యనుండును.

మనుష్యుఁడు నిద్రించుచున్నపుడీయాత్మ శరీరము నుండి గడ్డకువచ్చి, బయటఁ బారాడుచుండునట !

"స యథా శకునిః సూత్రేణప్రబద్ధో దిశం దిశం పతిత్వా-అన్యత్రాఽఽయతన మలబ్ధ్వా-బంధన మేవోపశ్రయత - ఏవమేవ ఖలు సోమ్య! తన్మనో దిశం దిశం పతిత్వా అన్యత్రాఽఽయతన మలబ్ధ్వా ప్రాణమే వోపశ్రయతే - ప్రాణబంధనం హి సోమ్య। మన యితి."

(ఛాందోగ్యము, 6-8-2)

"సూత్రముచేత బంధింపఁబడిన పక్షి నాల్గుదిక్కులనుజుట్టి చుట్టి - యెచ్చటను నిలుచుటకు సాధ్యముగాక దన కట్టుగొయ్యనే జేరును. అట్లే - యో సోమ్యా! మనోనిబద్ధమైన యాత్మ నాలుగుదిక్కుల జుట్టిచుట్టి - యెక్కడగూడ నాశ్రయము దొరకక మరలఁ బ్రాణమునే యాశ్రయిం

చును. కారణమేమన - ప్రాణ మనునదియే మనస్సుయొక్క కట్టుగొయ్య!"

## శాశ్వతవాదము మఱియు నుచ్ఛేదవాదము

ఇట్లు చిత్రవిచిత్రములైన యాత్మవిషయిక కల్పనలు బుద్ధకాలమున శ్రమణబ్రాహ్మణులలో వ్యాపించియుండెను. వీని నన్నిటిని రెండువర్గములుగ విංగడింపవచ్చును. ఒక వర్గము వారిట్లనిరి:

"సస్సతో అత్తాచ లోకోచవంఝో కూటట్ఠో ఏసికట్ఠా యిట్ఠితో"

"ఆత్మ - జగత్తు యీ రెండును శాశ్వతములు. వంధ్యములు. కూటస్థములు. నగరద్వారముపైనున్న స్తంభమువలె స్థిరములు."*

పై వాదమునందు "పూరణకస్సప - మక్ఖలి గోసాల- పకుధ కచ్చాయన - నిగంఠనాథ పుత్తు"ల మతములు సమావిష్టము లగును.

రెండవతెగ శ్రమణబ్రాహ్మణు లుచ్ఛేదవాదమును బ్రతిపాదింతురు. వారి వాద మిది:

"అయం అత్తారూపీ చాతుమ్మహా భూతికో మాతా పేత్తిసంభవో,
కాయస్సభేదా వుచ్ఛిద్యతి, వినస్సతి, నహోతి పరంమరణా"

"ఈ యాత్మ జడము. భూతచతుష్టయముతో నైనది. తల్లిదండ్రులనుండి యుత్పన్నమైనది. శరీర భేదానంతరము

* ఇంకను ననేకము 'లాత్మవాదము'లు 'దీఘనికాయము'లోని 'బ్రహ్మజాలసుత్తము'న వచ్చును. ఇతర 'నికాయము'లలోఁ గూడ నాత్మవాదముయొక్క యుల్లేఖము లున్నవి.

భిన్నమగును వినాశనము నొందును. మరణానంతరమున నది యుండదు."

ఇట్లు ప్రతిపాదించు శ్రమణులలో - నజితకేశ కంబళుఁడు - ప్రముఖుఁడు. ఇతని తరువాత 'కొన్ని యంశములలో నాత్మ శాశ్వతము; కొన్ని యంశములలో నశాశ్వతము' యని పలుకు శ్రమణబ్రాహ్మణులుగూడఁ గనపడిరి. సంజయ చేలట్ఠపుత్త్రుఁ డిట్లు వాదించువారిలో నొకఁడు. ఈ వాదము - జైనులలోఁ దరువాత నెక్కువ ప్రచారమునకు వచ్చెను.

## ఆత్మవాదముల పరిణామము

ఈ యాత్మవాదముల పరిణామము రెండురీతులుగ నయ్యెను. ఒక తెగవారు - భోగములందే సుఖమున్న దనుకొనిరి. వేఱొకరు - తపశ్చర్యతో శరీరమును గష్టపెట్టవలెననిరి. 'పూరణ కస్సపు'ని యూహాప్రకార 'మాత్మ యెవ్వరిని జంపదు-చంపింపదు. మఱి తమ సుఖమునకై - యితరులను హత్య సేయుటలోఁ దప్పేమున్నది?' జైను'లాత్మ' పూర్వజన్మమునం దొనర్చిన పాపముతోఁ గూడియున్నద'నుకొన్నారు. మఱి యా పాపక్షయమునకైఁ దపశ్చర్య సేయవలెనని వా రనుకొనుటయు సహజమే. 'ఆత్మ యశాశ్వతము. మరణానంతర మది లేద'నుకొన్నచో జీవితమందే సుఖములు తెన్నగా ననుభవింప వలయునను బుద్ధి పుట్టుటలో వింత యేమియు లేదు. అపుడుఁ దపశ్చర్య నాచరించు టెందుకు?

## ఆత్మవాద పరిత్యాగము

బుద్ధుఁడు భోగము - దపశ్చర్యయును నీ రెండు మార్గములను వదలిపెట్టెను. ఈ రెంటిలో నేదియు - మనుష్యజాతి యొక్క దుఃఖమును నశింపఁ జేయునని యాతనికి దోపలేదు. రేచు కుక్కలవలె నిరంతరము గలహించికొనుచున్న జాతికి శాంతి నివ్వని యెన్ని వాదములతో నేమి ప్రయోజనము? పై రెండు వాదములకును మూల మాత్మవాదమే. ఆత్మ శాశ్వతమైననేమి? యశాశ్వతమైన నేమి? ఆత్మవాదమును లెక్కింపక యీ జగత్తున దుఃఖ ముండనే యున్నది. ఈ దుఃఖమునకు గారణమేమి? మనుష్యునిలోనున్న తృష్ణ.

'ఆర్య - అష్టాంగిక మార్గముతో నీ తృష్ణను నాశన మొనర్చినపుడే మనుష్యునికి; మనుష్యజాతికి శాంతి-సమాధానములు దొఱకును.' ఇది యాతని సిద్ధాంతము. ఆత్మవాదమనెడు పీడ వదలనిది-యీ నవీనమార్గమును - ప్రచార మొనర్చు టాతనికి గష్టమయ్యెను. కనుకనే బుద్ధ భగవానుఁడు పంచవర్గీయ భిక్షువులకు నాలుగార్య సత్యములు బలికి, వానివెంటనే యనాత్మవాదము నుపదేశించెనని 'ఖంధ సంయుత్తము'న గలదు.*

బుద్ధభగవానుఁడు ఋషిపత్తనములోని 'మృగదావ వన'మం దుండెను. అపుడు - పంచవర్గీయులతో నిట్లనెను: "భిక్షువులారా! జడశరీర మనాత్మ. శరీర మాత్మయైనచో నుపద్రవ కారకమై యుండెడిది గాదు. 'నాశరీర మిట్లుండ

* ఈ సుత్తమే 'మహావగ్గము'నను గలదు.

రాదు - ఇట్లుండవలెను' యనుటయు ఘటిల్లెడిది. కాని శరీర మనాత్మ. అందుకే యది యుపద్రవకారకము. 'ఇట్లుండ రాదు - ఇట్లుండవలెన'ని వచింప సాధ్యముగాని దైనది.

"భిక్షువులారా! వేదన యనాత్మ. ఇది యాత్మ యైనచో నుపద్రవ కారకమై యుండెడిదిగాదు. 'నావేదన యిట్లుండవలె -నిట్లుండరాద'ని జెప్ప సాధ్యపడెడిది. కాని- వేదన యనాత్మ యగుటచే నుపద్రవ కారకమైనది. 'ఇట్లుండ రాదు. యిట్లుండవలె' నని జెప్పుట కసాధ్యమైనది. ఇట్లే- సంజ్ఞ - సంస్కారము - విజ్ఞానముగూడ ననాత్మలే. విజ్ఞాన మాత్మయైనచో - నుపద్రవకారకమై యుండెడిది గాదు. 'విజ్ఞానమిట్లుండవలెను-యిట్లుండరాద'ని జెప్పుటకు సాధ్య మయ్యెడిది. కాని విజ్ఞాన మనాత్మ యగుటచే - నుపద్రవ కారకమై 'యిట్టు లట్టుల'ని చెప్పరాని దైనది.

"భిక్షువులారా! జడశరీరము వేదన- సంజ్ఞా సంస్కార ములు - విజ్ఞానము-యివి నిత్యములా?- యనిత్యములా?"

భిక్షు :- భదంతా! ఇవి యనిత్యములు.

భ :- ఇవి యనిత్యములైనచో దుఃఖ కారకములా; సుఖ కారకములా?

భిక్షు :- భదంతా! ఇవి దుఃఖకారకములు.

భ :- ఇవి దుఃఖకారకములు గదా! విపరిణామమును బొందునవిగదా! అట్టిచో 'ఇవి నావి. ఇవే నేను. ఇది నాయాత్మ' యని దలంచుట యోగ్యమా! యయోగ్యమా!

భిక్షు :- అయోగ్యము.

భ :- కనుక భిక్షువులారా ! అతీతమైన జడపదార్థము ననాగతము. ప్రత్యుత్పన్నము. 'శరీరమునకు లోపలి ప్రదేశము - బయటి ప్రదేశము, స్థూల- సూక్ష్మ, హీనోత్కృష్ట, దూర-సమీప పదార్థములు యివి యేవియు నావి గావు. నే నవి గాను. అవి నా యాత్మ గావు' అని యథార్థముగ సమ్యక్ జ్ఞానముతోఁ దెలిసికొన వలెను. అట్లే యే వేదన యైనను - సంజ్ఞా సంస్కారము లైనను - యెట్టి విజ్ఞాన మైనను - అతీత, అనాగత, ప్రత్యుత్పన్నము లైనను -శరీరాంతర బాహ్య, స్థూల, సూక్ష్మాది పదార్థము లైనను 'ఇవి యన్నియు నావి గావనియు, నే నవి గాననియు, నివి నా యాత్మ గాదని'యు యథార్థ సమ్యక్ జ్ఞానముతోఁ దెలిసికొనుఁడు. భిక్షువులారా! యీ రీతిగ దెలిసికొన్న యార్య శ్రావకుఁడు జడపదార్థములు, వేదన, సంజ్ఞా - సంస్కారములు వీనియందు విరక్తుఁ డగును. విరక్తితో విముక్తి సిద్ధించును.

## ఆత్మయొక్క పంచ విభాగములు

'ఆత్మ శాశ్వతమా ! లేక యశాశ్వతమా!' యని యెవఁడైన ప్రశ్నించిన - వెంటనే సరిగా సమాధాన మిచ్చుట గొంత కష్టమే. ఈ చిక్కును - బుద్ధభగవానుఁడు గమనించెను. దాని స్వరూపము సరిగా నర్థమగుటకై పంచస్కంధములుగ నాత్మను విభజించినాఁడు. 'జడపదార్థము - వేదన- సంజ్ఞ - సంస్కారము - విజ్ఞానము' - యనెడు నీ యైదును నాత్మకు సంబంధించినవి. ఈ యైదిటి సమావేశమే 'యాత్మ' యని బుద్ధుని సిద్ధాంతము. ఈ విభాగము సేయుటలోనే

యాత్మ శాశ్వతము గాదు-యశాశ్వతమును గాదని తెలియు చున్నది. ఎందుకన - నీ పంచస్కంధములు సదా మారునవి యని యంగీకరించినచో నవి యనిత్యము లగును. దుఃఖ కారకము లగును. కనుక-'వానిని - నావి' యను కొనుట; 'యీ యాత్మ నాది' యను కొనుట రెండును బొరపాటులే. ఇదే బుద్ధుని యనాత్మవాదము. అతఁ 'డాత్మ నిత్యము, లేక యనిత్యము' యను నీ రెండు మార్గములను ద్రోక్కిక మధ్య మార్గము ననుసరించెను. అందుకే బుద్ధుఁడు- కాత్యాయన గోత్ర భిక్షువు నుద్దేశించి యిట్లు చెప్పెను: "కాత్యాయనా! జనత నిరంతర 'మస్తి-నాస్తి' విచికిత్సల తోఁ గల్లోలితము. రెంటిలో నేదో యొక వైపున కది మొగ్గును. నే నీ రెండు వాదములను వదలిపెట్టి - మధ్యమ మార్గముతో ధర్మోపదేశ మొనర్తును. *

## అనావశ్యక వాదము

ఇంతగా విప్పి జెప్పినను - యెవఁడైనను, దీని సంగతి నిర్ణయముగఁ దేల్చి కొనుటకు హఠము వట్టె ననుకొందము. 'శరీరము - ఆత్మ' యీ రెండును భిన్నములా? లేక యొకటియా - యని యడిగి నపుడు- యీ వితర్క 'వాదము నా కిష్టము లేదు. ఎందుకన - దీనిచే మనుష్య జాతికిఁ గల్యాణము గలుగద'నియే బుద్ధుఁ డొసఁగు సమాధానము.

* 'నిదాన సంయుత్తము' వగ్గ 2, సుత్తము 4.

ఈ యభిప్రాయ సూచన* 'చూళ మాలుంక్య పుత్త సుత్తము' నందు వచ్చును. దాని సారాంశ మిది:-

బుద్ధభగవానుఁడు శ్రావస్తియం 'దనాధపిండకు'ని యారామమం దుండెను. అపుడు మాలుంక్యపుత్తుఁడను భిక్షుఁడొకఁడు బుద్ధుని సమీపించి, నమస్కరించి యొకవైపున నిలచినాఁడు. వాఁడు భగవంతునితో ననెను. "భదంతా! యీ జగత్తు శాశ్వతమా? కాదా? శరీరాత్మలు భిన్నములా? లేక యొక్కటియేనా? తథాగతునకు మరణానంతరము బునర్జన్మయుండునా? లేదా? యనెడు ప్రశ్నలు—యేకాంతమునందు - నను నిరంతరము బీడించుచుండును. ఈ ప్రశ్నలు-సమాధానములు మిమ్మడుగఁదలంచితిని. ఇట్టి ప్రశ్నలు మీకి ష్టముండదని నే నెఱుఁగుదును. కాని మీరు వీనికి సరియైన సమాధాన మొసఁగినచో - మీకు శిష్యుఁడ నయ్యెదను. వీని యథాగతినాకుఁ దెల్పకున్నచో - మీకు వీని సమాధానములు దెలియ లేదనుకొందును."

బుద్ధుఁడు:- మాలుంక్యపుత్తా! నీవు నాకు శిష్యుఁడవైనచో - నీ ప్రశ్నలకు సమాధానము లిత్తునని నే నెన్నఁడైన నీతో నన్నానా?

మాలుంక్యపుత్తుఁడు:- భదంతా! అనలేదు.

బుద్ధుఁడు:- పోనీ - నీవైనను 'నా యీ ప్రశ్నలకు సమాధాన మొసఁగిననే మీకు శిష్యుఁడనౌదున'ని ముందెన్నడైన ననియుంటివా?

* 'మజ్ఝిమ నికాయము' సం॥ 63,

మాలుంక్యపుత్త్రుఁడు:- భదంతా! అదియును లేదు.

బు:- అట్లైనచో 'నా ప్రశ్నలను మీరు సమ్మతించి యుత్తరమిచ్చిననే నేను మీశిష్యుఁడ నౌదున' నుట నీకేమి న్యాయము! మాలుంక్యపుత్త్రా! ఒకని శరీరమందు విషలిప్తమైన బాణము గ్రుచ్చికొన్నదే యనుము. అపుడు, వాని యాప్తమిత్త్రుఁడు - చికిత్సకై శస్త్రవైద్యుని కడకేగెను. ఆ వైద్యుఁ 'డాబాణము వేసినదెవరు ?- వాఁడు బ్రాహ్మణుఁడా! క్షత్త్రియుఁడా? లేక వైశ్యశూద్రులలో నొక్కఁడా? నల్లనివాఁడా ? ఎఱ్ఱనివాఁడా ? వాఁడు బట్టిన ధనువెట్టిది ? దానియొక్క యల్లెత్రాడు దేనితోఁ జేయబడినది ? ఈ ప్రశ్నలకు ముందు సమాధానమిమ్ము! తరువాత - నీబాణము నూడబెఱుకుదు' నని పలికె ననుకొందము. దానితో రోగికిఁ బ్రయోజన మేమున్నది ? ఈ ప్రశ్నలు వినబడకముందే వాఁడు మరణించును. అట్లే 'యాత్మ శాశ్వతమా! గాదా! యీ ప్రశ్న తెగువఱకు నేను బ్రహ్మచర్యము నవలంబింపను.' యని యెకఁడను ననుకొందము. దానితో వానికి లాభమేమున్నది ? ఈ వాదమర్థము గాకముందే వాఁడు మరణించును.

మాలుంక్యపుత్త్రా ! జగము శాశ్వతమా ? యశాశ్వతమా ! యనెడు వితర్కమెంత తీవ్రముగ నున్నను-దానితో ధార్మికమైన యాచరణము గుదురునా ! జగత్తు శాశ్వతమనెడు విశ్వాస మొకనికి గల్గె ననుకొందము. వానికి జరామరణ శోక పరిదేవనములనుండి విముక్తి సిద్ధించునా ! నీ వింతకుముం దడిగిన 'శరీరము ఆత్మ ఈ రెండును భిన్నములా; ఒకటియేనా ? మరణోత్తరము తథాగతునకు బునర్జన్మ

గలదా ! లేదా?' యిత్యాదులు వితర్కించినను, వితర్కింపక పోయినను - నమ్మినను నమ్మకున్నను, జన్మ - జరా, మరణములు గల్గునవి గలిగియే తీరును. అందుచే నీవిషయములఁ దేల్చుకొను ప్రయత్నము నేను జేయను. ఎందుకనఁగా - నీ వాద -వివాదములతో బ్రహ్మచర్యమున కెట్టిను స్థైర్యము జిక్కదు. వైరాగ్య ముత్పన్నము గాదు. పాప నిరోధ మేర్పడదు. శాంతి - ప్రజ్ఞ - సంబోధము - నిర్వాణము, యివి సిద్ధింపవు.

'ఇది దుఃఖము - యిట్టిది దుఃఖసముదయము. ఈ స్థితి దుఃఖనిరోధము, దుఃఖనిరోధ మార్గమిది' యని నేను వివరించి చూపింతును. ఎందుకనఁగా - యీ నాలుగార్య సత్యములు - బ్రహ్మచర్యమునకు స్థైర్యము నిచ్చును. వీనితో వైరాగ్య మేర్పడును. పాపనిరోధ మగును. శాంతి - ప్రజ్ఞ - సంబోధ - నిర్వాణములు సిద్ధించును. అందుచే - మాలుంక్య పుత్రా! ఏ విషయమును నేను జర్చింప దలఁపలేదో - దానిని గుఱించి ప్రశ్నింపకుము. నే నేప్రశ్నలను వివరించి చెప్పుదునో - యవియే వివరించుట కర్హములైన విషయములని దెలిసికొమ్ము.

బుద్ధుని యీ మాటల కర్థమేమి? 'ఆత్మపంచ స్కంధ ములతోఁ జేయబడ్డది. కాని - దాని యాకార మెట్టిది ? అది యున్న దున్నట్లే యేమియు మారక బరలోకమునకుఁ బోవునా! లేదా!' యిత్యాది వాదములు బనిలేనివారి వేడుక. జగత్తున విపుల దుఃఖ మున్నది. దానికిఁ గారణము మను

ష్యుని తృష్ణ. అందుకే యష్టాంగ మార్గములతో – నా తృష్ణను నిరోధింపవలెను. అప్పుడు జగత్తున సుఖ – శాంతులు నెలకొనును. ఈపని సేయుట ప్రతి వ్యక్తికిని గర్తవ్యము. ఇదియే సరళమైన మార్గము. బుద్ధుని యుపదేశ సార మిది.

## ౦ ఈశ్వర వాదము

'బుద్ధుఁడీశ్వరు నంగీకరింపలేదు. అందుకై యతఁడు నాస్తికుఁడు' యని గొందఱు దలఁతురు బౌద్ధవాఙ్మయము – లేక ప్రాచీనములైన యుపనిషత్తులు జదివినచో – నీ యాక్షేప మవిచార మూలకమని దెలియును. ఈ లోక భ్రమమును దూరీకరించుటకు – బుద్ధ సమకాలికములైన యీశ్వర వాదములను దిగ్దర్శనముగఁ జూపింతుము–

ఈశ్వర శబ్దముయొక్క యుల్లేఖము 'అంగుత్తర నికాయము'లోని 'తికనిపాతము' నందును – (సుత్త సం॥ 61) మఝ్ఝిమనికాయములోని 'దేవదహసుత్త' మందును (నం. 101) గలదు. మొదటి సుత్తముయొక్క సారాంశ మిది:

భగవంతుఁ డనెను. "భిక్షువులారా! ఈ జగత్తున సర్వప్రాణులును సుఖదుఃఖములు – యుపేక్షా భావము వీని ననుభవించుచున్నవి. వీరందరు నీశ్వర నిర్మితులే – (ఇస్సర నిర్మాణహేతు) యని ప్రతిపాదించువారిని, నమ్మినవారిని, జూచినప్పుడు నా మనస్సున 'వీరి వాదమేమ'ని శంక బొడము. దానినే మరల నాప్రేమేడింతురు. అపు డిట్లనుకొందును. 'వీరంద రీశ్వర నిర్మితులైనచో నింత గలహ శీలురుగ – ఘాతకులుగ నెందుకున్నారు! ప్రాణఘాతములు – చౌర్యము

యసత్యము-కుట యిదియన్నియు జగత్తునం దెట్లు వచ్చెను.' ఈ నా ప్రశ్నలకు సమాధానమే దొరుకదు. భిక్షువులారా! యీ సర్వమును యీశ్వరుఁడే నిర్మించె ననుకొన్నను - నా విశ్వాసము సత్కర్మలకై యుత్సాహమును బురికొల్పదు గదా! ప్రవృత్తి నొసఁగదు గదా! 'ఇది జేయఁదగినది జేయరానిది'యను విషయమును దెలిసికొనుటకు సాయపడదు."

ఈ యీశ్వర నిర్మాణముయొక్క యుల్లేఖము 'దేవదహాసుత్తము'న గలదు. కాని యాభాగము ప్రక్షిప్తమై యుండవచ్చునని నా యనుమానము. ఎందుకనఁగా - దీని యందలి కల్పన మఱి యేసుత్తమునను నచుంబితమైయున్నది. బుద్ధుని కాలమందున్న దొడ్డదేవుఁడు బ్రహ్మ. కానియతఁడు వివిధములైన వస్తువులను సృష్టించువాఁడు. అంతేగాని - బైబిలులోని దేవునివంటి వాఁడు గాడు. జగత్తు పుట్టుటకు ముందతఁడు లేఁడు. విశ్వ ముత్పన్నమైనపిదప దొలుత బ్రహ్మ జనించెను. అతని యనంతర మితరప్రాణులు గల్గినవి. అందుకై యాతనిని భూతస్రష్టగాఁ దలఁచిరి. 'బ్రహ్మజాలసుత్తము'నందా బ్రహ్మవర్ణన మున్నది. దాని సారాంశ మిది:

"అనేక కాలానంతర మీ జగత్తు సంవర్తమును (నాశమును) బొందును. అపుడు దీనిలోని యనేక ప్రాణులా భాస్వర దేవలోకమును జేరును. పిమ్మట ననేక కాలమున కీ జగత్తుయొక్క వివర్త (వికాసము) మేర్పడును. అపుడు దొట్టతొలుత బ్రహ్మవిమాన ముత్పన్నమగును. పిదప నా భాస్వర దేవలోకమునుండి చ్యుతమై యొకప్రాణి యీ

విమానమున జన్మించును. ఆప్రాణి మనోమయుఁడు. స్వయం ప్రభుఁడు. అంతరిక్షచరుఁడు. శుభస్థాయి. దీర్ఘజీవి. ఇతని తరువాత ననేకప్రాణులు చ్యుతులై యీ విమానమున జన్మింతురు. ఆ ప్రాణులకుఁ దొల్తఁ బుట్టినవాఁడు - ఘనుఁడుగాఁ గన్పడును. వా రాతనిని 'బ్రహ్మ, మహాబ్రహ్మ, సర్వదర్శి, యీశ్వరుఁడు, కర్త, నిర్మాత, వశి - భూతభవ్యములకుఁ బిత' - యని కీర్తింతురు.

"బ్రహ్మా దేవానాం ప్రథమః సంబభువ,
విశ్వస్యకర్తా భువనస్య-గోప్తా" (1-1)

పై వాక్యము ముండకోపనిషత్తు లోనిది. దీనిలో బ్రహ్మవిషయికమైన పైకల్పన సంక్షేపముగ నిర్దేశింపఁ బడినది. దీనిలో బ్రహ్మను జగత్కర్తగా నిరూపించుటకై బ్రాహ్మణు లొనర్చిన ప్రయత్నము స్పష్టముగ దెలియుచున్నది. కాని యీవాదము సమకాలికులైన శ్రమణుల ముందు నిలువలేకపోయెను. తమవాద దౌర్బల్యమును గమనించి బ్రాహ్మణు లీ వాదమును వదలి బ్రహ్మశబ్దము నపుంసక లింగ మనుటకు మొదలుపెట్టిరి. చాల యుపనిషత్తులలో నీ బ్రహ్మశబ్దమునకే గొప్పదన మివ్వఁబడ్డది.

బ్రహ్మనుండి - లేక - యాత్మనుండి జగత్తు బుట్టినదే యనుకొందము. 'అదెట్లు బుట్టినది?' దీని కుత్తరము బృహదారణ్యకోపనిషత్తునం దిట్లు గల్పింపఁ బడినది. ఆ భాగ మిది:

"ఆత్మైవేద మగ్ర ఆసీత్ పురుషవిధః........
సవై నైవరేమే తస్మాదేకాకీ నర మతే

స ద్వితీయమైచ్ఛత్ । సహైతావానాస యథా స్త్రీ పుమాంసౌ
సంపరిష్వక్తౌ । స ఇమమేవాత్మానం ద్వేధా పాతయత్తతః
పతిశ్చ పత్నీచాభవతాం, తస్మాదిదమర్ధ బృగల మివస్వ ఇతి"

"సర్వ ప్రథమమున పురుష రూపియైన యాత్మ యుండెను. అతఁడు రమింపలేదు. అందుచే (మనుష్యుఁడు) నేకాకిగా రమింపఁడు. అతఁడు రెండవ దానిని గోరెను. స్త్రీ పురుషులు బరస్పర మాలింగన మొనర్చి కొనున ట్లతఁడుండెను. తన్ను దానే యతఁడు రెండుగాఁ జేసి కొన్నాఁడు. అందుచేఁ బతి పత్నులైరి. కనుక నీ శరీరము ద్విదళధాన్యము యొక్క దళము వంటిది."

(బృ. ఉ. 1-4-1-3)

'ఉత్పత్తి కథ'ను గుఱించి బైబిలేమి చెప్పునో చూతము. "తరువాత బరమేశ్వరుఁడు భూమిపై - పృథ్వ్యాంశమైన మానవుని బుట్టించెను. ఆతని యెముకను బెరికి దానితో స్త్రీని గల్గించినాఁడు... అందుకే బురుషుఁడు దల్లి దండ్రులను వదలి - తన స్త్రీతోఁ గలిసి వర్తించెను. వీ రిర్వురొక దేహమే. (బైబిలు-ఉత్పత్తి. అధ్యా...2)

పై వాదమునకును - నీ వాదమునకును భేద మెంత ? బైబిలులోని దేవుఁడు బృథివిని నిర్మించి - తరువాత మనుష్యుని సృష్టించెను. వాని యెముకతో స్త్రీ సృష్టి జరిగెనట ! జగత్తు కంటె నా దేవుఁ డత్యాతము భిన్నుఁడు. ఉపనిషత్తులలోఁ బురుష రూపియైన యాత్మ తానే రెండై - స్త్రీ పురుషు లయ్యెను.

## ప్రజాపతి యొక్క యుత్పత్తి

ప్రజాపతి యనఁగా జగత్కర్తయైన బ్రహ్మ. అతని యుత్పత్తి బృహదారణ్యకమం దిట్లున్నది:-

"ఆప ఏవేద మగ్ర ఆసుః, తా ఆపః, సత్యమసృజంత,
సత్యం బ్రహ్మ, బ్రహ్మ ప్రజాపతిం, ప్రజాపతిర్దేవాన్
తే దేవాః సత్యమేవోపాసతే, (5-5-2)

"అన్నిటికిని మొదట నుండినది నీరే. నీరు సత్యమును సృష్టించెను. సత్యము బ్రహ్మను - బ్రహ్మ ప్రజాపతిని- ప్రజాపతి దేవతలను వరుసగా సృష్టించిరి. దేవతలు సత్యమునే యుపాసింతురు." బైబిలులోఁ గూడ - జలప్రళయానంతరము - సృష్టి - మరల జరగిన కథ యున్నది. కాని దేవుఁడు మొదటనే 'నోవాను కుటుంబము, పశుపక్షులు పురుషులు-స్త్రీలు, వీరి నందఱిని బడవలో నెక్కించెనట! పిదప జలప్రళయము వచ్చినది.'* ఉపనిషత్తులందు - జలప్రళయమునకు ముం దేముండెనో జెప్పఁబడలేదు. ఇంతే గాదు. బ్రహ్మదేవుఁడు - బ్రహ్మతత్త్వము వీని యన్నిటికంటె ను - సత్యమునకిచ్చిన స్థానముగొప్పది. 'బ్రహ్మజాల సుత్త' మందివ్వఁబడిన బ్రహ్మోత్పత్తి కథ - యీ కథకు దగ్గరగా నున్నది.

'ఈశ్వరుఁడు జగత్తు కంటె భిన్నుఁడై - జగన్నిర్మాణ మొనర్చె' నను నీ కల్పన - హిందూ స్థానమునకు శకుల నుండి సంకలితమైనట్లుఁ దోచును. ఎందు కనఁగా నంతకుఁ దొల్లటి వాఙ్మయములో నిది గన్పట్ట లేదు.

* బైబిలు ఉత్పత్తి. అ॥ 7

అట్టిచో బుద్ధుఁ డీశ్వరుని గౌరవింపకుండుటచే నాస్తికుఁడని యాతనిపై మిరియములునూరుటదిన్ని పసియేనా? 'బుద్ధుఁడు వేదముల నిందించెను. కనుక నాతఁడు నాస్తికుఁడ'ని బ్రాహ్మణు లనిరి. కాని బుద్ధుఁ డెచ్చటను-వేదమును నిందించి నది లేదు. బ్రాహ్మణు లెంతయో గౌరవించు సాంఖ్య కారికల వంటి గ్రంథములలో వేదనింద దక్కువ యున్నదా! ఈ క్రిందిదాని నేమందురు?—

"దృష్టవదాను శ్రవికః
సహ్యవిశుద్ధి క్షయాతిశయ యుక్తః"

"దృష్టమైన యుపాయము వలెనే వైదికోపాయముగూడ నిరుపయోగము. ఎందుకనఁగా నవి శుద్ధి - నాశము-యతిశ యము యీ గుణములతోఁ గూడినవవి.

భగవద్గీతలో నున్న - 'త్రైగుణ్య విషయా వేదాః' యనుమాట - వేదనింద గాదా యేమి? సాంఖ్యులు - బ్రాహ్మణులజాతి భేదముపై దండెత్తలేదు. భగవద్గీత జాతి భేదమును నత్తినత్తిగా సంగీకరించినది. అందుచే - దాని వేద నింద వీరి కంత బాధకముగా లేదు. బుద్ధుఁ డన్ననో - వేద ముల నిందింపక - జాతిభేదముపై దండెత్తెను. ఇఁక నతఁడు వేదనిందకుఁ డెట్లుగాఁడు! వేదమనఁగా జాతిభేదము. జాతిభేద మనఁగా వేదము. ఈ రెంటికిని బ్రాహ్మణుల దృష్టిలో నంత యొద్దిక. మరి - జాతిభేదము లేనప్పుడు - వేదమెట్లు బ్రదు కును? జాతిభేదము చెలామణిలో నుండి వేదమొక యక్ష రము మిగులకపోయినను - వీరి దృష్టిలో వేదప్రామాణ్యబుద్ధి యుండినట్లే. వేదములు బ్రదికినట్లే.

బుద్ధసమకాలీనులైన శ్రమణ బ్రాహ్మణులలో - నీశ్వర వాదమున కంత ప్రాధాన్యము లేదని ముందు గావించిన వివేచనతో స్పష్టమైనది. వారిలో గొంద రీశ్వరుని స్థానమున గర్మను బ్రతిష్ఠించిరి. బుద్ధుడు కర్మవాది గాకుండుటచే నాస్తికుడనిరి. ఈ నిందలోని బలమెంతయో నై ప్రకరణమున జూతముగాక !!!

# ఎనిమిదవ ప్రకరణము

# కర్మ యోగము

## బుద్ధుఁడాస్తికుఁడా - నాస్తికుఁడా ?

ఒకసారి బుద్ధభగవానుఁడు వైశాలీనగర సమీపమున 'మహావన'మందుండెను. అప్పుడు కొందఱు ప్రసిద్ధులైన 'లిచ్ఛవీ' రాజులు - దమసంస్థాగారమందేదో యొక వ్యవహారమునకై జేరినారు. బుద్ధునిగూర్చిన ప్రశంస యక్కడ వచ్చెను. కొందఱు బుద్ధుఁడు - ధర్మము - సంఘము, వీనిని గుఱించి మెచ్చుకొన నారంభించిరి. దానిని విన్న 'సింహసేనాపతి' కి బుద్ధునిజూడ బుద్ధి బొడమినది. సింహసేనాపతి - నిర్గ్రంథోపాసకుఁడు. అందుచే - బుద్ధదర్శనమునకుఁ దన గురువైన 'నాథపుత్తు'ని యనుమతి గావలసియుండెను. సేనాపతి నాథపుత్తుని సమీపించినాఁడు.

సే:- భదంతా ! నేను శ్రమణగౌతముని జూడగోరుచున్నాను.

నాథ :- సింహా ! నీవు క్రియావాదివి. బుద్ధుఁ డక్రియావాది. అందుచే నాతనిని నీవు జూడరాదు.

గురువుయొక్క మాటలు విని సింహసేనాపతి యప్పటికి బుద్ధుని జూచు తలఁపు వదలుకొన్నాఁడు. మరల నొకటి రెండుమారులు సంస్థాగారమందు బుద్ధుని గుఱించిన మెప్పులను వినెను. అపుడుగూడ 'నాథపుత్తుఁడు' బుద్ధదర్శనము నంగీకరించినవాఁడు గాడు. ఇట్లు గొన్నిసారులు జరగెను.

కడకు – 'నాథపుత్తుఁడు' సమ్మతించినాఁడు. సింహ సేనాపతి పరివారముతోఁ గూడ – బుద్ధుని సమీపించి, నమస్కరించి, యొకవైపున నిలిచెను. సింహ సేనాపతి యనెను. "భదంతా! మీరు అక్రియా వాదులై శ్రావకుల కక్రియా వాదమును బోధించుచుంటిరట! ఇది నిజమేనా!"

బుద్ధుఁడు బదులొసఁగెను. "సింహ సేనాపతీ! అట్టిది గూడ నొక సంప్రదాయము నాలో నున్నది. దానినిబట్టి సత్యవాదులైన మనుష్యులు శ్రమణగౌతము లక్రియావాది యందురు."

సింహ:— ఆ సంప్రదాయ మేది?

బుద్ధు:— సింహా! నేను కాయ దుశ్చరితములు – వాగ్దుశ్చరితములు–మనోదుశ్చరితములు – వీని యక్రియ నుపదేశింతును. సింహా! నాయం దింకొక సంప్రదాయ మున్నది. దానితో సత్యవాదులైన మనుష్యులు నన్ను గ్రియావాది యందురు. అదియేది? నేను గాయ సుచరితములు –వాక్సుచరితములు – మన స్సుచరితములు వీని క్రియల నుపదేశింతును.

నాయందు వేఱొక సంప్రదాయము గలదు. దాని సంబంధముతో సత్యవాదులు న న్నుచ్ఛేదవాదిగా నెంతురు. అవియేవి? నేను లోభము – ద్వేషము – మోహము మొదలైన సర్వపాపకారక మనోవృత్తులయొక్క యుచ్ఛేదము నుపదేశింతును.

నాయం దింకొక సంప్రదాయ మున్నది. అందుచే – సత్యవాదులు నన్ను జుగప్సిగా నెంతురు. నేను గాయ దుశ్చ

రిత మనోదుశ్చరిత వాగ్దుశ్చరితముల గంటగించుకొందును. పాపకరములైన పనులు నాకు గిట్టవు.

ఇతర సంప్రదాయమును నా యందొకటి గలదు. అందుకే నన్ను సత్యవాదులు వినాశకుం డందురు. లోభ-ద్వేష-మోహాదుల వినాశమును నే నుపదేశింతును.

సింహ సేనాపతీ! వీనితోc బాటు వేఱొక మార్గము గూడ నాయం దున్నది. అందుచే సత్యవాదులు నను దపస్విగ నెంతురు. పాప కారకములైన యకుశల కర్మలను నే దపింపc జేతును. ఆ తపస్సుచేc బాపకరములైన యకుశల కర్మలు మూల మట్టముగ నశించును. మఱల మొలకెత్తవు. అందుచే నేను దపస్విని.*

## బుద్ధునిపై నాస్తికతారోపము

పై సుత్తమునందు బుద్ధుc డక్రియావాది యను నారోపము గలదు. ఈ యపనింద మహావీరస్వామి వేసెనో; లేదో-తెలియదు. ఎట్లైన నప్పుడు బుద్ధుని పైని నిట్టి యారోపమొకటి యుండె ననుటలో సందేహము లేదు.

గౌతముcడు క్షత్రియ కులమున జన్మించెను 'కోలియ' క్షత్రియులు - శాక్యులకుc బొరుగువారే. ఆప్తులు గూడ. వీ రిద్దరి నడుమ - రోహిణీ నది నీటి కొఱకై మాటి మాటికి రగడ లయ్యెడివి. వేఱొక గుంపులోని మనుష్యుcడొకcడు దమలోని వానిని జంపిన దానికి బదు లెదుటి

* చూ. 'బుద్ధలీలాసార సంగ్రహము' పు॥ 279-281

గుంపులోని మఱి యొకనిని జంపి తీరవలెను. ఈ పద్ధతి నేటికిని సరిహద్దులలో నివసించు పఠాను జాతి వారియందున్నది. ఈ యాచారమే బూర్వకాలమున హిందూస్థాన క్షత్రియులలోఁ గూడ బ్రాకి యుండెను. ఆ నాటి మరియాద ననుసరించి - దమ పొరుగువారైన 'కోలియు'ల రక్తమును బోధిసత్త్వుఁడు గోరవలసి యుండెను. అతఁడు క్షత్రియుఁడు గదా! కాని - గౌతముఁ డట్లు సేయక సన్యాసి యైనాఁడు. అదియే చిత్రమైన సంస్కార విశేషము.

ఆ నాటి బ్రాహ్మణులు గాని క్షత్రియులు గాని-గృహస్థాశ్రమము దమ కిష్టము లేకున్నచోఁ బరివ్రాజకులై గఠిన తపశ్చర్య నొనరించు చుండిరి. ఇట్లే - గౌతముఁడును, దపస్వి యయ్యెను. ఇందులో విశేష మేమియు లేదు. కాని - యీ తరుణ గృహస్థుఁడు - దన జాతికి నిరుపయోగి యయ్యె నని మాత్రమే జనులు బెదవి విఱచిరి. కాని యేడు వర్షములు దప స్సొనరించి - బోధిసత్త్వుఁడు బుద్ధుఁడై - గృహస్థాశ్రమములోని సుఖమును - సన్యాసములోని దపశ్చర్యను సమానముగ నిరసింపఁ జొచ్చెను. దానితో ననేకు లాతనిపై 'టీకలు' సేయ నారంభించినారు.

ఆ నాటి సమాజ పద్ధతులు రెండు. కర్మయోగము నాశ్రయించినచో బ్రాహ్మణుఁడు యజ్ఞ యాగము లొనర్పవలెను. క్షత్రియుఁడు యుద్ధము సేయవలెను. వైశ్య శూద్రులు వ్యాపారము, సేవ - వీనిని గావింప వలెను. ఈ కర్మయోగ మిష్ట పడనివా రడవులఁ జేరవలెను. అచటఁ దపశ్చర్యలతో శరీరమును గృశింపఁ జేసికొని మరణింప

వలెను. ఈ రెండే నాటి సామాజిక పద్ధతులు. వీనికిఁ దిరుగఁ బడుట కెవ్వరికి సాధ్యము గాకుండెను. బుద్ధుఁ డాపని యొనర్చినాఁడు.

వేలువేలు శ్రమణ సంఘములలో -భిన్నభిన్న తత్త్వ జ్ఞానములు ప్రతిపాదింప బడెడివి. కాని - తపశ్చర్యా విషయమున మాత్రము వారి కెవ్వరికి విప్రతిపత్తి లేదు. ఏకవాక్యతయే యుండెను. వారిలో నిర్గ్రంథులు గర్మ కెక్కువ ప్రాధాన్యము నొసఁగిరి. 'ఈ జన్మము దుఃఖకారకము. ఇది పూర్వజన్మ పాపఫలము. ఈ పాప పరిహారమునకుఁ గతిన తపశ్చర్యయే మార్గము -' యని వారి యగ్రనాయకులు వాదించుచుండిరి. బుద్ధుఁ డీ తపశ్చర్యను నిషేధించెను. అగుటచే నిర్గ్రంథు లీతని నక్రియావాది (అకర్మవాది) యనుట సహజమే. బుద్ధుఁడు శస్త్రత్యాగము సేయుటచే - బ్రాహ్మణు లీతని 'నష్టే' యన్నారు. తపశ్చర్య వదలుటచే శ్రమణులు గూడ నదే పేరు పెట్టిరి.

## క్రాంతికారకమైన తత్త్వజ్ఞానము

బుద్ధుఁడు గృహత్యాగ మొనర్చినది దాను మాత్రమే యాత్మబోధ మంది మోక్షమును బొందుటకుఁ గాదు తమ పొరుగువారిపై నాతఁడు గత్తి గట్టుట కిష్టపడ లేదు. హింసావృత్తి లేక బరస్పరము సుఖముగ జీవించు నొకానొక సమాజ రచన యొనరించుట సాధ్యమా! ఇదియే యాతని మనస్సున నిరంతరము దిరుగుచుండిన యాలోచన. దీనిని మనము మఱచినచో - బుద్ధుని చరిత్రలోని గళయే పోవును. తప

స్సుతో మానవ జాతికి 'శాంతి'ని ప్రసాదింపవచ్చునని దోత్తనాతనికిఁ దట్టినది. అందుచే నాతఁడిల్లువిడచి - యడవి కేగెను. ఏడేండ్లు దపశ్చర్య నడచినది. తపస్సుతో సాధింపఁబడున దేదియు లేదని యాతనికిఁ దెలిసెను. వెంటనే - నిస్సంకోచముగ దానిని వదలిపెట్టినాఁడు. ఒక నూతన మధ్యమ మార్గమును శోధించి గడ్డకుఁ దీసెను.

నేఁడుగూడ 'క్రాంతి' కిరులైనవారికి 'ధార్మికు'ల మనుకొను సనాతన రాజకీయవాదులు వినాశకులను (Nihilist) నొక విశేషణమును దగిలింతురుగదా! వారి లోటు పాటులను సమాజమున నెక్కువ ప్రచారము సేయుదురు. అట్లే - బుద్ధునిగూడ సమకాలికులైన టీకాకారు 'లక్రియా వాది' యనిరి. అతని నవీన తత్త్వజ్ఞానము నిరర్థకమని వేయి నోళ్ళతోఁ బ్రచార మొనరించిరి.

## దుశ్చరిత - సుచరితములు

ఈ ప్రకరణమున దుశ్చరిత - సుచరితము లన నేవో కొంత పర్యాలోకింతము. బుద్ధభగవానుఁడు సాలేయక బ్రాహ్మణులతో నన్నాఁడు. "గృహస్థులారా! కాయికము లైన యధర్మములు మూఁడు. అవియేవి? ఒకానొకఁడు ప్రాణఘాత మొనరించును. రుద్రదారుణ లోహితపాణియై గలహోయమానుఁ డగును. లేక దొంగతన మొనరించును. ఏవస్తువు దనదిగాదో - దానిని యడవిలోగాని - యూరి యందుగాని - విచారణ లేక దీసికొనును. వ్యభిచరించును. తల్లిదండ్రులు - చెల్లెలు - మగఁడు - నాస్త్రులు వీరిచేత

రక్షింపఁబడిన స్త్రీని జెఱచును. ఇవి త్రివిధములైన కాయికా ధర్మములు.

వాక్కుతో ఘటించు నాల్గు తెఱఁగుల యధర్మాచరణము లెట్టివి ? ఒకానొకఁడసత్యము బలుకును. సభలోఁ బరిషత్తులో - నాప్త మండలములో లేక రాజ ద్వారమునం దొకనిని సాక్ష్యము విచారింతురు. నీ వెఱిఁగినది బల్కుమందురు. తా నెఱుఁగని దెఱింగితి నని వాఁడనును. చూడనిది జూచితి ననును. ఇట్లు తన కొఱకై - బరుల కొఱకై - లంచము గొఱకై - బుద్ధి పూర్వకముగ నసత్యము వచించును. లేక గుత్రు లొనర్చును. ఒకరు బలుకుచున్న మాటలు విని - యవి వేఱొకరికిఁ జెప్పి - యిరువురకు భేదమును గలిగించును. ఈ భేదముతో వా రిరువురకుఁ గలహము బెరుగును. ఆ కలహముతో- భేదోపాయ మొనర్చువాని కానందము! జగడమును బెంచుమాటలే వాఁడాడు చుండును. లేక యొకఁ డొకనితో జగడించును. దుష్టకర్కశముగ మాటలాఁడును. క్రోధమును రెచ్చగొట్టుచుఁ బల్కును. ఆమాటలు మర్మచ్ఛేదకములై యుండును. సమాధానపడుటకు సాధ్యపడనివై యుండును. లేక యొకఁడు వదరుపోతుగా నుండును సందర్భశుద్ధి గమనించి మాట్లాడడు. అధార్మికముగ, శిష్టాచార విరుద్ధముగ, దుర్లక్ష్యముగఁ బలుకును. వాని పలుకులు ప్రసంగముల శోభింపవు. అకారణముగ ననర్థభాషణము సేయును. ఈ నాల్గును వాచికములైన యధర్మాచరణములు.

గృహస్థులారా ! మానసికములైన యధర్మములు ము త్తెఱఁగులు. అవియేవి ? ఒకఁడు - వేఱొకరి ద్రవ్యమును

గుఱించి చింతించును. ఇతరుని సంపత్తి తనకురావలెనని గోరును. ద్వేషబుద్ధినిగలిగి యుండును. వీఁడు నశించుగాక! జచ్చుగాక! యని గోరుచుండును. లేక - వాఁడు మిథ్యా దృష్టిగలిగి 'దానధర్మములులేవు. సుకృత దుష్కృత కర్మ ఫలములు లేవు. ఇహలోక-పరలోకములు లేవు'యని నాస్తిక విచారములు చేయును. ఇవి మానసికములైన యధర్మములు.

మఱియేవైన కాయిక ధర్మములేవి? ఒకఁడు ప్రాణిఘాతము సేయఁడు. ఇతరులపై నాయుధము నెత్తఁడు. హత్య వానికి లజ్జాకరము. సర్వప్రాణులయందును వాని యాచరణము దయామయమై యుండును. దొంగతన మొన ర్పఁడు. గ్రామములలోనైన - గానములోనైన - నిచ్చిననే దప్ప యొకరివస్తువును గైకొనఁడు. వ్యభిచారము సేయఁడు. తల్లిదండ్రులు-నన్న-జెల్లెండ్రు, పతి, యాప్తులు, వీనిచే రక్షింపఁబడిన స్త్రీతో సంబంధముంచి కొనఁడు. ఇవి కాయిక ధర్మాచరణములు.

వాచిక ధర్మాచరణము లేవి? ఒకఁ డసత్యము లాడఁడు. సభలో - బరిషత్తులో - రాజద్వారములో దన్ను సాక్ష్యము విచారించినప్పుడు - దనకు తెలియనిది - తెలియ దనియే చెప్పును. చూడనిది - చూడలేదనియే బలుకును. తనకొఱకై, యితరులకొఱకై లంచము కొఱకై-యసత్యము బలుకఁడు. కుట్ర సేయఁడు. ఒకరి మాట వేఱొకరికిఁ జెప్పఁడు. కలహించువారి నొకటిగాఁ జేయుటకై యత్నించును. వారిలో నేకవాక్యత గల్పించుటకు శ్రమించును. అనేకు లొకటైనప్పుడే వాని కానందము. ఐకమత్య

మును బెంచుమాటలే మాట లాడును. వాఁడుగాయగా నుండఁడు. వానిపలుకులు సరళములు. కర్ణ మధురములు. హృదయంగమములు. బహుజన ప్రియములు. నాగరకునకు శోభించునవియై యుండును. ప్రసంగాను గుణముగఁ బలుకును. శిష్టాచారము ననుసరించి వచించును. సులక్షణములై యోగ్యములైన మాటలను మంగళార్థముగ - ధార్మికముగ భాషించును. వాని పలుకులు సకారణములు. సార్థకములు. ఇవి వాచికములైన చతుర్విధ ధర్మములు.

ముత్తెఱఁగులైన మానసికధర్మము లేవి ? ఒకఁడు - బరద్రవ్యము నాశింపఁడు. వాని చిత్తము దోష విముక్తమై యుండును. వైరమును వాఁడుగోరఁడు. వాని సంకల్పములును - నిర్బాధకములై - దుఃఖరహితములై - సుఖసంపాదకములై - శుద్ధములై యుండును. వానికి సమ్యగ్దృష్టి యుండును. 'దానధర్మములుండవలెను సుకృతదుష్కృతములకు ఫలములున్నవి. ఇహ లోక పరలోకములుగలవు' ఇత్యాది విశ్వాసములువానివి. ఈరీతిగ మానసికధర్మములు మూఁడు రీతులు.*" సంక్షేపముగఁ జెప్పినచో - ప్రాణఘాతము - యదత్తాదానము - కామమిథ్యాచారము ఇవి కాయికములైన పాపములు. అసత్యము" నింద, గలహపరాయణత్వము. వదరుబోతుతనము యివి వాచికములైన పాపకర్మలు. పరద్రవ్యలోభము - యితరులు నాశనము గావలెనను నిచ్ఛ - నాస్తికతాబుద్ధి యివి మానసిక పాపకర్మలు. ఈ పదింటిని 'నకుశలకర్మపథములం'దురు వీనినుండి - నివృత్తమగుటయే

* 'మజ్ఝిమనికాయము' (సం:41) 'సాలేయ్యకసుత్తము' చూ:

కుశలకర్మపథము. కుశలకర్మలుగూడ బదియే. వానివర్ణనము పైన వచ్చినదిగదా ! ఏది యకుశలకర్మ ? ఏది కుశలకర్మ ? వీనివర్ణనము 'త్రిపిటక వాఙ్మయము'నం దనేకసారులు వచ్చును. అకుశల కర్మపథమే యధర్మాచరణము. కుశల ధర్మపథమే ధర్మాచరణము.

## కుశలకర్మములు - మఱియు నష్టాంగికమార్గములు

కుశలకర్మపథము లార్యుల యష్టాంగిక మార్గమందుఁ జేరును. కుశలకాయకర్మలు ముత్తెఱఁగులు గదా! వీనికి సమ్యక్కర్మయందు-సమ్మేళనము. కుశల వాచిక కర్మములు నాలుగురీతులు. వానిని సమ్యగ్వాక్కు- గ్రోడీకరించికొన్నది. ముత్తెఱఁగులైన మానసిక కుశలకర్మలు-సమ్యగ్దృష్టి - సమ్య క్సంకల్పములలోఁ జేరును. ఇఁకమిగిలిన యష్టాంగిక మార్గము లోని నాలు గంగములును - నీ కుశలకర్మపంథలకు బోషక ములు. సమ్యగాజీవము, సమ్యగ్వ్యాయామము-సమ్యక్స్మృతి- సమ్యక్సమాధి - యీ నాలుగింటిని, తథ్యముగ భావించి యనుసరింపనిది-కుశలకర్మపథమున కభివృద్ధిఘటిల్లదు. పూర్ణ తయు గల్గదు.

## అనాసక్తియోగము

ఆసక్తబుద్ధితోఁ గుశలకర్మ లొనర్చినను, వానినుండి యకుశలకర్మలు జనించు సంభవముగలదు.

"కుసలో ధమ్మో అకుసలస్స ధమ్మస్స ఆరమ్మణ పచ్చయేన
పచ్చయో దానందత్వా సీలంసమాధి యిత్వా
ఉపోసథకమ్మం కత్వా, తం అస్సాదేతి, అభినందతి

తం అరబ్భరాగో ఉప్పజ్జతి, దిట్ఠిఉప్పజ్జతి, విచికిచ్ఛాఉప్పజ్జతి ఉద్ధచ్చం ఉప్పజ్జతి, దోమనస్సం ఉప్పజ్జతి॥"

"అకుశల విచారములు - గుశలముల నాలంబనము గావించికొని ప్రత్యక్షమగును. ఒకానొకఁడు దానమొసఁగును. శీలమును రక్షించికొనును. ఉపవసించును. ఇతరులు వీని నభినందింతురు. దానిచే వానికి లోభముత్పన్న మగును. దృష్టియుత్పన్నమగును. శంక గలుగును. భ్రాంతత యేర్పడును. దౌర్మనస్యము జనించును."

ఇట్లు గుశల మనోవృత్తు లకుశల మనోవృత్తులకుఁ గారణములగు ప్రమాదము లున్నవి. అందుచే గుశలములం దాసక్తివదలి - నిరపేక్షుఁడై యాచరింపవలెను. ఈ యర్థమే క్రిందిగాథలో 'ధమ్మపద'మందు సంక్షేపముగ జెప్పబడినది.

"సబ్బపాపస్స అకరణం కుసలస్స ఉపసంపదా
సచిత్త పరియోదపనం యేతం బుద్ధానసాసనం"

"సర్వపాపములను జేయకుండుట, గుశలములను సంపాదించుట, దనచిత్తమును శోధించికొనుట - యిదియే బుద్ధుని శాసనము."

అకుశల పథములన్నియు వదలవలెను. కుశలమార్గమునం దనాసక్తుఁడై యాచరింపవలెను. ఈ సర్వము లష్టాంగ మార్గముయొక్క యనుసరణముచే నేర్పడును.

## కుశలకర్మలందు జాగృతి-యుత్సాహము

కుశలకర్మలయందు జాగృతి - యుత్సాహముండవలెనని యుపదేశము 'త్రిపిటకవాఙ్మయమం'దు జాలసార్లు

వచ్చును. ఆయుల్లేఖముల నన్నిటి నిక్కడ నొసఁగుటకు వీలు లేదు. కాని–చిన్నవి యొకటిరెండిత్తును.

బుద్ధభగవానుఁ డనెను. "భిక్షువులారా? స్త్రీగాని, పురుషుఁడుగాని, ప్రవజితుఁడుగాని, గృహస్థుఁడుగాని యీ క్రింది యైదింటిని నిరంతరము జింతన మొనర్పవలెను.

1. 'నేను జరాధర్మిని' - ఇట్లు మాటి మాటికిఁ జింతింప వలెను. ఎందుకనఁగాఁ దారుణ్యమదముతో మానవుఁడు - త్రికరణములతో దురాచరణముగావించును. ఆ మద మీ చింతనతో నాశమగును. త్రికరణ పాపములు దక్కువ యగును.

2. 'నేను వ్యాధిధర్మిని'-ఇట్లు మాటిమాటికిని విచారింప వలెను. ఏలనన-నారోగ్యమదముతోఁ బ్రాణి త్రికరణము లతో ననేకపాపము లొనర్చును. ఈ చింతనతో నాపాపము నశించును.

3. 'నేను మరణధర్మిని'- ఈ విషయము మాటిమాటికి జింతింపవలెను. జీవితమదముతోఁ ద్రికరణ దురాచారములు పుట్టెల్లును. ఆ దురాచారములు వీనితోఁ దక్కువగును.

4. 'ప్రియములైన – మనోరమములైన ప్రాణులు ... పదార్థములు వీనితో నాకు వియోగమున్నది' - యని బలు మారు విచారింపవలెను. ప్రియస్నేహముతో మనుష్యుఁడు- మనోవాక్కాయములతో దురాచారములు సేయును. ఆ స్నేహ మీ చింతనతో నాశనమగును. వాని కారణముతగ్గును.

5. 'నేను గర్మస్వకీయుఁడను, కర్మదాయాదిని, కర్మ యోనిని, కర్మబంధువును, కర్మప్రతిశరణుఁడను, కల్యాణ

కారకములు లేక పాపకారకములగు కర్మలొనర్చుటలో వాని వానికి దాయాదినై పోదును ' ఇట్లు మాటిమాటికి జింతింప వలెను. కాయిక, వాచిక, మానసిక దురాచరణములు నశించును. వానికిఁ గారణములు దక్కువగును.

నే నొకఁడనే గాదు, సకలప్రాణులును జరా, వ్యాధి, మరణ, ధర్మములతో గూడినవే. వీని యన్నింటికిఁ బ్రియ వియోగము దప్పనివి వారుగూడఁ గర్మ దాయాదులే. ఇట్లని యార్యశ్రావకుఁడు నిరంతరము భావించును. అందుచే నాతనికి మార్గము భాసించును. ఈ మార్గముయొక్క సతతా భ్యాసముచే వాని సంయోజనములు నష్టములై పోవును.*

మానవుఁడు గర్మస్వకీయుఁడు. అనఁగా నేమి ? కర్మ దప్ప దక్కిన వస్తుజాలము లన్నియు వానినుండి విడివడి పోవును. కర్మమే వాని స్వకీయము. నరుఁడు గర్మదాయా దుఁడు. సత్కర్మలచే సుఖము – దుష్కర్మలచే దుఃఖము వానికిఁ బ్రాప్తించుచున్నది. అతఁడు 'గర్మయోగి'. కర్మ వలననే వానికి బుట్టువుగల్గినది. అతఁడు గర్మయే యోనిగ, జనికారణముగఁ గలవాఁడు. నరుఁడు గర్మబంధువు. సంక టము లందు నిక్కముగ వానికిఁ దోడుపడునది వానికర్మయే. ఇంతయేగాదు. నరుఁడు గర్మప్రతిశరణుఁడు గూడ. అనఁగా – గర్మయే దన్ను రక్షించునను విశ్వాసముగలవాఁడు. బుద్ధుని దృష్టిలో మానవుఁ డిన్నిరీతులుగఁ గర్మచే బంధితుఁడు. కర్మపై నింతటి విశ్వాసమున్న బుద్ధుఁడు నాస్తికుఁడేనా!

* అంగుత్తర నికాయము 'పంచకనిపాతము' సుత్తము57, చూ.

ధమ్మపదమం దీ క్రింది శ్లోకమున్నది. సత్కర్మల నుత్సాహపూరితమైన మనస్సుతో నాచరింపవలెనని యది జెప్పును ఆగాథ యిది:

"అభిత్థరేథ కల్యాణే - పాపాచిత్తం నివారయే
దంధంహి కరోతో - పుణ్ణం పాపస్మిం రమతౌమనో"

"కళ్యాణకర్మలయందుఁ ద్వరపడవలెను. పాపమునుండి జిత్తమును నివారింపవలెను. ఎందుకనఁగా-పుణ్యకర్మలోన చ్చుటయం దాలసించినచో మనస్సు బాపమందు రమించును."

## బ్రాహ్మణుల కర్మయోగము

ఇంతవఱకు బుద్ధుని కర్మయోగ మెట్టిదో జూచితిమి. ఇఁక నానాటి బ్రాహ్మణుల కర్మయోగ స్వరూప మెట్టిదో విలోకింతము. బ్రాహ్మణుల యుపవిక యజ్ఞ యాగాదులు. వానిని విధిపూర్వకముగ నాచరించుటయే వారి కర్మ యోగము. క్షత్రియులకు యుద్ధము-వైశ్యులు వ్యాపారము-శూద్రాదులకు సేవ-యిది యాయాజాతుల కర్మయోగమని బ్రాహ్మణులు వచింతురు. ఈ కర్మయోగ మిష్టములేని వాఁ డడవులకుఁబోయి తప మొనరించును. దానిని సన్యాసయోగ మందురు. దీనితో వాని కర్మయోగము ముగిసినట్లే. కొం దఱు సన్యాసము స్వీకరించిగూడ - యగ్నిహోత్రాది కర్మ యోగముల నాచరించు చుండిరి. అదియే శ్రేష్ఠమార్గమని వారివాదము. ఈ యభిప్రాయము భగవద్గీతలో నిట్లున్నది.

"యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబంధనః
తదర్థం కర్మ కౌంతేయ! ముక్తసంగ స్సమాచర!"

"యజ్ఞార్థమైన కర్మ దప్ప దక్కిన కర్మ బంధకార కము. అందుచే గాంతేయా! సంగమును వదలి యజ్ఞము కొఱకై గర్మ నాచరింపుము."

"సహయజ్ఞాః ప్రజాస్సృష్ట్వా - పురోవాచ ప్రజాపతిః
అనేన ప్రసవిష్యధ్వం - ఏషవో స్త్విష్టకామధుక్"

"తొల్లి యజ్ఞములతోఁ గూడ బ్రజలను సృష్టించి బ్రహ్మదేవుఁడు 'మీరీ యజ్ఞయోగముతో నభివృద్ధి జెందుఁడు. ఈ యజ్ఞమే మీకు కోరికలఁ బిదుకు కామధేనువ'ని వంచించెను."

"ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయతీహయః
అఘాయురింద్రి యారామో మోఘం పార్థ ! సజీవతి."

"ఈ రీతి ప్రవర్తితమై-యజ్ఞయాగాదిరూపమైన లోక తంత్రము నెవ్వఁ డనుసరింపఁడో-వాఁడు వ్యర్థమైన జీవితము గలవాఁడు. పాపరూపుఁడు. ఇంద్రియ లంపటుఁడు, వాని పుట్టువు వ్యర్థము.*

## బ్రాహ్మణుల లోకసంగ్రహము

'ప్రజాపతిచేఁ బ్రవర్తితమైన యీ యజ్ఞయాగరూప చక్రము సముచితముగాదు. వీనియందు హింస బహుళము.' అని యెవ్వనికైన దోచినను వాఁ డట్లు దలఁపరాదట! ప్రచారమును సేయరాదట! ఎందుకనఁగా - వాని యా తలఁపు జనులలో బుద్ధిభేదమును గలిగించుచున్నది. ఈ యర్థము భగవద్గీత యిట్లు చెప్పెను.

---

* భగవద్గీత అ: 3-9, 10, 16;

"న బుద్ధిభేదం జనయే-దజ్ఞానాం కర్మసంగినాం
జోషయే త్సర్వకర్మాణి-విద్వాన్ యుక్తస్సమాచరన్"

"కర్మాసక్తమైన జనతకు బుద్ధిభేదములు గల్పింపరాదు. విద్వాంసుఁడు – సర్వకర్మలను సముచితముగ నాచరించువాఁడై యితరుల నాచరింపఁ జేయవలెను." (భగవద్గీత-3_26) గీతయొక్క సర్వాధ్యాయములును విచారింపఁ దగినవే.

భగవద్గీత యెప్పుడు రచింపఁబడె నను విషయ మిపుడు క్రొత్తగఁ దేల్చవలిసినది లేదు. అది బుద్ధుని సమకాలికములు గూడ గాదు. ఆతని కెంతయో యర్వాచీనము. బుద్ధుని తర్వాత యయిదు నూరేండ్లనుండి – వేయియేండ్ల లోపల దాని రచనాకాలము.

గీతయందుఁ జూపింపఁబడిన గొన్ని తత్త్వములు బుద్ధసమకాలికులైన బ్రాహ్మణులలో నుండెడివి. ఒకని మనస్సునం దేదైన నొక గొప్ప యూహ జనించినచో – వాఁడు–దానిని, లోకమునకుఁ దెలుపగూడదట ! కోసలదేశ వాసియైన లోహిత్యనామక ప్రసిద్ధ బ్రాహ్మణుఁ డీ యభిప్రాయమును బ్రకటించెను.* ఆ విషయ మిది.

బుద్ధ భవానుఁడు కోసలదేశమందుఁ దిరుగుచు–'శాలవతిక'యను గ్రామము దగ్గరకువచ్చెను అది లోహిత్య బ్రాహ్మణుని యగ్రహారము. ప్రసేనజిత్తు యొసఁగినది. 'ఒకానొక శ్రమణునికి గాని – బ్రాహ్మణునికిగాని – కుశల తత్త్వబోధ గల్గినచో దానిని వాఁడితరులకుఁ దెల్పరాదు.

* 'దీఘనికాయము' రెండవభాగము 'లోహిచ్చసుత్తము' చూ:

మనుష్యుఁడే యల్పుఁడు. వాఁడు - మఱియొక్కని కేమి తత్త్వము బోధించును? తత్త్వబోధతోఁ బ్రాచీన బంధ మొకటి దొలఁగి-దానితావున నవీనబంధ మొకటి దగుల్కొను నంతే. అందుచే నీనూతనమార్గ మొక చాపల్యము మాత్రమే.' ఇదిలోహిత్య బ్రాహ్మణుని యభిప్రాయము.

బుద్ధుఁడు దన గ్రామసమీపమునకు వచ్చెనని యాతఁడు వినెను. అపుడు 'రోసికుఁ'డను మంగలి నంపి బుద్ధు నామంత్రణము జేసినాఁడు. రెండవనాఁడు వంట తయారైన దరువాత నా మంగలిచేతనే 'రావలసినద'ని లోహిత్యుఁడు బుద్ధునకు వర్తమాన మంపెను. భిక్షుసంఘమునకుగూడ- బుద్ధుఁడు దన పాత్ర-చీవరములఁ గైకొని బ్రాహ్మణునింటికి గదలెను. త్రోవలో 'రోసికుఁడు' బ్రాహ్మణుని యూహ బుద్ధునకు విన్నవించి-యతనిని బాపకారకమైన యభిప్రాయమునుండి విముక్తుని గావింపవలయునని విన్నవించెను.

లోహిత్య బ్రాహ్మణుఁడు బుద్ధునకు- భిక్షుసంఘమునకు నాదరపూర్వకముగ భోజన మిడెను. భోజనానంతరము బుద్ధభగవానుఁడన్నాఁడు. "లోహిత్యా! ఒకానొకనికిఁ గుశల తత్త్వబోధ గలిగినచో వాఁడితరులకుఁ జెప్పరాదని నీ యభిప్రాయమట. ఇది నిజమేనా!"

లో:- అవును.

బుద్ధు:- లోహిత్యా! నీ వీ శాలవతిక గ్రామ మందున్నావు. ఒకానొకఁడు 'యీ శాలవతి యందెన్ని పదార్థము లుత్పన్నములగునో ని నన్నిటిని లోహిత్యుఁడే యనుభవింపవలెను. ఇతరుల కధికారము లేదు.' ఇట్లను

ననుకొనుము. ఈరీతి వచించువాఁడు నిన్నవలంబించికొని బ్రదుకుచున్న జనుల కకల్యాణకారకుఁడగునా? గాదా?

లోహిత్య:- అగును.

బుద్ధుఁడు:- ఇతరుల కంతరాయము గల్గించువాఁడు వారికి హితానుకంపియా! లేక యహితానుకంపియా?

లోహి:- గౌతమా! యహితానుకంపి.

బుద్ధుఁడు:- అట్టి మానవుని మనస్సు మైత్రీమయమా; లేక వైరమయమా!

లోహి:- వైరమయము.

బుద్ధుఁడు:-వైరమయ చిత్తముగల మనుష్యునిదృష్టి మిథ్యాస్వరూపమా; లేక సమ్యగ్దృష్టియా!

లోహి:- మిథ్యాదృష్టి.

పై సంభాషణతో బుద్ధుఁడు లోహిత్య బ్రాహ్మణుని కల్మషదృష్టిని బయటఁ బెట్టిన ట్లున్నది.

## కుశలకర్మలతో నకుశలకర్మల జయింపవలెను

ఈ యొక చోటనేగాదు. అనేక యెడల బుద్ధుఁ డిట్లే వర్తించెను. లోకమందున్న యకుశల కర్మలను - రూఢి విరుద్ధములైన కుశలకర్మలను మూఁగిగా నంగీకరించు టాతఁ డెఱుఁగఁడు. వానిలోని తత్త్వమును లోకమునకు వివరించి చెప్పవలెను. అప్పుడే దృష్టి. నలుగురితోఁ బాటు మాటాడుట - వారి వలెనే వర్తించుట యాతనికి గిట్టదు.

యజ్ఞ - యాగములు, వర్ణవ్యవస్థ యీ రెంటిని బ్రజాపతియే సృష్టించెనని బ్రాహ్మణుల వాదము. ఈ రెంటి

ననుసరించిన కర్మలే వారి దృష్టిలోఁ బవిత్రమైనవి. తృష్ణతోఁ గలుగు హింసాది కర్మలెట్లును శుద్ధములు గానేరవని బుద్ధుని యభిప్రాయము. అందుచే మనుష్యులు విషమమార్గమున బద్ధులైయున్నారనియుఁ గుశల కర్మలాచరించిననే - యీ విషమకర్మలనుండి వారికి విముక్తి యనియు నతఁడు విశ్వసించెను. 'మజ్ఝిమ నికాయము' లోని సల్లేఖ సుత్తమందు (8) భగవంతుఁ డిట్లనును: "చుందా! ఇతరులు హింసకులై చరింతురు. తా నహింసకుఁడగుగాక! ఇదియే యాత్మశుద్ధి. ఇతరులు ప్రాణఘాత మొనర్తురు. తాను దాని నుండి నివృత్తు డగుగాక. ఇదియే యాత్మశుద్ధి. ఇతరులు చోరులై యబ్రహ్మచారులై, యసత్య భాషణులై, యున్నప్పుడు దాను వీని నుండి నివృత్తు డగుగాక. ఇదియే యాత్మశుద్ధి. ఇతరులు కుట్రదారులై, కలహశీలురై, వృథాప్రలాపులై యున్నపుడు, దాను వీనినుండి నివృత్తు డగుట యాత్మశుద్ధి. పరులు - బరుల ధనమందు లోభము గలిగియుందురు. పరుల పై ద్వేషమును జూపుదురు. మిథ్యాదృష్టి గల్గి యుందురు. తా నీ దోషములనుండి విముక్తుడై సమ్యగ్దృష్టి గల్గి యుండవలెను - ఇది యాత్మశుద్ధి ...

చుందా! విషమ మార్గమందుఁ జరించుచున్నవాఁడు దాని నుండి, విముక్తుఁడగుటకు మార్గమేది? సరళ మార్గమున సంచరించుట. అట్లే విహింసక మనుష్యుఁడు దాని నుండి విముక్తుఁడగుటకు, మార్గమొకటే. దాని నుండి విరతి జెందుట. ప్రాణఘాతిమనుష్యునికి-ముక్తి ప్రాణఘాతమును వదలినపుడే. ఇట్లే - జోరుఁడుఁగూడ - జౌర్యము నుండి

విరతిఁజెందవలెను. బ్రహ్మచర్యము ననుసరింపనివాఁడు - దాని ననుసరింపవలెను. అసత్యభాషణునకు విముక్తి - దానిని వదలినపుడే. కలహశీలుఁడు గలహశీలిత్వమును వదలవలెను. కర్కశ వచనములు బల్కువాఁడు - వాని నుండి విముక్తి నందవలెను. వృథాప్రలాపి - వృథాలాపములు విడువవలెను. ఇది తప్ప వేఱు మార్గము లేదు.

చుందా! స్వయముగ బురదలో దిగఁబడిన వాఁ డితరులను బురదనుండి వెలికీడ్చునా? తన్ను దమించుకొననివాఁడు నియమించుకొనని వాఁ డితరుల నియమింపఁ జాలునా? తనకే శాంతిలేనిది - యితరుల కెట్లు గల్గింపఁగలఁడు? ఎవఁడు స్వయముగ దాంతుఁడో - వినీతుఁడో - పరినిర్వృతుఁడో - యట్టివాఁడే యితరుల కీ గుణములు శిక్షింపఁగలడు!" ఈ యర్థమే ధమ్మపదమునందలియొక్క గాథలో సంక్షిప్తముగఁ జెప్పఁబడినది. ఆ గాథ యిది:

అక్కోధేన జినేకోధం - అసాధుం సాధునాజినే
జినే కదరియందానేన - సచ్చేనా లీకవాదినం"

"క్షమతో క్రోధమును జయింపవలెను. అసాధువును-సాధుత్వముతో-గృపణుని దానముతో - నసత్యవాదిని సత్యముతో జయింపవలెను. (ధమ్మపదము - 223 వ శ్లో)

## దశకుశల కర్మపథములలో బ్రాహ్మణు లొనర్చిన మార్పులు

వైదిక గ్రంథకారులు - జైని జెప్పిన కుశలాకుశల కర్మపథములను-సంబరముగఁ దమ గ్రంథములందు వర్ణించిరి.

కాని-తమ హక్కులకు భంగము గలుగకుండ మాత్రము జాగ్రత్తదీసికొన్నారు. మనుస్మృతిలో నీ పది యకుశలకర్మ లెట్లు స్వీకరింపఁబడినవో - జూడుఁడు—

సతానువాచ ధర్మాత్మా - మహర్షీన్ మానవోభృగుః
అస్యసర్వస్య శృణుత - కర్మయోగస్య నిర్ణయం॥

"మను కులోత్పన్నుఁడై - ధర్మాత్ముఁడైన భృగువు - గర్మయోగముయొక్క నిర్ణయమును వినుఁడని మహర్షులతో ననెను."

"పరద్రవ్యేష్వభిధ్యానం - మనసాఽనిష్టచింతనం।
వితథాభినివేశశ్చ - త్రివిధం కర్మమానసం"

"పరద్రవ్యముల నభిలషించుట - మనస్సుతో ననిష్టమును జింతించుట - నాస్తికత - యీ మూఁడును మానసిక పాపములు."

"పారుష్య మనృతంచైవ - పైశున్యంచాపి సర్వశః
అసంబద్ధప్రలాపశ్చ - వాఙ్మయం స్యాచ్చతుర్విధం"

"కఠోర భాషణము-యసత్యము బలుకుట-పైశున్యము వదరుబోతుతనము, యివి వాచికపాపములు."

"అదత్తానాముపాదానం - హింసాచైవావిధానతః
పరదారోపసేవాచ - శారీరం త్రివిధంస్మృతం"

అదత్తదానము-వేదవిహితముగాని హింస - పరదారాభిగమనము-గాయిక పాపములు.

"త్రివిధంచ శరీరేణ, వాచాచైవ చతుర్విధం
మనసా త్రివిధం కర్మ - దశకర్మపథాన్ త్యజేత్"

"ఈ విధముగ మూఁడు గాయిక పాపములు - నాల్గు వాచికపాపములు - మూఁడు మానసికములు. ఈపది (అకుశల) కర్మపథములను వదలవలెను.

(మనుస్మృతి. 12-5-9.)

వీనిలో - మొదటి శ్లోకమున నాడఁబడిన 'గర్మయోగ' శబ్దము ముఖ్యమైనది. మనుస్మృతి కారునకు బుద్ధుఁడుపదేశించిన గర్మయోగ మంతయు నిష్టమే. కాని - యొక యపవాదమును మాత్రము నాతఁడు జూపించినాఁడు. వేదవిహితముగాని హింసయే హింస. వేదవిహితమైన హింస, హింసగాదు. ఇది స్మృతికారుని యూహ.

యుద్ధము ధార్మిక మగుటచే
నకుశలముగూడ కుశలమైనది.

యజ్ఞ యాగములందు హింస త్యాజ్యమైనచో నపుడు వీని నొనర్చుటకుఁ గారణమే లేకపోవును. యజ్ఞములు సేయు టెందులకు? యుద్ధములందు జయము గల్గుట - జయానంతరము లభించిన రాజ్యము స్థిరముగ నుంకుట - యీ ఫలములకు యుద్ధమునందలి హింస ధార్మికము గాకపోయినచో - వైదిక హింసకు 'ఆసరా' యుండదు. అందుచే యుద్ధము గూడఁ బవిత్రమనిరి. భగవద్గీతలోఁ గృష్ణుఁ డిట్లనాఁడు—

"స్వధర్మమపి చావేక్ష్య - నవికంపితుమర్హసి
ధర్మ్యాద్ధియుద్ధా చ్ఛ్రేయోఽన్యత్ క్షత్రియస్య న విద్యతే"

"అర్జునా! నీ ధర్మమును విచారించిగూడ భయపడుట నీకు యుక్తముగాదు. ధార్మికమైన యుద్ధమునకన్నను క్షత్రియునకు శ్రేయస్సు లేదు."

"యదృచ్ఛయా చోపపన్నం స్వర్గద్వార మపావృతం
సుఖినః క్షత్రియాః పార్థ ! లభంతే యుద్ధమీదృశం"

"అర్జునా! యుద్ధము యదృచ్ఛగా సంభవించిన - యపావృతమైన స్వర్గద్వారము. ఇది - భాగ్యవంతులైన క్షత్రియులకే దక్కును."

"అథచేత్త్వ మిమంధర్మ్యం సంగ్రామం న కరిష్యసి
తతః స్వధర్మం కీర్తించ హిత్వాపాప మవాప్స్యసి!

"నీవీ ధార్మిక యుద్ధమును జేయకున్నచో నీకీర్తి దొలఁగును. నీ ధర్మము దొలఁగును. నీకు పాపము లభించును."

(గీత. అ. 12; 32-33 శ్లో)

యుద్ధము ధార్మికమైనచో - నకుశల కర్మలు సర్వమును గుశలములగుట కవకాశ మున్నది. యుద్ధమునందుఁ దప్ప హింస సేయకుము. యుద్ధమందుఁ దప్ప దోచకుము. యుద్ధమందు దప్ప వ్యభిచరించకుము. ఇట్లు - యసత్యభాషణము - గర్కశ వచనము - యొకటేమి సర్వమును రాజకారణములం దుపయోగింపవచ్చునను యనుమతి దొరకును. ఇఁక పరద్రవ్య లోభమా? సర్వయుద్ధములకును శ్రీకారమదియే గదా! పరసైన్యముపై ద్వేషమును దమ సైన్యమున బాగుగఁ బ్రచారము సేయకున్నచో- నా సైన్యము లభినివేశముతోఁ బోరవు. స్వధర్మము కొఱకని - రాష్ట్రము కొఱకని యేదో యొక కాల్పనికమై పవిత్రా దర్శమును సృష్టించుకొని - దాని కొరకై 'మనము బోరుచున్నా' మని యొక మిథ్యాదృష్టి - జనులలో బ్రచారము సేయనిది యుద్ధము

లందు జయము లభింపదు. అనఁగా—నొక యుద్ధము కొఱకు — సమస్త కుశలకర్మలకును — నీరు వదలుకొని వలసినదే.

ద్రోణుని యుద్ధమం 'దశ్వత్థామ' యనెడు యేన్గు జచ్చినది. అపు'డశ్వత్థామజచ్చె'నని పల్కుటకై కృష్ణుఁడు యుధిష్ఠిరుని ప్రేరేపించెను. అతఁడు సత్యోపజీవి. 'నేను పల్కలే' నన్నాఁడు. కృష్ణుఁడు—'నరోవాకుంజరోవా'యను మాట మెల్లఁగా ననుమని—చనిపోవుచున్న సత్యము గొంతులో గొంచెముగ నీరుబోసెను. యుధిష్ఠిరుఁ డట్లే చేసెనట! యుద్ధములో సత్యమున కింతదగా! ఇఁక నేటి రాజకీయముల యెత్తులు జెప్పుటకు సాధ్యమేగాదు. సర్వము బ్రచ్ఛన్న ధర్మము. గోముఖవ్యాఘ్రము. తమ జయమునకై యేమి యొనరించినను ధర్మమే.

## ధార్మిక యుద్ధముయొక్క వికాసము

జైన — బౌద్ధములతో వైదికహింస నోటికి బీగము పడెను. కాని—క్షత్రియులలో మాత్రము బరస్పరము ధర్మ యుద్ధములు సాగుచునే యుండినవి. వారి యాశ్రితులు వారి కుత్సాహ మొసఁగుచుండిరి. మహమ్మదుపైగంబరు—యీ ధార్మిక యుద్ధమునకు వికాసమిచ్చెను.

తమలోఁదాము గలహించుట — యోగ్యము గాద నియు నితర సంప్రదాయములపై నెత్తుట ధర్మమనియు నాతని బ్రచారము. దానిని 'జిహాద్'యందురు. దీనికిఁ బ్రతి క్రియ క్రైస్తవ ధర్మయుద్ధములు గావించినవి. ఇవి చేయక— యఱకొఱగా విడచిన యపకారమును దేశాభిమానము

బూరించినది. నేటి దృష్టితో నభిమానమత్యంత ప్రముఖ ధర్మము. దానికై యే కుకర్మ యొనర్చినను - సరియే. ఈ- యభిమానము చేతనే - మనుష్యజాతి యంతయు విషమ మార్గమున జిక్కుకొన్నది. దీని నీమార్గమునుండి వెలికీడ్చుటకు - బుద్ధుని కర్మయోగముదప్ప వే ఉపాయములేదు.

# తొమ్మిదవ ప్రకరణము

# యజ్ఞ - యాగములు

## పౌరాణిక బుద్ధుఁడు

హిందువులు - బుద్ధుని విష్ణువు యొక్క తొమ్మిదవ యవతార మనిరి. జనార్దనుఁడు బుద్ధావతారమును ధరించి యసురులను మోహింపఁజేసి సురలచేతవారిని జంపించెనట! ఈ కథ విష్ణుపురాణమున వచ్చును. దీని సారాంశము భాగవత మందిట్లున్నది.

తతః కలౌ సంప్రవృత్తే సమ్మోహాయసుర ద్విషాం
బుద్ధోనామ్నా జన సుతః కీక టేషు భవిష్యతి.

అనంతరము కలియుగము రాఁగా నసురుల సమ్మోహింపఁజేయుటకై బుద్ధుఁడు జనించును. అతఁడు జన పుత్రుఁడు. కీకట దేశములం దాతని పుట్టుక.

సామాన్య హిందువులకు బుద్ధావతారముపై గొప్ప గౌరవములేదు. శాస్త్రము జదివిన పండితులకుఁ బురాణములు జదివెడు వారికి - బుద్ధునిపై నేకాసంత గౌరవమైనా నున్నచో, నది - విష్ణుపురాణ బుద్ధుని పైననే.

## విష్ణు శాస్త్రి మహాశయుల కల్పన

తొట్ట తొలుత బౌద్ధ ధర్మముపై దృష్టి సారించిన వాఁడు ప్రసిద్ధ పాశ్చాత్య పండితుఁడైన బర్నూఫ్ మహాశయుఁడు. ఇతడు 'మాక్స మిల్లర్' గురువు. కాని,

యాతనికి సమగ్రమైన సామగ్రి దొరకినది గాదు. అందుచే నీ ధర్మముయొక్క పరిపూర్ణ స్వరూపమును, పాశ్చాత్య పండితుల యెదుట బెట్టుట కాతనికవకాశము లేకపోయినది. కాని యతని పరిశ్రమచే నొక మేలు కల్గెను. అతనికి ముందున్న పాశ్చాత్య పండితులు బౌద్ధ ధర్మము త్యాజ్య మనియు, విమర్శనీయమైన విషయము గాదనియుఁ దలఁచు చుండిరి. బర్నాఫ్ మహాశయుని ప్రయత్నముచే, వారి కా దృష్టి గొంత మారినది. అటు తర్వాత కీ॥ శే॥ డాక్టర్ విల్సన్ మహాశయుని వంటి, క్రీస్తు మత భక్తుఁడు గూడ బౌద్ధ మతము నభ్యసింప మొదలు వెట్టెను. ఆ సంబంధ ముతో, మన కళాశాలల యందును - బౌద్ధ మతమును గురించిన యభిప్రాయములు ముఖ్యముగ యువకులలో మారఁజొచ్చినవి.

విష్ణుశాస్త్రి చిపళూన్‌కర్ దన బాణ కవి చరిత్రలో నిట్లు వ్రాయు చున్నాఁడు:

"ఆర్యులయొక్క మూలధర్మమైన, వైదిక ధర్మ ముపై, మొట్టమొదట వికల్పము బుద్ధుఁడు లేవదీసెను. కాల క్రమమున నా ధర్మము ననేకు లనుసరింపఁ జొచ్చిరి. వైదిక ధర్మమందు జీలిక లేర్పడెను. నవయువకులు 'దాము బౌద్ధుల' మనుకొనుట, కారంభించినారు. ఈ బౌద్ధ మెటువంటిది? దీని యుదయ ప్రసార లయము లెట్లు జరగినవి? ఎప్పుడు జరగి నవి? యిత్యాది విమర్శలు జరిత్ర కారులకుఁ, జాల యుత్కంఠను గలిగించునవి. కాని యిప్పుడు బనవి యేమి ప్రయోజనము? చరిత్రలో మొదట జరగిన విషాదపూరిత

సంఘటనలే - మఱల నొకసారి యాత్రమేడితము లగును. మన యితిహాసము సమగ్రముగ దొరకుటలేదు. అందుచేఁ బూర్వము బౌద్ధముతో జరగిన విషాద సంఘటన లిట్టివని. నచ్చజెప్పుటకు వీలులేదు.

అస్తు: బౌద్ధ సిద్ధాంతముపై మాకంత గౌరవము లేదు. కాని యిట్టి రాద్ధాంతమును లేవదీసిన యామేధ - లోకోత్తరమై యుండవలెను. అందుకే ప్రత్యర్థులైన బ్రాహ్మణులుగూడ - బుద్ధుని విష్ణువుయొక్క తొమ్మిదవ యవతార ముగ లెక్కించిరి. జయదేవుడు గీతగోవిందము యొక్క మొదటిలో —

"నిందసి యజ్ఞవిధే రహత శృతిజాతం
సదయ హృదయ దర్శిత పశుఘాతం
కేశవ దృత బుద్ధశరీరా ! జయ జగదీశహరే."

యని గీర్తించెను. (ధృవపదము)

" క్రీ॥ శ॥ యొక్క మొదటి శతాబ్దమందు బౌద్ధులకు - బ్రాహ్మణులకు గొప్ప వాదప్రతివాదములు జరగెను. శంకరులు బౌద్ధ ధర్మమును ఖండించిరి. మరల బ్రాహ్మణ ధర్మముయొక్క ప్రతిష్ఠాపన జరగినది. దీనితో బౌద్ధులకుఁ దల దఱిగినట్లయ్యెను. వారు రాజాజ్ఞతోనో - లేక దాము గానో, మనదేశమునే త్యాగ మొనర్చిరి. 'టిబెట్టు' 'చీనా' 'సింహళ ద్వీపము' - మొదలైన వానియందుఁ దలలు దాచుకొన్నారు."

'పైని యుల్లేఖముచే నాటి యాంగ్ల భాషాభిజ్ఞులైన హిందువులకు, బౌద్ధముపై నెట్టి యభిప్రాయ ముండెనో జూచాయగఁ గనపడుచున్నదిగదా!

'లైట్ ఆఫ్ ఏషియా' గలిగించిన పరిణామము

అటుపిదప 879 వ సంవత్సరమునందు 'మెడ్విన్ ఆర్నోల్డ్' 'లైట్ ఆఫ్ ఏషియా' యను ప్రసిద్ధ కావ్యమును రచించెను. ఆతని యా కావ్య మాంగ్ల భాషాభిజ్ఞులైన హిందువులలో బౌద్ధముపై నొక యాదరము గల్పించినది. కాని యజ్ఞ - యాగములను విధ్వంస మొనర్చి, యహింసా ధర్మము స్థాపించుటకే, బుద్ధుఁ డవతరించె నను నూహా మాత్రము మారలేదు. నేటికిని యా యభిప్రాయమే సవసవగా గలదు. వీరి యీ విశ్వాసమెంత సత్యమో జూడవలెనుగదా! అందుకై దొట్టతొలుత బుద్ధ సమకాలీనులైన శ్రమణులకు, బుద్ధునికి యజ్ఞయాగములపై నే యభిప్రాయ ముండెనో బర్యాలోకింతము.

హరికేశిబలుని కథ

'శ్రమణ పంథ'లో నేటికిని దండిగాదొరకు సాహిత్యము జైనులది, బౌద్ధులది. జైనగ్రంథమైన 'యుత్తరాధ్యయన సూత్ర'మందు హరికేశిబలునికథ యున్నది. దాని సారాంశ మిది:

హరికేశిబలుఁడు శ్వపాకుఁడు. అతఁడు జైన భిక్షువైనాఁడు. గొప్పతపస్వి యయ్యెను. ఒకసారి యతఁడు, మాస ముపవసించెను. పారణ దివసము నాఁడు భిక్షాటన

మొనర్చుచు, నొకానొక యజ్ఞస్థానమునకు వచ్చినాఁడు. యజ్ఞ సన్నాహము బ్రహ్మాండముగ నుండెను. హరికేశి బలుఁడు మలిన వస్త్రచ్ఛన్నుఁడు. కృశశరీరుఁడు వీనిని యజ్ఞ స్థలమున జూచిన బ్రాహ్మణుల కసహ్యమైనది. 'అటనుండి వెడలిపొమ్మ'ని యాజ్ఞాపించిరి. అక్కడ నొక తిందుకవృక్ష ముండెను. ఒకయక్షుఁడా వృక్షమున గుప్తరూపుఁడై వసించు చుండెను. వానికి బ్రాహ్మణులచర్య యన్యాయ మనిపించి నది. వాఁడు హరికేశిబలుని స్వరమువెట్టి: "బ్రాహ్మణు లారా! మీరు వేదముయొక్క శబ్దములను మాత్రమే, యాక ర్ణించితిరి. మీ వేదాధ్యయనము వృథా ప్రయత్నము. వేదముల యర్థమెఱిఁగి మీరు వీనినభ్యసింపలేద"ని బలికెను. బ్రాహ్మ ణుల కీవాక్యముతోఁ దమ యహంకారమునకు దెబ్బఁ దగిలి నది. ఈ శ్వపాకుఁడుఁ ద మ్మవమానించెనని వారనుకొనిరి. వెంటనే యచటి తరుణకుమారుల 'నీశ్వపాకుని బయటద్రోయుఁ డ'ని నియోగించిరి. ఆ యువకులు హరికేశిబలుని పైఁబడి కట్టెలతోఁ గొరడాలతోఁ గొట్ట నారంభించినారు. యజ్ఞ పురోహితుని దుహిత, భద్రాదేవి, కోసలరాజుయొక్క బిడ్డ. వీరిద్దరు మాత్రమా యువకుల - నా ప్రయత్నమునుండి నిషేధించిరి. ఇంతలో యక్షులగుంపు లా కుమారులపైఁబడి చావఁగొట్టినవి . వారి శరీరములు రక్తసిక్తము లయ్యెను. బ్రాహ్మణులు భయపడి హరికేశిబలుని వేడి కొన్నారు. ఆతని కన్నము వెట్టిరి.

భుజించిన తరువాత, హరికేశిబలుఁడు 'బ్రాహ్మణు లారా! యగ్ని రగిలించి, నీరు గాచికొని. స్నానము నుపేరెట

బాహ్యశుద్ధి యొనర్చికొందురు. ఈమాత్రముతో మీ కేమి లాభము? కేవలము దీనిచేతనే ప్రయోజనము లేదని తత్వజ్ఞు లందుర'ని వచించెను. అప్పుడు బ్రాహ్మణులు "భిక్షూ! మేము యజ్ఞ మెట్లొనర్ప వలెను? కర్మ నాశ మెట్లు ఘటిల్లును? దెలుపు మ"ని యడిగిరి. హరికేశి బలుఁ డిట్లనెను.

* "ఆఱు జీవకాయములను - హింసింపక, యసత్య చౌర్యముల పొంతబోక, వర్తింప వలెను. పరిగ్రహము - స్త్రీ - మానము - మాయ - వీనిచెంత జేరక సాధువులు శాంతులై వర్తింతురు. •పంచ సంవరములచే సంవృతులై జీవితమందు లౌల్యమువదలి దేహాశక్తిని విడచి, యాశ నడఁచి, వారు శ్రేష్ఠమైన యజ్ఞమునొనరింతురు."

బ్రాహ్మణులు:- ఆ యజ్ఞమున కగ్ని యేది? అగ్ని కుండమేది? స్రుక్స్రువంటిది? గోమయ మెట్టిది? సమిధ లే రీతివి? శాంతి యే తెఱఁగునది? ఏ పద్ధతితో, హోమమును గావింతురు!

హరి:- బ్రాహ్మణులారా! దపశ్చర్యయే యగ్ని. జీవుఁడే యగ్ని కుండము. యోగము స్రుక్కు. శరీరము

---

* పృథ్వీకాయము, అప్కాయము, వాయుకాయము, అగ్నికాయము, వనస్పలకాయము, త్రసకాయము - అనియాఱు జీవభేదములు. పృథ్వీపరమాణువులకు జీవమున్నదని జైనులందురు. వనస్పతికాయమనఁగా వృక్షాదులు. త్రసకాయమనఁగా - జంగమములైన ప్రాణులు.

• అహింసా సత్యాస్తేయ బ్రహ్మచర్యా ఽ పరిగ్రహములు. వీని సమావేశమునకే 'యోగసూత్రము'లలో 'యమ'మనిపేరు చూ: సాధన పాదము సూ : 30.

గోమయము. కర్మలే సమిధలు. సంయమమే శాంతి. ఈ రీతి, ఋషులు వర్ణించిన యజ్ఞమును నే నొనర్తును.

బ్రాహ్మ:- నీవు గ్రుంకు తటాక మేది? శాంతితీర్థ మెట్టిది?

హరి:- ధర్మమే - నా తటాకము. బ్రహ్మచర్యము- శాంతితీర్థము... దానియందు గ్రుంకులిడి, విశుద్ధమహర్షులు విమలమై యుత్తమమైన పదమును బొందుదురు.

ఇంతేగాదు. 'ఉత్తరాధ్యయనసుత్తము'లోని యిఱువదియైదవ యధ్యాయమందు, వేఱొకగాథ యున్నది. అది యును యజ్ఞయాగముల నిషేధించును. ఆ గాథ యిది.

"పసుబంధా సవ్వేవేయా; జట్ఠంచ పావకమ్మణా
నరంతాయంతి, దుశ్శీలం కమ్మాణి బలవంతిహ."

"సర్వవేదములందును, బశుమారణము, వర్ణింపఁబడి నను- యజ్ఞము పాపమిశ్రితమైయున్నది. యజ్ఞము జేయు వారియొక్క, యా పాపకర్మలు, వానిని రక్షింప శక్తములు గావు."

హరికేశి బలుని కథలో నెంత గాఢముగ యజ్ఞములు నిషేధింపఁబడినవి! ఈ గాథయందు యజ్ఞములే గాక వేదములు గూడ వికల్పింపఁబడెను.

## శ్రవణ పంథల యొక్క వేద విరోధము

అజితకేశ కంబలుఁడు నాస్తిక మత ప్రవర్తకుఁడు గదా! అతఁడు యజ్ఞయాగములను నిషేధించెను. అంతేగాక వేదములపైఁగూడ దాడితీసి యుండునని; 'సర్వదర్శనము'

లోని చార్వాక మత స్వరూప వివరణమును బట్టి తోచును. చార్వాకుల వని కొన్ని శ్లోకములు 'సర్వదర్శనము'న గలవు. వాని లోనిదే యీ క్రింది యొకటిన్నర శ్లోకము.

"పశుశ్చేన్నిహత స్స్వర్గం జ్యోతిష్టోమే గమిష్యతి
స్వపితా యజమానేన తత్రకస్మాన్న హింస్యతే.
త్రయో వేదస్యకర్తారో, భండ ధూర్తనిశాచరాః"

"అగ్నిష్టోమమందు వధింపఁబడిన పశువు - స్వర్గమునకుఁబోవును గదా! అట్టిచో యజమానుఁడు దన తండ్రినా యజ్ఞమం దేల వధింపరాదు? వేదములు భండులు, ధూర్తులు, రాక్షసులు, వీ రొనర్చిన కల్పన."

దీనిని బట్టి యనేక శ్రమణ సంప్రదాయములు కొద్దిగనో, గొప్పగనో, వేదమును నిషేధించునవే యని దెలియును. వారిని వేదనిందకు లనుటలోఁ దప్పులేదు. కాని బుద్ధుఁడు, వేదములను నిందించిన ట్లొక యాధారము గూడ లేదు. అంతేగాదు - అక్కడక్కడ వేదాభ్యాసమునకు గౌరవమును గూడఁజూపెను. బుద్ధుని భిక్షు సంఘమందు, మహాకాత్యాయనుని వంటి, వేదపారంగతులైన బ్రాహ్మణులుండిరి. మఱి - బుద్ధుఁడు, వేదనింద యొనర్చెనను టెట్లు పొసఁగును? కాని యతఁడు జేసిన దొక్కటి. యజ్ఞయాగము లందు వృషభములు, గోవులు, మొదలగువానిని హింసించుట - యితర శ్రమణుల వలెనే బుద్ధుఁడును, నిషేధించెను.

## యజ్ఞముల నిషేధము

'కోసల సంయుత్తము'లో యజ్ఞయాగముల నిషేధించు గొన్ని, 'సుత్తము' లున్నవి. అవి ఈ క్రిందివి.

బుద్ధభగవానుఁడు శ్రావస్తియం దుండెను. అపుడు గోసలరాజైన ప్రసేనజిత్తుయొక్క మహాయజ్ఞ సన్నాహము జరగుచుండెను. దానిలో, యూపములకు గట్టఁబడిన జంతువుల వివరమిది. ఏనూఱు వృషభములు, ఐదునూర్ల గోవులు, ఐదునూరులు దున్నపోతులు, ఏనూఱు మేకలు, ఐదునూర్ల మేషములు. ఇది యా యజ్ఞములోని బలి సంభారము. రాజుయొక్క దూతలు – సేవకులు, మొదలగువారు దండన భయముతో నాసవముల గ్రోలుచు, నడుమ నడుమ వదరుకొనుచుఁ గార్యములు సేయుచుండిరట!

ఈ సన్నాహ మంతయు, భిక్షులు జూచి భగవానునకు దెల్పిరి. అపుఁడు బుద్ధుఁ డనెను.

"అస్సమేధం పురిసమేధం, సమ్మాపాసం, రాజపేయం
నిరగ్గళం మహారంభా నతేహోంతి మహప్ఫలా
అజేళకాచ, గావోచ, వివిధాయత్థ హఞ్ఞరే
నతం సమ్మగ్గతా యఞ్ఞం, ఉపయంతి మహేసినో.
ఏచ యఞ్ఞా నిరారంభా యజంతి అనుకూలంసదా
అజేళకాచ గావోచ వివిదాయత్థ హఞ్ఞరే,
ఏతం సమ్మగ్గతా యఞ్ఞం ఉపయంతి మహేసినో,
ఏతం యజేథ మేధావీ ఏసోయఞ్ఞో మహప్ఫలో.
ఏతంహి యజమానస్స సేయ్యోహోతిన పాపియో
యఞ్ఞోచ విపులోహోతి పసీదంతిచ దేవతా."

"అశ్వమేధము, పురుషమేధము, సమ్యాక్ప్రాశము, వాజపేయము, నిరర్గళము—ఈ యజ్ఞముల కగు ఖర్చు గొప్పది. కాని యివి మహాఫలదాయకములు గావు. మేకలు, మేషములు, గోవులు మొదలైన ప్రాణులు వధింపఁబడెడు యజ్ఞమునకు, సన్మార్గస్థులైన మహర్షులు వెళ్ళరు. ప్రాణిహింసలేని యజ్ఞములే జనులకు రుచించును. మేషములు మొదలైన జంతువులు హింసింపఁబడని యజ్ఞములందే మహర్షులు పాల్గొందురు. అందుకై సుజ్ఞానులట్టి యజ్ఞ మొనర్పవలెను. అది మహాఫలదాయకము. ఆ యజ్ఞముచే యజమానునకుఁ గళ్యాణము సిద్ధించును. అకళ్యాణము గలుగదు. అట్టియజ్ఞము క్రమక్రమాభివృద్ధి జెందును. దానితో దేవతలు ప్రసన్నులౌదురు."

యజ్ఞమున బాపమేమి ?

యజ్ఞములందు ప్రాణివధ తప్పనిదిగదా! అందుచే యజమానునకుఁ ద్రికరణములతో, నకుశల కర్మాచరణము విధియగును కనుక యజ్ఞ మమంగళమని బుద్ధుని యభిప్రాయము.

'అంగుత్తర నికాయము' యొక్క 'సుత్తకనిపాతము' లోని యొక సుత్త మీ విషయమును దెలుపుచున్నది. దాని సారాంశ మిది:

భగవంతుఁడు శ్రావస్తియం 'దనాథ పిండికు'ని దైన 'జేతవన'మం దుండెను. అపు డుద్గత శరీర బ్రాహ్మణుఁడు (ఉగ్గత శరీరుడు) మహాయజ్ఞమునకు సిద్ధపడుచుండినాఁడు. జాతి కైదునూర్ల వృషభములు, గోవులు, దున్నలు, మేకలు,

మేషములు, సేకరింపఁబడినవి. అవి యూపములకుఁ గట్టఁబడి యుండెను. ఉద్గత శరీరుఁడు బుద్ధుని సమీపించి కుశల ప్రశ్న లడిగి, "గౌతమా! యజ్ఞముకొఱకై యగ్ని రగల్చుట, యూపములు నిల్పుట మహాఫలదాయకములని నేను విన్నా న"ని పలికెను.

"ఔనౌను! యజ్ఞముకొఱకై యగ్ని రగుల్చుట, యూపములు నిల్పుట మహాఫల దాయకములే. నేనును నట్లే వింటిని" యని బుద్ధుడు బదులు పల్కెను.

తన వాక్యమునే బ్రాహ్మణుఁడు రెండుసారులు వచించెను. బుద్ధుఁడుఁగూడఁ దన యుత్తరమును ద్విధా యామ్రేడించినాఁడు. అపుడు బ్రాహ్మణుఁడు నవ్వుచు "నట్లైన మన కిద్దఱకు మతభేదమేమి?" యనెను.

సమీపముననే యున్న యానందుఁ డందుకొన్నాఁడు. "ఓయీ! బ్రాహ్మణా! భగవంతుని సరిగ బ్రశ్నింపలేదు. 'యజ్ఞముకొఱ కగ్ని రగుల్చుట, యూపములు నిల్పుట యను ప్రయత్నము సేయుచున్నాను. దీనిగుఱించి నాకుఁ జిరకాల కళ్యాణ కారకమైన యుపదేశ మొసఁగుఁడు' యని యడుగుము."

బ్రాహ్మణు డట్లే యొనర్చెను. అప్పుడు బుద్ధుఁ డనెను. "బ్రాహ్మణా! యజ్ఞముకొఱ కగ్ని రగుల్చువాఁడు, యూపములు నిల్పువాఁడు, దుఃఖోత్పాదకములైన మూఁ డకుశలశస్త్రములు నొఱలనుండి పెఱికినవాఁడే యగుచున్నాఁడు. అవి కాయశస్త్ర వాక్శస్త్ర, చిత్తశస్త్రములు; యజ్ఞారంభ మొనర్చుకొని హృదయమం దిన్ని గోవులు, ఇన్ని దున్నలు,

యిన్ని వృషభములు, యిన్ని మేషములు యిన్ని భాగములు నఱుకవలెనను, నకుశల విచార ముద్భవించును. ఈ విచారముతోఁ గూడ వాఁడు దొట్టతొలుత దుఃఖోత్పాదకమైన చిత్త శస్త్రమును వెలికీడ్చినట్లే. ఈ ప్రాణులను 'మీరు వధింపుడ'ని సేవకులకు యజమానుఁ డాన బెట్టును. ఆ యానలో దుఃఖోత్పాదకమైన యకుశల వాక్శస్త్రమును వెలి కీడ్చుచున్నాఁడు. కర్మచారులలోఁ గూడ దాను నానా జంతువుల నఱుకుటకుఁ బ్రవృత్తుఁ డగును. దీనితోఁ గాయ శస్త్రము వెలి కీడ్వఁబడినట్లే.

బ్రాహ్మణా! ఈ మూఁడగ్నులను వదలవలెను. కాని నెప్పుడును సేవింపరాదు. ఆ యగ్నులేవి? కామాగ్ని, ద్వేషాగ్ని, మోహాగ్ని యనునవి. కామాభిభూతుఁడైన మనుష్యుఁడు, మనోవాక్కాయములతోఁ గుకర్మ నాచరించి తీరును. మరణోత్తరము దుర్గతి వానికిఁదప్పదు. ఇట్లే మోహ ద్వేషావిష్టులు గూడ. వారికి దుర్గతి పెరటిచెట్టు. కనుక నీ మూఁడగ్నులు ప్రమాదకరమైనవి. వీనిని సేవింపరాదు.

ఉద్గతశరీరా! *ఈ మూఁడగ్నులను సేవింపవలెను. గౌరవింపవలెను. వానిని నిరంతరముఁ బూజింపవలెను. పరిచరింపవలెను. ఆ యగ్నులేవి? ఆహవనీయ, గార్హపత్య, దాక్షిణాగ్నులు. తల్లిదండ్రులే యాహవనీ యాగ్నులు. వారి

* ఈ మూఁడగ్నులు వైదిక గ్రంథములలోఁ బ్రసిద్ధములు. 'దాక్షిణాగ్నిర్గార్హపత్యా ఽఽ హవనీయా స్త్రయోఽగ్నయః' అని యమర కోశము. వీని పరిచర్యాపద్ధతి, దాని కగుఫలము, మొదలైన విషయములు గృహ్యసూత్రములలో వచ్చును.

నాసక్తితోఁ బూజింపవలెను. భార్య - పిల్లలు - సేవకులు - మొదలైనవారు గార్హపత్యాగ్నులు. వారి నాదరముతోఁ జూడవలెను. శ్రవణబ్రాహ్మణులే దాక్షిణాగ్నులు. వారిని సత్కరించి పూజింపవలెను. ఓయీ! బ్రాహ్మణా! ఈ యగ్ని నిరంతరము వెలుఁగుచునే యుండవలెను. ఇవి యెప్పుడు నారిపోరాదు. వీని నుపేక్షింపరాదు."

బుద్ధభగవానుని భాషణము విని, 'యుద్గతశరీరుఁ' డతని కుపాసకుఁ డయ్యెను. యూపములకుఁ గట్టఁబడిన జంతువుల నా బ్రాహ్మణుడు వదలిపెట్టినాఁడు. వానికి జీవదాన మొసఁగఁబడెను. పచ్చనిగడ్డి తిని పడియలలోని చల్లని నీరుఁ ద్రావి వృక్షచ్ఛాయలందుఁ గన్నుల పండువుగ నవి విహరింపఁ దొడఁగినవి.

## యజ్ఞములలో - దపశ్చర్యయొక్క సమ్మేళనము

బుద్ధునికాలమందు బ్రాహ్మణులు, యజ్ఞయాగములలోఁ దపశ్చర్యనుగూడ గలిపిరి. వైదిక మును లడవులలో నుండి తపశ్చర్య సాగించుచుండిరిగదా! వారుగూడ దీక్షిత దొఱకినప్పుడు నడుమ నడుమ యజ్ఞము లొనర్చుచునే యుండిరి. దీని కొకటి రెండుదాహరణములు మూఁడవ ప్రకరణ మందే యివ్వఁబడెను. యాజ్ఞవల్క్యుని యుదాహరణముగూడ నొకటి. ఇతఁ డాకాలమున గొప్ప తపస్వి. బ్రహ్మనిష్ఠుఁడు. ఇల్లుండియు, నాతఁడు జనకరాజు యజ్ఞమున బాల్గొన్నాడు. జనకుఁ డాతనికి వేయి గోవులు, బదివేల బంగారు నాణెము లిచ్చెనట!*

బృహదారణ్యకము 3-1-1-2.

కాని యజ్ఞము - దపశ్చర్య వీని సమ్మేళనము, రెండింతలు దుఃఖకారకమని బుద్ధుని యూహ. 'కందరకసుత్త'♦ మందు భగవానుఁడు, నాల్గుదెఱఁగుల మనుష్యులను వర్ణించెను. వారు వీరు. 1. ఆత్మంతపులై బరంతపులు గానివారు. 2. పరంతపులై యాత్మంతపులు గానివారు 3. ఆత్మంతపులు - బరంతపులును 4. ఆత్మంతపులును - బరంతపులును గానట్టివారు.

కఠిన తపశ్చర్యలు సేయువారు మొదటివారు. వారుఁ దమకుఁ దామే, దాపమొనర్చికొందురు. ఇతరులకుఁ దాపమివ్వరు. కటిక వారు, వేటగాండ్రు - మొదలైనవారు. రెండవ జాతి వారు. వా రితర ప్రాణులను హింసింతురు. కాని, దమ్ము దపింపఁజేసి కొనరు యజ్ఞయాగము లొనర్చువారు, మూడవ జాతివారు. వారు దమకును గష్టము గల్గించుకొని, యితరులకును, కష్టములు గల్పింతురు. నాల్గవ తెగవారు బౌద్ధ శ్రావకులు. వారు దాము తపింపరు; ఇతరులకుఁ దాపమివ్వరు.

ఈ నాల్గు తెఱఁగుల మనుష్యులను గుఱించి, సవిస్తర వర్ణన మీ సుత్తమం దున్నది. మూడవ తెగవారిని గుఱించి యన్నమాట లివి: "భిక్షువులారా! ఆత్మంతపులు- పరంతపులునైన వా రెట్టివారు? ఒకానొక క్షత్రియుఁడు లేక శ్రీమంతుఁడైన బ్రాహ్మణుఁడు నూతన సంస్థాగారమును నిర్మించును. శిరోముండన మొనర్చికొని ఖరాజినము బఱచికొని శరీరమంతయుఁ దైలముచే నంటికొనును. జింకయొక్క-

♦ మజ్ఝిమనికాయము; సం॥ 51

కొమ్ముచే వీపు గోకి కొనును తన భార్యతోఁ గూడఁ బురోహితునితోఁగూడ వాఁడా సంస్థాగారమున ప్రవేశించును. గోమయ లిప్తమైన నేలపైననే శయనించును. సాధువైన గోవు యొక్క యొక చన్నునుండి వచ్చిన పాలతోనే, వాఁడు నిర్వాహ మొనర్చికొనును. రెండవ చన్నుయొక్క పాలను వాని భార్య సేవించును. మూడవ చన్నుపాలను బురోహితుడు గ్రహించును. నాల్గవ చన్నుయొక్క పాలతో హోమమొనర్తురు. యీ రీతి శరీరమును శుష్కింపఁజేసి కొందురు.

కాని ప్రయోజన మేమి? యీ పాలు గుడిచి-కూర్చుండి యజ్ఞమందు దిన్ని వృషభములు వధింపవలెను. ఇన్ని గోవులు జంపవలెను ఇన్ని దున్నలు, మేకలు, మేషములు వీనిని వధింపవలెను. యూపములకై యిన్నివృక్షములు ఖండింపవలెను. కుశాసనములకై యింత దర్భను సప్పఁబోయవలెనని యే విచారించికొందురు. వారి సేవకులు దండ భయభీతులై యాసవములు గ్రోలి యతృప్తితో, వదరుకొనుచుఁ బనులొనర్తురు. ఇట్టి యజమానులే యాత్మంతపులై బరంతపులైన వారు.

## జనులకు గోహింస యిష్టములేదు

సేవకులు, గర్మకరులు యజ్ఞకార్యములు సేయుటలో నతృప్తి బడుట యెందుకు? నడుమ నడుమ వదరు టెందుకు? దీనికిఁ గారణ మేమి? యజ్ఞములందు వధింపఁబడు జంతువులు, పేదలైన రైతులవి. వారిని బెదిరించి, యీ జంతువులఁ గైకొని, వత్తురు. దీనితో, నా రైతులకు మనస్సులం దమిత దుఃఖము. వారి వంటి వారైన సేవకులు,

గర్మకరులు, వీరికి దుఃఖము! 'సుత్త నిపాతము'దు '[బ్రాహ్మణ ధమ్మిక సుత్తము'లోఁ బ్రాచీన కాలమందలి బ్రాహ్మణాచరణము వర్ణితము. ఆ ఘట్టమం దీ క్రిందిగాథ లున్నవి.

యథా మాతాపితా, భాతా, అఞ్ఞేవాపిచ, ఞాతకా
గావో, నో, పరమా, మిత్తా యాసు జాయంతి, ఓసధా
అన్నదా, బలదా, చేతా, వణ్ణదా, సుఖదా, తథా
పీతమత్థవసం ఞత్వా, నాస్సుగావో హనింసుతే.

"తలిదండ్రులు, దమ్ములు, నితర బంధువులు - వీరి వలెనే గోవులు, మాకత్యంత ప్రియములు. మా సేద్యము వానిపైననే యాధారపడి యున్నది. అన్నము, బలము, కాంతి సుఖము - యీ పదార్థముల, నిచ్చు దాత లివియే. దానిని గ్రహించి ప్రాచీన బ్రాహ్మణులు, గోవులను వధింప కుండిరి."

పై గాథలనుబట్టి, సామాన్య ప్రజలకు గోవు లిష్ట బంధువులవలెఁ బ్రియమైనవనియు, వానిని యజ్ఞయాగము లందు, నిరవధికముగఁ జంపుట, వారికిష్టము లేదనియు స్పష్టముగదా! రాజులు, శ్రీమంతులైన - యజమానులు, వారే స్వయముగ, గోవులు మొదలైన ప్రాణి వధ యొనర్చి నచో, దాసులు - సేవకులు మొదలైనవారి కంతబాధ యుండెడిది గాదు. కాని యీ యజమాను లాసేవకులనే ప్రాణివధకు నియోగింతురు. ఆ సేవకుల కాప్రాణు లెవ్వ రివో; వానిని గొనివచ్చు టచే, వారికెంత మనస్సులకుఁ గష్టమగునో స్పష్టముగ తెలియును. ఈప్రాణు లెట్లు బలా

త్కరించికొని రాఁబడెనో, యదికూడ వాగు గనులారఁ జూచినదే. తమవలెఁ బేదవారైన రైతులనుండి వారి జీవన సర్వస్వములైన ప్రాణులను – బలవంతముగఁ బెరికికొనివచ్చి వానిని జంపుమన్నప్పు డా సేవకులకు దమ్మ్మె చంపికొను మన్నట్లయ్యెడిది. ఇది సహజమే. యజ్ఞము కొఱకై ప్రజల పైన యెట్టి 'జులుము' ప్రయోగింపఁబడుచుండెనో యీక్రింది గాథ తెలుపును.

"దదంతి ఏకే విసమే నివిట్ఠా
ఛేత్వా వధిత్వా, అథసోచయిత్వా
సా దక్ఖిణా అస్సు ముఖా సదండా
సమేన దిన్నస్స న అగ్ఘమేతి."

"విషమమార్గ నివిష్టులై, సామాన్య ప్రజలను బీడించి, వధించి, కొట్టి, కోలాహలము సేసి, ప్రాణులను బెరికికొని వచ్చి, పురోహితులకు దక్షిణగా నిత్తురు. లోకుల కన్నీటిచే దడసిన యీ దక్షిణకు – సమ్మతితో నిచ్చిన దక్షిణ యొక్క వెల వచ్చునా?"

యజ్ఞయాగములకువలెనే, యుదరనిర్వాహమునకును, ప్రాణి వధ జరుగుచుండెడిది. గోవును వధించి దాని మాంసమును, చత్వరములలో నమ్మెడువారట!* బుద్ధుఁడు యఙ్ఞయాగములు నిషేధింప మొదలు పెట్టినతరువాత నా కృత్యములు నిలచిపోయెను. దుకాణములలో మాంసము నమ్మెడు

---

* సేయ్యథాపి భిక్ఖవేదక్ఖో గోఘాతకో వా గోఘాతకాంతేవాసీ వా గావిం వధిత్వా చాతుమ్మహాపథేబిలసో విభజిత్వా నిసిన్నో అస్సఁ పతిపటాన (సుత్తము)

పద్ధతి బుద్ధున కిష్టము లేదు. కాని యజ్ఞ యాగములందలి ప్రాణి వధతోఁ బోల్చినప్పు డంగడులలో జరగెడు ప్రాణి వధ చాలతక్కువ. కటికలు నఱుకు గోవులు, వృషభములు, ముసలివైనవి. దుర్బలములై రైతుల కుపయోగపడనివే! వాని కొఱకెవ్వరేడ్చువారుండరు. యజ్ఞముకథ వేరు. 500 లేక 600 దున్నలు, గోవులూ ఒక్కొక్క యజ్ఞమునకుఁ గావలసిన సంభారము. దీనితో రైతుల కెంతనష్టము! వారి మనస్సు లెంత గలఁతపడును! ఈ స్థితిని మన మూహించుకొననైన లేము. ఈ 'జులుము' బుద్ధుఁడు నిషేధించెను. దీనిని వేదనిందగా మనమేల వ్యాఖ్యానించి కొనవలెను?

మంచియజ్ఞ మెటువంటిది?

శ్రీమంతులైనట్టి బ్రాహ్మణులెట్టి యజ్ఞ మొనర్ప వలెను? ఈ విషయము 'దీఘనికాయము'లోని కూటదంత సుత్తమునందుఁ జెప్పఁబడినది. దాని సారాంశ మిది:

బుద్ధుఁడు మగధ దేశమున సంచరించుచు 'ఖాణుమత' మనెడు బ్రాహ్మణ గ్రామమునకు వచ్చెను. ఇది బింబి సారుఁడు 'కూటదంతున'కు దానముగా నిచ్చినది. కూట దంతుఁ డప్పుఁడు యజ్ఞ సన్నద్ధుఁడై యుండెను. గో-వృషభ ములు, గాసరములు, ఛాగములు, మేషములు – జాతి కేడు నూఱులవంతున సంగ్రహింపఁ బడినవి.

భగవంతుఁ డచటికి వచ్చిన వర్తమానమువిని, 'ఖాణు మతము'లోని విప్రులంద రాతని దరిసింప నేగుచుఁ గూట దం తుని యింటిముందు జేరినారు. అతఁడు వారి 'నెక్కడికి మీ

పోక'యని ప్రశ్నించెను. 'బుద్ధభగవానుని దర్శింప'నని బదు లొసగిరి. 'నేనును మీతోడ వత్తున'ని కూటదంతుఁడన్నాఁడు.

కూటదంతుని యజ్ఞముకొఱకై, పరదేశ బ్రాహ్మణు లాహూతులు; వారికాతఁడు భగవంతుని దర్శించుట, యిష్టము లేదు. వారనిరి: "కూటదంతా! గౌతమునిజూడ నీ వేగుట నిజమేనా ?"

కూట:- పోవలెనని యనుకొను చున్నాను.

బ్రాహ్మణులు:- ఓయీ! గౌతమ దర్శనమునకు నీవు వెళ్లుట యోగ్యముగాదు. నీ వేగి యాతని దర్శించినచో బుద్ధుని యశస్సు పెరుగును. నీకీర్తి నశించును. అతఁడే నీకడకు వచ్చి దర్శింపవలెను గాని, నీవు బోవుటా! ఉత్తమ కులమున జన్మించితివి. ధనాఢ్యుడవు. విద్వాంసుడవు. సుశీలు డవు. అనేక శిష్యుల కాచార్యుఁడవు. నీకడఁ వేదము లభ్య సించుటకై, నాల్గుదిక్కులనుండి వేలకు శిష్యు లరుదెంతురు. గౌతమునికన్న, వయసున పెద్దవాఁడవు. మగధ రాజు నీ పాండిత్య గుణాదులకు మెచ్చి నీకీ యూరు దాన మొసగెను. ఇన్ని గుణములుగల నిన్నే బుద్ధుఁడు దర్శింప వలెనుగాని, నీ వేగి యాతని దర్శించుట సరిగాదు.

కూట :— మీ తలఁపు దెల్పితిరి. నా యభిప్రాయ మును వినుఁడు. శ్రమణ గౌతముఁడును గొప్పకులమున జన్మిం చెను. తనకున్న సంపత్తు నంతయుఁ ద్యాగ మొనర్చి, శ్రమ ణుఁడైనాఁడు. సుఖము లనుభవింప వలసిన వయసుననే సన్య సించెను. తేజస్వి, సుశీలుఁడు, మంగళకరుఁడు అతని వాక్కులు గళ్యాణ కారకములు. గౌతముని శిష్యులకు లెక్క

లేదు. విషయ విముక్తుఁడై శాంతమే రూపు గట్టినట్లు న్నాఁడు. "అతఁడు కర్మవాది. క్రియావాది. ఆతని ధర్మముచే నాకృష్టులై మారుమూల దేశములనుండి- జనులు దీర్ఘమువలె నాతని కడకు వచ్చుచుండిరి. 'సమ్యక్సంబుద్ధుఁడైన యాతఁడు విద్యాచరణ సంపన్నుఁడు. లోకవిదుఁడు. దేవ మనుష్యులకు శాస్త' యని యతని కీర్తి దిక్కులకు గుబాళించినది. బింబిసారుఁడు, కోసలుఁడైన ప్రసేనజిత్తు, దమ పరివారములతోఁగూడ శ్రావకులైనారు. 'పౌష్కరసాతి' వంటి బ్రాహ్మణు లాతని పూజ మహాభాగ్య మనుకొనిరి. ఇట్టి వాఁడు నా యూరికే వచ్చినప్పు డాతని కాతిథ్య మివ్వకుండుట, ధర్మముగాదు. అతిథిని సత్కరించుటకై పోవుటలో నన్యాయ మేమున్నది ?"

ఈ వాక్యములతో బ్రాహ్మణుల వాదము దీసికట్టయినది. కూటదంతుఁడే యింతగా బొగడినపుడు బుద్ధుఁ డెంత వాఁడై యుండవలెనో! వారందరుఁగూడ 'కూటదంతు'ని వెంటనే బయలుదేరిరి.

భగవంతుఁడు 'ఆమ్రయష్టి' వనమం దుండెను. గంగను గైకొనువచ్చు భగీరథుఁడు 'కూటదంతుఁడు' - బుద్ధుని సమీపించి, కుశల ప్రశ్నాదికము లొనర్చి యొకవైపున గూర్చున్నాఁడు. వెంటవచ్చిన బ్రాహ్మణులు గొందఱు బుద్ధునకు నమస్కరించిరి. కొందరు దమ నామగోత్రము లెఱింగించిరి. కొందఱు కుశలప్రశ్న లొనరించిరి. కొంత తడవున కీ సద్దణగెను.

'కూటదంతుఁడు' బుద్ధునితో ననాఁడు. "ఉత్తమ యజ్ఞవిధి యెట్టిదో, దమకుఁ దెలయునని విన్నాను. దయచేసి దానిపద్ధతి నెఱిఁగించినచో మాకుఁ దృప్తి యగును." భగవంతుఁ డీ క్రిందికథ జెప్పెను.

తొల్లి మహావిజితుఁ డను నొక రాజుండెను. అతఁడుఁ బ్రసిద్ధుఁడు. అతని సంపత్తు యపారమైనది. దానిని ఖర్చు పెట్టు టెట్లు? యిది యాతని ప్రశ్న. 'ఒక మహాయజ్ఞ మొనర్చి యాధనమును, వ్యయము సేయుద' మనుకొన్నాఁడు. అతఁడు దన తలంపును బురోహితున కెఱిగింప దలఁచెను. ఒకనాడు రాజు కుల బ్రాహ్మణునితో ననెను. "బ్రాహ్మణా! నాకు యజ్ఞమొనర్ప నిచ్ఛ గలిగినది. ఆ యజ్ఞ మెట్లున్నచో, నాకు హితాకరమగును? సుఖకరమగును? వివరింపుము."

పురోహితుఁడు బదులిచ్చెను "రాజా! నేఁడు నీరాజ్యమున శాంతిలేదు. పల్లెలలోఁ బట్టణములలో, నల్లరులు సాఁగుచున్నవి. దోపిడులు జరగుచున్నవి. ఈ స్థితిలో జనులపై బన్నురుద్దినచో, నీవు గర్తవ్యవిముఖుఁడవైనట్లే. శిరచ్ఛేదములొనర్చి, గుఱ్ఱముల క్రిందఁ ద్రొక్కించి, యితరశిక్షలు వేసి, చోరులు మొదలైన దుష్టులను స్వాధీన పరచికొనగలమని నీవనుకొనుట, యసంగతము. ఈ యుపాయములతోఁ బ్రజల దుఃఖము బూర్ణముగ సమసిపోదు. నీ శిక్షలతో నవి గొంత దగ్గిన ట్లగపడినను మరల దప్పక మొలకెత్తును. ఇవి సంపూర్ణముగ లేకపోవుట కొక్కటియే యుపాయము. నీ రాజ్యమునందలి పొలములు దున్ను రైతుల కన్నిసదుపాయములను గల్పింపుము. వ్యాపారులకుఁ బెట్టుబడి దక్కువైన

నప్పుడు ధనములిచ్చి ప్రోత్సహింపుము. పని జేయ గల్గువారికి, యోగ్యజీతము లేర్పఱచి యుద్యోగము లిమ్ము. ఇట్లొనర్చినచో, రాజ్యమందలి ప్రజ దమ తమ కార్యమునందు సమర్థమగును. వారిలో దుఃఖము లేర్పడుట కవకాశముండదు. నీ పన్ను లాలస్యములేక వసూలగును. భాండాగారము నిండును. లోకులు నిర్భయులై యెదలపైఁ జేయివైచికొని నిద్రింతురు. రాజ్యమున నానందము తాండవించును."

ఈమాటలు రాజునకు రుచించినవి. అతడు సమర్థులైన రైతుల కెన్నో సాయము లొనర్చెను. వ్యాపారము లభివృద్ధి యొనరించెను. పని చేయఁగలుగువారి కుద్యోగము లిచ్చి, నెలజీతము లేర్పఱచెను. ఈ యుపాయముతో మహా విజితుని రాష్ట్రమున సమృద్ధి నెలకొన్నది. దారి దోపిడులు, దొంగతనములు మందునకు లేకపోయెను. సర్వజనులు సుఖితులగుటచేఁ బన్ను లాలస్యములేక వసూలయ్యెను. భాండాగారము నిండినది. లోకులు నిర్భయముగ వసించిరి.

ఒకానొకనాడు మహా విజితుఁడు పురోహితునితో నన్నాఁడు: "ఓ బ్రాహ్మణా! నీ వుపదేశించిన యుపాముచే, నా రాజ్యమందలి దుఃఖములు నశించినవి. భాండాగారము ముందటికంటె సమృద్ధమైనది. రాజ్యమందలి ప్రజ నిర్భయముగ జీవించు చున్నది. వారి యానందమునకు మేర లేదు. ఇపుడు నేను మహాయజ్ఞ మొనర్తునా? దాని విధానము బోధింతువా?"

పురోహితుఁడు బదు లొసగెను. "మహారాజా? నీవు యజ్ఞమొనర్ప వలసినచోఁ బ్రజల యనుమతి గావలెను. కనుక వారి నొక చోటఁ జేర్చి యనుమమాతి నర్థింపుము!"

రాజట్లే యొనర్చెను. ప్రజలు యజ్ఞమున కనుమతించినారు. పురోహితుఁడు యజ్ఞమునకుఁ దయారయ్యెను. అతఁడు రాజుతో ననెను: "రాజా! ఈ యజ్ఞమందు దండిగా ధనము వెచ్చమగునని, దలఁపకుము. యజ్ఞము జరగునప్పుడు డబ్బు ఖర్చగునను నూహ నీ మనస్సున జనింపరాదు. యజ్ఞాంతమందు – ధనమెల్లఁ బోయెనను పశ్చాత్తాపమును దలఁపున మెలఁగరాదు. నా యజ్ఞమట్టి విచిత్రమైనది. దీని ననేక సాధువులు జేరుదురు. నీ వా సత్పురుషులను గౌరవింపుము. నీ హృదయమున కానందము కలుగును."

మహావిజితుని యజ్ఞమందుఁ బ్రాణివధ సేయఁబడలేదు. చెట్లు నఱికి యూపముల నెలకొల్పలేదు దర్భాసనము లమర్పఁబడలేదు. సేవకులు, నౌకరులు మొదలగు వారితో వారి యిచ్ఛకు విరుద్ధముగఁ బనులు సేయింపఁబడలేదు. ఇష్టమున్నవారు పనులు చేసిరి; లేని వా రూరకుండిరి. నెయ్యి, నూనె, లవణము, దేనె, చెఱకురసము వీనితోనే యా యజ్ఞము గావింప బడినది.

యజ్ఞానంతరము రాష్ట్రములోని శ్రీమంతులు గొప్ప గొప్ప బహుమానములతో మహావిజితుని దర్శింప వచ్చిరి. వారిని రాజెంతో యాదరించినాఁడు. శ్రీమంతులు బహుమానము లీ వచ్చిరి. రాజనెను: "గృహస్థులారా! మీ బహుమానములు నా కక్కఱలేదు. ధార్మికమైన పన్నుల

రూపమున నాకు వచ్చిన ధనమే పుష్కలమై భాండాగార మున నిండియున్నది. మీకే మైన గావలసిన దీసికొని పొందు"

రాజు శ్రీమంతుల బహుమానము లంగీకరింపలేదు. వా రా ద్రవ్యముతో ధర్మశాలలు గట్టించిరి. దరిద్రులకు దాన మొనర్చిరి. ఇంకను బ్రజోపయోగములైన కార్యము లనేకములు జరిగెను.

భగవానుఁడు జెప్పిన యీ యజ్ఞవృత్తాంతమును విని కూటదంతుఁడు మొదలగు విప్రులు 'చాల గొప్ప యజ్ఞ' మని యంకించిరి. తలలు బంకించిరి.

బుద్ధభగవానుఁడు కూట దంత బ్రాహ్మణునకుఁ దన ధర్మమును సవిస్తరముగ బోధించెను. ఆ బ్రాహ్మణుఁడు బుద్ధోపాసకుఁడైనాఁడు. యజ్ఞమునకు సేకరింపబడిన జాతి కేనూఱు ప్రాణులు యూపములనుండి వదలింపఁ బడినవి. వానికి జీవదానము గలిగెను. పచ్చని గడ్డిమేసి, పడియల నీరు ద్రావి, విచ్చిన కన్నులతో నవి చెట్లనీడలయందు విహ రించినవి.

దారిద్ర్యమును నాశనమొనర్చుటే నిజమైన యజ్ఞము. పై సుత్తమునందు — మహావిజితుఁ డను పదమునకు గొప్ప రాజ్యము గలవాఁ డను యర్థము. అట్టివారే పెద్దయజ్ఞములు చేయ సర్హులుగదా! మహాయజ్ఞమునకు ముఖ్యవిధానము, రాజ్యమందు బీదలు లేకుండఁ జేయుట— సర్వులను సత్కార్య పరులనుగా నొనర్చుట. ఈ విషయమే మఱియొకరీతిగా,

'చెక్కవత్తి సహనాద' సుత్తమందు వర్ణింపఁబడెను. దాని సారాంశ మీ క్రిందిది:

'దృఢనేమి'యను చక్రవర్తియుండెను. ముసలివాఁడై యాతఁడు గుమారు నభిషేకించి యోగాభ్యాసమునకై యుపవనము జేరినాఁడు. ముసలి రాజూరు విడచిన యేడవదినమందు - ప్రాసాదమునకు ముందున్న దేదీప్యమానమైన చక్ర మంతర్ధానమయ్యెను. ఈ సంఘటనకు దృఢనేమి పుత్రుఁడెంతో జింతించెను. రాజర్షియైన తండ్రికడ కేగి యీ వర్తమానమును విన్నవించినాఁడు దృఢనేమి యిట్లు బలికెను. "పుత్రా! నీవు భీతిల్లకుము. నీవు మరల జక్రవర్తి ధర్మములను, బాలన మొనరించినచో నది యథాస్థానమునకు వచ్చును. ప్రజలను న్యాయముగ రక్షింపుము. వారిని సమాధానముగఁ జూడుము. నీరాజ్యమం దన్యాయములు జరుగనివ్వకుము. దరిద్రులకు నిలువనీడనిమ్ము. వారితోఁ బనులుగైకొని నెలజీతము లేర్పఱపుము. నీరాజ్యమందలి శ్రమణబ్రాహ్మణుల గౌరవింపుము. వారి నపుడపుడు దర్శించి కర్తవ్య బోధల నందుము. వారి యుపదేశముల బడినడచి, యకర్తవ్య విముఖుఁడవై గర్తవ్యసుముఖుఁడ వగుము."

తరుణరాజు దండ్రిమాటలు గౌరవించెను. అతఁడట్లే మెలగ జొచ్చినాఁడు. రాజు దాపటిచేత నీరుగల్గు నొక పాత్రమును బట్టికొన్నాడు. వల చేతితో ధర్మచక్రమును ప్రవర్తింపఁజేసెను. ఆ చక్రము సామ్రాజ్యమందు నాలుగు దిక్కులజుట్టినది. దాని వెనువెనుకనే, రాజునడచి ప్రజలకుఁ 'ప్రాణివధ సేయరాదు, దొంగతనము మంచిదిగాదు. వ్యభి

చారమొనర్పరాదు. అసత్యములు బల్కరాదు. స్వచ్ఛముగ జీవించవలె'నని బోధించెను.

ధర్మచక్రము వెనుదిరిగి చక్రవర్తియొక్క సభ యెదుట నిలచినది. రాజప్రాసాదమున కది కాంతిని వెలార్చెను.

ఈ చక్రవర్తి వ్రత మేడుతరములు సాగెను. ఏడవ చక్రవర్తి సన్యాసము స్వీకరించిన యేడవ దినమందీచక్ర మంతర్థానమైనది. అప్పటి రాజునకుఁ గలిగిన దుఃఖమునకు మేర లేదు. కాని యతఁడు రాజర్షియైన తండ్రికడ కేగి, చక్రవర్తి వ్రతమును స్వీకరింపలేదు. తరుణరాజుయొక్క యమాత్యులు, నితరసద్గృహస్థులు, జక్రవర్తివ్రత మాతని కెఱిఁగించినారు. దీనిని విని రాజు న్యాయరక్షణ మారంభించెను. కాని దరిద్రులకుఁ దగిన వ్యవస్థ నేర్పాటు సేయక పోయెను. అందుచే వాని రాజ్యమందు భయంకర దారిద్ర్యము వ్యాపించినది. ఒకానొకఁడు దొంగతన మొనర్చెను. వానిని రాజు నెదుటికిఁ బట్టికొని వచ్చిరి. రాజడిగినాఁడు: 'నీవు దొంగతన మొనర్చినది నిజమేనా?'

దొంగ :- మహారాజా! నిజము.

రాజు :- ఆ కార్యమేల జేసితివి?

దొంగ :- నాకు బ్రదుకుటకు మార్గము లేదు.

రాజు వానికిఁ గొంతధన మొసగెను. "ఈ ధనముతో నేదేని యొకవృత్తి నారంభింపుము. కుటుంబమును పోషించుకొని, దానధర్మము లొనగుము."

'సరేనని' వాఁడు వెడలిపోయెను.

ఈ వృత్తాంతము వేఱొక దొంగ విన్నాఁడు. వాఁడును దొంగిలించెను. రాజు వానికిఁగూడఁ గొంత ధన మిచ్చెను. ఎవరెవరు దొంగతనము చేసిన – వారి వారికి రాజు బహుమాన మొసఁగు నను విపరీత ప్రచారము– జనులలో నెల కొన్నది. ఎవరు బట్టిన వారు దొంగతనము సేయ నారంభించిరి. ఒకనాఁ డొక చోరుని రాజుకడకు భటులుఁ గొని తెచ్చిరి. రా జాలోచించినాఁడు. 'దొంగతన మొనర్చినచో రాజు ధనమిచ్చు'నను విపరీత ప్రచారము బలిసిపోయినది. దీని నాపవలెను. మహారాజు వాని శిరచ్ఛేదనమున కాజ్ఞ యిచ్చెను రక్షకభటు లాచోరుని తలగొరిగించి పగ్గములచే బంధించి, వీధులందు ద్రిప్పితిప్పి, యూరికి వెలుపల దక్షిణము వైపు దల ఖండించిరి.

దీనిని విన్న దొంగలు భయపడినారు. రక్షణా సామగ్రి లేక దొంగతనము సేయఁబూనుకొనుట– ప్రమాద కరమని వారు దలఁచిరి. ఆ చోరు లాయుధములు ధరింప మొదలువెట్టిరి. బలాత్కారముగ దారులుగొట్టనారంభించిరి.

ఈరీతి దరిద్రుల కేమియుఁబని దొరుకకుండుటచే, రాను రాను దారిద్ర్య మెచ్చయ్యెను. దారిద్ర్యముతో దొంగతన ములు పెరిగినవి. దొంగతనములు, దోపిడులు, జక్కగ సాగు టకై శస్త్రములు ధరించుట మొదలయ్యెను. దానితో హత్య లెక్కువయ్యెను హత్యలతో నసత్యము, యసత్యముతో నింద, నిందలతో వ్యభిచారము, దానితోఁ గలహములు – యినియన్నియు, నొకటి కొకటి తోడై–రాజ్యమును 'పాండవ

బీజు' జేయ మొదలిడెను. వీని యభివృద్ధితో లోభ ద్వేషములు బెచ్చు పెరిగినవి. జనులయందును మిథ్యాదృష్టి వ్యాపించి యసత్కర్మలు మెండయ్యెను.

మహా విజితుని యొక్క పురోహితుఁడు పలికిన యజ్ఞ వృత్తాంతము కథ, 'చక్కనత్తి సీహనాద సుత్తము'నందును వచ్చును. బలవంతముగ బ్రజలనుండి జంతువుల నిడ్చి తెచ్చి, వధించు యజ్ఞము. యజ్ఞముగాదనియు; సమాజోపయోగము లైన కార్యములొనర్చి ప్రజలకు శాంతినొసగి దారిద్ర్యమును నిర్మూలించుటయే, గొప్పయజ్ఞమనియు, నీసుత్తమందును జెప్పబడినది! కాని - యీనాఁడు బలిదానపూర్వక యజ్ఞ యాగములు బూర్తిగ తగ్గలేదు. అయినను - నిజమైన యజ్ఞములొనర్చు బ్రయత్నములుఁ గూడ నక్కడక్కడ గనుపించెను. జర్మనీ, యిటలీ, దేశములు దారిద్ర్యమును దొలగించుటకై, యుద్ధసామగ్రిని నిర్మించెను. దానితో ఫ్రాన్సు, యింగ్లండు, అమెరికాలుఁగూడ, మేల్కొని యుద్ధ సామగ్రులు దయారు సేయ మొదలు పెట్టినవి. వారిద్వారికి గలతలు బెట్టుగు నవకాశము గల్గినది ఆసియాలో, 'జపాను' చీనాపైకి దూకనేదూకినది.* హిట్లరు, ముసోలినీలు - రే పేమి జేయుదురో! జెప్పుటకు వీలేలేదు ఒకటినిజము. ఈ ప్రయత్నములకుఁ బర్యవసానము రణయజ్ఞమే. ఆ యజ్ఞములో నితర ప్రాణులకంటెను - మనుష్యప్రాణు లెక్కువగ నాహుతియై పోదురు. దానిని నిల్పుటకు మార్గమేమి? దేశ

* ఈ విషయము రెండవ సంగ్రామమునకు ముందు వ్రాసితిని. మరల నా వ్రాతను మార్చలేదు.

ముల యుద్ధసామగ్రిని, నిర్మించుటమాని వేసి సమాజమున కుపకరించు పనులొనర్ప నారంభింపవలెను. అప్పుడే బుద్ధ భగవానుఁ డుపదేశించిన యజ్ఞవిధాన మాచరణలోఁ బెట్టినట్లు, అస్తు.

ఏదో వేఱు విషయముల లోనికి నడచితిని. బుద్ధుని యజ్ఞ విధానమును వివరించుటకై, యీ వివరము గావలిసి వచ్చెను. పైఁజెప్పఁబడిన సుత్తములు, బుద్ధుని యనంతరము గొంత కాలమునకు రచింపఁబడిన వే యైనను, వానిలో బుద్ధోపదేశము యొక్క మూల భూతములైన తత్వములు వివరింపఁబడ్డవి. ఇంత మంచి యజ్ఞములు బోధించిన బుద్ధుని వేదనిందకుఁ డని నిందించుట – నతని నవహేళనము సేయుట యోగ్యమేనా? విజ్ఞులు యోచింప వలెను.

# పదవ ప్రకరణము

# జాతిభేదములు

## జాతిభేదము యొక్క పుట్టుక

"బ్రాహ్మణోఽస్య ముఖమాసీత్ - బాహూరాజన్యః కృతః
ఊరూతదస్య యద్వైశ్యః - పద్భ్యాం శూద్రో అజాయత"

(ఋగ్వేదము. 10-90-12)

భారత దేశములోని జాతిభేదములకు మూలము పురుష సూక్తమందలి ఋా ఋక్కని విద్వాంసుల తలఁపు. ఈ నిర్ణయము భ్రమమూలకము. వేదములకు ముందుగూడ - సప్తసింధువులందును - మధ్య హిందూస్థానములోను - యహింసతో బాటు జాతిభేద ధర్మముగూడ నుండెను. ఆర్యులరాకచే వైదిక సంస్కృతి విజృంభించినది. దానితో నహింస యడవుల నాశ్రయించినది ఈ విషయము ప్రథమ భాగములోని - మొదటి ప్రకరణమునఁ జెప్పితిమిగదా! జాతిభేదములు మాత్ర మప్పుడప్పుడు వాని బాహ్య స్వరూపము గొంత మారినను - జనులలో బోలేదు.

## క్షత్రియుల మహత్తు

సుమేరియాలోఁ జాలమట్టుకుఁ బురోహితులే రాజులౌదురు. ఈ యలవాటు సప్తసింధువులలో గూడ నుండెడిది. ఒకానొకనాఁ డక్కడఁ జిన్న - పెద్ద సంస్థానములు గొన్ని యుండెడివి. 'ఈ సంస్థానాధిపతులలోఁ బ్రముఖుఁడు వృత్ర బ్రాహ్మణుఁడు. వీని నింద్రుఁడు వధించెను. దానిచే నింద్రునకు

బ్రహ్మహత్య ఘటిల్లినట. పైకథ-*మహాభారత ముందు వచ్చును. ఇంతకుముం దుదాహరించిన ఋగ్వేద ఋక్కు - ఆర్యులు వచ్చుటకు ముందు భారత దేశమం దుండిన సామాజిక స్థితినిదెల్పును. ఒకానొకనాఁడు విరాట్పురుషుని ముఖము బ్రాహ్మణులు, అతని బాహువులు రాజన్యులు, ఊరువులు వైశ్యులు, ఆ విరాట్పురుషుని పాదములనుండి శూద్రులు జన్మించిరట! ఆర్యుల యాగమనముతో క్షత్రియులకు మహత్తుబెరిగెను. బ్రాహ్మణుని వర్చస్సు గళితమైనది. కాని పౌరోహిత్యము మాత్రము వారిదే. ఈ స్థితి బుద్ధకాలము వఱకల్లీయుండెను. 'పాలీ' భాషయం దక్కడక్కడ క్షత్రియుల ప్రాముఖ్యము వర్ణింపఁబడియున్నది. ఉపనిషత్తుల లోను - నీ భావమే ప్రతిధ్వనించిన పట్టులు జాలగవు. దానిలో నీ క్రింది దొకటి.

"బ్రహ్మ వా ఇదమగ్ర ఆసీదేక మేవ। తదేకం సన్న భవత్తచ్ఛ్రేయోరూప మత్య సృజతక్షత్రం యాన్యేతాని దేవత్రా క్షత్రాణీంద్రో వరుణః సోమోరుద్రః పర్జన్యోయమో మృత్యురీశాన ఇతి తస్మాత్ క్షత్రాత్పరంనాస్తి। తస్మాత్ బ్రాహ్మణః క్షత్రియ మధస్తాదుపాస్తే॥"

(బృహదారణ్యక 1-4-11)

ఒకప్పుడు బ్రహ్మ యొకఁడే యుండెను. అతఁడొకఁడే యుండుటచే నాతనికి వికాసము గలుగలేదు. అందుచే నతఁ డుత్కృష్టమైన క్షత్రియ జాతిని సృష్టించెను. క్షత్రియులనఁగా నెవరు? దేవలోకములోని యింద్రావరుణులు -సోమరుద్ర పర్జన్యులు - ఈశాన యమమృత్యువులు. కనుక -

* చూ: హిందీ సంస్కృతి ఆణి అహింస' పుట 10

క్షత్రియునికంటె శ్రేష్ఠమైన జాతి వేఱొకటి లేదు. అందుచే బ్రాహ్మణుఁడు దక్షుడవవాఁడై క్షత్రియు నుపాసించు చున్నాఁడు.

## జాతిభేదముల నిషేధము

పై రీతిగ క్షత్రియునికి గొప్పదనము చేకూరినది. వాని ప్రధాన కర్తవ్యము - యుద్ధము సేయుటయే. యుద్ధమన్న - బుద్ధునకు గంటగింపు. అందుచే నాతని దృష్టిలో జాతిభేదము నిరుపయోగ మైనది. ఈ యూహతో జాతిభేదమును బుద్ధుఁడు సర్వదా నిషేధించెను. ఇతర శ్రమణ పంథలు - బుద్ధునివలె జాతిభేదము నంతగాఁ ద్రుణీకరించినట్లు గానరాదు. వారి సంఘములలో - జాతికృతమైన హెచ్చుతగ్గులు లేకున్న మాట వాస్తవమే. కాని - వారి యుపాసక వర్గములలో జాతిభేదము లుండినవి దానిని వారు నిషేధింపలేదు ఆ పని బుద్ధుఁ డొనర్చెను. అది యెట్లో వినదముగాక!

జాతిభేదముల బుద్ధుఁడు విసంవాద మొనర్చిన సుత్తములలోఁ బ్రాచీన మైనవి - 'వాసేట్ఠసుత్త - సుత్తనిపాత' మందును, 'మజ్ఝిమనికాయ' మునను - గనపడును. వాని సారాంశ మిది.

ఒకసారి బుద్ధుఁడు 'యిచ్ఛానంగల' మనెడు పల్లె దగ్గఱ - 'యిచ్ఛానంగల' మనెడు వనమం దుండెను. అప్పుడనేకులు - బ్రాహ్మణు లాపల్లెకు వచ్చిరి. వారిలో వాసిష్ఠుఁడు - భారద్వాజుఁ డనెడు నిద్దరు బ్రాహ్మణులకు జాతిభేద విషయమై వాదము జరిగెను. భారద్వాజుఁ డిట్లు వాదిం

చినాఁడు. "వాసిష్ఠా ! ఎవని తల్లిదండ్రుల వంశములలో నేడు తరములు శుద్ధములైనవో - వర్ణ సంకరము గలుగలేదో - యట్టివాఁడే శ్రేష్ఠుఁడైన బ్రాహ్మణుఁడు. బ్రాహ్మణత్వము జన్మతోనే వచ్చును"

వాసిష్ఠుఁ డిట్లు వాదించెను. "భరద్వాజా! శీలసంపన్నుఁడైన మనుష్యుఁడే బ్రాహ్మణుఁడు. కర్తవ్యదక్షుఁడైన వాఁడే బ్రాహ్మణుఁడు. బ్రాహ్మణత్వము గర్మచేత వచ్చును."

ఇరువురి నడుమ - నెంతయో తర్జన భర్జనలు సాగినవి. వారొక సమాధానమునకు రాలేకపోయిరి. కడకు వాసిష్ఠుఁడన్నాఁడు - "ఓయీ! భరద్వాజా! మన వివాదము మనలోఁ దెగునట్లు లేదు. ఈ యూరికి గౌతమ శ్రమణులు వచ్చినారట! వారు - సమ్యక్సంబుద్ధులు. పూజ్యులు. లోకమున కంతటికి గురువులని యనేకు లనుచున్నారు. వారిదగ్గరకు బోదముగాక! వారెట్లు బరిష్కరింతురో యదే సిద్ధాంతము." భరద్వాజుఁ 'డట్లే కానిమ్ము'నెను.

ఇద్దరును బుద్ధునికడకు వచ్చినారు. కుశలప్రశ్నలొనర్చి - వారిద్దరు జెఱియొకవైపు గూర్చొనిరి. వాసిష్ఠుఁడనెను. "గౌతమా! అతఁడు ప్రసిద్ధుఁడైన 'పౌష్కరసాతి' శిష్యుఁడు. నాగురువు 'తారుక్ష్యుఁడు.' మేమిరువురును వేద శాస్త్రములను జక్కఁగాఁ జదువుకొన్నాము. మా నడుమ జాతిభేదముల విషయము జర్చకువచ్చినది. జన్మతో బ్రాహ్మణుఁడగు నని యతనివాదము. కర్మతో బ్రాహ్మణుఁడగునని

నావాదము. మే మిర్వురము నీకడ కరుదెంచితిమి. ఈ విషయ మెట్లో దేల్చి చెప్పవలయును."

భగవానుఁడు జబునవ్వెను. అతఁడిట్లన్నాఁడు. "ఓయి వాసిష్టా! తృణములు, వృక్షములు, వనస్పతులు వీనియందు భిన్న భిన్నజాతులు స్పష్టముగ గన్పడు చున్నవి. అట్లే - గీటకములు, జీమలు మొదలైనవానిలో భిన్నజాతులున్నవి. సర్పములలో - శ్వాపదములలో - నీట నివసించు జేపలలో - నింగినెగురు బక్షులలో ననేక జాతులున్నవి. వానివాని భిన్న త్వమునకు గుర్తు లాప్రాణులయందే స్పష్టముగ గన్పడును. కాని-మనుష్యునిలో నట్టి గుఱుతులు గన్పడుట లేదు. కన్న, ముక్కు, గాలు, జేయి, వెంట్రుకలు సకల మనుష్యులకు నున్నవి. ఈ యవయవములు మనుష్యునకు - మనుష్యునకు భిన్నభిన్నముగ లేవు. అనఁగా బశుపక్ష్యాదులలో భిన్న భిన్న జాతులకు భిన్న భిన్నములైన యాకారము లెట్లు గోచరించునో యట్లు మనుష్యజాతిలో లేవు. సర్వమానవుల యవయవములును నించుమించు సమముగనే యుండుటచే-వారిలో జాతిభేదములుండుటకు వీలు లేదు. కాని - కర్మలతో మనుష్యులు భేదించుటకు సంభవ మున్నది.

ఒకానొక బ్రాహ్మణుఁడు గోవులను బాలించుచు జీవించుననుకొందము. అతఁడు గొల్లవాఁడే. బ్రాహ్మణుఁడు గాఁడు. శిల్పముతో జీవించువాఁడు శిల్పి. వ్యాపార మొనర్చి జీవించువాఁడు వైశ్యుఁడే. దౌత్యమును నెఱపువాఁడు దూత. దొంగతనముచే జీవించు విప్రుఁడు జోరుఁడు. యుద్ధజీవికగల బ్రాహ్మణుఁడు యోద్ధ. యజ్ఞయాగములచే బ్రదుకువాఁడు

యాజకుఁడు. రాష్ట్రపాలన మొనర్చుచో రాజు. వీరిలో నెవ్వరును కర్మనుబట్టిగాక - జన్మనుబట్టియే బ్రాహ్మణుఁ డగుటకు వీలులేదు.

సకలసంసార బంధములు వదలించుకొని - ప్రాపంచిక దుఃఖములకు భయపడక - యెవఁ డనాసక్తుడై యుండునో - యతఁడే నాదృష్టిలో బ్రాహ్మణుఁడు. ఇతరులు నిందించి నప్పుడు - బంధించినప్పుడు - వధోద్యోగ మొనర్చినప్పుడు మాఱుమాటాడక - యెవఁడు సహించునో - యెవనిబలము క్షమయో - వానిని నేను బ్రాహ్మణుఁ డందును. తామర పైని నీటిబొట్టువలె - యిహలోక విషయ సుఖములయం దెవ డంటియు - నంటకుండునో - వాఁడే నా దృష్టిలో విప్రుఁడు.

జన్మతో బ్రాహ్మణుఁ డెవఁడునుగాలేడు. అబ్రాహ్మణుఁడును గాలేడు. కర్మణోనే బ్రాహ్మణుఁడగును. అబ్రాహ్మణుఁడగుటకును గర్మయే కారణము. రైతు గర్మచే నగును. శిల్పి, దొంగ, సిపాయి, యాజకుఁడు వీరందరు దా మొనర్చు కర్మలనుబట్టి యేర్పడినవారే. రాజుగూడ నాతఁ డొనర్చు పనినిబట్టియే రాజగును. సర్వజగత్తు కర్మనుయమము. చక్రముల యాధారముతో రథము నడచినట్లు సర్వప్రాణు లును దమసేయు కర్మననుసరించి యుపజీవించు చున్నవి."

ఈ యుపదేశమును విన్న వాసిష్ఠ - భారద్వాజులు బుద్ధోపాసకు లైనారట!

## బ్రాహ్మణా - బ్రాహ్మణులు సమానులే !

పైని జెప్పిన పురుష సూక్తములలోని బుక్కు ననుసరించి బ్రాహ్మణులు దాము గొప్పవారని జాటుకొన దొడఁగిరి. వారు విరాట్పురుషుని ముఖమునుండి బయట బడిరట ! ఈ విషయమును బుద్ధుఁడు "మజ్ఝిమనికాయము" నందు 'అస్సలాయన సుత్తము'న దడవెను. ఆ ప్రసంగ మెంతయో గనువిప్పుగ నుండును. దాని సారాంశమిది—

ఒకనాఁడు బుద్ధుఁడు 'శ్రావస్తి' యందు 'అనాధపిండికు'ని యారామమునందుండెను. అపుడు - గారణాంతరముతో నేనూఱు బ్రాహ్మణులు శ్రావస్తిఁజేరినారు. "బుద్ధుఁడు - నాల్గువర్ణములకును మోక్షము లభించునని బల్కునట !" ఈ శ్రమణ గౌతముని వాదమున కాధారమేమో గనుగొనవలెనని వారిలో వారనుకొన్న మాట ! కొందఱు విప్రులు బుద్ధునితో వాదించి - యాతని వాద దౌర్బల్యమును బయట పెట్టవలయుననియుఁ దలఁచిరి. వారికి దక్కినవారు - 'మద్దతు' నిచ్చినారు. అందఱుఁజేరి యాశ్వలాయన బ్రాహ్మణుఁ డాపనికిఁ దగునని యెన్నుకొన్నారు.

ఆశ్వలాయన బ్రాహ్మణుఁడు వేదపారంగతుఁడు. ఛందశ్శాస్త్రము మొదలైన వేదాంగము లాతని నాల్కపై నట్టువ కత్తెలు. నాల్గు వేదములు 'నేను ముందు - నేను ముంద'ని యాతని ముఖమునుండి దూకుచుండెడివి ఇట్లున్నను దాను - 'బుద్ధునితో వాదించుటకుఁ దగన'ని యాతఁడు విజ్ఞుఁడై గ్రహించెను. కాని విప్రులు విన్నగదా!

లందరేకవాక్యముగ నాతనినే మఱల నెన్నుకొనిరి. అపుడాశ్వలాయనుఁ డన్నాఁడు. "బ్రాహ్మణులారా! శ్రమణ గౌతముఁడు ధర్మవాది. వాద వివాదములు ధర్మవాదుల బని గాదు. ఏది యెట్లున్నను నేను బుద్ధునితో వాటించుటకుఁ దగను. వేదవేదాంగములు జదివితినే యనుకొనుడు కాని - నేను దగను."

ఈ మాటపై మఱల 'గాదుగూడద'ని బ్రాహ్మణులలో వివాదములు బయలుదేరెను. ఆశ్వలాయనుఁడే యందుకుఁ దగినవాఁడని యా బ్రాహ్మణులకుఁ బాడగట్టెను. వారందఱు నొకటిగా - నతనితో ననిరి. "ఆశ్వలాయనా! నీవు బరివ్రాజక ధర్మములు జక్కగా నభ్యసించితివి. వానిపై మాటాడుటకు నీ కధికార మున్నది. ఇందరి సమ్మతిపై - నిందరి సమ్మానము జరగిన పిదప నీవు యుద్ధమునుండి పరాఙ్ముఖుఁడవగుట మా కిష్టము లేదు.

వీరెట్లును - దన్ను వదలరని యాశ్వలాయనుఁ డనుకొన్నాఁడు. ఇక నేమున్నది? రోటిలో దల దూర్చవలసినదే. అప్పటికిని వాఁడనెను. "విప్రులారా! గౌతముని వాదించుట నాకుఁ గష్టమే. కాని మీరు వదలరు. ఏమి సేయుదము. మీలోఁ బదిలోఁ బడునొకండవ వాఁడుగ నేనును వత్తును పదండు!"

బ్రాహ్మణులు సంతోషముతో నొల్లుమనిరి. అందరు బుద్ధునికడకుఁ గదలినారు. కదలివచ్చి గౌతముని గుశలప్రశ్న లొనర్చి యొకవైపువ గూర్చుండిరి. సంభాషణము నెవ్వ రారంభింతురు? పరస్పరము 'నీవు - నీవ'ని గనుసైగలు సేసి

కొన్నాడు. కడకంద రొక్కమ్మడిగ యాశ్వలాయనునకు సైగజేసిరి. దానికి 'నీవే - నీవే'నని యర్థము ఆశ్వలాయనున కికతప్పలేదు. అతఁడన్నాఁడు. "గౌతమా! బ్రాహ్మణ వర్ణమే శ్రేష్ఠమైనది ఇతరములు హీనములు. అదియే శుక్లము. ఇతరవర్ణములు కృష్ణములు. ముక్తి దక్కునది బ్రాహ్మణునకే. ఇతరులకుఁ జిక్కదు. విప్రులు విరాట్పురుషుని ముఖమునుండి బుట్టిరి. అందుచే వారతని యౌరసపుత్రులు. అనఁగా వారే బ్రహ్మకు దాయాదులు." ఇవి బ్రాహ్మణుల యూహలు. నాయూహగూడ. ఈ విషయమున దమ యభిప్రాయ మేమో!

బుద్ధుఁడు:- ఓయీ! అశ్వలాయనా! బ్రాహ్మణస్త్రీ గూడ ఋతిమతి యగుచున్నది. గర్భిణి యగుచున్నది. కనుచున్నది. శిశువునకు బాలిచ్చుచున్నది. ఇదంతయు జరగుచున్నదా; లేదా? ఇతర వర్ణములయందును శిశువు జన్మించు పద్ధతి యిదియే. ఇట్లుండగా - బ్రాహ్మణులు - బ్రహ్మదేవుని ముఖమునుండి బుట్టిరనుట యాశ్చర్యము గాదా! ప్రకృతి విరుద్ధముగాదా? బుద్ధుఁడు బ్రాహ్మణులవైపొకసారి బారఁ జూచినాఁడు.

అ:- గౌతమా! నీవేమైన జెప్పుము. బ్రాహ్మణుఁడొకఁడే బ్రహ్మదేవుని దాయాది. ఈ విషయముపై విప్రులకుఁ బూర్ణవిశ్వాసమున్నది.

బుద్ధుఁడు దిన్నఁగా నవ్వినాఁడు. అతఁడనెను. 'ఓయీ! యాశ్వలాయనా? నీ విశ్వాసము మాట యట్లుండనిమ్ము. అది తర్కసహము గావలెను. మన దేశపు సరిహద్దులలో

యవన - కాంభోజాదులు గొప్పదేశము లున్నవిగదా! వారిలో నార్యులు దాసు లని రెండుజాతులే యున్నవి. అప్పుడప్పు డార్యుఁడు దాసుఁడుగా నగుటయు దాసుఁ డార్యుఁ డుగా మాఱుటయు ఘటిల్లును. ఈ విషయ మెప్పుడైన విన్నావా?

ఆశ్వలాయనుఁడు:- ఔనౌను. విన్నాను.

బుద్ధుఁడు:- అట్లైనచో-బ్రాహ్మణులు బ్రహ్మముఖము నుండి బుట్టిరి. సర్వవర్ణములందు వీరే శ్రేష్ఠులనుట యెట్లు పొసఁగును?

ఆశ్వలాయనుఁడు :— మీరేమైన ననుఁడు. బ్రాహ్మణుఁడే శ్రేష్ఠుఁడనియు - నితర వర్ణములు హీనములనియు విప్రుల సంపూర్ణ విశ్వాసము.

బుద్ధుఁడు మఱియొకసారి దిన్నఁగా నవ్వెను.

"ఓయీ యశ్వలాయనా! విశ్వాసము తర్కసహము గావలెనని యింతకుముందే జెప్పితినిగదా! క్షత్రియుఁడు గాని - వైశ్యుఁడుగాని - శూద్రుఁడుగాని - ప్రాణఘాతము, చౌర్యము, కుట్ర, కలహము, వాగాడంబరము, బరధన వాంఛ, ద్వేషము, నాస్తికత యీ గుణము లున్నచో నరకమునకు బోవునుగదా! ఒక బ్రాహ్మణునకే యీ గుణము లుండెననుకొనుము. అతనికి నరకము లేదని నీ యభిప్రాయమా?

ఆశ్వలాయనుఁడు :— కాదు, కాదు. ఈ గుణము లున్నవాఁడెవఁడైననుం మరణోత్తరము - నరకమునకుఁ

భోగియయే తీరును. స్వకృత పాపములకుఁ బ్రాయశ్చిత్త మను భవించుటలో - బ్రాహ్మణా బ్రాహ్మణ విభేదము లేదు.

బుద్ధుఁడు :— ఒకానొక బ్రాహ్మణుఁడు పైనిజెప్పిన దుష్టగుణములనుండి నివృత్తుఁడై యున్నాఁడనుకొనుము. అతఁడు మరణోత్తరము స్వర్గమునకుఁ బోవునుగదా! ఇతర వర్ణస్థుఁ డెవఁడైనను నీ పాపములనుండి నివృత్తుఁడైనచో స్వర్గమునకుఁ బోవునా లేదా!

ఆశ్వలాయనుఁడు :— తప్పక పోవును. వాఁ డేవర్ణమున జనించినను - పాపనివృత్తుఁడైనవానికి మరణోత్తరము స్వర్గఫలము దప్పదు. పుణ్యాచరణమున కెవ్వఁడైన నర్హుఁడే.

బుద్ధుఁడు :— బ్రాహ్మణుఁ డొక్కఁడే ద్వేష, వైర రహితుఁడై మైత్రీభావన నొనర్ప శక్తుఁడనియు - దక్కిన క్షత్రియ, వైశ్య, శూద్రు లశక్తు లనియు నేదైన బ్రత్యక్ష ప్రమాణ మున్నదా!

ఆశ్వలాయనుఁడు:- లేదు. లేదు. నాల్గు వర్ణములును మైత్రీ భావము నొనర్ప శక్తములే.

బుద్ధుఁడు :- అట్లయినచో బ్రాహ్మణుఁడే శ్రేష్ఠుఁడు-యితరులు హీను లని తలంచుటలో నర్థమేమి?

ఆశ్వలాయనునకు దిక్కు- తోచలేదు. అనఁగా నితర బ్రాహ్మణులకును దోచ లేదన్నమాట. కాని యేదియో బలుకవలెను. ఆశ్వలాయనుఁడన్నాడు.

ఆశ్వలాయనుఁడు :- మీ రేమైన ననుకొనుఁడు. బ్రాహ్మణుఁడు, దన్ను శ్రేష్ఠుఁడని భావించును. శూద్రుని హీనునిగ జూచును. ఈ భావమునకు గొట్టు లేదు.

బుద్ధభగవానుఁడు మఱల నవ్వినాఁడు. సత్యసం సూచక మైన యీ నవ్వు బ్రాహ్మణుల కెట్లు భాసించెనో ? బుద్ధుఁ డందుకొనెను.

బుద్ధుఁడు :- ఆశ్వలాయనా ! మూర్ధాభి షిక్తుఁడైన రాజొక నూఱు మందిని గుంపు జేర్చును. వారిలో నాల్గు జాతు లుండినవి. మొదటి మూఁడు జాతులను జూచి రాజు 'మీరు శాలము, లేక జందనము మొదలైన వృక్షముల యుత్తరారణిఁ గ్రహించి యగ్నిని సృష్టింపుఁ' డనెను. తక్కిన శూద్రులు, చండాలురు, మొదలగు వారితోఁ 'గుక్కలు, బందులు, మొదలైనవి నీరు ద్రావు తొట్టిపై, యీముదపు చెట్టు యొక్క యుత్తరారణి ఘర్షించి, యగ్నిని సృష్టింపుఁ' డన్నాడు. వా రట్లే యొనర్చిరి. ఆశ్వలాయనా ! బ్రాహ్మణాదులైన యుత్తమ జాతులు సృష్టించిన యుత్త మోత్త రారణి నిష్పన్నమైన యగ్ని కంటె నిషాదాదులు నిర్మించిన యగ్ని తేజస్సునందు దక్కువయా ? బ్రాహ్మ ణుల యగ్ని యే యే కార్యముల నొనర్చునో యా కార్య ముల నా యగ్ని గావింపలేదా !

ఆశ్వలాయనుఁడు:- గౌతమా! ఏవర్ణమువాఁడేగాని- యెట్టి యుత్తరారణితోగాని-యేచోటగాని - యగ్నినుత్పా దించిన నాయగ్నులెల్ల - తేజస్సున సమానములే. వాని కార్యములలో భిన్నతయు లేదు.

బుద్ధుఁడు:- ఒకానొక క్షత్రియుఁడు బ్రాహ్మణకన్యను వివాహము జేసికొనెను. వారికొక కొడుకు గలిగెననుకొం దము. ఆ కుమారుఁడు తల్లిదండ్రులవలె మనుష్యుఁడుగా

నుండఁడా! అట్లే యొక బ్రాహ్మణుఁడు క్షత్రియకన్యను వరించును. వారిద్వరకొక కుమారుఁడు గలుగును. ఆ కుమారుఁడు మూఁడవ రకముగ నుండునా?

ఆశ్వలాయనుఁడు:- లేదు. మిశ్రమ వివాహములచే సంతానోత్పత్తియైనను, నాసంతానము వాని తల్లిదండ్రులనే బోలియుండును. వానిని బ్రాహ్మణునిగా క్షత్రియునిగాఁ బిలువవచ్చును.

బు:- ఓయీ బ్రాహ్మణా! ఒకానొక యాఁడుగుఱ్ఱము నకు గాడిదతో సంబంధము గలిగినది. ఆ పిల్లను గుఱ్ఱమందుమా; లేక గాడిదగా లెక్కింతుమా?

ఆశ్వ:- గౌతమా! అది గుఱ్ఱమును గాదు; గాడిదయుగాదు. ఆ సంతానము మూఁడవ జాతిది. దానిని గంచరగాడిద యందురు. కాని బ్రాహ్మణులు - క్షత్రియులు, వీరి సంబంధముతోఁ గలిగిన సంతానమును భిన్నజాతిగ లెక్కింపము.

బు:- ఆశ్వలాయనా! యిరువురు బ్రాహ్మణులున్నారు. వారిలో నొకఁడు చక్కఁగ వేదాధ్యయనమొనర్చెను. రెండవవాఁ డశిక్షితుఁడు. ఈ యిద్వరిలో శ్రాద్ధములందుగాని - యజ్ఞములందుగాని ప్రథమామంత్రణ మెవ్వరికుండును?

ఆశ్వ:- సుశిక్షితుఁడైన వానికే.

బు:- ఇద్వరు బ్రాహ్మణులున్నారు. వారిలోనొకఁడు విద్వాంసుఁడు కాని దురాచారి. రెండవ వాఁడు విద్వాం

సుఁడు గాడు. కాని, శీలవంతుఁడు. వీ రిద్దరిలో బ్రథమామంత్రణ మెవ్వరికుండును!

ఆశ్వ:- గౌతమా! శీలవంతునకే యుండును. దురాచారియైన మనుష్యున కొసఁగఁబడిన దానము - మహాఫలదాయక మెట్లగును?

బు:- ఆశ్వలాయనా! తొట్టదొలుత నీవు జాతియే గొప్పదంటివి. తరువాత వేదపఠనము గొప్పదంటివి. అటుపిదప శీలము గొప్పదంటివి. అనఁగాఁ దిన్నతిన్నఁగా - నేను బ్రతిపాదించిన విధానమునకే దిగజారిపోవన్నమాట!

ఇఁక నాశ్వలాయనుఁ డేమియు మాటలాఁడఁజాలక పోయెను. ఏమైన దోఁచినగదా - మాటలాడుటకు! అటుపిదప బుద్ధభగవానుఁ డతని 'కసిత దేవలఋషి' యొక్క కథ జెప్పినాఁడు. కడ కాశ్వలాయనుఁడు బుద్ధున కుపాసకుఁడయ్యెను.

## అధికారము సామాన్య ప్రజలకే.

బ్రాహ్మణులే శ్రేష్ఠులనియు - నితరవర్ణులు హీనులనియు గేవలము సిద్ధాంతించుటలో విప్రులు దృష్టిపడి యూరకుండలేదు. ఏయేవర్ణముల కేయేకార్యము గర్తవ్యమో దానిని నిర్ణయించుపనిగూడ దమకేయుంచికొన్నారు. ఈ విషయము 'మజ్ఝిమనికాయము' లోని (సం॥96) 'ఏసుకారిసుత్తము' నుండి దెలియును. దాని సారాంశ మిది.

బుద్ధుఁడు శ్రావస్తిలోని 'జైతవనము'లో ననాథపిండికుని యారామమం దున్నాఁడు. అచటికి యేసుకారి యను బ్రాహ్మణుఁడు వచ్చెను. కుశల ప్రశ్నానంతరమైన తరు

వాత నా బ్రాహ్మణుఁ డిట్లనెను. "గౌతమా! విప్రుఁడు నాలుగు పరిచర్యలు నిర్దేశించుచున్నాఁడు. విప్రునకుఁ దక్కిన వర్ణముల వారందఱు సేవ యొనర్పవలెను. క్షత్రియుని సేవ, క్షత్రియ - వైశ్య - శూద్రులకు గర్తవ్యము వైశ్యుల సేవ. వైశ్య - శూద్రులును, శూద్రుని సేవ శూద్రుఁ లే యొనర్పవలెను. ఇతర వర్ణములు శూద్రునకుఁ బరిచర్య యొనర్పరాదు. ఇది విధి. దీనిలో మీ యభిప్రాయ మేమి?"

"బ్రాహ్మణా! విప్రుఁడు నిర్దేశించిన దే-యితర జాతులనుసరింపవలె ననుటలో న్యాయమేమి? వర్ణపరిచర్యల నిర్దేశించు నధికారము విప్రుల కెవరిచ్చినారు?"

బ్రా :— ఎవ్వరు నివ్వలేదు.

బుద్ధు :— ఒకానొకనికి మాంస మిష్టము లేదట! వాఁడు బేదవాఁడు. వాని బ్రక్కింటివాఁడు దనకున్న మాంసములో వానికి భాగము వెట్టి దానికిఁ గ్రయ మడుగునట! నాకు నీ 'మాంసము నలదన్నను వినఁడు.' అట్లున్నది విప్రుని యొక్క స్థితి. లోకులపైఁ దన నిర్ణయమును వేసి రుద్దుటకీతఁ డెవ్వఁడు? ఏ జాతియైన నేమి? ఎవనిని సేవించుట గల్యాణప్రదమో - యకల్యాణముల నది దొలఁగించునో- యట్టివానినే సేవింపవలెను. నాల్గు వర్ణములలోఁ - బెద్దవారి నెవరినైన యడిగి చూడుము! ఇదే యభిప్రాయ మిత్తురు. ఉచ్చకులమునందు - నుచ్చవర్ణమందు - శ్రీమంతుల గృహమందు జన్మించుట నా దృష్టిలో మంచిదియుఁ గాదు; చెడ్డదియునుగాదు. అది జన్మించుట మాత్రమే. ఉచ్చవర్ణము

లలో - శ్రీమంతులలోఁ బుట్టిన మనుష్యుఁడు ప్రాణఘాతాది కార్యము లొనర్చినచో, వాని కులము మంచిది యగునా! నీచకులోత్పన్నుఁడైనను - పాపనిర్ముక్తుఁడై మెలఁగినచో వానికులము జెడ్డదేనా! ఎవనిని సేవించుట - శ్రద్ధాశీల, శృతత్యాగ, ప్రజ్ఞల నభివృద్ధి నొందించునో - యట్టివాని సేవ గర్తవ్యము. ఇది నా తలఁపు.

యసుకారి బ్రాహ్మణుఁడు :—గౌతమా! బ్రాహ్మణుఁడు నాలుగు ధనముల బ్రతిపాదించుచున్నాఁడు. భిక్షుచర్య బ్రాహ్మణుని ధనము - యుద్ధము క్షత్రియుని ధనము- కృషిగోరక్షలు వైశ్యుని ధనము - కొడవలితోఁ బంటలు మొదలైనవి గోయుట, బుట్టలు మొదలైనవి యల్లుట, యిత్యాది సేవలు శూద్రుని ధనము. ఈనాల్గు వర్ణములును దమతమ ధనమును దాఁటుమారుగ నొనర్చినచో - వారు జోరులుగ లెక్కింపఁ బడుదురు. దీన మీ యభిప్రాయమేమి?

బుద్ధుఁడు : నాయనా! యీనాల్గు ధనములను నిర్ణయించుటకు జనులు బ్రాహ్మణున కధికార మిచ్చిరా!

యసుకారిబ్రా :- లేదు.

బుద్ధుఁడు:- నే నింతకుముందుఁ జెప్పిన మాంసము పాలుపెట్టిన వానికథయే మఱల. బ్రాహ్మణా! ఆర్యశ్రేష్ఠ ధర్మములే యందరికిని ధనము బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్ర కులములందు జన్మించినవారిని - బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య శూద్రులందుము గదా! ఇవి సంజ్ఞలు మాత్రమే వీరిలో హెచ్చుతగ్గులు లేవు కట్టెలలోఁబుట్టిన యగ్నిని కాష్ఠాగ్నియందురు. శకలికలో జన్మించిన యగ్నిని

శాకలికాగ్ని యని బిలుతురు. తృణములందు బుట్టిన యగ్ని తృణాగ్ని. గోమయముతోఁ గల్గిన గోమయాగ్ని. ఈ నాలు గగ్నులలో గుణములలో నేదేని భేదమున్నదా? లేదుగదా! క్షత్రియాది జాతులుగూడ నింతే. ఈ నల్గురిలోఁ బ్రతి మనుష్యుఁడును - బాహ్యములనుండి నివృత్తుఁడగుటకు వీలున్నది గదా! మఱి - వీరిలో - బ్రాహ్మణుఁ డొక్కఁడే మైత్రీ భావన యొనర్పఁగలఁడు. ఇతరుల కాశక్తి లేదని నీకుఁ దోచునా!

యేసుకారి బ్రా:- గౌతమా ! అట్లుదోపదు. ఏ వర్ణము వాఁడైనను మైత్రీభావనను భావింపవచ్చును.

బుద్ధుఁడు:- బ్రాహ్మణుఁడుమాత్రమే నదికేగి స్నాన చూర్ణముచేఁ దనశరీరమును శుద్ధమొనర్చుకొన గలఁడనియు నితరున కాశక్తిలేదనియు నీ తలఁపా!

యేసుకారి బ్రా:- గౌతమా! అట్లులేదు. నాల్గు జాతులలో నెవరైనను - స్నానమొనర్చి తమ దేహములు శుద్ధ మొనర్చుకొనగలరు.

బుద్ధుఁడు:- అట్లే నాల్గుజాతులలో నెవరైనను తథాగతుని యుపదేశములను వర్తించి న్యాయ - ధర్మముల నుపాసింపగలరు.

## బ్రాహ్మణవర్ణమే శ్రేష్ఠమనుట కేవల విడంబన

బుద్ధుఁడు బరినిర్వాణమొందిన తరువాతగూడ నతని ప్రముఖశిష్యులు - జాతుర్వర్ణ్యము నంగీకరింపలేదు. ఈ వర్ణ విభాగము కృత్రిమ మని వారు నిర్ణయించిరి. దీనికొక్క

యుదాహరణము 'మజ్ఝిమ నికాయము' లోని 'మధుర సుత్తము'న (నం. 84) వచ్చును. దాని సారాంశ మిది.

ఒకసారి 'మహాకచ్చానుఁడు' *మధురదగ్గర బృందావన మందుండెను. మధురరాజ వంతి పుత్రుఁడు గాత్యాయనుని కీర్తివిన్నాఁడు. గొప్పపరివారముతో రా జాతని సందర్శించి కుశలప్రశ్న లొనర్చి యిట్లు ప్రశ్నించెను.

రాజు: కాత్యాయనా! 'బ్రాహ్మణుఁడే శ్రేష్ఠుఁడు. ఇతరుఁడు హీనుఁడు. బ్రాహ్మణవర్ణమే శుక్లము. ఇతరములు కృష్ణములు. విప్రులకే ముక్తి-ఇతరులకు లేదు. బ్రాహ్మణులొక్కరే బ్రహ్మముఖమునుండి బుట్టినవారు. వారే యాతని యౌరస పుత్రులు.'' ఇవి విప్రుల యభిప్రాయములు. తమ యభిప్రాయమేమి?

కాత్యా:- మహారాజా! ఈ వాదము కేవలము శబ్దాడంబరము. ఒకానొక క్షత్రియుఁడు ధనసమృద్ధుఁడై యున్నాఁడనుకొనుము. రాజ్య పాలకుఁడై యున్నాఁ డనుకొనుము? వానిసేవ ఇతరవర్ణము లన్నియు గావించుచున్నవా; - లేదా?

రాజు :- కావించు చున్నవి. నాల్గు వర్ణములు గూడ నా మనుష్యునకు సేవకులు.

కాత్యా :- అట్లే - యే జాతిలోని మనుష్యుఁడే గాని ధనవంతుఁ డైనచో - రాజ్యవంతుఁ డైనచో - వానిసేవ నందఱు సేయుచున్నారా ! లేదా ?

* నేటి మధురయే.

రాజు :- అవును. నాల్గు వర్ణములు నతనిని సేవించుచున్నారు.

కాత్యా :- అట్లైనచో నీ నాల్గు వర్ణములలో భేద మెక్కడ వచ్చినది ?

రాజు :- ఈ దృష్టితో నాల్గు వర్ణము లొక్కటే. భేదము గన్పడుట లేదు.

కాత్యా :- అందుకే నేను జెప్పినది 'బ్రాహ్మణుఁడే శ్రేష్ఠుఁడు - ఇతరులు హీనులు' యను నీ ప్రవాదము కేవలము విడంబనము. నాల్గువర్ణములలో నెవ్వఁడు బాప మొనర్చినను - నరకమున కేగునా ! లేదా !

రాజు :- తప్పక బోవును

కాత్యా :- మఱి - వారిలో భేదమేమి ? నాల్గు వర్ణములలో నెవ్వఁడేని బాప నివృత్తుఁ డైనచో సద్గతి కేగును ఇది నిజమా ? కాదా ?

రాజు :- అవును.

కాత్యా :- నేను చెప్పిన దందుకే. బ్రాహ్మణుఁడే శ్రేష్ఠుఁడనుట కేవలము విడంబనము. నీ రాజ్యమందు - నాలుగు వర్ణములలో నెవఁడేని యొకఁడు దొంగతనము - బరదారాగమనము - ఇత్యాది యపరాధము లొనరించె ననుకొందము. వానిని రాజపురుషులు నీ కడకు గొనివత్తురు. అపుడు వాఁ డేకులమువాఁడైనను శిక్ష విధింతువా, లేదా ?

రాజు :- తప్పక విధింతును. వాని యపరాధమును బట్టి - వానినిఁ జంపుటయో - సరిహద్దు వెడల నడచు

టరయా - యే దండనమునైన విధింతును. అపరాధము నొన ర్చుటకుముందు - వాఁడే జాతివాఁడైనను - నపరాధముతో వానిజాతి నశించినది. అపరాధి కేవల బంది. అదియే వాని జాతి.

కాత్యా :- మఱి - యీ విషయమున నాల్గు వర్ణము లొకటేనా; కాదా?

రాజు :- తప్పక యొకటే.

కాత్యాయ :- నాల్గు వర్ణములలో నెవ్వఁడేని బరి వ్రాజకుఁడైనచో - సదాచారియైనచో - వానియెడ నీవెట్లు వర్తింతువు?

రాజు :- అతనికి నమస్కరింతును, గౌరవింతును. అతని యన్నవస్త్రముల కేర్పాటు సేయుదును. అంతకు ముందున్న వానిజాతి నశించినది. అతఁ డిప్పుడు కేవలము శ్రమణుఁడు.

కాత్యా :- అట్లైనచో నాల్గు వర్ణములలో భేదమేమి?

రాజు :- ఏమియు లేదు.

కాత్యా :- అందుకే - నేను జెప్పినది బ్రాహ్మణుఁడు సర్వశ్రేష్ఠుఁ డనుట విడంబన.

రాజు:- కాత్యాయనా! తమ యుపదేశము జాల సుందరమైనది. ఒకయింట జీకటి నిండినదనుకొనుఁడు. కొన్ని పదార్థములు బోర్లగిలఁబడి యున్నవి కొన్నిటికి మూతలు లేవు. కొన్ని కంటికగుపడుట లేదు. త్రోవ గన్పడదు అట్టిచో వాయింట దీపము వెలిగించుట గొప్ప యుపకారము గదా!

అట్లే నా హృదయమందిరమున బోధదీపమును వెలిగించి - జటిలతరమైన యీ ధర్మనిర్ణయమును దీర్చితిరి. నేను గాత్యాయనునకు - ధర్మమునకు - భిక్షుసంఘమునకు శరణుజొచ్చుచున్నాను. నేటినుండి - యామరణమును నేను దమ యుపాసకుఁడను.

కాత్యా:- మహారాజా! నీవు నన్ను శరణుబొందుటకు వీలులేదు. నేనే బుద్ధుని శరణుబొందితినో నీవుగూడ నాతనినే యాశ్రయింపవలెను.

రాజు:- కాత్యాయనా! బుద్ధుఁడిపుడెచటనున్నాఁడు?

కాత్యా:- వారు పరినిర్వాణ మందిరి.

రాజు:- ఇపుడు నేనేమి సేయుదును? వారు జీవించి యున్నచో - నూఱామడలైనను - వారి దర్మమునకై ప్రయాణించి యుందును. పోనిమ్ము. బుద్ధభగవానుఁడు నిర్వాణమందినను - వారిని - వారి ధర్మమును - వారిభిక్షుసంఘమును శరణుబొందుదును. నేటినుండి నేను భగవానుని యుపాసకుఁడను.

బుద్ధుఁడు జీవించియుండఁగా - మధురయందు బౌద్ధధర్మమెక్కువగ వ్యాపింపలేదు ఈ వృత్తాంతము రెండవ ప్రకరణములోని 'యుంగుత్తరనికాయసుత్తము'న దెల్పఁబడినదిగదా! అవంతిపుత్రుఁడు బుద్ధుని పరినిర్వాణానంతరము సింహాసనమెక్కి యుండవలెను. బుద్ధుని జీవితముననే సింహాసనస్థుఁడై యున్నచో - భగవానుని గుఱించి-యామాత్రము దెలిసుకపోవుట సంభవింపదు. బుద్ధుఁడు పరినిర్వాణమందుట గూడ నాతనికిఁ దెలియదనుట - యాతని పైసందేహామే

దెల్పునుగదా! బుద్ధుని కాలమం దీతనితండ్రి సింహాసనస్థుఁడు. ఆతఁడు బ్రాహ్మణమతాభిమాని. అగుటచే నారాజకుటుంబమునకు బుద్ధునిపై నొక విపరీతభావముండెడిది. మహాకాత్యాయనుఁడు మధురవాఁడే. బ్రాహ్మణుఁడు. విద్వాంసుడు. అందుచే నాతని ప్రభావము దరుణుఁడైన యవంతిపుత్రునిపై బాగుగఁబడి యుండును.

## జాతిభేదమును దొలఁగించుటలో - శ్రమణుల యశక్తత

ఈ ప్రకరణమందు నాల్గు సుత్తము లుదహరించితిని, 'వాసిష్ఠసుత్త' మందు జాతిభేదము కృత్రిమమని - బుద్ధుఁడు స్థాపించెను. 'అస్సలాయనసుత్తము'లో బ్రాహ్మణులు విరాట్పురుషముఖోత్పన్నులనుట ఖండింపఁబడెను. మూఁడవదైన 'యసుకారిసుత్తమం' దితరవర్ణముల - కర్తవ్యాకర్తవ్యముల నిరూపించు నధికారము బ్రాహ్మణునకు లేదని సిద్ధాంతమైనది. నాల్గవదైన 'మధురసుత్తము'లో మహాకాత్యాయనుడార్థిక నైతిక దృష్టితో జాతిభేదకల్పన యెంత నిరర్థకమో స్పష్టమొనర్చెను. ఈ నాల్గు సుత్తములను జక్కఁగా బర్యాలోచించినప్పుడు - బుద్ధుఁడు - నాతని శిష్యులు వీరు జాతిభేదమును గౌరవింప లేదనుట స్పష్టముగదా! దానిని నిర్మూలించుటకు నారెంతయో ప్రయత్నించిరి. కాని - వారి యత్నము సఫలముగా లేదు మధ్య హిందూస్థానమున నేగాక- గోదావరీ తీరమునను బ్రాహ్మణులు జాతిభేద సిద్ధాంత పతా

కము నెగురవేసిరి. దానిని - సమూలముగఁ బెకిలివేయుటకు నే శ్రమణ సంఘమునకును సాధ్యముగాకపోయినది.

## శ్రమణులలో జాతిభేదము లేదు.

ఋషులు - మునులు వీరిపరంపర ననుసరించిన శ్రమణసంఘములందు - జాతిభేదము లేశమును గూడ లేదు. ఏ జాతి వాఁడే యగు గాక! శ్రమణుఁడై సంఘమందుఁ జేరవచ్చును. హరికేశిబలుని వృత్తాంతము దొమ్మిదవ ప్రకరణమున వచ్చినదిగదా! అతఁడు చండాలుఁడు. నిర్గ్రంథ జైనసంప్రదాయమందుండెను. బౌద్ధభిక్షువులలో - *శ్వపాకుఁడను చండాలుఁడు-సునీతుఁ డను నీచకులమువాఁడును గొప్పసాధువులై ప్రసిద్ధులైరి. బౌద్ధభిక్షువులలో నున్న గొప్పగుణము జాతిభేదముల బాటింపకుండుటయే యని బుద్ధుఁడు ఘోషించెను. భగవానుఁడనుచున్నాఁడు, "భిక్షువులారా! గంగా, యమున యచిరవతి, సరయు, మొదలైన నదులు సముద్రమున జేరుచున్నవిగదా! సముద్రమున జేరినతరువాత - నవి దమవ్యక్తిత్వము నేమైన నిలిపికొనుచున్నవా! వానికివి మహాసముద్రమనియే పేరు అట్లే- బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య శూద్రాదులలో నెవ్వరేగాని - 'తథాగతు'ని సంఘమున బ్రవేశించినచో - వారి పూర్వనామగోత్రములు నశించిపోవుచున్నవి. 'శాక్యపుత్రీయశ్రమణు' లనునదే వారి నామధేయము.

(ఉదానసుత్తము. ౫. ౫ అంగుత్తరనికాయము. అట్ఠకనిపాతము)

---

*చూ. 'బౌద్ధసంఘాణాపరిచయ' పుట 253 - 256

## అశోకుని కాలమందలి
## బౌద్ధసంఘములో జాతిభేదము లేదు.

అశోక సమకాలీన బౌద్ధసంఘము జాతిభేదమును మన్నింపలేదు. ఈ విషయము 'దివ్యావదానము'లోని యశుఁడను మంత్రికథలో వచ్చును.

అశోకుఁడు బౌద్ధుఁడైనప్పుడు భిక్షువుల పాదములపై బడి నమస్కరించెను. ఆతనికడ యశుఁడను మంత్రియుం డెను. ఆ మంత్రి కీకార్యము సరిపోలేదు. 'మహారాజా! శాక్యశ్రమణులలో సర్వజాతి శ్రమణులును నుందురు. అభిషిక్తమైన దమ శిరస్సును వారికి వంచు టంత భావ్యము గాదేమో!' యనెను. అశోకుఁ డపు డేమియు బలుకలేదు. కొన్ని దినములు గడచెను. ఒకానొక నాఁడశోకుఁడు మేకలు గొఱ్ఱెలు మొదలైన ప్రాణుల యొక్క శిరస్సులఁ గొన్నిటి దెప్పించెను. 'వానిని విక్రయింపవలె'నని యశునితోఁ జెప్పి – మనుష్యుల తలలను గొన్ని టిని దెప్పించినాఁడు. వానినిగూడ విక్రయించుటకే. వానిని జనుల యెదుట బెట్టినారు. మేకలు మొదలైనవాని తలలను జనులు గొనిపోయినారు. మానవుల తలలుమాత్ర మట్లే నిలచి పోయినవి. ఎవరికిచ్చినను గైకొనరు. ఊరకనైన గైకొనుఁ డని యశోకుఁడు యశునిచే నడిగించెను. పుగుసాటికిగూడఁ గొనిపోవుట కెవ్వరును సమ్మతింపరైరి. అపు డశోకుఁడు యశునితో నన్నాఁడు "అమాత్యా! ఊరక యిచ్చినను – మనుష్యుని తల నెవ్వరును గైకొనిపోకుండుటకు గారణమేమి?

యశుఁడు :- వారు మానవుని తల నసహ్యించు కొందురు.

అశోకుఁడు :- మానవుని తలను గైకొనుట కిష్టపడని వారెవ్వరుగూడ నితర ప్రాణుల శిరస్సుల గైకొనుట కసహ్యతి జూపరే?

యశుఁడు :- మహారాజా! యెవఁడో యొక మానవుని తల నతికి తీసికొని వచ్చినారని జనుల కసహ్యము.

అశోకుఁడు :- నా తలను గూడఁ గంటగించి కొందురా! ఏమి?

యశుఁడు దీనికుత్తర మొసఁగ సాహసింపఁ డయ్యెను. పరవా లేదు చెప్పుమన్నాఁ డశోకుఁడు. యశుఁడ నెను: మహారాజా! తమతలపై గూడ లోకుల కసహ్యమే.

అశోకుఁడు :- అయినచో నట్టి నా తలను - భిక్షుకుల పాదములపై మోపుటచే వారికేదో గౌరవ మొచ్చెనని నీ వెందుల కనుకొంటివి.

ఈ సంవాదములో గొన్ని శ్లోకము లున్నవి. వానిలో నిది యొకటి

* "ఆవాహ కాలేధ - వివాహకాలే జాతేః పరీక్షా నతుధర్మకాతీ.
ధర్మప్రియా యాహి గుణా నిమిత్తా
గుణాచ్ఛ జాతిం న విచారయంతి"

కొడుకునకుగాని - కూతునకుగాని - వివాహ మొనరించునపుడు జాతిభేదము విచారింప దగ్గదే. ధార్మిక విచార

* ఆవాహమనఁగా దమ యింటికిఁ గోడలిని దెచ్చికొనుట. వివాహమనఁగాఁ దమ బిడ్డ నితరుల యింటికిఁ గోడలిగా నంపుట.

మందు - జాతి భేద సమస్య లేదు. ధార్మిక కృత్యములందు గుణము ప్రధానము. గుణములు జాతినిష్ఠములు గావు.

## జైనసంఘములు జాతిభేదమును స్వీకరించినవి.

ఇతర శ్రమణ పంథలలో నిర్గ్రంథ సంఘమును గుఱించి మాత్రమే మనకుఁ గొంతకొంత దెలియును. ఈ శ్రమణు లశోకునికి ముందే జాతిభేదమునకు - గొప్పతన మంటగట్టుటకు ప్రయత్నించిరి. ఈ విషయము 'ఆచారాంగ సూత్రము'యొక్క నిరుక్తితోఁ దెలియును. ఈ నిరుక్తిని రచించినది భద్రబాహుఁడు ఇతఁడు చంద్రగుప్తుని గురువని జైను లెంతురు. ఈ నిరుక్తి మొదటనే జాతి భేదమును గుఱించిన చర్చ యున్నది. అది యిది—

"నాలుగు వర్ణముల సంయోగముతోఁ బదునాఱు జాతులు గలుగు చున్నవి. పురుషుఁడు బ్రాహ్మణుఁడు- క్షత్రియ స్త్రీ, వీ రిద్దరకు గలిగినవాఁడు - సంకర క్షత్రియుఁడు. క్షత్రియ పురుషుఁడు - వైశ్య స్త్రీ, వారికి బుట్టిన వాఁడు సంకర వైశ్యుఁడు. వైశ్య పురుష - శూద్ర స్త్రీ జనితుఁడు ప్రధాన శూద్రుఁడు. లేక సంకర శూద్రుండు. ఇట్లేడు జాతులైనవి. వాని పరస్పర సంయోగముతో మఱల దొమ్మిది జాతు లేర్పడెను.

1. బ్రాహ్మణ పురుషుఁడు - వైశ్య స్త్రీ-వీరికి అంబష్ఠుఁడు
2. క్షత్రియ పురుషుఁడు - శూద్రస్త్రీ-వీరి కుగ్రుఁడు.
3. బ్రాహ్మణ పురుషుఁడు-శూద్రస్త్రీ-వీరికి నిషాదుఁడు.

4. శూద్ర పురుషుఁడు - వైశ్యస్త్రీ-వీ రిద్దరకయోఁగ వుండు.
5. వైశ్య పురుషుఁడు-క్షత్రియస్త్రీ-వారికి మాగధుఁడు.
6. క్షత్రియ పురుషుఁడు-బ్రాహ్మణస్త్రీ-వీరికి సూతుఁడు.
7. శూద్ర పురుషుఁడు - క్షత్రియస్త్రీ - వీరికి క్షత్త.
8. వైశ్య పురుషుఁడు - బ్రాహ్మణస్త్రీ - వీరికి వైదేహుఁడు,
9. శూద్ర పురుషుఁడు - బ్రాహ్మణస్త్రీ - వారికిఁ జండాలుఁడు.

క్రమముగా జనింతురు (ఆచారాంగ నిర్యుక్తి) (అధ్యా 1. గాథ 22-27) - మనుస్మృతి యీ నిర్యుక్తి కంటె నెంతయో నవీన మైనది. కాని - నిర్యుక్తి కాలమందలి విప్రులు మనుస్మృతియందలి యనులోమ ప్రతిలోమ జాతుల కశ్లై యుత్పత్తి జెప్పుటకుఁ బ్రయత్నించి నట్లున్నది. జైనులీ వ్యుత్పత్తిని బ్రాహ్మణులనుండియే సంగ్రహించి రని నా యనుమానము. ఎట్లున్నను - నిర్గ్రంధ శ్రమణులు జాతి భేదము నంగీకరించి రనుటకు పై నిరుక్తి యొక ప్రమాణము.

## హీనజాతులు జైన సంఘములోఁ జేరుట కనంగీకారము

"బాలే - బుద్ధే - నపుంసేయ - కీవే - జడ్డేయ వాహియే
తేణే రాయాని గారీయ ఉమ్మత్తేయ అదంసణే
దాసే, దుట్ఠేయ, మూఢేయ, అణత్తే జుంగియే ఇయ
ఉబద్ధ యేచ భయయే, సేహ నిప్ఫేడియా ఇయ."

1. బాలుఁడు 2. వృద్ధుఁడు 3. నపుంసకుఁడు 4. క్లీబుఁడు 5. జడుఁడు వ్యాధితుఁడు 7. చోరుఁడు 8. రాజాపరాధి 9. పిచ్చివాఁడు 10. అకర్మనుఁడు 11. దాసుఁడు 12. దుష్టుఁడు 13. మూఢుఁడు 14: ఋణార్తుఁడు 15. జుంగితుఁడు 16. ఖైది 17. భయార్తుఁడు 18. ఒకసారి బరుగెత్తిపోయి మరల వచ్చి చేరిన శిష్యుఁడు- యీ పదునెనిమిదిమందికి - జైన సాధుసంఘమున జేరుట కధికారములేదు. పై వారిలో జాలమందిని బౌద్ధసంఘము గూడ నిషేధించెను. ఈ రెండుసంఘములందును నేర్పరుపఁబడిన ప్రకాశవిధి (ఉపసంహారణము)ని సరిపోల్చిచూచుటచే చరిత్ర కెంతయో యుపయోగమున్నది. కాని - యది యప్రస్తుతము. పై జెప్పిన పట్టికలోఁ బదునైనవవాఁడైన జుంగితుని గుఱించిన టీక యిట్లున్నది.

* "తథాజాతి - కర్మ - శరీరాదిభిర్దూషితో జుంగితః।
తత్రమాతంగ - కోలిక - బరుడ - సూచిక - ఛింపాదయోఽ
స్పృశ్యా జాతిజుంగితాః। స్పృశ్యాఅపిస్త్రీ - మయూర -
కుక్కుట - శుకాదిపోషకావంశవరత్రారోహణ - నఖ
ప్రక్షాలన - సౌకరికత్వ - వాగురికత్వాది నిందితకర్మకారి
ణః కర్మజుంగితాః । కరచరణ వర్జితాః పంగు -
కుబ్జ - వామనక - కాణప్రభృతయః శరీరజుంగితాః ।
తేఽపి న దీక్షార్హా లోకేఽవర్ణవాదసంభవాత్"

* బౌద్ధభిక్షు సంఘమునందు 'ప్రవేశవిధి' ధర్మముల వివరములు గావలసినచో — చూ: 'బుద్ధధర్మ అణిసంఘ' పు: 56-60; 'బౌద్ధసంఘాచా పరిచయ' పు; 17-19.

ఇట్టు జాతి - కర్మ - శరీరాదులతో దూషితులు జుంగితులు. వారిలో - నీడిగలు, మేదరులు, దర్జీ వారు, రంగారీ వారు, వీరు జాతి జుంగితులు. స్పృశ్యజాతి యందున్నను - స్త్రీజుంగితమే. నెమళ్లు, కోళ్లు, చిలుకలు, మొదలైనవి బెంచువారు - దొమ్మరవారు. గోరులు గడుగువారు, బందులు బెంచువారు, వేటగాండ్రు, యిత్యాది నింద్యకర్ములు కర్మజుంగితులు. కాలుసేతులులేనివారు, పంగులు, కుబ్జులు, వామనకులు, కాణప్రభృతులు శరీరజుంగితులు. వీరందరును దీక్షార్హులు గారు. వారికి దీక్ష యొసఁగినచో లోకమున నపవాదు గలుగుట కవకాశమున్నది. *

బౌద్ధభిక్షువులలోఁ జేరుటకు జాతి యేమాత్ర మడ్డు గాదు. నింద్యకర్మయొనర్చువాఁడైనను - నా పనివదలినచో వాఁడు దీక్షార్హుఁడే.

## ఇతరదేశస్థులకు హిందూసమాజమున ప్రవేశము

ఇతరము లెట్లున్నను - బౌద్ధ - జైనములు రెండును- 'బరాయి' దేశస్థులను హిందూసమాజములోఁ గలిపికొనుట

---

* ఈ యుద్ధృతికిబీజము 'ప్రవచనసారోద్ధారము' ద్వారము 107 నుండి, ఈ భాగమును వెదకియిచ్చిన యుపకారకులు శ్రీ జనవిజయసూరి గారు, వారికి నా కృతజ్ఞత.

దీని విషయమై యెక్కువ విషయములు గావలసినచో డా॥ D. R. భండార్కర్ మహాశయుల 'Indian Antiquary, Vol. 40, January 1911, PP 7-37" లోనున్న The Foreign elements in the Indian Population" అను వ్యాసమును జదువఁ బ్రార్థింతులు. విశేషించి ౨౮-౩౬ పుటలలోని విషయము ముఖ్యముగ గమనింపఁదగినది,

కెంతయో శ్రమించినవి. గ్రీకులు, శకులు, హూణులు, మాళవ, ఘూర్జరులు - మొదలౌ విదేశీయజాతులు భారత దేశమునకు వచ్చిరి. వారి కుదారములైన జైన - బౌద్ధ ధర్మములు ద్వారములు తెఱచినవి. ఆ వాకిలిలో వారు హిందూమతమున బ్రవేశించిరి. తొలుత - వారు జైనులో - బౌద్ధులో యగుదురు. తరువాత వారి రుచి ననుసరించి - చాతుర్వర్ణ్యములలో నేదియే నొక వర్ణము నాశ్రయింతురు. ఒకనే గోత్రమందుఁ గొందఱు క్షత్రియులు - గొందఱు బ్రాహ్మణులు - గొందఱు శూద్రులు, వారివారి భావములనుబట్టి వసించున ట్లుదాహరణము లున్నవి,

## అస్పృశ్యతయొక్క పరిణామము

ఇతర దేశీయు లెంతగా హిందూసమాజమున బ్రవేశించినను - నస్పృశ్యుల పరిస్థితి మాత్రము జక్కఁబడ నేలేదు. జైన బౌద్ధములు రెండును-నిజాతుల నుపేక్షించెను. దీనితోఁ గ్రమక్రమముగా వీనిపై నితరుల కేహ్యభావము బెరిగెను. కారణము లేకయే వీరి నితరులు మోసగించిరి. దాని దుష్ట పరిణామమును హిందూసమాజమంతయు ననుభవించెను. బౌద్ధ - జైనులుగూడ ననుభవింపక దీర లేదు.

జాతిభేద వృక్షము దృఢమూలమైన కొలఁదియు - జైన - బౌద్ధులను యితర జాతులు దేలికగఁ జూచెను. కారణము - వారు స్వజాతులయందును భిక్షుగహించుట. జైను లస్పృశ్యులను జేర్చుకొనుటకు నిరాకరించి రేగాని - శూద్రులను నిషేధించినట్లు లేదు. బౌద్ధధునందుఁ గడపటి వరకు జాతిభేదపు గోడపడయే గానరాదు. కాని - రాగ రాగ

సమాజమున జాతిభేదము బలపడెను. బ్రాహ్మణులు-శంబూక కథవంటి ఎన్నియో యల్లిరి. అల్లి - లోకప్రియములైన పురాణములలో వానిని దూర్చిరి. పోనుపోను బౌద్ధ శ్రమణులు బూర్తిగ నశించిరి. జైనశ్రమణులు [illegible] కొంత ప్రాణములతో బ్రతికినారు. సమాజ సంశోధన మనెడు పెద్దపని వారిచేతఁగాక పోయినది.

## ఇతరదేశములలో భిక్షుసంఘమొనర్చిన పరిశ్రమ

భారతదేశమం దెదిగిన జాతిభేద సమస్య యెదుట బౌద్ధభిక్షు సంఘము నిలుకడగ నిలువలేక పోయెను. కాని బయటి దేశములలో వా రొనర్చిన పరిశ్రమ గొప్పది. దక్షిణమున సింహళము - తూర్పున బ్రహ్మదేశమునుండి జపానువరకు - నుత్తరమున టిబెట్టు, మంగోలియా దేశములు, బుద్ధసంఘమున కాశ్రయమైనవి. ఆ సమాజములను బౌద్ధ సంస్కృతి యెంతయో గొప్పవారిగ నొనర్చెను. హిమాలయములనుండి - దక్షిణమున సముద్రాంతము [illegible] గ్రామ గ్రామమున కేగి [illegible] సంస్కృతిని [illegible]. [illegible] సంస్కృతియు - బౌద్ధము [illegible] బుద్ధుని యుపదేశములలో నున్నవే. [illegible] దేశములలోఁగూడ నడచినవి. అనంతరము [illegible] ప్రచారమైనది. బుద్ధుని జాతి [illegible] గను పరచియుండినను సంత గొప్ప పని [illegible]గదా! జాతిభేద మనెడు రోగము [illegible] భారతదేశము. మన నష్టము 'బాహ్య ఆసియా' యనెడు దేశములకు లాభమైనది.

# పదునొకండవ ప్రకరణము

# మాంసాహారము

## బుద్ధభగవానుని మాంసాహారము

పరినిర్వాణ దివసమందు బుద్ధభగవానుఁడు 'చుందుఁ'డను గమ్మరియొక్క యింటియందుఁ బంది మాంసమును భక్షించెను. ఈనాఁడుగూడ బౌద్ధభిక్షువులు గొద్దిగనో - గొప్పగానో మాంసమును సేవింతురు. 'అహింసయే బరమ ధర్మ'మని చాటు బుద్ధుఁడు - నతని యనుయాయులు- మాంసాహారము నెందుకు నిషేధింపరైరి? ఈ ప్రశ్న జర్చింపఁ దగినదే.

బుద్ధుఁడు బరినిర్వాణ దినమందుఁ దిన్న పదార్థమునకు 'సూకర మద్దవ' మని పేరు. ఈ శబ్దముపై బుద్ధ ఘోషాచార్యు లొనర్చిన టీక యిది.

"సూకర మద్దవం తి - నాతితరుణస్స - నాతి జిణ్ణస్స ఏక జేట్ఠక సూకరస్స-పవత్తమంసం. తం కిర ముదుంచేవ పినిద్ధం చ హోతి, తం పటియాదాపేత్వా - సాధుకం పచాపేత్వా, తి, అత్థో. ఏకే భణంతి; సూకరమద్దవం తి, పన, ముదుఓదనస్స, పంచగోరస యూస, పాచన విధానస్స నామ మేతం, యథా గవపానం నామ పాక నామం తి, కేచిభణం తి సూరకమద్ద వం నామ రసాయన విధి, తం పన రసాయనత్థే ఆగచ్ఛతి; తం చుందేన భగవతో పరినిబ్బానం న భవేయ్యా తి రసాయనం పటియత్తం తి"

"సూకర మద్దన మనఁగా - ముసలిదిగాక - కేవలము జిఱుతయుగాక నడిమి వయస్సునను నున్న పందియొక్క మాంసము. ఆ మాంసము మృదువుగ-స్నిగ్ధముగ నుండును.

దానిని నిపుణముగ వండి - చేసిన పదార్థమునకును సూకర మద్దత మనియే పేరు. కొందఱు బంచగోరసములచేఁ దయారు జేయఁబడిన మృదువయిన యన్నమునకు 'సూకరమద్దవము'ను పేరు గలదందురు. గవపాన మనునది యొక విశిష్ట పక్వాన్నమునకుఁ బేరున్నదిగదా! కొంద ఱిది యొక రసాయన వాచక మందురు. భగవంతుఁడు బరినిర్వాణము జెందదాదని 'చుందుఁడా'నాఁడీ రసాయనము నొసఁగెనట!

పై టీకలో 'సూకర మద్దవ' శబ్దమునకు ముఖ్యార్థము పందిమాంసమనియే జెప్పఁబడ్డది. అయినను నీ యర్థము సరియేనా? యనుటలో బుద్ధ ఘోషాచార్యులకు విశ్వాసము లేదు. ఎందుకనఁగా - బుద్ధఘోషుని కాలమునకు మఱి రెండర్థము లీ శబ్దమున కేర్పడినవి. బుద్ధఘోషుఁడు జెప్పిన మూఁడర్థములే గాక క్రొత్తవి రెండర్థములు ఉదాన అట్ఠకథలో నున్నవి. అవి యివి.

"కేచి పన సూకరమద్దవంతి న సూకరమంసం - సూకరేహి మద్దిత వంసకళీరో తి వదంతి. అఞ్ఞే సూకరేహి మద్దితపదేసే జాతం అహిచ్ఛత్తకంతి"

"ఈ పదమునకుఁ బంది మాంసమని యర్థముగాదు. మఱి పందుల చేతఁ ద్రొక్కఁబడిన వేణువు యొక్క యగ్ర మని గొందఱి యర్థము. మఱి, యితరులు బందులచేఁ ద్రొక్కఁబడిన చోటఁ బుట్టిన పుట్ట గొడుగని యందురు."

ఈ రీతి 'సూకర మద్దవ' శబ్దమున కర్థము జెప్పుటలో ననేకాభిప్రాయము లున్నవి. కాని బుద్ధభగవానుఁడు భుజించినది బంది మాంస మనుటకు 'అంగుత్తర నికాయము'లోని

పంచక నిపాత'మున దీనిగాథ కలదు. ఉగ్గ గణపతి యిట్లనును

"మనాపం మే భంతే సంపన్నవర సూకర మంసం తం మే భగవా పటిగ్గణ్హాతు అనుకంపం ఉపాదాయా తి. పటిగ్గహేసి భగవా అనుకంపం ఉపాదాయాతి"

"భదంతా! ఉత్తమమైన సూకర మాంసము నుత్కృష్టముగ వండి తెచ్చితిని. నా యందు దయ యుంచి దీనిని స్వీకరింపుఁడు" భగవానుఁడు దాసని గరుణించి యా మాంసమును స్వీకరించెను.

## జైన శ్రమణుల యొక్క మాంసాహారము

ఇతర శ్రమణ సంప్రదాయములలోఁ బ్రసిద్ధులైన దపస్వులు జైనులే. వారి సంప్రదాయ మందును శ్రమణులు మాంసమును దినుచుండిరి. ఈ విషయము 'ఆచారాంగ సూత్రము'లో నిట్లు గలదు.

"సే భిఖ్ఖూవా భిఖ్ఖుణీవా సెజ్జం పుణ జాణెజ్జా బహు అట్ఠియం మంసంవా, మచ్ఛంవా బహు కంటకం, అస్మిం ఖలుపడిగాహి తంసి అప్పేసియా భోయణ జాఏ బహు ఉజ్ఝియ ధమ్మిఏ తహప్పగారం బహు అట్ఠియంవా మంసం, మచ్ఛంవా బహుకంటకం, లాభేవి సంతే ణో పడిగాహేజ్జా. సే భిక్ఖూవా భిక్ఖుణీవా గాహావయికులం పిండవాయపడియా ఏ అణుపవిట్ఠే సమాణే పరో బహుఅట్ఠిఏణ మంసేణ మచ్ఛేణ ఉవణి మంతేజ్జా. అవుసంతో సమణా అభికంఖసి బహుఅట్ఠియం మంసం పడిగాహేత్తఏ? ఏయప్పగారం ణిగ్ఘోసం సోచ్చా ణిసమ్మసే పువ్వమేవ ఆలో ఏజ్జా అఉసోత్తివా భఇణిత్తివా ణోఖలుమే కప్పఇ బహుఅట్ఠియం మంసం పడిగాహేత్తఏ, అభికంఖసిసే దాఉం జావఇయం తావఇయం పొగ్గలం దల

యాహిమా అట్ఠియాఇం. సే సేవం వదంతస్సపరో అభిహట్టు అంతో పడిగ్గహగంసి బహుఅట్ఠియం మంసం పరిభాఏత్తణి హట్టుదలఏజ్జా, తహప్పగారం పడిగ్గహణం పరహత్థంసివా పరపాయంసివా అఫాసుయం అణేసి-ణిజ్జం లాభే వినంతే ణో పడిగాహేజ్జా. సేఆహచ్చ పడిగాహిఏ పియాతిం ణోహిత్తి వఏజ్జా, అణోవత్తివఏజ్జా. సేత్తమాయాయ ఏగంత మవక్క-మేజ్జా. అతక్క-మేత్తా అహే ఆ రామంసివా ఆహే ఉవస్సయం సివా అప్పంథఏ జావసంతాణఏ మంసగం మచ్ఛగం భోచ్చా అట్ఠియా ఇం కంటఏ గహాయసేత్త మాయాఏ ఏగంత మవక్క-మేజ్జా. అవక్క-మేత్తా అహే ఆ రామంసివా అహే ఉ వస్సయంసివా అప్పండఏ జావ సంతాణఏ మంసగం మచ్ఛగం భోచ్చా అట్ఠియాఇం కంటఏ గహాయ సేత్త మాయాఏ ఏగంత మవక్క-మేజ్జా అవక్క-మేత్తా అహేజ్ఝా మథం డిలంసివా అట్ఠిరాసింసివా కిట్ఠిరాసింసివా తుసరాసింసివా గోమయరా సింసివా అణ్ణయ రసింసి వా తహప్పగా రంసి థండిలంసి పడిలేహియ పడిలేహియ పమజ్జియ పమజ్జియ తఓసంజయామేవ పమజ్జియ పమజ్జియ పరివేజ్జా"

"ఎక్కువ యెముకలున్న మాంసపదార్థముగాని-బుష్టల ముగ ముండ్లున్న మత్స్యములుగాని భిక్ష దొరకినచో-దాని యం దాహారపదార్థములు దక్కువయు - బారవేయ వలసిన దెక్కువయు నుండుననీ, భిక్షువు గాని - భిక్షుణిగాని దెలియ వలెను. ఎవండైన బుష్కలముగ నెమ్ములుగల మాంసము గాని - యెక్కువ ముండ్లుగల చేపలుగాని భిక్ష యొసంగినచో భిక్షుకీ - భిక్షువులు గైకొనరాదు. ఎవరింటి కైన బిచ్చము నకు వెళ్ళినపు 'డెక్కువ యెమ్ములు గల మాంస మున్నది, ముండ్లెక్కువ గల మత్స్యము లున్నవి గావలెనా?' యని గృహస్థు డడిగిన 'ఆయుష్మంతుండా! నాకు వలద'న్ని

బలుక వలెను. గృహిణి యైనచోఁ జెల్లెలా! యని సంబోధింప వలెను. నీ కిచ్ఛ యున్నచో నెముకలు లేని మాంసమును గొంత పెట్టుమని యడుగ వలెను. ఇట్లు పలికిన మీఁదఁ గూడ గృహస్థుఁడు నిర్బంధముగ నెముకలు గల మాంసము బెట్ట వచ్చినచో దానిని గ్రహింపరాదు. బలవంతముగఁ బాత్రలో వేసినచో దానిని దీసికొని పోయి యారామములోనో - లేక - యుపాశ్రయ మందో-యల్ప ప్రాణులు దిరుగాడని చోట గూర్చొని - దానిలోని మాంసమును తిని-యెముకలు గాని-ముండ్లుగాని జాగ్రత్తగ దీసికొని పోవలెను. అట్లు తీసుకొని పోయి వానిని గాల్చబడిన నేలల యందో-యెముకల రాశిలోనో-మడ్డి నిండిన లోహఖండముల యొక్క రాశి పైననో - తుషరాశిపైననో-యెండిన పేడ పైననో వేయవలెను. ఆ వేయుట గూడ- నా రాశి పైన జౌకముగ గొంత జో టొనర్చి సంయమ పూర్వకముగ నాయెముకలు-మొదలైనవి జెదరకుండు నట్లు పోయవలెను."

ఈ యర్థమే 'దశ వైకాలిక సూత్ర'మందలి యీ క్రింది గాథలోఁ గూడ సంక్షేపముగఁ దెల్పఁ బడినది.

"బహు అట్ఠియం పుగ్గలం అతిమిసం వా బహు కంటయం।
అచ్ఛియం తిందుయం బిల్లం, ఉచ్ఛుఖండం వ సింబలిం॥
అప్పే సిఆ భో అణజ్జాఏ బహు ఉజ్ఝియ ధమ్మియం।
దింతిఅం పడియాఇక్ఖే న మే కప్పఈ తారిసం॥"

"యెక్కువ యెముకలున్న మాంసము - యెక్కువ ముండ్లున్న మాంసము - నస్థి వృక్షము యొక్క ఫలము-బిల్వ ఫలము- జెఱకు-శాల్మలి మొదలైన పదార్థములు నేను

దీసి కొనను. ఎందు కనఁగా వీనిలో దినెడు భాగమున కన్న బారవేసెడు భాగ మెక్కువ" యని భిక్షుకుఁడు బలుక వలెను.

## మాంసాహారమును గూర్చి ప్రసిద్ధ జైన సాధుల యభిప్రాయము

గుజరాతు విద్యాపీఠములో 'బురాతత్త్వమందిర' మని యొక శాఖగలదు. అది బురాతత్త్వమనెడు త్రైమాసిక పత్రిక నొకదానిని బ్రకటించును. 1925 వ సంవత్సరమందలి యొక పత్రికలో నేను బ్రస్తుత విషయముపై నొక వ్యాసము వ్రాసితిని. దానియందు రెండు బ్రతీతముల నుదాహరించితిని. ఆ రెండుల్లేఖములును – నేను స్వయముగఁ బరీక్షించి గ్రహించినవికావు మాంసాహారమును గురించి ప్రశ్నింపగాఁ బ్రసిద్ధులైన జైన పండితులే కొందరు నా కా యుల్లేఖముల నొసఁగిరి. వానిని నే నావ్యాసమం దుపయోగ పఱచికొంటిని.

నా వ్యాసము గడ్డకువచ్చిన వెంటనే 'యహమదాబాదు'లోని జైనులలో నొక పెద్దకలకలము బయలుదేరినది. నేను జైన ధర్మమును నాశనము జేయుట కిట్టివ్రాతలు వ్రాయుచున్నానని, వారు నాపై నొక యభియోగమును 'బురాతత్త్వ' నిర్వాహకులకు బంపిరి. ఆ నిర్వాహకు లావిషయమును గురించి నన్ను విచారింపనే లేదు. వారు వారే సమాధాన పడినారు. ఆ యభియోగముతో నాకే బాధయు గలుగ లేదు.

అపు 'డహామదాబాదు' నందు రతన చంద్రుండను ప్రసిద్ధజైన పండితుండుండెను. అతని గురువు వయోవృద్ధులైన గులాబచంద్రులు. వీ రిద్దరును గొప్ప పండితులే. రతనచంద్రుండు శతావధానిగూడ. ఒకనాడు నేనొక జైన పండితుని వెంటబెట్టుకొని వారిదర్శనమున కేగితిని. అప్పటికి సాయంకాలమైనది. రాత్రులలో జైనులు - దమచెంత దీప ముంచికొనరు. అందుచే వా రిర్వురి ముఖములును మాకు స్పష్టముగఁ గనపడలేదు. నా వెంటవచ్చిన జైనపండితుఁడు నన్ను వారికిఁ బరిచయముఁ జేసినాఁడు. అపుడు రతనచంద్రు లనిరి: "మీ కీర్తి మే మింతకుముందు విన్నాము. కాని- మీరు, ప్రాచీన జైనసాధువులు - మాంసాహార మొనర్చు వారని మీ వ్యాసమున వ్రాసితిరి. మా ధర్మము నిట్లపహాల పాలు సేయుట మీకు న్యాయముగాదు"

నేను వారి కిట్లు బదులిచ్చితిని: "పూర్వశ్రమణసంప్రదాయములలో నేటికి మిగిలినవి రెండే. బౌద్ధ - జైనులు. ఈ రెంటిపై నాకెంత భక్తి - శ్రద్ధలున్నవో లోకమెఱిఁగిన విషయమే. కాని పరిశోధన యొనర్చునపుడు - మన కున్న భక్తి - లేక ప్రేమ సత్యమున కడ్డురాదుగదా! సత్యమును జెప్పినచో నే సంప్రదాయమునకును నష్టము గలుగదని నాయూహ. సత్యము ప్రకటించుట సంశోధకుని కర్తవ్యమనుటయు నాతలంపు".

వృద్ధులైన గులాబచంద్రులు కొంత దూరమున గూర్చుండి యుండిరి. వారచ్చటనుండియే శిష్యునితో నన్నారు. "ఈగృహస్థుండు దా నుదహరించిన యుల్లేఖముల

కొసంగిన యర్థము సరియైనదే. ఆధునికటీకాకారుల యర్థము సరిగాదు. ఆ రెండు ల్లేఖము లేగాదు. ఇంకను ననేకాధారములతో జైనసాధువులు మాంసము దినుచుండిరని స్థాపింపవచ్చును. దీనిలోఁ దప్పు లేదు."

ఇట్లు బలికి వారు పై విషయమును సమర్థించుచు - జైనసూత్రము లుదాహరింప మొదలిడిరి. కాని రతనచంద్రులు ప్రసంగము మార్చివేసి, యీ చర్చను పైని సాగనీయలేదు. గులాబుచంద్రు లిచ్చిన యుదాహరణ లేవి? యను విషయము నిచట విపులీకరించుట లేదు. ఈ విషయముపై నింత విస్తరణ మిట నప్రస్తుతమని నా యూహ.

## మాంసాహారమును గుఱించి

## మహావీరస్వామి యభిప్రాయము

మహావీరాస్వామియే మాంస భక్షణము సేయుచుండెననుటకుఁ జక్కని యాధారము లున్నవి. ప్రస్థాన మనెడు పత్రికయందు - గడచిన కార్తిక మాసమున (సంవత్ 1995. 14 వర్ష. 1. అం) శ్రీయుతులు - గోపాలదాస జీవాభాయి పటేలు మహాశయులు 'శ్రీమహావీర స్వామి యొక్క మాంసాహారము' అనునొక వ్యాసమును వ్రాసిరి. దాని నుండి మన మిట సంక్షేపముగ గ్రహింతము గాక!

మహావీరస్వామి శ్రావస్తియం దుండెను. మక్ఖలి గోసాలుఁడు గూడ నచటికి వచ్చెను. వారిద్దఱును - గ్రమక్రమముగఁ గటువిమర్శ లారంభించికొన్నారు. కడకు వారు

బరస్పరము శాపములకు దిగిరి. మఖ్ఖలిగోసాలుఁడు "నా తపో బలమున నీ వేడుమాసములకుఁ బిత్త జ్వరముతో మరణింతువుగాక !" యని మహావీరునకు శాప మిచ్చెను. మహావీరుఁడు "నీ వేడవనాటి రాత్రి పిత్త జ్వరముచే మరణింతువని" ప్రతిశాప మిచ్చినాఁడు గోసాలుఁ డట్లే యేడవనాఁడు మరణించెను. గోసాలుని ప్రభావముచేత మహావీరున కమిత దాహ మెత్తినది. రక్తభేదు లారంభమైనవి.

అపుడు మహావీరుఁడు సింహానాముఁడైన దన శిష్యుని బిలిచి "ఓయీ! నీవు 'మేండిక' గ్రామమునకు బొమ్ము. అక్కడ 'రేవతి' యను నొక స్త్రీ యుండును. ఆమె నా కొఱకు రెండు పావురములను వండి పంపించును. అవి మహావీరునకు వలదని చెప్పుము. నల్లపిల్లి చేతఁ జంపఁబడిన కోడి యొక్క మాంసమును దయారు చేసి యిమ్మనుము! పొమ్మ"ని బంపించినాఁడట !

శ్రీయుత గోసాలదాస మహాశయులు దమ వ్యాసమునం దీ విషయమునకు 'పాలీభాష'లోని మూలసూత్రము లివ్వలేదు కేవలము వాని యర్థముమాత్రమే వ్రాసిరి. నే నా మూలము నీ క్రింద నిచ్చుచున్నాను.

"తం గచ్ఛహ ఇం తుమం సీహా, మేండియగామం నగరం రేవతీయే గాహావతి ణీఏ గిహే తత్థ ణం రేవతీఏ గాహావఇణీఏ మమం అట్ఠాఏ దువే కవోయ సరీరా ఉవక్ఖడియా తేహి నో అట్ఠో। అత్థి సే అన్నే పరియాసియే మజ్జారకడయే కుక్కుడమంసయే తం ఆహారాహియే ఏణం అట్ఠో"

అల్ప స్వల్పముగ నర్ధమాగధి వచ్చిన వారి కైనను శ్రీ గోపాల మహాశయులు వ్రాసిన యర్థము పై వాక్యములకు సరియైన దనిపించును. కాని యీ నడుమ గొందఱు జైన పండితులు వారికి విరుద్ధముగ నేవో యదికి - యదుకని టీక లల్లుచున్నారు.*

## బౌద్ధ - జైన శ్రమణులలో మాంసాహారములోని భేదము

మాంసాహారమును గూర్చి బౌద్ధ - జైనుల యభిప్రాయము లెట్టివి? యను విషయము విమర్శించుటలో మొదలు - గోపాలదాసుగారి వాక్యములే యుదహరించుట మంచిది. వైశాలి యందు సింహ సేనాపతి నిర్గ్రంథోపాసకుఁడు. ఇతని విషయ మెనిమిదవ ప్రకరణముననే వచ్చినది గదా! బుద్ధ బోధలు విన్న తరువాత సింహ సేనాపతి బుద్ధోపాసకుఁ డయ్యెను. అతఁడు బుద్ధుని భిక్షు సంఘమును గృహమున కాహ్వానించి వారికి సంతర్పణ యొసఁగెను. ఇది నిర్గ్రంథులకు రుచింపలేదు. వారు సింహ సేనాపతి యొక్క పశువును జంపి గౌతమునకు - భిక్షు సంఘమునకు నాహారముగ బెట్టె ననియు, నీ విషయము దెలిసి - తెలిసి బుద్ధుఁ డాభిక్షను స్వీకరించె ననియు బ్రచారము సేసిరి. ఈ విషయము వారినోట వీరినోటఁబడి సింహసేనాపతికి దెలిసెను. అపుడత "డీప్రచారమున కర్థము లేదు. బుద్ధునిపై యపనిందలు మోపుట నిర్గ్రంథులకు సంతోషము. అందుచే వారిట్టి

---

* ఈ యత్నము 1939వ సంవత్సరమందు;

వల్లమాలిన పసు లొనర్తురు. తెలిసి తెలిసి యొక పశువుసుఁ జంపి యతిథులకుఁ బెట్టునంత యవివేకి సింహసేనాపతి గాఁడ”ని జవా బిచ్చెనట !

ఇట్టిదే యొక సంఘటనము ‘మజ్ఝిమనికాయము’లోని ‘జీవక సుత్తము’న వర్ణింపఁ బడినది. దాని వివర మిది. ఒక సారి – బుద్ధభగవానుఁడు రాజగృహమం దుండెను. ఆయన జీవక కౌమార భృత్యుని ‘యామ్రవనమం’ దుండెడువాఁడు. అపుడు జీవకుఁడు భగవంతుని దరిసి యభినందించి “భదంతా! మిమ్ముద్దేశించి చంపఁ బడిన ప్రాణిమాంసముతో వండిన యన్నమును దాము భుజించిన ట్లపవాదు వచ్చినది. ఇది నిజమేనా !” యని ప్రశ్నించెను. భగవానుఁడు బదులు జెప్పినాఁడు. “ఈ నింద కేవల మసత్యము. నన్నుద్దేశించి ప్రాణి వధ సేయుట జూచినను – విన్నను లేక, యనుమా నించినను – దానిని దాకను. అది నిషిద్ధమని నా యభి ప్రాయము.”

పై వృత్తాంతముతో జైనులు బుద్ధునిపై వేసిన యప నింద యెట్టిదో మన కర్థమగును. ఏ గృహస్థుఁడైనను బుద్ధుని గృహమున కామంత్రించి మాంసాహారము నొసఁగినచో– నా వంట – బుద్ధుని యుద్దేశించి యొనర్చినదే యని జైనులు దలఁచిరి. అట్లు ప్రచారము లొనర్చిరి. ఇఁక జైను లందమా! వా రామంత్రణమును స్వీకరించుటయే లేదు. దాగులలోఁ బోవుచు – బిచ్చమడుగుదురు. అపు డా యన్నములో మాంసము దొరకినచో దానిని భుజింతురట!

కొందఱు తపస్వులు మాంసమునువర్జించుచుండిరి

బుద్ధునికాలమందుఁ గొందఱు దపస్వులు మాంసాహారమును వర్జించిరి. అట్టియొక తపస్వికిఁ - గాశ్యపబుద్ధునకు నైన సంవాదము సుత్తనిపాతములోని (24) వ 'ఆమగంధ సుత్తము'న వచ్చును. దాని భాషాంతర మిది.

1. (తిష్యతాపసుఁడు) శ్యామాకములు - తృణధాన్యములు - చింగూళకములు - చీనకములు - జెట్లయాకులు - గందమూలములు - ఫలములు - ధర్మానుసారముగఁ జిక్కుచున్నవి. వానితోడనే నిర్వాహము జరుగుచుండగా - నితర పదార్థములకై వ్యర్థముగ నంగలార్తురు.

2. కాశ్యపా! ఇతరులు వండిన భక్ష్యములు - జక్కఁగ వండిన తండులాన్నము - స్వీకరించు నీవు 'ఆమగంధము' (అమేధ్యపదార్థము) భుజించుచున్నావే!

3. ఓయీ! బ్రహ్మబంధూ! పక్షులయొక్క మాంసముతో మిళితమైన యన్నమును దినునీవు మా కామగంధము గిట్టదని జెప్పెదవు. నీ యూహలో నామగంధమను మాట కర్థమేమో! మాకు దెలియుటలేదు.

4. (కాశ్యపబుద్ధుఁడు) ప్రాణఘాతము, వధ, ఛేదము, బంధనము, దొంగతనము, గల్లలాడుట, మోసమొనర్చుట, దోచుట, జారణ, మారణాదికముల యభ్యాసము - వ్యభిచారము - ఇవి యామగంధములు. మాంసభోజనముగాదు.

5. స్త్రీ విషయమున సంయమము లేకుండుట - జిహ్వా లోలుపత-యశుచి కర్మములొనర్చుట -నాస్తికత-విషమత- దుర్నీతి - ఇవి యామగంధములు. మాంస భోజనముగాదు.

6. రూక్షుఁడు - దారుణుఁడు - బరనిందకుఁడు - మిత్ర ద్రోహి - నిర్దయుఁడు - నతిమానముగలవాఁడు - కృపణుఁడు- లోభి వీరిపను లామగంధములు మాంసము దినుట గాదు.

7. క్రోధము _ మదము - కఠోరత - విరోధము - మాయ - ఈర్ష్య - వృథాలాపన - మానాభిమానములు - దుర్జనులసంగతి - యివి యామగంధములు. మాంసము దినుటగాదు.

8. పాపి - యప్పునెగవేయువాఁడు - కుట్రదారుఁడు - లంచముగైకొను నుద్యోగి- వీరికర్మ లామగంధములు. ఇహ లోకమందుఁ గల్మష ముత్పన్నము సేయు నరాధముఁల పను లామగంధములు. మాంసభోజనముగాదు.

9. భూతదయాహీనుఁడు - యితరులదోచి యుపద్ర వించువాఁడు - భయంకరుఁడు - కలహశీలుఁడు - నితరుల ననాదరించువాఁడు వీరికర్మ లామగంధములు. మాంసభోజనముగాదు.

10. ఇట్టి కర్మలయం దాసక్తులు - బరుల విరోధించు వారు - ఘాతమొనర్చువారు - నిరంతరము దుష్టకర్మలయం దాసక్తులు - వీరి వృత్తులు పాపములు. మాంసభోజనము గాదు.

11. మత్స్య మాంసముల వర్జించుట- దిగంబరత్వము- ముండనము_జటలు బెంచికొనుట - భస్మధారణము- యజన చర్మధారణము - నగ్నిహోత్రముల యుపాసన - యింకను దక్షిణ కర్మలు - మంత్రాహుతులు - యజ్ఞములు - శీతోష్ణ సేవనము తోడి తపస్సులు మొదలైనవి-గుశంకలు విడువని మానవుని బవిత్ర మొనర్పలేవు.

12 ఇంద్రియముల సంయమించికొని - యింద్రియ ముల గుర్తించి వర్తించువాఁడు - ధర్మమున నడచువాఁడు- ఆర్జవ - మార్దవములందు సంతోషమును భావించువాఁడు - సంగాతీతుఁడు - సర్వదుఃఖాతిగుఁడు నైన ధీరపురుషుఁడు - దృష్టశ్రుతములైన పదార్థములందుఁ దగులొ్కనఁడు.

13. ఈ యర్థమును భగవంతుఁడు మాటిమాటికిని జెప్పెను. బ్రాహ్మణుఁ డనుకొన్నాఁడు. 'ఈ యర్థము నిరా మగంధుఁడు - ననాసక్తుఁడు - నదమ్యముని యగు నతనిచే రమ్యగాథలలోఁ జెప్పఁబడినది.'

14. నిరామగంధములై - సర్వదుఃఖములు నాశన మొనర్చు బుద్ధుని సుభాషితములు విని - తాపసుఁడు నమ్రుఁడై యతని పాదములపైఁ బడెను. అపుడే బ్రాహ్మణ తాపసుఁడు సన్యసించినాఁడు.

## శ్రమణు లొనర్చిన మాంసాహార సమర్థన

ఈ సుత్తములు జాల ప్రాచీనములు. కాని - వీనిని కాశ్యప బుద్ధుడే యుపదేశించె ననుటకు బలమైన యాధార ములు లేవు. బుద్ధసమకాలికులైన భిక్షులు మాంసాహారము

నీ రీతిగ సమర్థించుచుండిరని యూహించుటకు మాత్రమే యది బనికివచ్చును.

ఈ సూత్రమున దపశ్చర్య నిరర్థకముగఁ బరిగణింపఁ బడెను. ఇది జైన శ్రమణులకు రుచింపలేదు. ఎందుకనఁగా - వారు మాటిమాటికిఁ దపశ్చర్య యొనర్చుచుండిరి. కాని - బౌద్ధులవలెనే - మాంసాహారమును వారును సమర్థించెడు వారు. ఎందుకనఁగా - ప్రాచీనులైన మును లడవులలో నివసించుచుండిరి. వారికి గాయగసురులే యాహారము. వీ రటవీ వాసమును వర్జించిరి. లోకులొసంగెడు భిక్ష వీరికి ముఖ్యావలంబనము. ఆ కాలమందు నిర్మాంస భిక్ష దొరకుట జాల కష్టము. బ్రాహ్మణులు యజ్ఞములు సేసి వేలకొలఁది ప్రాణుల వధించి - వాని మాంసము జుట్టుబక్కల బంచుచుండిరి. జనులు దేవతలకు బలి యొసఁగి యా మాంసమును దినెడు వారు. ఇంతేగాక 'కటికలు' మొదలైన వా రంగళ్ళలో మాంసము నమ్ముచుండిరి. ఈ స్థితులలో - బక్కాన్న భిక్షపై నాధారపడు శ్రమణులకు మాంస మిశ్రితముగాని యన్న మెక్కడ దొఱకును? జైనుల సిద్ధాంతము నందు 'పృథ్వీకాయ - అప్ కాయ - వాయుకాయ - అగ్నికాయ - వనస్పతికాయ - త్రసకాయము'లను నీ యాఱు జీవభేదము లున్నవి. పృథ్వీకాయ మనఁగా పృథివీపరమాణువు. అట్లేజల- వాయు పరమాణువులు. వీనికిఁ బ్రాణ మున్నదని వారు - నమ్మెడు వారు. వనస్పతికాయ మనఁగా - వృక్షాదికములు. అవి సజీవములని జెప్ప బనిలేదుగదా! త్రసకాయ మనఁగా - బురుగుమొదలు లేస్గువఱకుండు సమస్త ప్రాణులు. వీనిలో

నే ప్రాణిని గూడ హింసించుట జైనుల దృష్టిలోఁ బాపము. అందుకే వారు రేల దీపములు వాడరు. చల్లని నీరు ద్రావరు. 'పృథ్వీ పరమాణువులు నాశ మవునే'మో యని యెంతో జాగరూకతతో నడతురు.

కాని - జైనోపాసకులు పొలము దున్నుదురు. ధాన్యము నూడురు. బియ్యమువండి యన్నము సేతురు. ఈపనులలోఁ బైఁ జెప్పిన యాఱు విధములైన ప్రాణుల సంహారము జరగుచునే యున్నది. పొలమును దున్నుటలో పృథ్వీ పరమాణువులు ముఖ్యముగ నష్టము గాకున్నను - బురువులు - జీవులు మొదలైనవి లక్షలకుఁజచ్చును. కలుపు తీయునప్పుడు వనస్పతికాయ, జలకాయ, అగ్నికాయ, వాయుకాయములైన సర్వప్రాణుల కుచ్ఛేదము దప్పదు. మఱి - యిన్ని ప్రాణిహింసలతోఁ గూడిన భిక్షాన్నమును జైనులు గ్రహించుచునే యుండిరి. కాగా - యొకానొక జైనోపాసకునిచేత వండఁబడిన మాంసభిక్షను గ్రహించుటలో ప్రాచీన జైనశ్రమణుల కాక్షేపణ యేమి! ఆ కృత్యముల యొక్క సమర్థనము 'ఆమగంధసుత్తము'నందుఁ జెప్పఁబడిన మార్గముననే దామును సమర్థించుకొను చుండిరేమో!

## గోమాంసమును దినరాదు

మాంసమును దినరాదను కోలాహల మెట్లారంభ మయ్యేను, గోమాంసమును దినరాదని మొట్టమొదటఁ బ్రచార మొనర్చినవారు - బౌద్ధులే. తొమ్మిదవప్రకరణ మందు-గోవునుగుఱించి గొంత ప్రసంగించితిని, 'బ్రాహ్మణ

ధమ్మసుత్తము' నుండి రెండుశ్లోకము లుదాహరించితిమి గూడ ! ఈ క్రిందిది మఱియొకగాథ.

"నపాదా నవిసాణేన నాస్సు హింసంతి కేనచి
గావో 'ఏళకసమానా' సోరతా కుంభ దూహనా
తా విసాణే గహేత్వాన రాజా సత్థేన ఘాతయి
తతోచ దేవా పితరో ఇందో అసురరక్ఖసా
అధమ్మో ఇతి పక్కందుం యం సత్థం నిపతీగవే.

ఆవులు గొఱ్ఱెలవంటివే. ఎవరికిని బాధగలిగించునవి గావు. న్రమములు. కుండలకొలంది పాలొసంగును. పాదములతోగాని - కొమ్ములతోగాని - యితరావయవములతోగాని యెవ్వరిని హింసింపవు. వానిని - బ్రాహ్మణులమాటలు విని, యిక్ష్వాకురాజు కొమ్ములు బట్టుకొని జంపెను. గోవుపై నతఁడు శస్త్రప్రహార మొనర్చునపుడు దేవతలు - పితరులు - నింద్రుఁడు - రాక్షసులు మొదలైన వా రధర్మము జరగినదని యాక్రోశించిరి.

## చాలాకాలము వఱకు బ్రాహ్మణులు గోమాంసమును వదలలేదు

జైన బౌద్ధులు - గోమాంసాహారమును నిషేధించినను బ్రాహ్మణులు దానిని దినుట వదలలేదు. వారా యలవాటు విడుచుటకుఁ దరువాత నెన్నియో శతాబ్దములు బట్టినది. యజ్ఞదీక్షితుఁ డైనవాఁడు గోమాంసమును దినరాదనుట - చెలామణిలోనికి వచ్చిన మొట్టమొదటి నిషేధము.

"సధేన్వైచానడు హశ్చ నాశ్నీయాత్। ధేన్వనడుహౌ వాఽఇదం సర్వం బిభృత స్తే దేవా అబ్రువన్ ధేన్వనడు హౌవాఽఇదం సర్వం బిభృతో హంత యదన్యేషాం వయసాం వీర్యం తద్ధేన్వ నడుహయోర్నాశ్నీయాత్ తదుహోవాచ యాజ్ఞ వల్క్యోఽశ్నా మ్యేవాహం మాంసలం చేద్భవతీతి"

ఆవులు, నెద్దులు, మొగలైన వానిని దినరాదు గో వృషభము లీ సర్వమును ధరించుచున్నవి, దేవత లన్నారు. 'గో వృషభములు సర్వాధారణములు. అందుకే వేఱుజాతి పశువులయొక్క వీర్యమును గో-వృషభములయం దుంచు దము. కనుక గో వృషభములను దినరాదు. కాఁగా-యాజ్ఞ వల్క్యుఁ డనెను: "శరీరము మాంసల మగుచున్నది. అందుచే నేను గో మాంసమును దిని తీరెదను."

(శతపథ బ్రాహ్మణము. 3-1-2-21)

ఈ వాదము యజ్ఞశాలకు ముందే జరగెను. దీక్షితుఁడు యజ్ఞశాలను ప్రవేశించిన తరువాత గోమాంసమును దినగూడ దని కొందఱు వాదించిరి. యాజ్ఞవల్క్యుఁడు దీని కంగీకరింపలేదు. శరీరము పుష్టమగుచున్నది. కనుక నే నవశ్యము దిందు ననెను. ఇతర సమయములలో గోమాంస భక్షణమునందు బ్రాహ్మణులలో విప్రతిపత్తియే లేదు. ఇంతే గాదు. అతిథి యెవ్వఁడైన నింటికి వచ్చినపుడు దొడ్డయెద్దును జంపి యా మాంసముతో వాని నాదరించు నాచారము ప్రసిద్ధముగ నుండెను. ఒక గౌతమ సూత్రకారుఁడు మాత్రమే గోమాంసాహారమును నిషేధించినది. అతఁడుగూడ మధుపర్కవిధిని గాదనలేదు. భవభూతికాలమువఱకును బ్రాహ్మ

ములలో నీ యాచార ముండెనని దోచుచున్నది. ఉత్తర రామచరిత్ర నాల్గవ యంకముయొక్క మొదట — సౌధాతకి-దండాయనుఁడు, వీరి సంవాద మున్నది. దానిలో గొంత భాగ మిూ క్రిందిది.

సౌ :— ఏమి! వసిష్ఠా!

దం :— తరువాత నేమి?

సౌ :— ఆ వచ్చువారెవరో బులివంటివాఁడుగ నుండ వలెనని దోచుచున్నది.

దం :— ఏమంటివి?

సౌ :— అతని రాకకై యొక నల్లని తర్లకము నామె దయారుచేసి పెట్టినది!

దు :— మధుపర్కవిధి సమాంసమై తీరవలె ననెడు ధర్మశాస్త్రముయొక్క యాజ్ఞను మన్నించి గృహస్థుఁడు — శ్రోత్రియు బ్రాహ్మణుఁడు వచ్చినపుడు దర్లకముగాని — పెద్దయెద్దునుగాని వధించి మాంసమును వండుదుగు. ధర్మ సూత్రకారుఁ డట్లుపదేశించెను.

భవభూతియొక్క కాల మేడవ శతాబ్దము. ఆనాఁడు గోమాంస భక్షణ సేటివలె యత్యంత నిషిద్ధమైనచో వసిష్ఠుఁడు దర్లక మాంసమును దిన్నసంగతి భవభూతి దన నాటకమందు బ్రస్తావించియే యుండఁడు. ఈనాఁడిట్టి సంవాదము నెవఁడైన దన నాటకమున జేర్చినచో దానిని జమవుదురా!

ప్రాణిహింస జేయరా దని దొట్టదొలుత బ్రచార మొనర్చినవాఁడు జారిత్రముగ నశోకుఁడు. అతని మొదటి శిలాలేఖ మిట్లున్నది.

ఈ ధర్మలిపి దేవానాంప్రియుఁడైన ప్రియదర్శిరాజు చేత వ్రాయింపఁబడ్డది. "నా రాజ్యమందెవరేని - యేప్రాణి నైన జంపి హోమహవనము లొనర్పరాదు. జాతరలు సేయ రాదు. జాతరలలో ననేక దోషము లున్నవని ప్రియదర్శికిఁ దోచినది. కొన్ని జాతరలుమాత్రము ప్రియదర్శి కిష్టమైనవే. ఇంతకుముందు దేవానాంప్రియుని పాకశాలలో ననేక జంతువులు వధింపఁబడెడివి. ఈ ధర్మలేఖ వ్రాసినది మొదలు - రెండు నెమళ్ళు - యొక మృగము మాత్రమే వధింపఁబడుచున్నవి. మృగముగూడ దినమును భుజింపఁబడుటలేదు. ఇఁకమీఁదట నీ యలవాటుగూడ విడిచిపెట్టఁబడును."

అశోకుఁ డీలేఖయందు గోవృషభముల సంతతి యెత్తనేలేదు. బ్రాహ్మణేతరగులైన వరిష్ఠజాతులలో నానాటికే గోమాంసాహారము జాలమట్టుకు దగ్గియుండెనేమో! ఇంతే కాదు-అన్నము కొఱకుగూడ నేప్రాణిని హింసింపరాదని యశోకుఁడు శాసించెను. మూలమునందు 'సమాజ' శబ్దమున్నది. దానిని నేను జాతరయని భాషాంతరీకరించితిని. మూలమున కిది నికరమైన భాషాంతరము గాకపోవచ్చును. కాని యున్నమాటలలో నిదియే దగినదని దోచినది. నేఁడు మహారాష్ట్రదేశమున జాతరలు జరుగుచున్నవి. ఉత్తర హిందూస్థానమున - మేళములు జరుగుచుండెడివి. ఇట్లే యశోకుని కాలమున సమాజము లుండెను. వానిలో దేవతలకు బలులిచ్చుటవాడుక. అట్టి యుత్సవము లశోకున కిష్టము గావు. ప్రాణివధ లేని జాతర నాతఁడడ్డగింపలేదు. యజ్ఞముల

లోఁగాని, జాతరలలోఁగాని మరి యెచ్చటను ప్రాణి వధ సేయరాదనియే యశోకుని మఖ్యోద్దేశము.

## మన పూర్వులును మాంసాహారులే

నేడు యజ్ఞ యాగములు లేనేలేవుగదా! జాతరలలో బలియొసఁగు పద్ధతిమాత్ర మిప్పటికిని, యున్నది. కాని యితర దేశములకంటెను, హిందూదేశమందు మాంస భక్షణము – దక్కువ యనుట మాత్రము సత్యము. దీనికిఁ గారణము, బౌద్ధులు, జైనులు జేసిన ప్రచారమే! మన మందర మిపుడు శాకాహారులమే! దీనినిబట్టి మన పూర్వులుఁగూడ మనవలెనే శాకాహారు లనుట మాత్రము కల్ల.

## చీనాదేశమునందు పందులమహాత్వము

ఇపుడు బందిమాంసమును గురించి నాలుగుమాటలు జెప్పెదను. చాలప్రాచీనకాలమునుండి – చీనాదేశస్థులు బందులను సంపత్తిలక్షణముగ భావించిరి. వారి లిపి – చిత్రమైనది. దానినిండ యాకారములే ఈ యాకారచిహ్నముల – భిన్న భిన్నమిశ్రణములతో శబ్దములేర్పడును. మనుష్యుని చిహ్నముప్రాసి దానిపైగ త్రిని నిల్పనచో 'శూరుఁడ'ని యర్థము. ఇంటిబొమ్మవేసి దానిక్రింద శిశువును వ్రాసినచో నక్షరమని యర్థము. ఇరువురు స్త్రీల రేఖలు వ్రాసినచో జగడమని యర్థము. పందిని గీచినచో సంపత్తి యని యర్థము. అనఁగా నింటి యందు బందు లుండుట సంపత్తి లక్షణమని ప్రాచీనులైన చీనా దేశీయుల యభిప్రాయము. నేటికిని వాని చిహ్న మంతే.

## ప్రాచీన హిందువులు బందులను సంపత్తిలో భాగమని నెంచిరి

హిందూస్థానమందుఁ బందుల కింత మహత్త్వము లేదు. కాని సంపత్తిలో నవి యొక భాగమను నభిప్రాయము మాత్ర ముండెడిది. 'అరియపరియేసన సుత్తమం' దైహిక సంపత్తి యొక్క యనిత్యత వర్ణింప బడ్డది. ఆ భాగ మిూ క్రిందిది.

"కించ భిక్ఖవే జాతిధమ్మం ? పుత్త భరియం భిక్ఖవే జాతిధమ్మం దాసీ దాసం... అజేళకం... కుక్కుట సూకరం ...హత్థి గవాస్స వళవం... జాతరూప రజతం జాతి ధమ్మం..."

ఏనుగు - గోవు - గుఱ్ఱములు మొదలైనవి జెప్పఁ బడినవి వాని జతలోనే 'కోళ్లు - పందుల'ను గూడఁ జేర్చి నాఁడు. మఱి పంది మాంసముపై మన కింత యేహ్యాభావ మేట్లు గలిగెను? యజ్ఞ యాగములందు వధించుటకై బనికి వచ్చు గొన్ని జంతువుల పట్టిక లున్నవిగదా! వానిలోఁ బంది పేరు 'పాలీ' పట్టిక యందుఁ గన్పించుట లేదు. అనఁగా బుద్ధుని కాలమందే నీ ప్రాణు లమేధ్యములు. కాని-యభక్ష్యము లనుట కాధారము లేదు. అట్లైనచో క్షత్రియ గృహము లందలి సంపత్తిలో వీని సమావేశము జరగి యుండదు. సూకర మాంసము యొక్క నిషేధము మొట్ట మొదట ధర్మ సూత్రములలో * వచ్చును. తరువాత నా

---

* కాకకంక గృధ్రశ్యేనా జలజర క్త పాదతుండా గ్రామ్య కుక్కుట సూకరాః (గౌతమ ధర్మ సూత్రములు. అ 8-29)

పద్ధతినే మనుస్మృతి మొదలైనవి యనుసరించెను. కాని యడవి పందుల మాంసము మాత్రము నిషేధింపఁ బడలేదు. అది పవిత్రముగ గూడ నెంచఁ బడెను.*

## బుద్ధుఁడమితముగ భుజించెనను నసత్యప్రచారము

పరినిర్వాణమునకు ముందు బుద్ధుఁడు భుజించినది సూకరమాంసమని యొకరీతిగ సిద్ధాంతికమైనను - దాని నెక్కువగ భుజించుటచే - నజీర్ణమై మరణించెనను కల్పన మాత్రము కేవల మసత్యము. కుత్సిత టీకాకారులు జేసిన పని యిది. బుద్ధుఁ డమితముగ భుజించువాఁ డనుట కొక యుదాహరణము గూడ లేదు. అట్టిచో పరినిర్వాణమునకు ముందుమాత్ర మమితముగ భుజించె నని యారోపించుట కేవల మన్యాయము. నిర్వాణమునకు ముందు బుద్ధుఁడు 'వైశాలి' యందు మూఁడునెలలు పెద్ద జబ్బుతోఁ బడి నాఁడు. అందుచే నాతని శరీరమందు బలమెంతయో సన్నగిల్లినది. 'చుందుఁ' డొసఁగిన యాహార మాతని నిర్వాణమునకు నిమిత్త మాత్రమే. తన యనంతరము చుందుని లోకము భయంకరముగ నిందించునేమోయన్న యనుమానము బుద్ధునకు గలిగినది. అందుకే యతఁ డానందునితో నన్నాఁడు. "ఆనందా! తథాగతుఁడు నీవొసఁగిన భిక్షను గ్రహించి నిర్వాణమందెను. దీనితో నీ కెక్కువ పాపము వచ్చినదని" యెవరైన - నా యనంతరము చుందుని నిందింతురేమో.

---

* ఏకఖురోష్ట్ర గవయగ్రామ సూకర శరభగవాం (ఆపస్తంబధర్మ సూత్రము; ప్రశ్న 1, పటలము 5, ఖండిక 17-29)

మనుస్మృతి అ॥ 5-19; మనుస్మృతి అ॥ 3-270

అపుడు నీ వాతనిచింత నీ మాటలతోఁ బోఁగొట్టుము. "చుందా! నీ వొసఁగిన యాహారమును గ్రహించి బుద్ధుఁడు బరినిర్వాణ మందెను. దీనితో నీకు మహాఫలము గలిగినదని బుద్ధుఁడన్నాఁడ"నుము నే నెన్నియో భిక్షలు గ్రహించితిని. ఆ యన్నిటిలో రెండు భిక్షలు మాత్రము మహాఫలదాయకములు. ప్రశంసనీయములు. ఒకటి 'సుజాత యొసఁగిన భిక్ష.' ఆ భిక్ష గ్రైకొన్ననాఁడే నేను సంబోధిజ్ఞాన మందితిని. రెండవది చుందుని భిక్ష ఈ నాఁడే నేనును బరినిర్వాణ మందుచున్నాను. చుందుఁ డొనర్చిన కార్యము సుఖ-యశ-స్వర్గముల గలిగించునది. ఆయుష్య మిచ్చునది. స్వామిత్వ మొసఁగునది. ఆనందా! నేనిట్లంటినని వచించి యాతని చింత నీవు మాన్పవలెను.

# పంద్రెండవ ప్రకరణము

# దినచర్య

### ప్రసన్నముఖకాంతి

బోధిసత్త్వుఁడు సంసారియైనపుడు - దపస్సు సేయునపుడును - నతనిదినచర్య నాలు - గైదవ ప్రకరణములందు గొంచెము విచారింపబడ్డది. ఇపుడు సంబోధి జ్ఞానము మొదలుకొని పరినిర్వాణపర్యంత మాతని దినచర్య విమర్శింపఁబడుచున్నది.

తత్త్వజ్ఞాన మందిన తర్వాత బుద్ధుఁడు బోధివృక్షము క్రిందనే దన జీవితక్రమమును నిర్ణయించుకొనెను. తపశ్చర్య వదలిపెట్టఁ బడెనుగదా! మరల గామోపభోగములవైపు మొగ్గుట కాతని కిష్టములేదు. ఆ వాసనయే మిగిలినదిగాదు. అందుచే శరీరాచ్ఛాదనమునకై వస్త్రము - క్షుధాశమనమునకాహారము మాత్రమే గ్రహించి - బహుజనహిత మొనర్చుచు బ్రదుకవలెనని యతఁడు నిర్ణయించికొన్నాఁడు. ఈ నిర్ణయముతో నాతని ముఖమున కెట్టి కాంతి గలిగిన దను విషయము మజ్ఝిమనికాయమందలి 'యరియపరియేసన' సుత్తమందును - వినయముయొక్క 'మహావగ్గ' మందును వచ్చును.

బుద్ధభగవానుఁడు పంచవర్గీయుల కుపదేశించుటకై గయనుండి వారణాసికిఁ బోవుచుండెను. త్రోవలో నాతనికి 'యుపకుఁడ'ను నాజీవకశ్రమణుఁడు దటస్థపడినాఁడు.

ఉపకుఁడనెను. ఆయుష్మంతుఁడవైన గౌతమా! నీము ఖము ప్రసన్నము. అంగకాంతి దేజస్వంతము, నీయాచార్యు లెవరు?.

బుద్ధుఁడు:- నా ధర్మమార్గమును నేనే శోధించి గను గొంటిని.

ఉపకుఁడు:- అయినచో నీ వర్హుఁడవైతివా? జనుఁడని నిన్ననవచ్చునా!.

బుద్ధుఁడు:- ఉపకా! నేను పాపకారకములైన సర్వ వృత్తులను జయించితిని. అందుచే జనుఁడనే.

ఉపకుఁడు జూచిన ముఖప్రసన్నత బుద్ధుని జీవితాంత ముండెనని దలఁచుటలో బాధ యేమున్నది?

## సామాన్యదినచర్య

బుద్ధుఁడు ప్రాతఃకాలముననే నిద్రలేచును. అపుడు ధ్యానమొనర్చెడువాఁడు. లేక - జుట్టుపట్టుల నుబుసుపోక కట్టెటు దిరుగాడును. సకాలమునకు భిక్షుకై యూరిలోనికిఁ బోవును. భిక్షగ్రహించుటలో నతని 'కీజాతి - యాజాతి' యనిలేదు. భిక్షకొని యూరివెలుపలికివచ్చి యట భుజించెడు వాఁడు. కొంచెము విశ్రమించి మరల ధ్యానస్థుఁడగును. సంధ్యాకాలమున మరల గ్రామములోని కేగును. రాత్రిళ్ళు దేవాలయమందో - ధర్మశాలయందో - లేక, యొక చెట్టు నీడయందో గడపెడువాఁడు.

రాత్రి మొదటి యామమున భగవంతుఁడు ధ్యాన మొనర్చును. లేక - గొంత యటు నిటు దిరుగును. మధ్య

యామమందుఁ గాళ్ళు జక్కఁగా జాచి - తలగడకు బదులు శిరస్సుక్రింద జేయి పెట్టికొని - కుడిప్రక్కఁ బొరలి కుడి కాలిపై నెడమకాలు మోపి జాగ్రత్తగ నిద్రించెడువాఁడు.

## సింహశయ్య

బుద్ధుని శయ్యకు సింహశయ్య యని పేరు. 'అంగుత్తర నికాయము' లోని 'చతుక్కనిపాత'మందు (సు. 244) నాల్గు విధములైన శయ్యలు వర్ణింపఁబడినవి మొదటిది ప్రేత శయ్య. అనఁగా - వెల్లకిలఁ బరుండుట. (2) కామభోగిశయ్య. కామభోగమందు సుఖ మనుభవించువారు సాధారణముగ నెడమవైపున కొత్తిగిలి పండుకొందురు (3) సింహశయ్య. కుడికాలిపై నెడమకాలునుంచి 'నే నీవేళకు లేవవలె' నని స్మరించుచు - జాగ్రత్తగా నిద్రించుట. (4) తథాగత శయ్య యనఁగా నాల్గు విధములైన ధ్యాన సమాధి.

వీనిలో కడపటి రెండు శయ్యలు బుద్ధున కిష్టమైనవి. ఇంతకు - దేలిన సారాంశ మిది. ప్రథమ యామమున నాతఁడు ధ్యానించును. మధ్యమ యామమున సింహశ య్యపై నిద్రించును. కడపటి యామమం దటునిటు దిరుగా డును. లేక ధ్యానము సేయును.

## మితాహారము

బుద్ధుని యాహార మత్యంతము నియమితము. భోజన పానములం దాతని కతిరేకత లేదు. ఇట్లు ప్రవర్తింప వలెనని యాతఁడు శిష్యులకు మాటిమాటి కుపదేశ మిచ్చెడువాఁడు. మొదటమొదట రాత్రిళ్లుగూడ భగవంతుఁడు భుజించుట

వాడుక. ఈ విషయము 'మజ్ఝిమనికాయము'లోని (సం 70) 'కిటాగిరి' సుత్తమునుండి దెలియును. ఆ సుత్తమున భగవానుఁ డిట్లనుచున్నాఁడు "భిక్షువులారా! నేను రాత్రి పూట భోజనము వర్జించితిని. అందుచే నా శరీరమున వ్యాధి దగ్గినది. జాడ్యము దగ్గినది. అంగమందు బలము చేకూరెను. చిత్తస్వాస్థ్య మేర్పడెను.

అప్పటినుండియు భిక్షువులు బంఁడెండు గొట్టుటకు ముందే భుజించు నలవాటు మొదలయ్యెను పంఁడెండు తరువాత భుజించుట నిషిద్ధమయ్యెను.

చారిక

చారిక యనఁగా ప్రవాసము. ఇది రెండు రీతులు. శీఘ్రచారిక - సావకాశ చారిక-యని. వీనినిగుఱించి 'యంగుత్తరనికాయము' యొక్క 'పంచకనిపాతము' నందలి మూఁడవ వర్గ మొదటిలో నిట్లున్నది: భగవంతుఁ డనెను; "భిక్షువులారా! శీఘ్రచారికయం దైదు దోషములున్నవి. (1) ఇంతకు ముందేధర్మవాక్యములు వినలేదో వానిని వినుటకు సాధ్యపడదు. (2) వేనిని విన్నామో వానిని విమర్శించుట కవకాశ ముండదు. (3) ఏ విషయమును గుఱించియుఁ బూర్ణజ్ఞాన మేర్పడదు. (4) అప్పుడప్పుడు భయంకర రోగములు రావచ్చును. (5) మిత్రులు లభింపరు. భిక్షువులారా! శీఘ్రచారికలో నీ యైదు దోషములున్నవి.

భిక్షువులారా! సావకాశచారికలో నీ యైదుగుణము లున్నవి. (1) ఇంతకుముందే ధర్మవాక్యములు వినలేదో వానిని విందుము. (2) విన్నవానిని విమర్శించికొనవచ్చును, (3) ఒకవిషయమున బూర్ణజ్ఞాన మలవడును. (4) భయంకర రోగములు రావు. (5) మిత్రులు లభింతురు. భిక్షువులారా! సావకాశ చారికలో నీ యైదుగుణము లున్నవి.

బుద్ధభగవంతుఁడు బోధిసత్త్వుఁడుగా నున్నప్పుడు దనకుఁగల్గిన యనుభవములే శిష్యునకుఁ దెల్పినాఁడు. త్వరిత చారికతోఁగల్గిన నష్టములును, సావకాశ చారికతోఁగల్గిన లాభములును భగవానుని స్వీయానుభవములే. సావకాశ ప్రవాస మొనర్చియే యాతఁ డితర శ్రమణులనుండి జ్ఞానసంపాదన మొనర్చెను. కడపట దన నూతన మధ్యమార్గమును సంశోధించి కనుగొనెను.

## భిక్షువులతోగూడ ప్రవాసము

బుద్ధుఁడైన తరువాత నతఁడు బుద్ధగయనుండి గాశికిఁ బయనించెను. అచట బంచవర్గీయ భిక్షువుల కుపదేశించి భిక్షుసంఘమును స్థాపించెను. వారిని వారణాసిలో వదలి యొంటరిగా రాజగృహమునకు వచ్చెనని 'మహావగ్గ'యం దున్నది. ఈ పంచభిక్షువులుగూడ జాతుర్మాస్య గడచిన వెనుక బుద్ధునితోడనే యుండిరనుట కాధారములుగలవు. రాజగృహమందు సారిపుత్తమోగ్గల్లానులు శిష్యులైన తరువాత బౌద్ధసంఘము 'తోజు'గా బెరిగెను. సారిపుత్తమోగ్గల్లానులు మహాప్రసిద్ధులు. అప్పటినుండి బుద్ధునితోఁగూడ బెద్దదియో చిన్నదియో యొక భిక్షుసంఘముండెడిది. వారితోఁ

గూడియే బుద్ధుడు బయనించెడువాడు. అటుతరువాత - సంఘమును వదలి బుద్ధుడే యొనర్చిన ప్రయాణములు జాల నఱుదు.

## సంచారక గురుకులములు

బుద్ధునికాలమందలి శ్రమణులును - వారినాయకు లును నిట్లే ప్రయాణించెడువారు. బుద్ధునకు వెనుకముందు గొన్ని బ్రాహ్మణ గురుకులము లుండెడివి. వారి దగ్గర కుచ్చజాతులకుఁ జెందిన యువకులు బోయి జదువు కొనెడు వారు. కాని - యాగురుకులములతో సామాన్యజనులకు లాభ మేపాటియో గలిగెడిది. విప్రులు వేదాధ్యయనముసేసి రాజులనాశ్రయించెడువారు. క్షత్రియులు ధనుర్విద్య నేర్చి రాజులగొలచి - వారికడ 'నౌకరీ'సేయుచుండిరి. జీవక కౌమార భృత్యునివంటి వా రాయుర్వేదమునభ్యసించి గొప్ప వారి కుపయోగపడెడువారు. కడకు వారును రాజులనే యాశ్రయించుచుండిరి. శ్రమణుల గురుకులము లిట్టివి గావు. వారు బవాసము లొనర్చుచునే శిష్యుల శిక్షించెడువారు. సామాన్యజనులలో మెలఁగుచు -ధర్మోపదేశము లొనర్తురు. అందుచే - సామాన్య జనులలో వీరి కెక్కువ బలుకుబడి.

## భిక్షు సంఘములోని నియమములు

బుద్ధ భగవానుని భిక్షు సంఘమం దుత్తమ నియ మము లుండెడివి. భిక్షువు లవ్యవస్థితముగ వర్తించు టాతనికి గిట్టదు. ఈ విషయమై 'చాతుమ' సుత్తము (మజ్ఝిమ నికాయము 67. సం) నం దీ కథ యున్నది:

భగవానుఁడు 'చాతుమ' మనెడు శాక్య గ్రామం 'దామలక వన'మం దుండెను. అపుడు సారిపుత్త మోగ్గల్లాను లైదునూర్ల శిష్యులతో నచ్చటికి వచ్చిరి. అంతకు ముందే గొందఱు భిక్షువులు బుద్ధునితో నుండిరి గదా! వీరికిని - గ్రొత్తవారికిని స్వాగత - కుశల ప్రశ్నాదికము లారంభ మైనవి. క్రొత్తవా రెచట నుండవలెను? ఎచటఁ బండవలెను? పాత్ర చీవరము లేచోట బెట్టవలెను? మిత్యాది విషయముల సవ్వడి యారంభ మయ్యెను. అపుడు భగవంతుఁ డానందునితో "మత్స్యముల బట్టునప్పుడు జాలరులలో శబ్ద మైనట్లీ సద్దేమిటి?" యన్నాఁడు.

ఆనందుఁ డనెను. "భదంతా! సారిపుత్త మోగ్గల్లానుల వెంట వచ్చిన భిక్షువులకు సంబంధించిన దిది. వారి నివాస విశ్రాంతులకుఁ జోటు వెదకి కొనుటలో గడ బిడ యగుచున్నది."

బుద్ధుఁ డానందు నంపి సారిపుత్త మోగ్గల్లానులను వారి భిక్షువులతోఁ గూడ బిలిపించెను. వా రరుదెంచిరి. "మీరు మాతోఁ గూడ నుండఁ దగరు. వేఱుచోట నుండుఁ"డని వారికి శిక్ష విధించెను. ఆ భిక్షువులు బుద్ధునకు నమస్కరించి మరలిరి. అపుడు శాక్యులా యూరియం దేదో పని కొఱకై దమ సంస్థాగారమున మూగినారు. ఇపుడే వచ్చిన భిక్షువులు దిరిగి పోవుచుండిరి. శాక్యుల కాశ్చర్య మయ్యెను. "ఎందుకు వెడలుచున్నార"ని ప్రశ్నించిరి. "బుద్ధభగవానుఁడు మాకు శిక్ష విధించెను. అందుచే వెడలి పోవుచున్నామని భిక్షువు లన్నారు. ఆ శాక్యు లా భిక్షువుల

నచ్చోటనే యుండ బ్రార్థించిరి. శాక్యులు బుద్ధునకు విన్న వించుకొని యీ భిక్షువుల క్షమింపవలె నన్నారు. బుద్ధుఁడా భిక్షువుల క్షమించెను.

## ధార్మిక సంవాదము లేక యార్యుల మౌనము

నిరంతరమును మౌనమును ధరించు శ్రమణు లెందరో బుద్ధుని కాలమున నుండిరి. అసలు "ముని" శబ్దము నుండియే మౌనపదము పుట్టినది. ఈ విధమగు దపస్సు బుద్ధునకు రుచించినది గాదు. అవిద్వాంసుఁడై - మూర్ఖుఁడైన మనుష్యుఁడు మౌనధారణ మొనర్చి నంతనే ముని యగునా! కాని యప్పుడప్పుడు మౌనధారణము యోగ్యమే నని భగవంతుని దలఁపు. 'అరియపరియేసన'* సుత్తమందు (మజ్ఝిమ నికాయమున సం. 26) భగవానుఁ డిట్లనును. "భిక్షువులారా! సాధ్యమైనచో ధర్మచర్చ సేయుఁడు. లేకున్న నార్య మౌనము ధరింపుఁడు."

## శాంతము గావలెను

బుద్ధుఁ డుపదేశించు నపు డేమాత్రమును సద్దు జేయరాదు. ఇతరసమయములలోఁగూడ వారి వర్తనమంతే. సద్దుసేయుట భగవానులకు గిట్టదు. ఈ విషయమును 'దీఘనికాయము'లోని 'సామంజఫలసుత్త' మిట్లు వివరించును.

బుద్ధభగవానుఁడు రాజగృహమందు జీవకుని యామ్రవనమున భిక్షుసంఘముతోఁగూడ నుండెను. ఆనాఁడు

* న మోనేన ముని హోతి మూళహరూపో అవిద్దసు (ధమ్మపదము 268)

కార్తిక పూర్ణిమ. పిండియారఁబోసినన వెన్నెల. రాజైన యజాతశత్రుఁ డమాత్యులతోఁగూడఁ దన ప్రాసాదోపరితలమున భాషించుచుండెను. ఆ రాత్రిని జూచిన రాజున కేమో యానందమైనది. ఆతఁడు మంత్రులతో నీవెన్నెల యెంత హాయిగానున్నది! ఈ ప్రశాంత సమయమున నొక శ్రమణునితోఁగాని నిక్కమైన బ్రాహ్మణునితోఁగాని గడిపిన నెంత బాగుండునో! చంద్రికలతో ముందే శీతలమైన యీ హృదయము నాతని యుపదేశములు మరింత శీతలమొనర్చును గదా! యన్నాఁడు. అపుడు రాజగృహముయొక్క చుట్టుపట్టుల నైదుగురు ప్రసిద్ధులైన శ్రమణ నాయకు లుండి రని ముందే చెప్పితిమిగదా! అజాతశత్రుని మంత్రులలో నొక్కక్కరి కొక్కొక్కనిపై మక్కువ. అజాతశత్రుఁ డీప్రశ్న నడిగిన వెంటనే యొక మంత్రి పూరణకస్సపుని బొగడెను. మఱియొకఁడు మక్ఖలిగోసాలు నగ్గించెను. ఇతరుఁ డజితకేశకంబళుఁడే శ్రేష్ఠుఁడన్నాఁడు. దానిని గాదని వేఱొక మంత్రి 'పకుధకచ్చాయనుని' ప్రస్తుతించినాఁడు. వేఱొకఁడు 'సంజయచేలట్ఠపుత్తుఁడే' యుత్తముఁడనెను. ఇంకొక మంత్రి నిగంఠనాథపుత్తునికై వాదించినాఁడు ఆ అజాతశత్రుఁ డన్నియు వినెను.

జీవకకుమార భృత్యుఁడేమియుఁ బలికినవాఁడుగాఁడు. అతని మౌన మజాతశత్రునకు వింతయైనది.

"జీవకా! నీవేమియుఁ బలుకలేదే?".

"మహారాజా! మీ యందఱి మాటలు వినుచున్నాను. నా దృష్టిలో బుద్ధభగవానుఁడే మాకిపుడు చిత్తశాంతి నివ్వ

గలవాఁడు. వారు నా యామ్రవనమందు భిక్షువులతో వసిం చుచున్నారు. బుద్ధభగవానులను మీరు గలసికొన్నచోఁ దరువాత నేను జెప్పవలసిన దుండదు".

అజాతశత్రుఁడు వాహనములను సిద్ధము చేయించెను. రాజొక పెద్ద యేనుగుపై నెక్కినాఁడు. అంతఃపురములోని స్త్రీలుగూడ గజములపై నధివసించిరి. జీవకుఁడొక వాహ నముపై నెక్కెను. ఆ వెన్నెలలో నందఱు - బుద్ధునికడకుఁ బయనించిరి.

జీవకుని యామ్రవనమును సమీపించినారు. అయ్యె డలఁ జిఱుయలికిడిగూడ లేదు. అజాతశత్రునకు భయ మైనది.

"జీవకా! నన్నిటకు గొనివచ్చితివేమి? ఏకాంతము నందు నన్ను నాశత్రువులకుఁ బట్టించుటకై యెత్తుగడ నెత్తితివా యేమి? ఇక్కడ మనుష్యుడున్న యలికిడి గూడ లేదే? నీవన్నట్లు లెక్కలేనంతమంది భిక్షువు లిక్కడ వసించునప్పుడు వారిలో నొక్కడైనను దగ్గఁడా! తుమ్మఁడా! తమలోఁదామైన గుసగుస లాడుకొనరా! అవేవియు లేవే" యనెను. జీవకుఁడు బదులిచ్చినాఁడు. "మహారాజా! దమరు భయపడవలసిన యవసరము లేదు. మిమ్ము మోసగించుటకు నే నిక్కడకు గొనిరాలేదు. తమ శత్రువు లిక్కడ లేరు. అదుగో! యెదుట జూడుఁడు! ఆ మండల మాలయందు దీపములు వెలుగుచున్నవి. తమ శత్రువు లిచ్చట నున్నచో వారింత బాహాటముగ దీపములు వెలిఁగించుకొని వసింతురా?"

రాజు వాహనమును దిగినాఁడు. తక్కినవారును దిగిరి. వారందఱు బాదచారులై యామ్రవనమును సమీపించి నారు. రాజు భగవానుఁ డెక్కడ నున్నాఁడు ?*

జీవకుఁడు :- మహారాజా ! అదిగో ! యీ మండల మాలయొక్క మధ్యమున నొక స్తంభమున్నది గదా ! దానికిఁ బ్రక్కన దూర్పునకు మొగముచేసి కూర్చున్నవారే బుద్ధభగవానులు.

అజాతశత్రుఁడు బుద్ధుని దరిసి నిలబడెను. భగవానున కిఱువైపులను భిక్షువులు బరివేష్టించి యుండిరి. కాని చీమ చిటుకుమన్న వినబడునంత నిశ్శబ్దము. ఆ శాంతి కజాతశత్రున కేమో యాహ్లాదమైనది. ఈ సంఘమునందు వికసించిన శాంతి నా మనస్సును గూడ నెన్నఁడైన నాక్రమించి కొనునా ?" యని హఠాత్తుగ ననెను.

భగవానులు జిఱునవ్విరి. "మహారాజా ! నీకు మా యందు గాఢమైన ప్రేమగలదు. అందుకే యీ మాటలు." బుద్ధుని ప్రతివచన మిది.

తరువాత బుద్ధభగవానునకు - నజాతశత్రునకు నెంతయో సంవాదము నడచెను. అదియంతయు నిట నప్రస్తుతము. బుద్ధుఁడు సంఘముతో నివసించునప్పుడు - భిక్షువుల బాహ్యప్రవర్తన మెట్లుండెనో జూపించుటకే యీ గాథ వచించినది.

* మండలమాల యనఁగా 'గుడారము' వంటి యొక మంటపము. దానిని గొంత యెత్తైన నేలపై నిర్మింతురు.

## భిక్షుసంఘములోని నియమిత జీవనము

సమయమైనంతనే బుద్ధుఁడు భిక్షకై బయలు దేరును. త్రోవలో నప్పుడప్పు డితర శ్రమణుల నివాసములకును బోవుట యాతని వాడుక. ఆ పోవునప్పుడు దూరమునుండియే బుద్ధుని జూచిన వారినాయకుఁడు - దమ శిష్యులతో "శ్రమణ గౌతములు వచ్చుచున్నారు సద్దుసేయుట వారికి గిట్టదు. ఈ కాసంత సేపు మీామీా మాటలు గట్టిపెట్టి మౌనులై యుండుఁడని హెచ్చరించెడువాఁడు." ఇట్టి సందర్భ మొకటి 'మజ్ఝిమనికాయము'లోని 'మహాసకులుదాయి సుత్తము' (77) న వచ్చును. దాని నీక్రింది నిత్తును.

బుద్ధుఁడు రాజగృహమున వేణు వనమందలి "కలిందక నివాప"మం దుండెను. అపుడొక ప్రసిద్ధ పరివ్రాజకుఁడు శిష్యులతో "మోరనివాప మందలి" పరివ్రాజకారామమం దుండెను. ఒకనాఁడు - బుద్ధుఁ డూరిలోనికి భిక్షకై బయలు దేరి నాఁడు. కాని-భిక్షాసమయ మింకను గాలేదు. అందుచే మార్గమధ్యమున భగవానుఁడు యీా శ్రమణుల యారామములోనికిఁ బ్రవేశించెను. అపుడు - * 'సకులుదాయి' దన సంప్రదాయస్థులైన పరివ్రాజకులతోఁ బరివేష్టించి యుండెను. ఆ పరివ్రాజకు లెన్ని విషయములో మాటలాడుకొను చుండిరి. రాజకథలు - చోరకథలు - మహామాత్య కథలు- అన్నియు వారికి విషయములే. ఇంతేగాక - సేనాకథలు-

---

* కులీనుఁడైన యుదాయి

భయం కథలు-* యుద్ధ కథలు గూడ వారు దడవు చుండిరి. వారి మాటలలోఁ బొగడ్తలే గాదు - తెగడ్తలు గూడ నుండెను. బుద్ధుఁడు కొంత దూరమం దుండగనే సకులుదాయి జూచెను. శిష్యులతో "శ్రమణ గౌతములు వచ్చుచున్నారు. వారికి గడబిడ గిట్టదు. మెత్తగా మాట లాడుట వారికి సమ్మతము. మంద్రభాషణముల నెప్పుడును వారు ప్రస్తుతించు చుందురు. మీ రందరు నిశ్శబ్దముగ నున్ననే వారిచటికి వత్తురు. కనుక సద్దు చేయకు"డని యనెను.

పరివ్రాజకులు శాంతులైరి. బుద్ధభగవానుఁడు సకులు దాయిని సమీపించి నాఁడు. సకులుదాయి "దయసేతురు గాక! చాల కాలమునకు - భగవానులకు మాపై దయ గలిగినది. తమ రీ యాసనము నందు వసింపు" డనెను.

బుద్ధుఁ డా యాసనముపై గూర్చున్నాఁడు. అందరి పరివ్రాజకుల నొకసారి బుద్ధుఁడు దేరిపార జూచినాఁడు. ఆ చూపులతో వారికేమో యమృతము జల్లినటులైనది. బుద్ధుఁడు దాయి వైపు దిరిగెను.

బుద్ధుఁడు :- మీ రింతవర కేమి భాషించు చుంటిరి?

ఉ :- భగవన్! మా మాటల కేమి? అవి దినము నున్నవే. వాని నట్లుండనిండు. కొన్నాళ్ళకు ముందు-వేఱు వేఱు సంప్రదాయములకు జెందిన శ్రమణ బ్రాహ్మణ లోక

* తిరచ్ఛానకథా; అనియ్యానికత్తా సగ్గ, మోక్షమగ్గానంతి రచ్ఛా బ భూతా కథాతి తిరచ్ఛానకథా (అట్ఠకథా)

* 'కౌతూహల శాల'లో గుమిగూడిరి. వారిలో వారిట్లను కొన్నారు "మక్ఖలి గోసాలుఁడు - పూరణ కస్సపుఁడు మొదలగు శ్రమణు లింతమంది రాజగృహ సమీపముననే వసించుట యుంగ మగధుల యదృష్టమే. కాని ఇందఱు భిక్షు సంఘనాయకు లున్నారు గదా! వీరిలో దమ భిక్షుల కత్యంతము ప్రీతి పాత్రుఁడైన నాయకుఁ డెవఁడో! ఏ నాయకుని భిక్షువు లెక్కువ గౌరవింతురు? ఏ నాయకుని సాన్నిధ్యమున భిక్షువులు వసింప నుత్సహింతురో!"

అపుడు గొంద ఱనిరి. "పూరణ కస్సపుఁడు ప్రసిద్ధుఁడే. కాని - శ్రావకు లాతని నెక్కువ గౌరవింపరు. అపుడపు డా భిక్షులు దమలోఁ దాము గలహించి కొందురు.

మరికొంద ఱిట్లనిరి, 'మక్ఖలిగోసాలుని శ్రావకులు గూడ గలహించుచునే యుందురు.'

ఇట్లు శ్రమణనాయకు లేగురును - నాజనులచేఁ బూర్వపక్షితులైనారు.

కడకు వారిలో నారు 'ఈ శ్రమణ గౌతముఁడు ప్రసిద్ధ నాయకుఁడు. అతనిమాటలు శ్రావకులు మన్నింతురు. అతనికడ నివసింపనిచ్ఛగింతురు. ఒకనాఁడు బుద్ధుఁడు ధర్మోపదేశ మొనర్చుచుండెను. దానిని వినుచున్న భిక్షువులలోఁ నొకఁడు పాపము! దగ్గినాఁడు. వేఱొక భిక్షువు - 'ఇచట సద్దు సేయకుము! మన శాస్త్ర ధర్మోపదేశ మొనర్చుచున్నాఁ' డని యదలించెనట! నూర్లకొలఁది శ్రమణులకు బుద్ధుఁడు

* వాద వివాదములు గావించికొనెడు చోటు;

ధర్మోపదేశ మొనర్చునపుడుగూడ - నొక చిన్నయలికిడి వినరాదు. జనులెంతో యాదరముతో నాతనిబోధలు విందురు,' అని యనుకొనిరి.

బుద్ధుఁడు :- ఉదాయీ! నా శ్రావకులు నన్నాదరించుటకు గారణ మేమనుకొందువు! వారు నాతో వసింప నిచ్ఛగించుటకు హేతువేమి?

ఉద:- దీని కైదుకారణము లని నేనూహింతును. (1) తమరల్పాహారమును సేవింతురు. అల్పాహారమును వర్ణింతురు. (2) ఏదేనియొక చీవరముతో సంతుష్టులగుదురు. సంతుష్టి నభినందింతురు. (3) దొఱకినభిక్షతో సంతోషపడుదురు. సంతోషమును వర్ణింతురు. (4) వసించుట కేచోటు దొఱకిన నదియే జాలు ననుకొందురు. ఇతరు లట్లుండవలె నందురు. (5) తమ రేకాంతమునందు వసింతురు ఇతరు లేకాంతము సేవింపవలెనని భావింతురు.

"ఈ యైదు కారణములతో - భగవంతునిపై శ్రావకులకెక్కువ ప్రీతి యని నాయూహ!"

బుద్ధుఁడు జెఱునవ్వెను. "ఉదాయీ! శ్రమణగౌతముఁడల్పాహారి యనుట నిజమే. కాని - నాకన్న నల్పాహారమును సేవించు శ్రమణులు భిక్షువులలో నున్నారు. వారుగూడ నన్నాదరింతురు. వారుగూడ నాదగ్గర వసించుటకై యాశింతురు."

దొఱకిన చీవరముతో నేను సంతుష్టుఁడ నౌదునంటివి. సత్యమేగావచ్చును. కాని - మాభిక్షువులలో - శ్మశానమునందుఁ బడిన పేలికలనుధరించి - దృఢ్తినపు భిక్షువు

లున్నారు. దారులందుబడిన పేలికలు చించి కట్టికొను వారున్నారు. వారుగూడ నన్నాదరింతురు. నేనుమాత్ర మప్పుడపుడు గృహస్థులొసఁగెడు వస్త్రముల ధరింతును.

దొఱకినభిక్షతో సంతుష్టుఁడ నగుట నాగౌరవమునకు గారణమంటివి. దొరకిన యన్నముతోఁ దృప్తిపడు గుణము నాకున్నది. నిజమే. కాని - నాశ్రావకులం దల్పభిక్షతో దృప్తిపడువా రనేకులుగలరు. పనిగట్టుకొని వారు పెద్ద యిండ్లలోనొసఁగు భిక్షను వర్జింతురు. అట్టివారుగూడ నన్నభిమానింతురు. నాకడ నుండగోరుదురు. నేనుమాత్ర మపుడపుడు గృహస్థుల యామంత్రణమును స్వీకరింతును.

నివసించుట కేచోటు దొరకిన దానితో నేను దృప్తి బడుదునంటివి. నిజమే! కాని - యుదాయీ! నాశిష్యులలో నేదేని యొక చెట్టుసీడ వసించి దృప్తిపడువారున్నారు. ఆరు బయట నివసించువా రున్నారు. వారికిఁగూడ నన్నుజూచిన నభిమానమే. సంవత్సరమున కెనిమిది నెల లాచ్ఛాదితమైన చోటునే జూడక బయలున బ్రదుకు వ్రతముగలవారున్నారు. వారికిని నాపై మక్కువయే. నేనుమాత్ర మపుడపుడు పెద్ద విహారములలో వసింతును.

నే నేకాంతవాసి నంటివి. నిజమే. కాని - నాభిక్షువులలోఁ గేవల మరణ్యములందే నివసించువా రనేకులు. వారు బదునైదు దినముల కొక్కసారి మాత్రమే 'ప్రతిమోక్షము' కొఱకై భిక్షువులతోఁ జేరుదురు. వారుగూడ నన్ను గౌరవింతురు. నేనుమాత్ర మపుడపుడు భిక్షుణీ - భిక్షువులతో

వసింతును. ఉపాసకులు - నుపాసికలు-రాజులు - మంత్రులు యితర పంథలకుఁ జెందిన శ్రమణులు వీరితోఁ జేరి వసింతును.

ఉదాయీ! నన్ను శ్రావకులు గౌరవించుటకు నీవు జెప్పిన యైదును గారణములుగావు. ఆ యైదు కారణములును వినుము. 1. శ్రమణగౌతముఁడు శీలవంతుఁడు. 2. అతఁడు యదార్థమైన ధర్మోపదేశ మొనర్చును. 3. ప్రజ్ఞావంతుఁడు. నా శ్రావకులు నాతో వసించుట కిది ముఖ్యకారణము. 4. నేను శ్రావకులకు నాలుగార్య సత్యములు బోధింతును.

5. ఆధ్యాత్మికమగు నున్నతికి భిన్నభిన్న మార్గములు బోధింతును. ఈ యైదుగుణములతో నన్ను శ్రావకులు మన్నింతురు. నాతో వసింపగోరుదురు.

## భిక్షువులతోగూడ నుండునపుడు భగవంతుని దినచర్య

తన భిక్షుసంఘమందు బుద్ధుఁడెట్టి కఠిన నియమముల నేర్పరచియుండెనో - మనకుఁ దెలిసినదిగదా! భిక్షువులతో నుండునప్పుడు బుద్ధుఁడుగూడ నెంతయో శాంతముగ బ్రవర్తించువాఁడు. ఆ విషయము యీ సుత్తమునుండియే తెలిసినది. అపుడపుడు బుద్ధుఁడు గృహస్థుల యామంత్రణము స్వీకరించెడువాఁడు. వారొసఁగిన వస్త్రములను ధరించుటయు కూడుక. కాని యల్పాహారమును- సేవించుటందును - నన్న వస్త్రములు సామాన్యమైనవే గ్రహింపవలెనను నియమమందును - ఏకాంతవాసమే పాటింపవలెను ఆచరణమునందుగూడ నాతఁడు దక్కువవాఁడుగాడు. భిక్షుసంఘముతోఁగూడి బ్రయాణించునప్పుడొక యూరిబయటనో; లేక యొక యుపవనమందో, లేక యొక చెట్టునీడనో వసించెడు

వాఁడు. రాత్రి ప్రథమయామమున సింహశయ్యపై బరుఁడును. ప్రాతఃకాలముననే యాతఁడు లేచును. కల్యములందాతని కటునిటు బచారు సేయుట వాడుక. లేక ధ్యానస్థుఁడై కూర్చొనును.

సమయమైనంతనే బుద్ధుఁడు భిక్షాటనకు బయలుదేరును. దారిలోనైన - భిక్షాటన మొనర్చునప్పుడైన- నెనరేని సాధకు లగుపడిన వారికాతఁ డుపదేశించుట వాడుక. 'సిగాలోవాదసుత్తము' దారి నడచుచునే బుద్ధునిచే నుపదేశింపఁబడెను.

కాని - భరద్వాజ సుత్తము - యట్టివే యైన యితరములు గొన్ని భిక్షాటన మొనర్చునపు డుపదేశించినవి.

కడుపు నిండు నంతవరకు భిక్ష దొరికి నంతనే బుద్ధుఁడూరి వెలుపలకు వెళ్ళువాఁడు. ఒక చెట్టు నీడనో - మరి యేదేని ప్రశస్తమైన చోటనో గూర్చుండి యాతఁ డా యన్నమును భుజించును. పిదప విహారము లోనికి వెళ్ళి గొంత విశ్రమించును. ఆ పై ధ్యానమునకు గూర్చొనును. సోణదండుఁడు - కూటదంతుఁడు మొదలైన బ్రాహ్మణులతో జరిగిన సంవాదము లిట్టివే. ఈ విషయము దీఘనికాయమున వచ్చును. గృహస్థులు రానినాఁడు భగవానుఁడు భిక్షుల కుపదేశించును.

తరువాత నొకటి రెండు రోజు లాతఁడు భిక్షువులతో గూడి ప్రవాస మొనరించును. తూర్పున భాగల్పూరు- పశ్చిమమున గురురాజుల యొక్క కల్మాషదమ్య మను పట్టణము - నుత్తరమున హిమాలయములు - దక్షిణమున

వింధ్యము – వీని నడిమి నేలలు భిక్షు గణముతో బుద్ధుఁడు దిరిగెడు చోటులు.

## వర్షావాసము

భగవానుఁ డుపదేశముల కారంభించినపుడు వారి భిక్షువులు జాల గొద్దిమందియే యుండిరి. వారు వర్షాకాలము లందొక చోట గుమి గూడుట లేదు. ఆ భిక్షువులు దేశములు దిరిగి ప్రచార మొనర్చు చుండిరి. ఇతర శ్రమణులు వర్షా కాలములం దొక చోటనే యుండుట వాడుక. ఈ బౌద్ధ భిక్షువుల వర్తనము మాత్రము విభిన్నముగ నుండెను. ఇది లోకులకు గిట్టలేదు. దానిపై వ్యాఖ్యలు బయలుదేరినవి. బుద్ధుఁ డిది గ్రహించెను. సామాన్యులను దృప్తిబరుప వలె నని వర్షాకాల మందుఁ గనీసము మూఁడు నెలలైనను బౌద్ధ భిక్షువు లొక చోటనుండి గదలరాదని యేర్పరచెను.*

మహావగ్గ యందు వచ్చిన వృత్తాంతమునకుఁ బై విషయము సారాంశము. కాని – యీ కథను సర్వాత్మనా సత్యమనుటకు వీలులేదు. భిక్షువు లందరును వర్షాకాలమం దొకటే చోటఁ జేరి రనుటకు నిదర్శనములు లేవు. బుద్ధుఁ డొనర్చిన నియమములకే యపవాదము లెన్నో గలవు. చోరులు మొదలైన యుపద్రవములు గలిగినప్పుడు – వర్షా కాలమైనను భిక్షువు లొకచోట నుండి మరి యొక చోటికి వెళ్ళెడు వారు.

---

* 'బౌద్ధసంఘాచా పరిచయ' పృ-24

బుద్ధుఁ డుపదేశింప నారంభించినప్పు డాతని కెక్కువ ప్రసిద్ధి లేదు. అందుచే నతనికి గాని - యాతని భిక్షు సంఘమునకు గాని వర్షాకాలమం దొక టే చోట నివసించు నను కూలము లుండ లేదు. బుద్ధుఁడు ప్రసిద్ధుఁడైన వెనుక యనాథ పిండికుఁడు శ్రావస్తి దగ్గర 'జేతవనమం' దొక పెద్ద విహారమును ♦ గట్టి యిచ్చెను. మరి కొన్ని దినముల తరువాత విశాఖ యను నుపాసిక యా యూరి దగ్గరనే బూర్వారామ మనెడు ప్రాసాదమును గట్టించి బౌద్ధ సంఘమున కిచ్చినది. ప్రాయము పడమటికి వ్రాలు నప్పటికి భగవానుఁడు సాధారణముగ నీ రెండు చోటులనే గాలము గడిపెడువాఁడు. ఇతరస్థలములందున్న యుపాసకు లాహ్వానించినచో నాయన-యాపల్లెలకుగూడ వెళ్ళివచ్చుట వాడుక. వర్షాకాలము వచ్చుచున్నదనఁగా - జనులు భిక్షువులకు గుడిసెలు మొదలైనవి వేసి యిచ్చుచుండిరి. బుద్ధుని కొక ప్రత్యేకమగు గుడిసె యుండెను. దాని పేరు 'గంధకుటి'.

వానకాలమందుఁ జుట్టుపట్టుల నున్న యుపాసకులు బుద్ధుని దర్శించి యాతని యుపదేశములు వినెడువారు. కాని-వారు దినమును బుద్ధుని నాహ్వానించి తమయింట భిక్ష యొనర్చెడు వారుగారు. ఎన్నఁడో యొకనాఁడు బిలచుచుండిరి. దినమును బుద్ధభగవానుఁడు, భిక్షువులును బిచ్చము పైననే జీవించెడివారు.

---

♦ చూ: 'బుద్ధలీలాసార సంగ్రహము' పు: 167-179

## రోగార్తులైన భిక్షుకుల విచారించుట

భిక్షువులలో నెవఁడేని రోగార్తుఁడైనపుడు బుద్ధుఁడు రెండవమారు దాను గావించు ధ్యానమైనతరువాత వారి సమాచారము విచారించెడువాఁడు. ఒకసారి మహాకాశ్యపుఁడు రాజగృహములోని పిప్పలి గృహమందు రోగార్తుఁడయ్యెను. అపుడు బుద్ధుఁడు వేళువనమం దున్నాఁడు. సంధ్యలందు భగవానుఁడు మహాకాశ్యపుని విషయము విచారించువాఁడు. ఈ విషయము 'బోజ్ఝంగసుత్తము'యొక్క బదునాల్గవసుత్తమునవచ్చును. పదునైదవ సుత్తమున మఱియొక కథయున్నది. మోగ్గల్లానుఁడు జబ్బువడెనట. అపుఁడు భగవానుఁ డాతనిసమాచారము విచారించెనట. రోగార్తులిద్వొరకును బుద్ధుఁ డేఁడు నిషిద్ధపదార్థముల నుపదేశించెను. వా రా నియమము ననుసరించి రోగవిముక్తులైనారు.

## కొన్నిదినముల యేకాంతవాసము

ప్రవాసమందున్నను, లేక వర్షాకాలమందొకచోట యున్నను, రాత్రులందు ప్రథమ, తృతీయ యామములలో బుద్ధుఁడు ధ్యానస్థుఁడగుచుండె నని ముందే తెల్పితిమి. భగవానుఁడు వైశాలికడ మహావనమందు 'కూటాగారశాల' యం దుండెనట! అట బదునైదు దివసము లేకాంతవాసము; కాని దనకొఱకై భిక్షను దీసికొనువచ్చు నొకభిక్షువు మాత్రము దన్ను సమీపించుటకు బుద్ధుఁడనుమతి నొసఁగెను. ఈ విషయము 'ఆనాపానస్మృతి సంయుత్తము'యొక్క తొమ్మిదవ సుత్తమున వచ్చును. ఈ సంయుత్తముయొక్క

బదునొకండవ సుత్తమునందుగూడ నీవృత్తాంత మున్నది. అది యిది:

ఒకసారి బుద్ధుఁడు 'యిచ్ఛానంగల వనమం'దుండెను. అపుఁడు బుద్ధుఁడన్నాడు "భిక్షువులారా! నేను మూఁడు నెల లేకాంతమం దుండగోరితిని. నాకు భిక్ష గైకొనివచ్చువాఁడు దప్ప నితరభిక్షుకు లెవ్వరును నాకడకు రారాదు." మూఁడు నెలలు గడచినవి. ఏకాంతవాసమును ముగించిన బుద్ధుఁడు భిక్షువులతో ననెను. "ఇతరసంప్రదాయ పరివ్రాజకు లెవ రైనను బుద్ధుఁ డీ వర్షాకాలమం దెట్టి సమాధియం దుండెనని మిమ్మడిగినచో నాయనది *'యానాపానస్మృతి సమాధి' యని పల్కుఁడు"

పై సుత్తమందుగూడ బుద్ధుఁడు బదునైదు దినము 'లానాపానస్మృతి సమాధి' యందుండెనని జెప్పఁబడినది. దీనిపిండితార్థ మిది. ఈ సమాధి మహాత్మ్యము నలుగురికిఁ దెలిసి రావలెనని బుద్ధుని యూహ. పదునైదు దినములు లేక మూఁడు నెల లీభావన నొనర్చినను శరీర శోషణము మొదలైన యవస్థలు గలుగవు. పైగా శరీరము స్వస్థముగూడ నైనది.

బుద్ధుఁడు భిక్షుసంఘమును విడిచి విలిక్తసేవియై 'పారిలేయక వనమం'దుండుట, యీ పుస్తకమందే యేడవ ప్రక

---

* 'ఆన' మనఁగా నాశ్వాసము, 'అపానము' ప్రశ్వాసము. వీనిని సాధించి, పొందుసమాధికి 'అనాపానస్మృతిసమాధి' యని పేరు. దీని విషయము 'సమాధిమార్గము'న వచ్చును. చూ: 'సమాధిమార్గము' పుట; 38 - 48.

రణమునందు (పూర్వార్ధపుట॥ 165) వచ్చును. ఈ వృత్తాంతముల బట్టి యెప్పుడప్పుడు బుద్ధభగవానుఁడు దన్నెవ్వరు-జూడకుండుచోటఁ గొన్నిదినములు గడపెడువాఁడని దెలియును. కాని బుద్ధుఁడు ప్రసిద్ధుఁడైన తరువాత ననేకులాతని జూడవచ్చెడువారుగదా! అపుఁడతని కేకాంతవాసమున కవకాశము దొరకెడిదిగాదు. సంఘముతోనుండియే గొంతకాలము వాని కలిపుఁడై యుండ నారంభించెనని యూహించుకొనవచ్చును. కాని యాతని నలుబదియైదు వర్షముల ప్రచారకాలమందు యిట్టి సంఘటన లేకోలఁదియో దప్ప, లేవు.

ఆ కాలమున 'కాయకల్పప్రయోగము' నకు జాల ప్రసిద్ధి యుండెను. నెలగాని లేక నెలపై బదునైదు దినములుగాని యొక డొక గదియందు గడపి, పథ్యపానములతో నౌషధములను సేవించినచో వానికి బలవీర్యములు గల్గునని నమ్ముచుండిరి. ఈ కాయకల్ప చికిత్సకును, భగవానుని యేకాంతవాసమునకును సంబంధమేమియు లేదు. ప్రసంగవశమున జెప్పితి నంతే. ఏకాంతమునందు భగవంతుఁడే యౌషధమును సేవించెడువాఁడుగాదు. ఆనాపానస్మృతి సమాధిని మాత్రమే భావించెడువాఁడు.

ఏకాంతమున నోరంతకాలము గడపు నాచారము సింహళ - బ్రహ్మదేశములలో నేటికిని గలదు. సయాము నందును, గొలఁదిగా యున్నది. టిబెట్టులోమాత్ర మిది యెక్కువ. కొన్నియెడల దీని కధికమైన ప్రాముఖ్యముఁగూడ గలదు. త్రివిష్టపమునందలి కొందరు 'లామాలు' వర్షముల

కొలది గుహాలయందు గడుపుదురు. వారపుఁడు సిద్ధశక్తులకై ప్రయత్నింతురట.

## శరీరము యొక్క యనారోగ్యము

భగవానుఁడు జబ్బుపడిన వృత్తాంతము లేరెండు— మూఁడో నప్ప నెక్కువలేవు. రాజగృహ సమీపమునందలి వేణువనమం దొకసారి యాతఁడు జబ్బుపడెను. అపుఁడు మహాచందున కాతఁ డేఁడు విధములైన నిషిద్ధపదార్థముల బోధించెనట! చుందుఁ డా నియమమును బాటించెను. బుద్ధుఁడు స్వస్థుఁడైనాఁడు. ఈ వృత్తాంతము 'భోజ్ఝంగ సంయుత్తము'న గలదు.

ఇట్టి కథయే వినయపిటకములోని మహావగ్గమునందు వచ్చును. బుద్ధుఁ డొకసారి జబ్బుపడెను. అపుఁడు * జీవక కౌమార భృత్యుఁ డాతనికి విరేచనమున కొసఁగి జబ్బును బాగు పరచి నాడట! చుల్లవగ్గలో దేవదత్తుని గాథ గలదు. వాఁడు గృధ్ర పర్వతము నుండి బుద్ధునిపై కొక గుండును దొర్లించెను. అది క్రిందబడి ముక్క చెక్కలైనది. కాని దాని యొక ముక్క బుద్ధుని పాదములపైఁ బడెను. దానితో నాతఁడు జబ్బు పడెను. దేవదత్తుఁడు బుద్ధుని జంపునేమో యను భయము భిక్షు సంఘమునకు గల్గినది. భగవానునకు దెలుపకయే వారి నివాస ప్రదేశమును గాపలా కావ దొడఁగిరి. ఈ విషయము భగవానునకు దెలిసెను. వా రానందు నడిఁగినారు. "ఆనందా! యీ భిక్షువు

* చూ: 'బౌద్ధ సంఘాచాపరిచయ' పు: 34

లిట నెందుకు దిరుగుచున్నారు ?” అతఁడు బదులిచ్చెను. “భదంతా ! దేవదత్తుఁడు మీపైఁ గసిగట్టెను. అందుచే వాఁడు దమ్ము హింసించునేమో యని వీరుఁ గాపలా కాయుచున్నారు”. ఆనందు నంపి యా భిక్షువులను బుద్ధ భగవానుఁడు బిలిపించి నాఁడు. ఆతఁడు వారితో ననెను. “భిక్షువులారా ! ఈ నా శరీరముపై మీ రింత జాగ్రత్త దీసికొన వలసిన యవసరము లేదు. నా శిష్యుల సాయమున నీ శరీరమును రక్షించుకొనవలె ననెడు నాస నాకు లేదు. నన్ను మీరు రక్షించు ప్రయత్నము మాని, మీ మీ పనుల యందు బ్రవృత్తులు గండు.

వినయపిటక మందలి పై కథకు సుత్త పిటకమందాధారము గానరాదు. విరేచనమున కిచ్చిన కథ యొక సామాన్యమైన విషయము. దేవదత్తుని కథను మాత్ర మున్న దున్నట్లుగ నమ్ముటకు వీలులేదు. దేవదత్తు నత్యంత నీచునిగ నిరూపించుటకై యెవరో యీ కథ నల్లియుండురు. ఒకవేళ నా కథ నిజమైనను-కాలిపైఁ బడిన యొక రాతి దెబ్బతో జాల దినములు వ్యాధిగ్రస్తుఁ డయ్యె ననుట, నమ్మదగినదిఁ గాదు. ఏది యెట్లున్నను, పైఁజెప్పిన వాని వంటి యొకటి-రెండు విషయములలో దప్ప బుద్ధుని యారోగ్య మెన్నఁడును జెడి యుండలేదని యూహింప వచ్చును.

## ఆరోగ్యకారణము

బుద్ధుఁడు - నతని శిష్యులు యే జాతివా రొసగిన భిక్షనైనను గ్రహించెడువారు. దినమున కొక పూట మాత్రమే వారి భోజనము. ఇట్లున్నను, వారి యారోగ్యము

సంపన్నమై ముఖకాంతి ప్రసన్నమై యుండెడిది. దీనికిఁ గారణ మేమి? ఆ కారణ మీ క్రింది సంవాదమున గలదు.

ప్రశ్న:—అరఞ్ఞే విచరంతానం, సంతానం, బ్రహ్మచారినం
ఏక భుత్తం భుంజమా నానంకేన వణ్ణో వసీదతి.

వీరరణ్యమందే నివసింతురు. బ్రహ్మచర్యమును బాటింతురు. భోజన మొక పూటమాత్రమే. మరి వీరి ముఖము లింత బ్రసన్నముగ నుండుటకు హేతు వేమి?

ఉత్తరము;—అతీతం నానుశోచంతి నప్ప జప్పంతి నాగతం
పచ్చు పన్నేన యాపేంతి తేనవణ్ణో వసీదతి.

గడచిన దానికి శోకింపరు. అనాగతమైన విషయమునకై దారుమారు పడరు. వర్తమాన కాలమును సంతోషముగ గడుపుదురు. ఇదే వారి ముఖకాంతికి కారణము.*

## కడపటి యనారోగ్యము

భగవానుని యొక్క కడపటి యనారోగ్య విషయము 'మహా పరినిబ్బాన సుత్తము'లో♦ 'వర్ణింపఁబడినది. ఆ వర్షాకాలమునకు ముందు భగవానుఁడు రాజగృహమం దుండెను. అటనుండి బుద్ధుఁడు భిక్షుసంఘముతోఁ బ్రవసించుచు వైశాలికి వచ్చినాఁడు. ఆ యూరి దగ్గరనున్న 'బేలువ' మనెఁడు గ్రామమం దాతఁడు గాలము కాలము గడపుచుండెను. భిక్షువు లెప్పటివలెనే వైశాలి యొక్క సమీపముననే దమ నివాస మేర్పరచి కొన్నారు. ఆ వర్షాకాలమున భగవానుఁడు

* చూ: దేవతా సంయుత్తము, వగ్గ, 1. సుత్తము 10.
♦ చూ; 'బుద్ధలీలాసార సంగ్రహము' పు. 292-312

జాల జబ్బు వడెను. కాని యాతఁడు దన జాగ్రుతిని వదల లేదు. భిక్షు సంఘమునకు గనుమఱుగై దాను పరినిర్వాణ మందుట గౌతమున కంత యిష్టమైనది గాదు. అందుచేఁ దన శారీరక బాధల నెట్లో యణచికొని, యాతఁడు గొన్ని దినములు గడపినాఁడు. కొంతకాలమునకు శరీరము బాగై నది. అప్పు డానందుఁడు బుద్ధునితో ననెను: "భదంతా! మీరు దుఃఖమును గడచుట మా కెల్ల సమాధాన కారణము. తాము శారీరక బాధతోఁ గష్ట పడుచున్నప్పుఁడు నా కేమియు దోచనేలేదు. నా ప్రాణము దుర్బలమై పోయినది. బుద్ధియే తబ్బిబ్బయ్యెను. ధార్మికోపదేశములు గూడ మఱువ నారంభించితిని. కాని బుద్ధుఁడు దన శిష్యులకు జెప్పక గడపటి ధర్మోపదేశ మొసర్పక పరినిర్వాణ మందడను నొక యాశ నాజీవమును నిల్పినది."

బుద్ధుఁడు జిఱు నవ్వెను. "ఆనందా! భిక్షువులు నా నుండి యింకేమి వినవలెను? నా ధర్మమార్గము నంతయూ నింతకు ముందే వారికి స్పష్టముగ వివరించితిని. భిక్షుసంఘమున కెవఁడు దాను నాయకుఁడు గావలెనని గోరునో, భిక్షులు నిరంతరము దనపై నే యాధారపడి యుండవలెనని గోరునో, యట్టివాఁడు గడపటి బోధలు-మొదలైన తతంగము లొనర్చును. ఆనందా! భిక్షుసంఘమునకు నాయకుఁడు గావలెనను నాశ నాకులేదు. వారు నిరంతరము నాపైననే నాధార పడవలె నను దురాశయు నాకు లేదు. అట్టిచో నేను గడపటి సందేశ మివ్వవలె నను నియమ మేమున్నది?

ఆనందా! నేను వృద్ధుఁడనైతిని. నా శరీరము దుర్బలమైనది. నా వయసిప్పు డెనుబది. విఱిగినబండి కేదో యొక కట్టె నతికించి నడిపించినట్లు నా శరీరమును నడిపించుచున్నాను. నిరోధ సమాధిని భావించినప్పుఁడు మాత్రమే నా దేహము కొంచెము స్వస్థమైనది. ఇకమీఁదట మీరు నాపై నాధారపడి ప్రయోజనములేదు. మీరు మీపై ననే యాధారపడవలెను. ధర్మమే మీకు మార్గమునుజూపు దీపము. ఆత్మనే శరణు జూడుఁడు. ధర్మమునే యాశ్రయింపుఁడు."

ఇంత దుర్బలముగనున్నను భగవానుఁడు 'చేలువ' గ్రామమునుండి వైశాలికి వచ్చినాఁడు. ఆనందునితోఁ జెప్పి పంపి భిక్షుసంఘమును బిలిపించినాఁడు. మహావన మందలి కూటాగారశాలలో వారందరు గుమిగూడిరి. బుద్ధుఁడు వారి కుపదేశించినాఁడు. పిదప భిక్షుసంఘముతోఁ భాండగ్రామము, హస్తిగ్రామము, నామ్రగ్రామము, జంబుగ్రామము, భోగనగరము మొదలైన ప్రదేశములన్నియు బుద్ధుఁడు జుట్టెను. కడపట నతఁడు 'పావా' నగరమునకువచ్చి చుందుని యామ్రవనమున వసించెను. చుందుఁడు భగవంతుని, భిక్షువులను - దన యింటికి కామంత్రించెను. ఆనాఁడాతఁడు సిద్ధమొనర్చిన పదార్థములలో * సూకరమద్దవము గూడ నొకటి. దానిని భగవానుఁడు భుజించెను. అతని కతిసార రోగమంటుకొన్నది. కాని యావేదనను సహించి భగవంతుఁడు కకుత్థము-హిరణ్యావతి యను రెండు నదులను, దాటి

* ఈ పదమున కర్థవిచార మింతకుముందే జేసితిమి.

కుశినారపర్యంతము నడచినాఁడు. అచట మల్లులశాలవనమం దారాత్రియే, రెండవ యామమున బరమపవిత్రుఁడైన బుద్ధ భగవానుఁడు శరీరమును జాలించెను. అతఁ డందినది పరినిర్వాణము. ఇట్టి - దట్టి దనరాని స్థితి.

ఈ రీతి భగవానుని జీవితము గడచినది. అతని ధర్మ మెంత బోధప్రదములో - యీ జీవిత మంతబోధప్రదము. లోకకల్యాణకరుఁడైన బుద్ధుఁడు దనువును జాలించినాఁడు. కాని - యాతఁడు వెలింగించిన ధర్మదీపము జిఱుగాలి తాకుడులకు నిలిచి - స్నేహమయమై - నాటినుండి నేటివఱకు భిన్న భిన్నరూపములతో వెలుఁగుచునే యున్నది. ఇక మీఁదను-వెలుఁగఁగలదు. మానవజాతి చరిత్ర బుద్ధుని జన్మచేఁ బవిత్రమైనది.

# పరిశిష్టభాగము – మొదటిది

## గౌతమ బుద్ధుని చరిత్రలోఁ బ్రవేశించిన మహాపదానసుత్త ఖండములు

అపదాన (అవదానము) మనఁగా సచ్చరిత్ర. మహాపదాన మనఁగా గొప్పవారి సచ్చరిత్ర. మహాపదాన సుత్తమందు గౌతమబుద్ధునకు ముం దుండిన యార్గురు బుద్ధుల చరిత్రలు, గౌతముని చరిత్రయు గలదు గ్రంథారంభ మందివియన్నియు సంక్షేపముగ వివరింపఁబడియున్నవి. గౌతమునకు ముం దార్గురు బుద్ధు లుండి రంటినిగదా! వారు విపస్సి, సిఖి, వేస్సభూ, కకుసంఘ, కోణాగమన, కస్సప బుద్ధులు. మొదటి మువ్వురును క్షత్రియులు. తక్కినవారు బ్రాహ్మణులు. ఈ యార్గురు బుద్ధుల గోత్రములు, యాయుర్మర్యాదలు, వారు సంబోధి నందిన వృక్షముల నామములు మహాపదాన సుత్తమున గలవు. ఇంతేగాదు – వారికి ముఖ్యులైన యిరువురు శిష్యులపేరులు, వారి భిక్షుసంఘముల గొలందులు వారి యుపస్థాపకుల దల్లిదండ్రులు, వీరిని గుఱించిన వివరములును నున్నవి. ఆ కాలము లందలి రాజులు, వారి రాజధానులు, మొదలైన విషయములును – నా సుత్తముయొక్క మొదటఁ గలవు. ఈ వివరములైన తరువాత, విపస్సి బుద్ధుని చరిత్రమాత్రము విపులముగ వర్ణింపఁబడ్డది. ఈ పౌరాణిక చరిత్రనుండి బుద్ధుని చరిత్ర లోనికిఁ జొనిపిన విషయము లీ క్రింద వర్ణింపఁ బడుచున్నవి.

౧

బుద్ధుఁడనెను. "భిక్షువులారా! నేటికిఁ గొన్ని కల్ప ములకు ముందర్హతుఁడైన సమ్యక్సంబుద్ధుడీలోకమున జన్మించెను. అతఁడు క్షత్రియుఁడు. కౌండిన్య గోత్రుఁడు. అతఁడు జీవించిన దెనుబది కాలవర్షములు; పాటలీవృక్షము క్రింద నతఁడు సంభోధినందెను. అతని ప్రధానశిష్యు లిద్దరు ఖండ–తిస్సులు. అతనికి మూఁడు భిక్షుసంఘము లుండెడివి. ఒక సంఘమందున్న భిక్షు లాఱున్నరలక్ష. రెండవ సంఘ మందొక లక్ష భిక్షువు లుండిరి. మూఁడవదానిలో నెనుబది లక్షలట! వీరందరు క్షీణాశ్రవులే. అశోకుఁడు వీరిలో నగ్ర సేవకుఁడు. అతని తండ్రి బంధుమ. అతఁడు రాజు. బంధు మతిరాణి యాతని తల్లి. వారి రాజధాని బంధుమతి.

౨

1. "భిక్షువులారా! విపస్సి బోధిసత్త్వుఁడు తుషిత దేవ లోకము నుండి చ్యుతుఁడై దల్లి యుదరమున బ్రవేశించెను. ఆమె స్మృతిమతి. జాగృతి గలది. అందుకే యాతఁడామె గర్భమునఁ బ్రవేశించెను. ఇది స్వాభావికమైన విషయమే.

2. భిక్షువులారా! బోధిసత్త్వుఁడు తుషిత లోకమందుండి మాతృగర్భమున బ్రవేశించునప్పుఁడు దేవతలు, మారుఁడు, బ్రహ్మ, శ్రమణులు, బ్రాహ్మణులు వీరిచేతఁగూడిన యీ లోకమందు బ్రహ్మాండమైన వెలు గాక్రమించును. దాని తేజస్సు, దేవతల కాంతిని గూడ వెనుక వేయున ట్లుండును. భిన్న భిన్న జగత్తులలోఁ గొన్ని ప్రదేశములు కేవల మంధ

కార బంధురము లున్నవిగదా! వానిలో మహానుభావు లైన సూర్య చంద్రుల కాంతి-బడనే పడదు. ఆచోటులం గూడ దేవతలకాంతిని వెనుక వేయు కాంతి విపులమై యాక్రమించును. ఆ చోటులందున్న ప్రాణులు బరస్పరము జూచు కొనియే యెఱుఁగవు. ఈ వెలుగులో నవి బరస్పరము జూచికొనును. ఓహో! ఇక్కడ మావంటి యితర ప్రాణులు గొన్ని గలవని యెఱుఁగును. దశ సహస్ర జగత్తులు హాహాకార మొనర్చును. ఈ యన్నింటి యందును దేవత తలకాంతిని వెనుక వేయు కాంతి యాక్రమించును. ఇది స్వభావమే!

3. భిక్షువులారా! బోధిసత్త్వుఁడు తల్లి గర్భమున బ్రవే శించు నప్పుడు శిశువునకును, దల్లికిని- యెవరినుండియు నణుమాత్రమును భయము గలుగగూడ దని నలుగురు దేవపుత్రులు నాల్గుదిక్కుల నుండి రక్షించుచుందురు. ఈ విషయము సాధారణ మైనదే.

4. బోధిసత్త్వుఁడు దల్లి కడుపున బ్రవేశించు నప్పుడా తల్లి సాధారణముగ శీలవతి యగును. ప్రాణఘాతము, దొంగ తనము, వ్యభిచారము, కల్లలు, మద్యపానము వీని వాసనలుం గూడ నామె కంటవు. ఇది దగినదే గదా!

5. బోధిసత్త్వుఁడు గడుపున ప్రవేశించినపుడా తల్లికి పురుషుని విషయమున గామాసక్తియే మూలముట్టముగ నశిం చును. ఎవడైనను గామాసక్తితో నామెను దరియుటకే శక్తుఁడు గాఁడు. ఇందులో నాశ్చర్య మేమున్నది?

6. భిక్షువులారా! బోధిసత్త్వుఁడు తల్లి కడుపున బ్రవే శించి నపుడా మెకైదు సుఖోప భోగములు గలుగును.

సంక్రమించిన యా మైదిటితో నామె సుఖ మనుభవించును. ఇందులో వింత యేమి?

7. బోధిసత్త్వుఁడు కడుపున బడినది మొద లామె కే రోగము నంటదు. ఉపద్రవము లంటవు. ఎల్లప్పుఁ డామె సుఖియై యుండును. ఆమెకుఁ దన యుదరమందున్న బోధి సత్త్వుఁడు సర్వేంద్రియ సంపూర్ణుఁడై గనపడుచు నేయుండును. ఒకా నొక వైడూర్యమణి, యుత్తమ జాతిది, యష్టకోణ ములు గలది, యున్నదే యనుకొనుము; ఏ దోసఁగు లేక స్వచ్ఛమై శుద్ధమై, సర్వాకార పరిపూర్ణమై యుండె నను కొనుము; దానిలో నీలము, యెఱుపు, పసుపు, దెలుపు మొదలైన వర్ణములు ద్రాడులు బెనచినట్లు, స్పష్టముగ గనుపించు చుండును గదా! ఆరంగులు వేరుగ, మణివేరుగ గన్నులున్న వానికెల్ల నగపడునుగదా! అట్లే బోధిసత్త్వుని తల్లి, యుదరస్థుఁడైన తన కుమారుని స్పష్టముగ వీక్షిం చును. ఇందులో వింత లేదు.

8. బోధిసత్త్వుఁడు జన్మించిన యేడవ దినముందే దల్లి మరణించును. ఆమె తుషిత లోకమున జన్మించును. ఇది సాధారణ నియమము.

9. సాధారణముగ స్త్రీలందరును దొమ్మిదవ లేక పది యవ మాసమున బ్రసవింతురు. బోధిసత్త్వుని తల్లి యట్లు గాదు. పది మాసములు సంపూర్ణముగ నిండిన తర్వాతనే యామె కనును. ఇది సాధారణ నియమము.

10. భిక్షువులారా! కొంద ఱుపవిష్టులై బ్రసవింతురు. కొందఱు బండుకొని ప్రసవింతురు. బోధిసత్త్వుని తల్లి యట్లు

గాదు. ఆమె నిల్చుకొనియే ప్రసవించును. ఇది సాధారణ నియమము.

11. బోధిసత్త్వుఁడుఁ దల్లి కడుపు నుండి, గడ్డకు వచ్చి నప్పుఁడు దొల్త నాతనిని, దేవతలు గ్రహింతురు. పిదప మనుష్యులు గ్రహింతురు. ఇది సాధారణ నియమము.

12. బోధిసత్త్వుఁడు దల్లి కడుపునుండి గడ్డకు వచ్చిన తరువాత, భూమిపైఁ బడుటకు ముందే యాతనిని నల్గురు దేవపుత్రు లెత్తికొందురు. ఆ శిశువును తల్లి కప్పగించి, 'మాతా! ఇతఁ డానంద స్వరూపుఁడు. మహానుభావుఁడైన పుత్రుఁడు నీకు గల్గెన'ని యామె కప్పగింతురు. ఇది సాధారణ నియమము.

13. బోధిసత్త్వుఁడు జననీ గర్భమునుండి గడ్డకు వచ్చుట యుదకోదక, శ్లేష్మ, రుధిరములతోఁ గూడ జరుగదు. శుద్ధుఁడై, స్వచ్ఛుఁడై, యాతఁడు వెలికి వచ్చును. స్వచ్ఛమైన యొక పట్టు వస్త్రముపై, మణి నుంచితిమే యనుకొనుము. ఆ మణితో వస్త్రము మలిన మగునా? లేక వస్త్రమేమైన మణిని మలినమొనర్చునా? అట్లు జరుగదు గదా! అట్లే బోధిసత్త్వుఁడు గర్భమునుండి వెలికివచ్చి నప్పుఁడు బరిశుద్ధుఁడై యుండును. ఇందులో వింత లేదు.

14. భిక్షువులారా! బోధిసత్త్వుఁడుఁ దల్లి కడుపునుండి గడ్డకు వచ్చునప్పు డంతరిక్షము నుండి రెండు జలధారలు ప్రవహించును. ఒకటి యుష్ణోదక ధార, రెండవది శీతల జల ధార. ఈ రెండు ధారలును దల్లిని గొడుకును గూడ శుద్ధ మొనర్చును.

15. పుట్టినవెంటనే బోధిసత్త్వుఁడు పాదములపై నిలచును. ఉత్తరమువైపున కాతఁ డేడడుగులు వేయును. అప్పుడా శిశువుపై నిశ్వేతచ్ఛత్రము వెల్గును. బోధిసత్త్వుఁడు నాల్గుదిక్కులుఁ గలయఁజూచి, 'నే నీజగమున నగ్రగామిని, జ్యేష్ఠుఁడను. శ్రేష్ఠుండను ఇది కడపటిజన్మ. నాకిక బునర్జన్మ లేద'నిగర్జించును. ఇవి సాధారణ నియమము.

16. భిక్షువులారా! బోధిసత్త్వుఁడు దల్లికడుపునుండి గడ్డకువచ్చినప్పుడు దేవతలు, మారుఁడు ... బ్రహ్మ (తక్కిన విషయము రెండవ శ్లోకమునందువలెనే) ... ...

3

భిక్షువులారా! విపస్సి కుమారుఁడు జన్మించిన పిదప బంధుమారాజునకుఁ గలవచ్చెను. ఆకలలో నెవరో 'మహారాజా! నీకు బుత్రోత్పత్తియైనది. పోయిచూడు' మన్నటు లయ్యెను. బంధుమారాజు విపస్సి కుమారునిగాంచి నాఁడు. జ్యోతిష్కుల బిలిపించి, యాతని లక్షణముల బరీక్షింపం డనెను.

జ్యోతిష్కు లన్నారు. "మహారాజా! నీవు ధన్యుఁడవు. మహానుభావుఁడు నీకు బుత్రుఁడై జన్మించెను. నీ కులమం దిట్టివాఁడు జన్మించుట యా వంశముయొక్క భాగ్యము. ఈతనికి మహాపురుష లక్షణములు ముప్పది రెండున్నవి. ఈ జీవితమునకు రెండే రీతులున్నవి. మూఁడవది లేదు. లేదా! యితఁడు గృహస్థుఁడై-ధార్మికుఁడై జతుస్సముద్ర పర్యంత భూమి నేలును. రాజ్యమున శాంతిదీపమును వెలార్చును. ఏడురత్నములతో గూడిన జక్రవర్తియగును. అవి యివి.

చక్రహస్త్యశ్వ, మణి, స్త్రీ, గృహపతి పరిణాయక రత్నములు. ఇతనికి శత్రుమర్దనులైన కుమారు లనేకమంది గల్గుదురు. వారును శత్రుల నిర్జించి సముద్ర పరివేష్టితమైన భూమి నేలుదురు. లేదా, యితఁడు ప్రవ్రజించును. సన్యాసియైనచో జగమునం దర్హతుఁడై సమ్యక్సంబుద్ధుఁడై యవిద్యను దూరీకరించును.

మహారాజా! ముప్పదిరెండు లక్షణము లేవియో వినుఁడు. 1. ఇతఁడు సుప్రతిష్ఠితపాదుఁడు. 2. ఇతని యడుకాళ్ళలో సహస్రారములు గలిగి, నేమి నాభులతోఁ గూఁడిన సర్వాకార పరిపూర్ణములు జక్రములు గలవు. 3. ఇతని కరచరణములు దీర్ఘములు 4. అంగుష్ఠములు బొడవులు 5. కాలుసేతులు మృదువులు 6. తొడలు సమానములు 7. మడిమలు శంఖములవలె వర్తులములు 8. హరిణి జంఘల వంటి జంఘలు 9. నిలచికొని యేమాత్రము వంగక యున్నపుడే యితని హస్తతలములు జానువుల స్పృశించును. 10. ఈతని వస్త్రగుహ్యము గేశాచ్ఛాదితము 11. ఇతని కాంతి బంగారువంటిది 12. చర్మము సూక్ష్మమైనదగుటచే నితని యొడలికి ధూళి యంతగా నంటికొనదు. ఇతని రోమకూపములం దొక్కొక్క వెంట్రుకయే మొలచును. 14. ఇతని కేశములూర్ధ్వాగ్రములు, నీలములు, సోగలైనవి, దక్షిణావర్తములు. 15. అవయవములు సరళములు. ఒడలియొక్క యేడు భాగములు నిండికొనియుండును. 17. ఈ కుమారుని శరీరోర్ధ్వ భాగము సింహముయొక్క ముందుభాగమువలె నుండును. 18. స్కంధములు సంభరితములు. 9. ఇతఁడు న్యగ్రోధ

వృక్షమువలె వర్తులాకారుఁడు. పొడవెంతయో లావంత. లావునకుఁ దగిన పొడవు. 20. ఇతని రెండు స్కంధములు నొకటే రీతిగ వర్తులములు. 21. ఇతని నాల్క యుత్తమము. 22 చిబుకము సింహము చిబుకమువలె నుండును. 23. ఇతనికి దంతములు నలువది. 24. అవి సరళములు 25. నిరంతరములు 26. పాండుశుభ్రములు. 27. ఇతని జిహ్వ పొడవుగ నుండును. 28. ఇతని కంఠనాదము కలవింకపక్షి నాదమువలె మనోహరము. 29. కనీనికలు నల్లనివి 30. ఆవుయొక్క గన్గ్రుడ్లవలె నీతని కంటిపాప లుండును. 31. ఈతని కనుబొమ్మలలో మృదువైన తూలికాతంతువులవలెఁ దెల్లని లవములుండును 32. ఈతని శిరస్సు యుష్ణీషాకారమై (అనఁగా నడుమ గొంచెమెత్తైనదై) యుండును.

౪

బంధుమారాజు తనయునికై మూఁడు ప్రాసాదములు నిర్మించెను. ఒకటి వర్షాకాలము కొఱకు – వేఱొకటి హిమానీసమయమునకు – మూఁడవది వేసవికాలమునకు. పంచేంద్రియములను సుఖింపఁజేయు సమస్త పదార్థములీ ప్రాసాదములలోఁగలవు. భిక్షువులారా! వర్షాకాలమునకైఁ గట్టిన హార్మ్యమందు విపస్సికుమారుఁడు నాల్గు నెలలు గడపును. ఆ హార్మ్యమునిండ స్త్రీలే. ధ్వనించుచున్న వాద్యములే. బుద్ధుఁ డామేడ దిగుట లేదు.

౫

భిక్షువులారా! కొన్నినూర్ల సంవత్సరములకుఁ దరువాత విపస్సికుమారుఁడు సారథితో ననెను. "ఓయీ! శీఘ్ర

ముగ సన్నద్ధుఁడవుగమ్ము. సృష్టి సౌందర్యమును జూచుటకై యుద్యానవనమునకుఁ బోవుదముగాక!." విపస్సికుమారుఁడు - రథస్థుఁడై యుద్యానవనమునకుఁ బయనించినాఁడు. త్రోవలో నొకఁ డెదురుపడెను. వాఁడు భగ్నశరీరుఁడు. నిడుదయూర్పులు విడచుచుండెను గతవయస్కుఁడు. రోగి. శరీరమంతయు వణఁకుచుండెను. వానిని జూచిన బుద్ధుఁడు సారథితో నన్నాఁడు "ఓయీ! యీతని స్థితియేమి? ఇతని శరీరము - వెంద్రుకలు నితరులకువలె లేవే!

సారథి:- మహారాజా! ఇతఁడు ముసలి.

వి:- ఓయీ! ముసలియనఁగా నేమి!

సా:- ఇతని కింక జాలదినములు భూమిపై నాయువు లేదు.

వి:- నేనుగూడ నిట్లే యొకనాఁ డౌదునా?

సార:- తప్పక. మహారాజా! మనమెల్లరము జరాధర్ములమే.

వి:- అయినచో నీనాఁ డుద్యానయాత్ర జాలింతము. తిరిగిపోదము రమ్ము.

సార:- మంచిది.

ఇరువురు రంతిపురమునకు మరలిరి. నాఁడు విపస్సికుమారుని మనస్సు మనస్సులో లేదు. జరాధర్మమైన యీ జన్మముతో నేమి ప్రయోజనము? అని యాతని యాలోచన.

బంధుమారాజు సారథిని బిలిపించినాఁడు. రాజడిగెను. "మీరిరువు రుద్యానవనమునకు వెళ్ళలేదా! వనమునందుఁ గుమారుఁడు సుఖించెనే గదా!"

సా:- మహారాజా ! లేదు.

రాజు:- ఏమీ? మీరు వనమునకుఁ బోలేదా !

సారథి గడచిన వృత్తాంతమును జెప్పెను. విపస్సి కుమారుఁడు సన్యసించునేమో నని రాజునకు భయమైనది. అందుచే నాతఁడు గుమారుని పంచేంద్రియముల సుఖింపఁ జేయు పదార్థముల నింకను హెచ్చించెను. కుమారుఁడా సుఖములు మఱగి జగత్తునే మఱచినాఁడు.

కొన్ని యేండ్లు గడచెను. ఒకనాఁడు కుమారుఁ డుద్యానమునకుఁ బ్రయాణమైనాఁడు. అతఁడు త్రోవలో నొకరిని చూచెను. వాఁడు రోగపీడితుఁడు. తన మలమూత్రములలోఁ బొరలాడుచుండెను. వేరొకరుపట్టుకొననిదే - వాఁడు నిలువలేడు. ఇతరులే వానికి వస్త్రములు దొడుగుట.

"వీని కేమైనది ? వీనికన్నులును - కంఠస్వరమును యన్యులవలె లేవే ?"

సారథి:- కుమారా ! యితఁడు రోగి.

వి:- రోగియనఁగా ?

సార:- రోగియైనవాఁ డింతకుముందువలె వర్తింపలేడు.

వి:- సారథీ ! నేనుగూడ నిట్లౌదునా !

సా:- కుమారా! మనమందరమును వ్యాధిగ్రస్తులమే.

వి:- నేఁటి కుద్యానమువలదు. మరలిపోదము గాక !

వా రిర్వు రంతఃపురమునకు వచ్చిరి. విపస్సి కుమారునకు దుఃఖమే దుఃఖము. వ్యాధి ధర్మమైన యీ జన్మముతో నేమిఫలము ! !

సారథినుండి యీవృత్తాంతమును రాజెఱిఁగెను. రాజెన్ని యో సౌఖ్యసాధనములు కుమారునికై పెంచినాఁడు. తనయుఁడు సన్యాసి గాఁగూడదని రాజుతలఁపు.

అనేక సంవత్సరములు గడచినవి. విపస్సికుమారుఁ డొకనాఁ డుద్యానవనమునకుఁ దయారయ్యెను. దారియొం దొకపల్లకి మోసికొని పోఁబడుచుండినది. దానివెంట ననేక జనులు. కుమారుఁ డడిగెను. "ఓయీ! ఈ పల్లకి కర్థమేమి?"

సారథి:- కుమారా! దానియందు మృతుఁడైన యొకఁడున్నాఁడు.

విపస్సి:- మనరథము నాకడకు మళ్ళింపుము.

సారథి రథమును మళ్ళించెను. విపస్సికుమారుఁ డా శవమును జూచినాఁడు.

విపస్సి:- ఓయీ! మృతుఁడనగా నేమి?

సారథి:- కుమారా! వీఁడిక దలితండ్రులను, బాంధవులను గన్పడఁడు. అట్లే వీఁడును వారిని జూడలేడు.

విపస్సి:- నేనుఁగూడ మరణధర్మినేనా? నా తలితండ్రులు, బాంధవులు, వీరినందరి నొకనాడు వదలివెళ్ళవలసినదేనా? వారుఁగూడ నొకనాఁడు నన్ను జూడలేరుగదా!

సారథి:- అవు నవును.

"రథమును మళ్ళింపుము" వారు వెనుకకువచ్చిరి. నాడంతయు, విపస్సికుమారునకిదే యాలోచన. జరా, రోగ, మృత్యువులకు మూలకందమైన యీ జన్మమింతేనాఁ?

బంధుమారాజున కిది దెలిసెను. అతని కొకటే భయము. అందుచే నెట్లైన గుమారుని మఱపించుటకై సుఖసాధనముల నెచ్చుఁ జేసినాఁడు.

భిక్షువులారా! మరికొన్ని వేల వర్షములు గడచెను. విపస్సికుమారుఁడు ధ్యానమునకుఁ దయారయ్యెను. త్రోవలో నొక బ్రవ్రాజకుఁ డెదురయ్యెను. విపస్సికుమారుఁడు సారథితో ననెను. "ఇతఁడెవ్వరు! ఇతని శిరోవస్త్రములు నలుగురికంటె వేఱుగా యున్నవే?"

సారథి:- మహారాజకుమారా! ఇతఁడే బ్రవ్రజితుఁడు.

విపస్సి:- అనగా?

సారథి:- ప్రవ్రజితుఁడనగా 'ధర్మచర్యమంచిది. సమచర్య శుభావహము. కుశలక్రియ యుత్తమము. పుణ్యక్రియ దొడ్డది. యవిహింస కర్తవ్యము. భూతదయ, బెద్దగుణము -' యీ రీతిగ దలఁచువాఁడు.

విపస్సి:- ఆ వైపునకు రథము దోలుము.

సారథి యట్లే యొనర్చెను. ఆ ప్రవ్రజితుని విపస్సికుమారుఁడు బ్రశ్నించినాడు.

విపస్సి:- అయ్యా! మీరెవరు? మీ శిరోవస్త్రములు లోకాచార విరుద్ధముగ నుండుటకుఁ గారణమేమి?

ప్రవ్రజితుఁడు:- మహారాజా! నేను బ్రవ్రజితుఁడను. నా దృష్టిలో ధర్మచర్యా, సమచర్య లుత్తమములు. కుశలక్రియాపుణ్యక్రియలు మంచివని నాతలఁపు. అవిహింసను, భూతానుకంపను నేను బ్రేమింతును.

చాలచక్కని మాట.

విపస్సి రథమునుండి దిగెను. సారథితో నన్నాఁడు. "ఓయీ ! ఈ రథమును తీసికొని నీవింటికి బొమ్ము. నేను గేశఖండిన మొనర్చికొని సన్యాసినయ్యెదను. కాషాయముల ధరింతును."

సారథి వట్టిరథముతో నంతఃపురమునకు వచ్చినాఁడు. విపస్సికుమారుఁడు సన్యసించెను.

౬

భిక్షువులారా ! విపస్సిబోధిసత్త్వుఁ డేకాంతమున యోచింప మొదలుపెట్టెను. ఈ ప్రపంచస్థితి యాతనికి మిగుల దుర్భరముగ గన్పడెను. మానవుడు జన్మించును. రోగి యగును. మరణించును. చ్యుతుఁడగును. మరల జన్మించును. ఈ చక్రమునుండి వారికి విడుమర లేదు! దీని నెట్లు బరిష్కరించుట?

భిక్షువులారా! జరామరణము లెట్లు గలుగుచున్నవని విపస్సి బోధిసత్త్వుఁడు విచారింప మొదలిడెను. ఆతనికి బ్రజ్ఞాలాభము గలిగినది. జన్మతో జరామరణమును గలిగెనని బుద్ధునకుఁ దోచెను. జన్మకుఁ గారణమేమి? భవము. దానికి ? ఉపాదానము. ఉపాదాన మెట్లు గల్గును ? తృష్ణతో. తృష్ణ వేదనతో జన్మించును. వేదనకు స్పర్శ కారణము. స్పర్శ షడాయతనములతోఁ బుట్టును. నామరూపములు షడాయతన కారణము. నామరూపములు విజ్ఞానముతో జనించును. ఈ కారణపరంపరను

బోధిసత్త్వుఁడు క్రమముగా నెఱిఁగెను. అట్లే జన్మలేనిది- జరామరణములు లేవు. భవములేనిది జన్మలేదు.........
విజ్ఞానములేనిది- నామరూపములు లేవు. ఈ యనుక్రమమును గూడ బుద్ధునకు దెలిసెను. ఈ జ్ఞానముతో నాతని మనస్సునందు ధర్మచక్షువు వెలిగెను. ధర్మజ్ఞానముఁ గలిగెను! ప్రజ్ఞా విద్యాలోకము లుత్పన్నము లయ్యెను.

౭

భిక్షువులారా! సమ్యక్సంబుద్ధుఁడైన విపస్సి భగవంతుని మనస్సునందు- ధర్మోపదేశ మొనర్ప నిచ్ఛగల్గినది. 'కాని యెవరికి బోధించుట? ఈ జ్ఞానము గంభీరము. దుర్దర్శము. కష్టపడనిది, దెలియనిది. శాంతము; తర్కాతిగము; నిపుణము; పండితులకే యెఱుఁగ నర్హమైనది. ఇట్టి ధర్మమును నేను సాధించితిని. కాని యీ లోకము సుఖములందే మునిగి యున్నది. ఇట్టివారికిఁ గారణ పరంపర ప్రతీత్యసముత్పాదము సులభముగ నర్థమగునా? సర్వసంస్కారశమనము, సర్వోపాధి, త్యాగము, తృష్ణాక్షయము, విరక్తి, నిరోధము, నిర్వాణము వీరికిఁ గలలోనివార్త. నేను ధర్మముపదేశింతునే యనుము. వారి కర్థముగాకున్నచో నాకది యొక నవీన వేదన, యేర్పడును గదా?' యని యాలోచించెను.

భిక్షువులారా! ఇంతకు ముందెన్నఁడును స్ఫురింపని యొక గాథ, బుద్ధున కాసమయమున మనస్సున భాసించెను. దాని యర్థ మిది.

"నే నీజ్ఞానము నెంతో ప్రయాసపడి సాధించితిని. దీని నితరులకుఁ జెప్పవచ్చునా? ఈ జనులు రాగద్వేష భరితులు. వీరికి నా ధర్మ మర్థమగునా? అర్థముగాదు."

"నాధర్మ మేటి కెదురీతవంటిది. నిపుణగంభీరము. దుర్దర్శము. కామాసక్తులై-యంధకార బంధితులైన వీరి కావెల్లు గనరాదు."

భిక్షువులారా! యిట్లూహించిన విపస్సిభగవంతుఁడు ధర్మోపదేశమువైపు మనస్సును మరలింపక యేకాంతవాసమున రమింపఁ దొడఁగెను. బ్రహ్మదేవున కీ విచారము దెలిసినది. అతఁడు దనమనసులో 'నోహో! జగత్తు నాశనమగుచున్నది. సమ్యక్సంబుద్ధుఁడైన విపస్సిభగవంతుఁడు దన ధర్మము నితరులకు బోధింపక యేకాంతవాసావిష్టుఁడగుచున్నాడ'ని దలఁచెను.

భిక్షువులారా! యొకానొక మనుష్యుఁడు - ముడిచిన యంగములు దాచినట్లు - దాచిన యవయవములు ముడిచికొన్నట్లు-రెప్పపాటులో బ్రహ్మ విపస్సిభగవంతుని కడకు వచ్చినాఁడు. మహాబ్రహ్మ దనయుపవస్త్రము నొకభుజముపై వేసికొని - నేలపై మోకరిల్లి - చేతులు జోడించి బుద్ధునితో ననెను. "స్వామీ! తమరు ధర్మోపదేశ మొనర్పనిది జగతికి మోక్షములేదు. ప్రభూ! లోకమునం దందరును గామాసక్తులే గాదు. అందరి గన్నులును - ధూళీధూసరితములే గావు. సరియైన ధర్మోపదేశములేక యెందరో జెడిపోవుచున్నారు. మీ యుపదేశములచేఁ గొందఱు బాగుపడుదురు."

విపస్సి భగవంతుఁడు దన నిశ్చయమును మూఁడు సారు లెతిఁగించెను. బ్రహ్మ మూఁడుసారులు ప్రార్థించెను. అపుడు భగవంతుఁడు బ్రహ్మ ననుగ్రహించెను. బుద్ధుఁడు జ్ఞానచక్షువును దెఱచి లోకమును బారజూచెను. ఓహో! లోకమునందెన్ని పోకడలు. కొందఱి నేత్రములు సంపూర్ణ ధూళీభరితములు. కొందఱి కన్నులలో లేశము మాత్రమే ధూళి యంటియున్నది. కొందఱు తీక్ష్ణేంద్రియులు. మఱి కొందఱి యింద్రియములు మృదువులు. కొందఱికిఁ బరలోక మన్న భయము. మఱికొందఱి కా వెఱపున్న. కొందఱు మృదుబోధచేతనే జక్కఁబడుదురు. మఱికొందఱొత్తి చెప్పి ననేగాని - మరలనివారు. బుద్ధుఁ డిట్లనుకొనెను. 'ఈ జగత్తే యొక సరస్సు. దీనియం దనేకములు శతపత్రములు విరిసి యున్నవి. కొన్ని నీటిలోనే మునిఁగెను. కొన్ని నీటిమట్టముననే యున్నవి. మఱికొన్ని నీటిపై నిలిచి తలలెత్తియున్నవి. కాని యీపుష్పములకు నీరమంటనేలేదు. మఱి - యిట్టిచో-నేను ధర్మోపదేశ మేల సేయరాదు?

బుద్ధుని యాలోచన బ్రహ్మ కర్థమైనది. అతఁడు గొన్నిగాథలలో విపస్సిబుద్ధుని గార్యమునకై-ప్రేరేపించెను. ఆగాథలయర్థ మిది. "ఉన్నతపర్వత శిఖరముపై నిలచి క్రింద నున్నలోకమును జూచుచున్నమనుష్యునివలె - నోయీ! సుమేధా! నీవు ధర్మమయప్రాసాదముపై నిలచికొన్నావు. శోకరహితుఁడ వైనావు. కొంచెము దయదలఁచి జన్మజరా పీడితులైన మనుష్యులవైపుఁజూడుము!"

వీరా! లెమ్ము. నీవు సంగ్రామమున గెలిచితివి. ఋణముక్తుడైన సార్థవాహుఁడవు. అందుకై జగమున సంచరింపుము.

భగవన్! ధర్మోపదేశ మొనర్పుము. నీ యుపదేశము నర్థము జేసికొను వారున్నారు.

భిక్షువులారా! సమ్యక్సంబుద్ధుఁ డిట్లు బదులు పలికెను. "ఎవరికొఱకు నిర్వాణ ద్వారము దెరచి కొన్నదో-యెవరికి విననిచ్ఛ గలదో - వారు నా ధర్మమును విందురు గాక! భావమున ధరింతురు గాక! ఓయీ! బ్రహ్మదేవా! లోకమునం దుపద్రవము గలుగునేమో యని నే నింతవరకు నా ధర్మమును బోధింప లేదు."

భిక్షువులారా! విపస్సభగవంతుఁడు ధర్మోపదేశ మొనర్తునని, ప్రతిన సేసెను. బ్రహ్మ బుద్ధునకు నమస్కరించి ప్రదక్షిణించి, తన లోకమునకు వెళ్ళినాఁడు.

ఈ యేడుఖండములలో మూఁడవ ఖండము ముందుగ వ్రాయఁబడిన ట్లున్నది. ఎందుకనగా నా భాగము త్రిపిటకములలోఁ గూడ జాల ప్రాచీనమైన సుత్తనిపాత గ్రంథములోని, సేల సుత్తమం దగుపడుచున్నది. ఈ సుత్తమే, మజ్ఝిమ నికాయము నందు, (సంఖ్య॥ ౯ ౨) గూడఁ గలదు. దానికి ముందటిదైన 'బ్రహ్మాయుసుత్త' మందును దీఘ నికాయములోని, యంబట్ట సుత్తమునను గూడ దీని విషయము గలదు. బుద్ధ కాలీనులైన బ్రాహ్మణు లీముప్పది రెండు లక్షణములను జాల గొప్పగ నెంచుచుండిరి. ఈ చిహ్నము లన్నియు బుద్ధుని శరీరమం దుండెనని - యాతని

గొప్పతనమును జూపుటకై యీ సుత్తము రచింప బడినది. దీని రచన బుద్ధుని యనంతర మొకటి రెండు శతాబ్దము లలో జరిగి యుండును. తరువాత నవి మహాపదాన సుత్తము లోని కెక్కెను. గౌతమ బోధిసత్త్వుఁడు బుద్ధుఁడైన దరు వాతనే విప్రు లాతని శరీర లక్షణముల బరీక్షించిరి. కాని యీ సుత్తమందు విపస్సి కుమారుని శరీర లక్షణముల నాతఁడు బుట్టిన వెంటనే బరీక్షించిన ట్లున్నది. దీనితో నవక తవకలు గలిగెను. అప్పుఁడే బుట్టిన శిశువునకు నలుబది దంతము లుండునా ? ఇక నవి సరళములై యుండె ననుటయు శశి విషాణమే. అవి - యవిరళములై యుండె ననుటయు గల్లలలో కల్ల. ఆ దంతములు శుభ్రములట ! ఇది యంతయు నేల విడిచిన సాము ఈ నాల్గు లక్షణము లాతని కెక్కడ నుండి వచ్చును ? ఈ సుత్తము రచించిన వాడీమాత్ర మెందు కూహింపలేదో ?

ఇందులో నివ్వఁబడిన రెండవఖండముగూడ మొదటి దానికి తరువాత రచింపఁబడ్డదే. ఆ స్వాభావిక నియమము లన్నియు - మజ్ఝిమనికాయ మందలి - అచ్ఛరియ, అద్భుత, ధమ్మసుత్తమున (సంఖ్య 123) వచ్చును బోధిసత్త్వుని మహ త్త్వము ప్రకటించుటకే యివి రచింపఁబడెను. వీనిలో బోధి సత్త్వునితల్లి నిలిచియే ప్రసవించుటయు - నేడవదినమే మర ణించుటయు నీరెండును సత్యములే. తక్కినవన్నియు గవి కల్పనలు. ఏడవఖండము, ద్వితీయఖండమునకు గొంచెము ముందో వెనుకలనో రచింపఁ బడినది. ఈ భాగము మజ్ఝిమ నికాయ మందలి అరియపరియేసన సుత్తమున నున్నది.

నిదానవగ్గ సంయుత్తములోను (6-1) గలదు. మహావగ్గము యొక్క మొదట గూడ నున్నది. బ్రహ్మ ప్రార్థించుటచే, బుద్ధుఁడు ధర్మోపదేశమున కారంభించెనని, దెలుపుటకే యీ ఖండము రచింపఁబడెను. మైత్రి, కరుణ, ముదితము, ఉపేక్ష యనెఁడు నాలు గుదాత్తములైన మనోవృత్తుల గ్రహించి, యీ రూపకాలంకార మల్లఁబడినట్లు, నాయూహ- ఈ విష యమును నేను 'బుద్ధధర్మము - మరియు - సంఘము' యనెఁడు నాగ్రంథమందు మొదటిలో విపులముగ జర్చించితిని.

నాల్గవఖండము మూఁడు ప్రాసాదములకు సంబంధించి నది. దీని యుల్లేఖ మంగుత్తర నికాయములోని, తికనిపాత మందు (సు॥ 39) గలదు. మజ్ఝిమనికాయములోని మాగంది యసుత్తమునను (సంఖ్య, 75) నున్నది. మొదటిదానిలో బుద్ధుఁడు దండ్రిగృహమునం దున్నప్పుఁడే - యాతని కొఱకు మూఁడు ప్రాసాదములు నిర్మింపబడినట్లుఁ గలదు. రెండవ దానిలో దరుణవయస్సులో మూఁడుమేడలు బుద్ధున కున్న ట్లున్నది. తండ్రివృత్తాంతములేదు. ఎవరువానిని గట్టించిరో! వజ్జిరాజులవలె శాక్యులు సంపన్నులుగారు. వజ్జిరాజకుమా రులుఁగూడ నింతటి సుఖము లనుభవించినట్లు ఆధారములు లేవు. అంతేగాక వారెంతో సరళమైన జీవితముకు సాగించి నట్లు, గాథలుగలవు. వారు సుఖలిప్సులుగారు. ఈ వృత్తాం తము 'ఓపమ్మ సంయుత్తమం'దు (వగ్గ-1-సు॥ 5) వచ్చును. బుద్ధభగవానుఁ డనెను. 'భిక్షువులారా! ఈ లిచ్ఛవీజనులు సామాన్యములైన కట్టెలమంచములపై నిద్రించుచున్నారు. ఉత్సాహదీప్తులై జాగ్రత్తగా సైనికసన్నాహము లొనర్తురు.

అందుచే మాగధుఁడైన యజాతశత్రుఁడు వాని జయింప లేదు. కాని రాగరాగ వీరు సుకుమారులై, పోదురు. వారి కాలు-సేతులు కోమలము లగును. హంసతూలికా తల్పము లందు నిద్రింతురు. అప్పుఁ డజాతశత్రుఁడు వీరిని గెల్వఁగలఁడు.'

వజ్జిరాజ్యములోని గణరాజు లానాఁడు సంపన్నులు. వారే యిట్లు బ్రతుకు చున్నప్పుఁడు, వారికన్న నెంతయో తక్కువయైన శాక్యులు, దొడ్డ హర్మ్యములను నిర్మించికొని రనుట - యసంభవము. శుద్ధోధనుఁడే స్వయముగ, సేద్య మొనర్చుచుండె నంటిమిగదా ! అట్టివాఁడు దనకుమారునకు మూఁడు మేడలు గట్టింపఁజాలునా ? ఈ కల్పన యంతయు నెవ్వఁడో సృష్టించి, బుద్ధచరిత్రలోని కెక్కించెను. ఇది మహాపదాన సుత్తమునుండి బుద్ధునిచరిత్రలోని కెక్కెనో; లేక యెవఁడేని భావుకుఁడు దీర్చెనో నిర్ణయించుట గష్టము.

పైని యొసగబడిన యాఱవఖండమును - నిదానవగ్గ సంయుత్తలోని, నాలుగునుండి యాఱువర కున్న సుత్తము లును మక్కికి మక్కిగా నొకటిగా నున్నవి. వీనినిబట్టి మహా పదాన సుత్తమునుండియే యివి యితరములలోనికి బ్రవేశించె ననుట స్పష్టము. గౌతమునకు ముందాఱుగురు బుద్ధులుండిరి గదా! వారికి ప్రతీత్య సముత్పాద, కారణపరంపర స్ఫురించి నది. అట్లే బుద్ధు కుఁగూడ బోధిసత్త్వుఁడుగ నున్నప్పుడే, యా కారణ పరంపర స్ఫురించెను. ఇట్లు నిదానవగ్గసుత్తము లోని, పదవసుత్తమున వర్ణితము. కాని మహావగ్గమందు బుద్ధుఁడైన పిమ్మటనే యా కారణవర్గము స్ఫురించినట్లు గలదు. ఈ ప్రతీత్య సముత్పాదము బుద్ధుని పరినిర్వాణము

నకు బిదప యొకటిరెండు శతాబ్దములలో రచితమై యుండును. తరువాత యాతని గొప్పతనమును జాటుటకై పూర్వబుద్ధుల చరిత్రలోనికిఁగూడ నిది యెక్కింపఁబడి యుండును. రానురాను బుద్ధచరిత్రలోనికిఁగూడ నిది తలదూర్చినది. దీని పరిణామ మేమైనది? సరళమైన యార్యసత్యముల ప్రభావము వీని మఱుఁగున మఱఁగిపోయినది. క్లిష్టమైన యీ కారణ పరంపర ప్రముఖముగ నిలచినది.

ఐదవఖండ ముద్యానయాత్ర. త్రిపిటకవాఙ్మయమందు గౌతమబుద్ధుని చరిత్రలో నీఘట్టము లేనేలేదు. లలిత విస్తరము, బుద్ధచరిత్రము, జాతకనిదానకథ—వీనిలోనికి యిది యెట్లో ప్రవేశించినది. నిదానకథయొక్క గడపట, "తతో బోధిసత్తో సారథిం - సమ్మ కోనామ ఏసో, పురిసో, కేసా, పిస్స నయథా, అజ్ఞేసంతి మహాపదానే ఆగతనయేన పుచ్ఛిత్వా" అని యున్నది. దీనిసిబట్టి యీ సర్వగ్రంథకర్తలును, నీ వృత్తాంతమును, మహాపదాన సుత్తమునుండి గ్రహించిరనుట, దేటతెల్లము.

మొదటిఖండమందుఁ జెప్పబడినట్లు, గౌతమబుద్ధుని యగ్రశ్రావకులు, మొదలైనవారిపేరులు — ఈ సుత్తము యొక్క ప్రస్తావనలో నివ్వఁబడినవి గౌతమబుద్ధుఁడు క్షత్రియుఁడగుటచే నాతని తండ్రియొక్క రాజధాని కపిలవస్తువగునని దానిలోఁ జెప్పబడెను. ఇంతేగాక బుద్ధుఁడు గౌతమ గోత్రజుఁడనియుఁ గలదు. వీనికి సంబంధించిన చర్చనంతయు

మనము నాల్గవ ప్రకరణముననే గావించితిమి. శుద్ధోదన శాక్యుని యూరు కపిలవస్తువు గానే కాదు. శాక్యు లాదిత్య గోత్రులు. కాని శాక్యు లనుపేరిటనే వారు ప్రసిద్ధులైనారు. అందుకే బౌద్ధభిక్షువులకు 'శాక్యపుత్రీయశ్రమణులు'ను పేరు ప్రచారములోనికి వచ్చెను. బుద్ధుఁడు గౌతమగోత్రజుఁడే యైనచో, వారికి గౌతమికశ్రమణులని నామధేయ మేర్పడి యుండెడిది.

# పరిశిష్టము - రెండవది

## వజ్జియొక్క యభ్యున్నతికై యేడు నియమములు

బుద్ధుఁడు రాజగృహముకడ గృధ్రకూటమందుండెను. అపుఁ డజాతశత్రుఁడు వజ్జిని జయించునూహాలో నుండెను. ఈ విషయమున భగవానుని యభిప్రాయ మెట్టిదో, గనుగొన వలెనని యాతని యాశ. అందుకై యాతఁడు 'వస్సకార' బ్రాహ్మణుని భగవానునికడ కంపెను. ఆ యమాత్యుఁడు భగవంతుని కజాతశత్రుని నిశ్చయమెరింగించినాఁడు. అపుఁ డానందుఁడు బుద్ధునితోఁడనే యుండెను. అతఁడాతనికి గాలి విసరుచున్నాఁడు. భగవంతుఁ డానందుని వైపునకుఁ దిరిగి "ఆనందా! వజ్జి దేశము పలుమారొకచోటఁ జేరుననియు, సభలేర్పాటుఁ జేసికొను ననియు, నీవు విన్నది నిజమేనా?" యన్నాఁడు.

ఆనందుఁడు:- భదంతా! నిజమే. వజ్జిదేశము, మాటి మాటికిని సభలు కూర్చికొనుచున్నది. శాక్యరాజు లందరు నొకచోటఁ జేరుదురు. ఈ మాట నిజమే.

బుద్ధుఁడు:- వజ్జిదేశము సమగ్రముగ నేకత్రజేరుటయు, సమగ్రముగ లేచుటయు, సమగ్రముగఁ దమ కార్య కలాపములు దీర్చికొనుటయు నిజమేనా?

ఆనందుఁడు:- భగవన్ ! అట్లే నేను వింటిని.

బుద్ధుఁడు:- తామొనర్చికొనని నియమము నొనర్చి కొంటిమని, వజ్జిదేశ మనుకొనుట లేదుగదా! ఏర్పరచికొన్న నియమములను భంగపఱచుట లేదుగదా! వజ్జిదేశ మింతకు

ముం దేర్పరచికొన్న చట్టములను బట్టియే నేటికిని వర్తించు చున్నదా ?

ఆనందుఁడు:- అవును భదంతా ? నిజమే. వారు లేని నియమ మున్న దనరు. ఉన్నదానిని గాదనరు. ఇట్లు నేను వింటిని.

బుద్ధుఁడు:- వృద్ధులైన రాజ్యతంత్రజ్ఞులను వారు గౌరవింతురా ? వారి యుపదేశముల స్వీకరింతురా ?

ఆనందుఁడు:- భగవన్ — గౌరవింతురు. స్వీక రింతురు.

బుద్ధుఁడు:- తమ రాజ్యము నందలి కన్యలనుగాని, గృహిణులనుగాని వారు బలాత్కరించుట లేదుగదా?

ఆనందుఁడు:- లేదు. వజ్జిరాజ్యమున స్త్రీలపై బలా త్కారము లేదు.

బుద్ధుఁడు:- వజ్జి నగరమునందును, నగరము బయట నున్న దేవస్థలములను, వారు సరిగ విచారించికొందురా ?

ఆనందుఁడు:- విచారించికొందురు.

బుద్ధుఁడు:- తమ రాజ్యమునందుఁ దిరుగుచున్న యర్హతులు సుఖముగ జీవింపవలెనని, వారికిఁదగిన వ్యవస్థ నొనరింతురా? తమ రాజ్యమున ప్రవేశింపని యర్హతుల నాహ్వానింతురా ? అర్హతుల కెన్నఁడును, దాపముగలి గించుట లేదుగదా !

ఆనందుఁడు :- లేదు. అర్హతు లేమైన నొప్పి పడుదు రేమో యని వజ్జి దేశము - వారి యెడల చాలఁ జాగరూక తతో వర్తించునని నేను వింటిని.

అప్పుడు బుద్ధుడు మంత్రియైన వస్సకారునితో నన్నాడు "ఓయీ! బ్రాహ్మణా! ఒకానొకప్పుడు నేను వైశాలియందుంటిని. అప్పు డీ నియమములను, వజ్జి దేశస్థుల కుపదేశించితిని. ఎంతవరకు వారీ నియమము లనుసరింతురో, యంతవరకు వారి కభ్యున్నతియే తప్ప యవనతి లేదు."

వస్సకారుఁ డనెను. "గౌతమా! ఈ యేడునియమములలో నొక దానిని నిజముగ ననుసరించినచో, నే దేశమైనను బాగుపడును. దీన సందేహము లేదు. వజ్జి దేశ మీ యేడునియమములఁ బాలించు చున్నప్పుడు దాని కవనతి యెట్లు గల్గును?

## ఏడు నియమములపై టీక

పై జెప్పిన యేడు నియమములపై బుద్ధఘోషాచార్య కృతమైన యట్ఠకథా రూపమగు టీక యున్నది. అది యీ క్రిందిది.

**1.** మాటిమాటి కొక చోట జేరుట :- సకాలమున నొకచోట జేరుదురు. ఉపేక్ష సేయక చేరుదురు. 'నేను పోకున్న నేమి?' యను భావ మెవ్వరికి నుండదు. ఇట్లందరు నొకచోట జేరకున్నచో, నన్నికడల జరగు సమాచారములు సభకుఁ దెలియవు కదా! ఈ పల్లెలో ని విషయము జరిగినది. ఈ నగరమున నిది జరగెను. ఈపొలిమేరలో నీ వివాదము నడచినది. ఇచ్చట దొంగతన మయ్యెను—యిత్యాదు లనేక విషయము లందరు దప్పక నొకచోట జేరినపుడే గడ్డకు వచ్చును. రాజ్య కర్తలు జాగ్రత్తగ నున్నారని

దొంగలు గూడ జడియుదురు. అట్లు లేకున్నచోఁ జోరులు ప్రబలుదురు. ఇది రాజ్యమున కవనతి. అంద రొకచోట జేరి యచ్చోట నేమి జరుగుచున్నదీ దెలిసికొన్నచో, వెంటనే సైన్యమును బంపి, యా కలఁతల నణఁప వచ్చును. చోరులు గుంపులు జేరరు. భయభీతులై బరువెత్తుదురు. ఇట్లు రాజ్యమున కున్నతి దక్కును.

2. సమగ్రముగ నొకచోట జేరుట, యిత్యాదులు:- 'నేడు నాకు బని యున్నది - ఈనాడు మా యింట వివాహము" యను నడ్డు మాటలతో నొక్కొక్కఁడు సభకు రాకున్నచో, నిక సభ యెట్లు జరగును? వజ్జి రాజులట్లు సేయుట లేదు. ఏమైనను వారంద రొకచోటఁ జేరెదువారు. చేరిన వారు సభాంతము వరకును లేవరు. అందరును గూర్చుండి, యన్ని విషయములను, సమగ్రముగ వినుట వారి విధి. అందరు సమగ్రముగ నుండి యన్ని విషయము లవగత మొనర్చి కొన్నచో, నేదేని యొక రాజునకు, బని పడిన వెంటనే, దక్కినవారు సాయ మొనర్పఁ బోదురు. తమ రాజ్యమం దెవరేని, యతిథులు గ్రొత్తగ నేతెంచిన వారి కాదర సత్కారము లేమరుపాటు లేక నడపింతురు.

3. చేయని నియమము జేసితి మనరు - యిత్యాదులు :- అనగా క్రొత్త చట్టమును బ్రవేశపెట్టి, పూర్వ వ్యవస్థను బాడుచేయరని యర్థము. చేసికొన్న నియమము నుల్లంఘింపరు. దాని ననుసరించి నడతురు. అనగా దొంగయని యెవడైనను నిర్ణయింపఁ బడినప్పుడు, వానికి వెంటనే శిక్ష వేయరు. సరిగ విచారించియే శిక్ష విధింతురు. అట్లు సేయ

కున్నచో జనులలో నుపద్రవము గలుగును. అతృప్తులైన జనులు సరిహద్దుల జేరి, దోపిడు లారంభింతురు. దుర్మార్గుల గుంపులు బయలుదేరును. రాజ్యముపై దాడిసేతురు. ఇది రాజ్యమున కవనతి. చట్టము ననుసరించి, రాజ్యము జరగినచో పన్నులు సులభముగ వసూలగును. భాండాగారము నిండును. సైన్యబల మేర్పడును.

వజ్జిదేశము చట్టము యిట్టిది. దొంగతన మొనర్చిన వానిని బట్టుకొని వత్తురు. వానిని వెంటనే వజ్జిరాజు శిక్షింపఁడు. వినిశ్చయ మహామాత్యుల కొప్పగించును. వారనేక విధముల వానిని విచారింతురు. వాని వృత్తాంతము నంతయు రహస్యముగ గనుగొందురు. దొంగ గాకున్నచో వానిని వదలుదురు. దొంగ యైనచో వ్యావహారికుల కప్పగింతురు. వారును నట్లే విచారించి దొంగ యని దోపకున్నచో, వదలుదురు. తోచినచో నంతఃకారికు లనెడు నధికారుల కప్పగింతురు. వారుఁ గూడ విచారింతురు. దొంగయని దోపకున్నచో, వదలిపెట్టు నధికారమును వారికిని నున్నది. చోరుఁడనియే నిర్ణయమైనచో, వాని నష్టకులికుల కొప్పింతురు. వారును ముందటి వలెనే విచారించి చోరుఁడని దేలిన నుపరాజున కప్పగింతురు. ఆ యుపరాజు రాజున కొప్పగించును. వాఁడు దొంగ గాకున్నచో, రాజు వదలును. చోరుఁడే యయినచో రాజు 'ప్రవేణీ పుస్తకము' నధికారులచేఁ జదివించి దాని నిర్ణయము ప్రకారము శిక్ష విధించును. వజ్జిరాజుల నియమము లన్నియు నింత ధర్మ దక్షమైనవే.

4. వృద్ధులైన రాజ్య తంత్రజ్ఞులను గౌరవించి వారి యభిప్రాయముల గ్రహింపకున్నచో, రాజ్య మవనత మగును. సమయము వచ్చినపుడంతయు బెద్దవారి సలహాలు గైకొన్నచో, రాజ్యము సుఖించును.

5. కన్యలు గాని, గృహిణులు గాని, స్త్రీలను బలాత్కరించినచో రాజ్యమందలి జను లసంతుష్టు లగుదురు. మే మీా శిశువును జిన్ననాటి నుండి బెంచితిమి. పెద్ద జేసితిమి. నేడు వీడు బలాత్కరించుకొని పోవుచున్నాడు. ఇది యెంత ఘోరము!! ఈ భావము హృదయములలోc బడిన జనులు సరిహద్దులకు వెళ్ళి దోపిడిగాండ్ర గుదురు. లేక దోపిడిగాండ్ర గుంపులోc జేరుదురు. రాజ్యముపై కెత్తుదురు. స్త్రీ జాతిని నిర్బంధింపకున్నచో, రాజపురుషులు వారి మానము రక్షించినచో, లోకము నిశ్చింతగ నుండును. కార్యతత్పరమై యుండును. రాజ్య మభ్యున్నతి నందును.

6. దేవస్థానములను సరిగ విచారించి కొను చున్నచో, దేవతలు రాజ్యముకు రక్షింతురు.

7. అర్హతులకు నేవిధమగు దాపమును – గలిగింపక వారిసదప్పక విచారింపవలెను. అనగా వారికి నివాసస్థానము లేర్పాటు సేయవలెను. వారి యాశ్రమములందున్న మృగములను వేటాడరాదు. వారి సరస్సులలోని చేపలc బట్టరాదు. ఈ విషయమున జాగ్రత్తగ వర్తింపవలెను.

అట్టకథలో వజ్జి దేశముయొక్క చట్టముపై గొంచెము విస్తృతమైన టీక యున్నది. దొంగ దొరకినచో వానిని గ్రమముగ, వినిశ్చయ, మహామాత్య, వ్యావహారి, కాంతః

కారి శాష్ట, కులిక, సేనాపత్యుపరాజ, రాజులు విచారిం చెడువారు. అష్ట కులికు లనగా నేటి 'జూరీ' వంటి వారేమో! ఇతరాధికారుల వివరము లెట్టివో మనకుఁ దెలియదు. రా జనగా గణరాజుల యధ్యక్షుఁడు. అతఁడెన్ని వర్షములు రాజుగ లేక యధ్యక్షుఁడుగ నుండెడివాఁడో స్పష్టముగ దెలియదు. వజ్జి దేశమందలి చట్టములు వ్రాయబడిన పుస్తకమొకటి యుండి యుండును. అది సంపూర్తిగ నశించినది. ఇదిచాల దుఃఖకర విషయము. గ్రీకులు దమ పూర్వుల న్యాయశాస్త్ర ముల నన్నే నిలిపికొన్నారు. మనము వానిని నష్టముఁ జేసి కొంటిమి. స్త్రీలపై బలాత్కారము జరుపకుండుటకై వజ్జి దేశము చాల జాగ్రత్త గైకొన్నది. ఇది గొప్పవిషయము. కాని, క్రమముగ, గణరాజులు లోలుపులైరి పేద వారైన స్త్రీలపై వారి దుర్మార్గములు సాగెను. అందుకై లోకు లేక సత్తాక రాజ్యములను ప్రేమింపఁ దొడఁగిరి. ఎందు కనఁగా, మహారాజుల దుర్మార్గము ముఖ్యపట్టణముల పరి సరములకే ప్రాకును. అంతకుమించిపోదు. కాని యీ గణ రాజు లూరికొక్కరు. అందుకై యేయూరియందే చక్కని దియు మానముగ బ్రదుక లేదు.

ఒకసారి యీరాజు లవ్యవస్థితులుగ మారినచో — నిక పరిస్థితులు జక్కఁబడవు. వారిలో సంధిభేద మొనర్చుట సుల భము. వజ్జిగణరాజులలో—వస్సకార బ్రాహ్మణుఁడు సంధిభేద మొనర్చెను. దానితో నజాతశత్రువు వజ్జిని జయించినాఁడు. వజ్జిగణరాజ్యము నష్టమైనదే మొదలు—మల్లుల గణరాజ్యము గూడ నవనతికి దారిదీసెను, ఇట్లు ప్రాచీన గణరాజ్యములు

నశించినవి. ఇట్టి సంఘటనల గుఱించిన వర్ణనము బౌద్ధ వాఙ్మయమునఁగూడ దొఱకుట జాలకొలఁది.

బౌద్ధసంఘ మొకచోటఁ జేరి - సంఘకృత్యము విచారించుకొను చుండెనని వినయపిటక మనును. ఇది వజ్జిరాజ్యము నుండి నేర్చికొన్న నియమమే. భిక్షుసంఘములోని యీ పరిపాటిని బట్టి వజ్జిరాజులసభ లెట్లుండెడివో మన మూహింపవచ్చును.

# మూఁడవ పరిశిష్టము

## అశోకుని భాబ్రూశిలాలేఖము - దానిలోఁ జెప్పబడిన సుత్తము

భాబ్రూ జయపుర సంస్థానములోనిది. అది యొక యడవిలోనున్నది. అక్కడి భిక్షుసంఘ మశోకునకు సందేశ మంపెను. ఆ సందేశమును రాజు చదివి - దానినొక శిలపై జెక్కించెను. ఇట్టిసందేశము లశోకుఁడు మాటిమాటికిని బంపి యుండును. వానిలో గొప్పవని తోచినవి యతఁడే శిలలపై లేక శిలాస్తంభములపై జెక్కించియుండును. ఈ శిలాలేఖము పై నిర్దేశింపఁబడిన సూత్రములు మగధదేశమునందలి బౌద్ధులు మననము సేయవలె నని యాతని యభిప్రాయము. ఈ విధమగు నాజ్ఞ మగధదేశస్థుల కాతఁడు శిలాలేఖమున గాని - మౌఖికముగ గాని యొసఁగియుండును. ఆ యాజ్ఞమాత్రము జెక్కింపఁబడలేదు. దాని కవసరములేదని యాతని యూహ. ఎందుకనఁగా - దమసమీపమందున్న భిక్షుసంఘము లేమేమి జదువుచుందు రని - యెట్లు వర్తించుచుందు రని పరస్పరము విచారించికొనుట యా కాలములో వాడుక. ఈవిషయమునకై గొందఱు రాజపురుషుల నశోకుఁడే నియోగించి యుండెను. కాని రాజస్థానములవంటి దూరప్రదేశములనుండి వర్తమానములు వచ్చుట కాలస్యమయ్యెను. అందుచే నచ్చోట నొక శిలాలేఖముండిన బాగుండు నని యశోకుఁడు దలఁచి యుండును. ఆ శిలాలేఖముయొక్క భాషాంతర మిది—

## భాబ్రూశిలాలేఖముయొక్క భాషాంతరము

ప్రియదర్శి మగధరాజు సంఘము నభినందించి దాని స్వాస్థ్యసుఖనివాసములను విచారించుచున్నాఁడు. "మహాత్ములారా! మీకును - నాకును బుద్ధధర్మమునందును - సంఘమందెంత యాదరమున్నదో యది ప్రసిద్ధమే. బుద్ధభగవానుని వచనము లన్నియు శిరోధార్యములే. కాని - వీనిలో గొన్నిటిని మాత్రమే యెందుల కుల్లేఖించితిని ? వీని నైనను మననము సేసిన బౌద్ధధర్మము జిరస్థాయి యగునను నూహచేతనే. ధర్మ పర్యాయము లివి (1) వినయసముకసే, (2) అలియవసానే, (3) అనాగతభయానే, (4) మునిగాథ, (5) మోనేయసూతే, (6) ఉపతిసపసినే- యెనెడు సుత్తములు. రాహులున కుపదేశించిన యసత్యభాషణ సిరసనముగూడ బై వానిలోఁ జేరినదే. ఈ సుత్తములను భిక్షుణీ - భిక్షువులు మాటిమాటికి వినవలె నని - బఠింపవలె నని నాయాశ. అట్లే - యుపాసకోపాసికలుగూడ. అందుకై నీ శిలాలేఖమును జెక్కించితిని. దీనితో జనులకు నా యభిప్రాయము దెలియునుగదా!"

పై యేడింటిలో మొదటిది వినయ సముత్కర్ష. దీనికే ధర్మచక్ర ప్రవర్తన మని పేరు. దీని రూపాంతరము నైదవ ప్రకరణములో నొసఁగితిని. తక్కిన సుత్తముల భాషాంతరీకరణము క్రమముగా నిత్తును.

## అలియవసానే లేక అరియవంససుత్తము

ఇది యంగుత్తరనికాయము యొక్క చతుక్కనిపాతమున వచ్చును. దాని రూపాంతర మిది.

భిక్షువులారా! ఈ నాలు గార్యవంశములును- ముఖ్యములు. ప్రాచీనములు. అసంకీర్ణములు. ఇవి సంకీర్ణములుగా లేవు. కాఁబోవు. ఏ శ్రమణులుగాని - బ్రాహ్మణులుగాని వీనిని నిందింపలేరు. ఆ నాలు గెట్టివి?.

1. దొఱకిన వస్త్రముచే భిక్షువు సంతుష్టుఁ డగును. అట్టి తుష్టి నాతఁడు బొగడును. వస్త్రమునకై యయోగ్య కర్మ నాచరింపఁడు. వస్త్రము దొఱుకలేదని భయపడఁడు. దొఱకెనని యుప్పొంగఁడు. ఆసక్తుఁడుగాడు. ఈ వస్త్రము లల్పపదార్థములని ముక్తికై యాతఁడు యత్నించును. సంతుష్టి తనకుఁ గలదని దన్ను తాను స్తుతించుకొనఁడు. లేనివారిని నిందింపఁడు. ఇట్టి సంతోషమున దక్షుఁ డెవఁడో-జాగృతుఁ డెవఁడో - స్మృతిమంతుఁ డెవఁడో-భిక్షువులారా! యతఁడే యార్యవంశము ననుసరించి వర్తించు భిక్షువు.

2. భిక్షువులారా! దొఱకిన భిక్షతో వాఁడు తృప్తి పడును. అట్టి తృప్తిని బొగడును. భిక్షకై యయోగ్యముగ వర్తింపఁడు. దొఱుకకున్న బాధపడఁడు. దొఱకిన యుప్పొంగఁడు. మదాసక్తులు వానికిలేవు. అన్నము దోషయుక్తమని ముక్తికే వాఁడు యత్నించును. దానిని సాధించుటకై శరీర పోషణమాత్ర మన్నము సేవించును. ఆత్మస్తుతి-పర నిందలు లేవు. ఇట్లు దక్షుఁడై జాగృతుఁడై నవాఁడే యార్యవంశము ననుసరించి చరించెడు వాఁడు,

3. భిక్షువులారా! నివాసస్థాన మెట్టిది దొఱకినను - వాఁడు సంతుష్టుఁడగును. తుష్టిని వర్ణించును. నివాసమునకై యయోగ్య కార్యములఁ జేయఁడు. దొఱుకకున్న బాధ

పడఁడు. దొఱకిన సుఖొంగఁడు. మదాసక్తులు వానికిలేవు. నివాసము దోషభూయిష్ఠము. అందుకై వాఁడు ముక్తికై యత్నించును. ఇట్టి దక్షుఁడే యార్యవంశానుకారి యగు భిక్షువు.

4. భిక్షువులారా! అతఁడు సమాధి భావమున నానందించును. వాఁడు భావనారతుఁడు. క్లేశములను నష్టములొనర్చుటలోనే వాని కానందము. జానియందే వానికి రతి. వాని కాత్మస్తుతి - పరనింద లుండవు. ఇట్లు దక్షుఁడై, జాగృతుఁడై, స్మృతి మంతుఁడైన వాఁడే యార్య వంశ నియమానుగుణముగ వర్తించు భిక్షువు.

ఈ నాలు గార్యవంశములను యే శ్రమణులు గాని, బ్రాహ్మణులు గాని నిందింప లేదు.

భిక్షువులారా! యీ నాలు గార్యవంశములచేఁ గూడిన భిక్షువు దూర్పునకు వెళ్ళిన నచటనే యరతిని జయించును. అరతి వానిని జయింప నేరదు... పశ్చిమమునకు... ఉత్తరమునకు... దక్షిణమునకు-యెచ్చటికి వెళ్ళినను నచటనే వాఁడరతిని జయించును. అరతి వానిని జయింపనేరదు. ఎందువలన? వాఁడు ధీరుఁడు. అందుచే నరతిని జయించును. రతిని నిర్జించును.

ధీరుని నరతి జయింపలేదు. ధీరుఁడు దానికి బాహ్యుఁడే. అరతినే వాఁడు జయించి విజయవంతుఁ డగును.

అతఁడు సర్వకర్మత్యాగి. రాగద్వేష విముక్తుఁడు. వాని నడ్డగలవాఁ డెవ్వఁడు? స్వచ్ఛమైన బంగారు

నెవ్వఁడు దప్పు బట్టఁగలఁడు? బ్రహ్మదేవుఁడును వానిని బ్రశంసించును.

అనాగత భయాని

ఈ సుత్తము 'అంగుత్తర నికాయము' లోని పంచిక నిపాతమున నున్నది. దాని భాషాంతర మిది.

"భిక్షువులారా! యీ యైదు ననాగత భయములనుఁ గాంచెడు భిక్షువునకు నప్రాప్త పదార్థప్రాప్తి కొఱకు - అజ్ఞాతమైన విషయ విజ్ఞానము కొఱకు - సాక్షాత్కృతము గానిదాని యొక్క సాక్షాత్కారము కొఱకు-నప్రమత్తుడై - యుత్తమ శీలుఁడై మనస్సు లగింపఁజేసి ప్రవర్తించినచో నతఁ డగ్రగామి యగును. ఆ యైదు నియమము లేవి?

1. 'నే నిప్పుడు యువకుఁడను కాని - యొకా నొక నాఁడు నాకు వార్ధక్యము వచ్చును. వృద్ధునకు బౌద్ధ ధర్మముల మనన సుకరముగాదు. అరణ్యవాసమును సుకరము గాదు. ఆ స్థితులు గల్గుటకు ముందే నే నప్రాప్తమైన దానిని బ్రాపింపవలెను. తెలియని దానిని దెలిసికొన వలెను. సాక్షాత్కృతముగాని దానిని సాక్షాత్కరింపఁజేసి కొనుటకు యత్నింపవలెను. ఈ పని నిప్పుడే జేసితినేని వార్ధక్యమున నేను సుఖింతును.' యని భిక్షువు యోచించును. ఈ యనాగత భయమును ముందే బరికించిన భిక్షువు మనస్సును లగించి ప్రయత్నించి - యగ్రేసరుఁ డగును.

2. 'నే నిప్పు డరోగిని, నా జఠరాగ్ని యనుకూలము. ప్రయత్నానుగుణము. కాని - యొక నాఁ డీశరీరము వ్యాధి

గ్రస్తమగును. వ్యాధిగ్రస్తునకు బౌద్ధ ధర్మముయొక్క మననము సుకరముగాదు. ఏకాంతవాసము సుకరము గాదు. అనిష్టమై యప్రియమైన -యీ యవస్థ ప్రాప్తముగాకముందే నేను ... ప్రయత్నించుట మేలు. రుగ్ణావస్థ సుఖకరముగాదు' ఈ యనాగత భయమును గమనించిన భిక్షువు మనసుంచి - ప్రయత్నించి యగ్రేసరుఁ డగును.

3. 'భిక్షువులారా! ఇప్పటికి నేను సుభిక్షుండను. భిక్షము గష్టములేక దొఱకుచున్నది. కాని యొకానొక నాఁడు దుర్భిక్షము వచ్చును. ధాన్యములు ఫలింపవు. భిక్ష దొఱకుట గష్టమగును. ఇట్టి కరువులో లోకులు సుభిక్ష దేశములకై బోయెదరు. అట్టియెడ బుద్ధధర్మ మనన సుకరము గాదు. ఏకాంతవాసము క్షేమముగాదు. ఈ యనిష్టము ప్రాపింపక ముందే ... ... ప్రయత్నించుట మేలు. ఇపుడే ప్రయత్నించికొన్నచో దుర్భిక్షకాలమునగూడ నేను సుఖినై యుందును.' ఈ మూఁడవ యనాగత భయమును ముందే గమనించిన భిక్షువు ... ... యగ్రేసరుఁ డగును.

4. 'నేటి లోకము ముదితమనస్కమై యున్నది. పాలు-నీరువలెఁ బరస్పరము ప్రేమించుకొనుచున్నది. కాని యొకానొకనాఁడు వీరిలో వీరు గలహింతురు. లోకులు చేతికి దొఱకిన పదార్థములు గైకొని సురక్షిత ప్రదేశముల కేగెదరు. ఇట్టి సంకటము రాకముందే ... ... ప్రయత్నించుట మేలు. విప్లవకాలములలో బౌద్ధధర్మ మనన సుకరముగాదు. ఏకాంతవాసము మంచిదిగాదు.' విప్లవ మనెడు యీ నాల్గవ యనా

గత భయమును ముందే గమనించి ప్రయత్నించెడువాఁడు పురోగామి.'

5. 'నేఁడు సంఘము సమగ్రము. సమ్ముదితము. కలహములు లేక జక్కఁగ సాఁగుచున్నది. కాని - వీరిలో భిన్నాభిప్రాయములు గలుగు నొక సమయము వచ్చును. అపుడు- బుద్ధబోధ మనన సుకరముగాదు. అంతకుముందే ప్రయత్నింపవలెను.' ఈ యైదవ యనాగత భయమును ముందే యూహించి - ప్రయత్నించినవాఁ డగ్రగామి యగును.

భిక్షువులారా ! యీ యైదనాగత భయములను ముందే గమనించినవా డప్రాప్తమైన వానిని బ్రాపించును. తెలియనిదానిని దెలిసికొనును. సాక్షాత్కృతముగానిదానిని సాక్షాత్కరించికొనును. వాఁ డగ్రగామి యగును.

మునిగాథ

ఇది సుత్తనిపాతమున వచ్చును. దాని కచట 'మునిసుత్త'మని పేరు. దానిభాషాంతర మిది.

స్నేహమూతో భయము జనించును. అందుచే నిస్స్నేహత - గృహహీనత యివియే మునియొక్క తత్త్వజ్ఞానము.

ఉద్భవించిన మనోదోషము నెవఁ డుచ్ఛేదించునో - దానిని మఱల దలయెత్తనివఁడో - వానిని స్నేహము వశీకరించికొనలేదు. వాఁ డేకాకియై మునియగును. వాఁడు శాంతిపదవి జూచును.

పదార్థములు - వాని బీజములు గమనించి - వానివిషయమైె స్నేహమును వర్జించినవాఁడు జన్మక్షయముల

యంతమును దర్శించును. తర్కమును వదలి నామాభిధాన ముల నందఁడు.

ఎవరికి సర్వాభినివేశములు దెలియునో; వాఁడు వానికి లోఁబడఁడు. అతఁడు వీతతృష్ణుఁడు. నిర్లోభి. స్థిరుఁడు. ఎందు కనఁగా వాఁడు పారమును జేరినవాఁడు. సర్వజేత. సర్వ జ్ఞుఁడు. సుబుద్ధి. సర్వములనుండి యలిప్తుఁడు. సర్వత్యాగి. ఆశనుండి విడివడ్డవాఁడు. అట్టివానినే విద్వాంసులు ముని యందురు.

అతనికి ప్రజ్ఞయే బలము. వాఁడు శీలవ్రత సంప న్నుఁడు. సమాహితుఁడు. ధ్యానరతుఁడు. స్మృతిమంతుఁడు. సంగవిముక్తుఁడు. కాఠిన్యరహితుఁడు. అనాశ్రవుఁడు. అతనిని విద్వాంసులు ముని యందురు.

వాఁడేకాకి. అప్రమత్తుఁడు. మునియైనవాఁడు-నిందా స్తుతి విముఖుఁడు. సింహమువలె భయములేని వాఁడు. లోకజాలములకుఁ జిక్కనివాఁడు. నీటియందు కమలమువలె నలిప్తుఁడు. వాఁడితరులకు నాయకుఁడు వానికి నాయకుఁడు లేఁడు. వానినే విద్వాంసులు ముని యందురు.

లోక మేమన్నను వాఁడు దలఁకఁడు. స్తంభమువలె స్థిరముగ నిలుచును. వీతరాగుఁడు. సుసమాహితేంద్రియుఁడు. వానినే విద్వాంసులు ముని యందురు.

వాఁడు స్థితాత్ముఁడు. నూలిపాగడయందుఁ గొమ్మ వలె సరళముగ వర్తించును. పాపకర్మముల దిరస్కరించును. విషమ - సమముల గుర్తించును, వాఁడు ముని.

చిఱుతయైనను - బెద్దయైనను ముని పాపము లొనర్పఁడు. వాఁడు యతాత్ముఁడు. రాగము వానిని బంధింపనేరదు. ఎవరిపైనను వానికి రాగము లేదు. వాఁడు ముని.

ఇతరులొసఁగిన యన్నముపై వాఁడు జీవించును. వండిన వెంటనే - వారెవ్వరు దినకముందే దనకుఁ బెట్టవలెనను నియమము లేదు. ఎప్పుడు బెట్టినను వానికొక్కటే. వాఁడే ముని.

వాఁడు స్త్రీసంగ విముక్తుఁడు. యువకుఁడైనను - బద్ధుఁడుగాఁడు. మదప్రమాద విరతుఁడు. ముక్తుఁడు. వాఁడు ముని.

ఇహపరములు రెంటిని వాఁడు గమనించును ప్రవాహమును - సముద్రమును రెంటిని జూచి - రెంటియందును గూడ నైక్యమైనట్లు - వాఁ డన్ని బంధములను వదలించికొనును. అనాశ్రితుఁడు. అనాశ్రవుఁడు. వాఁడు ముని.

సంతానవంతుఁడై - వారికొఱకు శ్రమించు గృహస్థుఁడు - ముని వీరివృత్తులే భిన్నములు. ప్రాణిహింస జేయరాదను నియమమును గృహస్థుఁడు ముక్తసరిగా బాటింపఁడు. మునికహింసయే ప్రాణము.

హంసము - మయూరము రెండుగూడ గగనమున కెగురుచున్నవి. కాని - హంసమువలె మయూరము బరువెత్తలేదు. ఏకాంతస్థితుఁడై ధ్యానమొనర్చు సన్న్యాసిని - గృహస్థుఁ డనుకరించుట సాధ్యమేగాదు.

## మోనేయ్య సుత్తము

ఇది నాలకసుత్తమనేడు సుత్తనిపాతమున గలదు. దీనిలో ప్రాస్తావిక గాథలే యిరువదిగలవు. వానికి భాషాంతర మిందులేదు. విశేషముగ దెలిసికొన గోరువారు 1937 వ సంవత్సరములోని, వివిధజ్ఞాన విస్తారాంకమును జూడదగును. నాలకుఁడు; అసితఋషియొక్క సోదరికొడుకు. అతఁడుఁ జిన్నవాడుగ నున్నప్పుడు, గౌతమబుద్ధుఁడు జన్మించెను. అసితఋషి బోధిసత్తుని భవిష్యత్తును గమనించి, యాతఁడు గొప్పఋషి యగునని దెలిసికొన్నాఁడు. అసితుండు నాలకునితో 'నీవు బుద్ధధర్మము ననుసరింపుము'ని యాదేశించెను. నాలకుఁడు మామయొక్క యాదేశానుసారము, బోధిసత్త్వుఁడు బుద్ధుఁడగువరకును దానొక దాపసుఁడై యుండెను. అతడు బుద్ధపద మందిన తరువాత సమీపించి మునులను గురించి, బుద్ధుని ప్రశ్నించినాడు. ఆ ప్రశ్నతో నీసుత్త మారంభమగును.

1. నీవు శ్రేష్ఠ ముని వౌదువని యసితుఁ డానాడు బల్కినాడు. అది నేటికి యదార్థమైనది. సర్వముయొక్క సారమును దర్శించిన గౌతముని, నే నీ ప్రశ్న విచారింతును.

2. ఓ మునీ! గృహత్యాగమును గావించి భిక్షపై నాధారపడి జీవించునాతనికిఁ బొందదగిన మునిపదవి యెట్టిది? దానిని నాకుఁ దెలుపుము.

3. భగవంతుఁ డనెను. 'చెప్పెదను వినుము. ఆ తత్త్వము దుష్కరము. దురభిసంభవము. అయినను దానిని నీకు దెల్పె

దను. నియమవంతుఁడవై వర్తించి దృఢమనస్కుఁడవు గమ్ము.

4. ముని యగువాఁడు దన్నొకరనాదరించిన దుఃఖపడరాదు. స్తుతించిన మిట్టెక్కరాదు. రెంట సమభావమును గలుగవలెను. క్రోధమును వర్జింపవలెను. శాంతమును గలుగవలెను.

5. పచ్చగనున్న యరణ్యమం దగ్నిజ్వాలికలు రగులు కొనునట్లే, యూళ్ళయందు స్త్రీలు దిరుగుదురు. ఈ విషయము మును లెన్నఁడును విస్మరింపరాదు. వారి మోహమున బడరాదు.

6. చిన్నవైనను, బెద్దవైనను గామోపభోగములు బంధములే. స్త్రీలు ప్రధానబంధము. స్థిర-చరప్రాణులతో మునికి విరోధము లేదు. ఆసక్తియు నుండరాదు.

7. నావంటివాఁడు వాఁడు. వానివంటివానినే నేను. ఈ రీతిగ సరిపోల్చుకొని యొకనిని హింసింపరాదు. ఇతరులను హింసకై బురికొల్పరాదు.

8. సామాన్యుఁ డిచ్చకు బద్ధుఁ డగును. లోభమునకు లోనగును. విరక్తుఁడు చక్షుష్మంతుఁడు గావలెను. ఈ రెంటిని వర్జించి నరకమును గడచి గట్టెక్కవలెను.

9. ముని తిండిపోతు గారాదు. మితాహారిగావలెను. అల్పేచ్ఛుఁడు గావలెను. అలోలుపత, వానిధనము. సర్వేచ్ఛలు దొలగించికొనవలెను. శాంతుఁడు గావలెను.

10.ముని భిక్ష గ్రహించి వనములోనికో, యొక చెట్టు నీడకో రావలెను. అట నాసన బంధ స్థిరుఁడు గావలెను.

ధ్యానరతుఁడై, ధీరుఁడైన పురుషుఁడు వనమం దానందమును భావించును. చెట్టు నీడను వసించి సంత సించును. ధ్యానించును.

ఊరి బయట రాత్రి గడపును. పగటిపూట మాత్రమే యూరిలోనికిఁ బోవును. క్రొత్తవాని మైత్రిచే వాని కుల్లా సము లేదు. ఆమంత్రణముచే మిన్నంది కొనఁడు. వాఁ డనాసక్తుఁడు.

ముని, కుటుంబములతో సంబంధ ముంచికొనరాదు. తన భిక్షను గుఱించి యేమియుఁ బల్కరాదు. సూచింపనూ రాదు.

భిక్ష దొరికిన మంచిదే. దొఱుక కున్నను మంచిదే. వాఁడు సమభావుఁడు. చేతియందు భిక్షాపాత్ర ధరించి-చరించు ముని, నోరున్న మూగవాఁడై, వర్తింపవలెను. దొఱ కిన యల్ప భిక్ష నైనను దిరస్కరింపరాదు. దాతను నిందింప రాదు. శ్రవణుఁడు హీనమార్గ మెట్టిది? ఉత్తమమార్గ మెట్టిది? యని నిరంతరము స్పష్టముగ విమర్శించి కొన వలెను. సంసారము నుద్ధరించుటకుఁ ద్రోవ యొక్కటే. కాని జ్ఞానమార్గములు మాత్రము భిన్నములు.

ఆసక్తి లేని భిక్షువునకు, సంసారము లేని భిక్షువునకు, కృత్యాకృత్య విహీనుఁడైన భిక్షువునకుఁ బరిదాహ మేది?

ఇప్పుడు ముని ధర్మములఁ జెప్పుచున్నాను. వినుము. సన్యాస ధర్మము కత్తిపై సాము వంటిది. నాలుకకు సంపూర్తిగ బీగము వేసికొని సంయమమును బాలింపవలెను.

జాగృతుఁడవై యుండుము. కాని యొకే దానిని గుఱించి తీవ్రముగఁ జింతించకుము. హీన విచారములనుండి ముక్తుఁడవు గమ్ము. అనాశ్రితుఁడ వగుము. బ్రహ్మచర్యమున మెలఁగుము.

వివిక్త సేవివి గమ్ము. ధ్యానరతుఁడవై మెలఁగుము. ఏకాకి వైనచో మౌనము సిద్ధించును. ఏకాకి వగుటలోని యానందమును క్రమ క్రమముగ భావింపుము.

ధ్యానరతుఁడైన వాఁడు, గామాసక్తుఁడు గానివాడు, దశ దిక్కుల వెలిఁగించును. వాడు ధీరుఁడు. ఇట్టి పదవి నందిన నా శ్రావకులు, పాపముల బొందబోరు. శ్రద్ధాపరులు.

వారు నదుల వంటివారు. వానకాలమందలి వరదలు గొప్పగఁ జప్పుఁడులఁ జేయుచు వచ్చును. నదులు మాత్రము సర్వకాలముల యందును శాంతములై ప్రవహించును.

వానకాలములోని వరదలు - రొద సేయుట యేకాని లోతు దక్కువ. కాని నదులు గంభీరములు. మూర్ఖుఁడీ వరదవంటివాడు. జ్ఞాని గంభీరమైన సరస్సు వంటివాడు. నిరంతరము వాడు శాంతుఁడు.

శ్రమణుఁడు (బుద్ధుఁడు) భాషించును. కాని వాడు యోగ్యముగ భాషించును. ఉపయుక్తముగ బలుకును. ఇత

రులకు ధర్మోపదేశముల నిచ్చును. అందుచేఁ బుష్కలముగ మాటాడును.

సంయుతాత్ముఁడు, దనకు విషయము దెలిసినను బుష్కలముగ భాషింపడు. ముని మౌనము నాశ్రయించును.

ఉపతిసపసినే

ఇది సుత్తనిపాతమున వచ్చును. దాని కచట 'సారి పుత్తసుత్తము'ని పేరు. అట్ఠకథలో దీనికి థేరపఞ్హమనియు పేరు. దీనిచే నీభాగమునకు 'సారిపుత్తపఞ్హ' యనియు 'ఉప తిస్సపఞ్హ' యనియు, పేరులు గావచ్చును. దాని భాషాంతర మిది.

ఆయుష్మంతుఁడైన సారిపుత్తుఁ డనెను. 'అట్లు తీయగఁ బల్కువాఁడు, సంతుష్టుఁడు. సంఘనాయకుఁడు బుద్ధుఁడు. అట్టివానిని నే నంతకుముందుఁ జూడలేదు. విన లేదు. సకలమైన తమో గుణమును నాశన మొనర్చి, శ్రమణ ధర్మమందు రతుఁడైనవాఁడు, జగత్తునఁ జక్షుష్మంతుఁడైన వాఁడు బుద్ధుఁడొకఁడే.'

అతఁ డనాశ్రితుఁడు. అదాంభికుఁడు. అతనిపాదముల కడ నేనెన్నియో విషయములు దెలిసికొంటిని. బద్ధులైన మానవులకు, హితము గల్గించుటకై, బుద్ధుఁడెన్నియో విష యములఁ జెప్పెను.

సంసారమును ద్యజించి, యే చెట్టునీడనో, స్మశానము ననో, బర్వత గుహాలలోనో, యేకాంత వాసమొనర్చు

భిక్షువునకు, నట్టి చోటులలో భయ మేమున్నది? వాఁడా నిశ్శబ్ద ప్రదేశమందు భయమును భావింపనే భావింపఁడు.

అమృతత్వ సంపాదనమునకై, భిక్షువు సుదూరము ప్రయాణించినాఁడు. జనులకు సుదూర ప్రదేశమున నాతఁడు వర్తించును. అట్టి భిక్షువు నేవిఘ్నములు బాధింప గలవు?

దృఢనిశ్చయుఁడైన భిక్షువుయొక్క పలుకు లెట్లుండ వలెను? నివాస మెట్లుండవలెను? శీలవ్రతము లెట్లుండ వలెను?

కంసాలి బంగారమును బుటముఁ బెట్టును. మూసలోఁ బోసి కరగించి దానిమాలిన్యమును దొలఁచివైచును. అట్లే స్మృతిమంతుఁడైన భిక్షువభ్యాసక్రమముతోఁ, దనమాలిన్య ములఁ దొలగించికొనును. ఆ యభ్యాసమెట్టిది?

భగవంతుఁ డనును "సారిపుత్తా! సంసారవిరహితుఁడై, యేకాంతతా సహితుఁడైన సంబోధి పరాయణుఁ డగు వాఁడు, జరింపవలసిన కర్తవ్యము లుపదేశింతును. వినుము.

వివిక్త సేవియై, స్మృతిమంతుఁడై, ధీరుఁడైన, భిక్షువు పంచభయముల నుండి, భయపడఁడు. ఆ పంచ భయము లివి. సర్పములు, మనుష్యుల యుపద్రవములు, చతుష్పాదులవలని బాధలు, కరచి మింగు జంతువులు.

పంచధర్మముల ననుసరించువారు; పరధర్మముల నను సరించువారియొక్క దారుణ కృత్యములనుఁ జూచికూడ వాఁడు వెఱువఁడు. కుశలాన్వేషి యైన భిక్షువు — ఇతరుల నుండి ప్రాప్తించు విఘ్నముల సహించును.

రోగము, క్షుత్తు, వీనిచేగలుగుబాధ, శీతోష్ణములచేఁ గలుగు వైకల్యము, వీనిని వాఁడు సహింపవలెను. విఘ్నము లనేకములు. వానితో గల్గుబాధలుఁ గూడ ననేకములే. కాని వాని ధాటికి మొండివాఁడై మెలగవలెను. ఉత్సాహము వదలరాదు. విక్రమింపవలెను.

దొంగతనము సేయరాదు. అసత్యమును బల్కరాదు. స్థిరచరులగు ప్రాణులపై మైత్రీభావన గల్గవలెను. మనఃకాలుష్యము, మారపక్షీయము, వీనిని దూరముంచవలెను.

క్రోధమునకును, మానమునకును, వశుఁడు గారాదు. మూలమట్టముగ వానిని బెల్లగింపవలెను. బుద్ధమార్గగామియై ప్రియాప్రియముల సహింపవలెను.

కళ్యాణప్రియుఁడు గావలెను. ప్రజ్ఞానంతుఁడై విఘ్నముల సహింపవలెను. ఏకాంతవాసమున నసంతుష్టి గలిగినను, దానినిఁగూడ సహింపవలెను. శోకప్రదములైన నాలుగు విషయముల ద్యజింపవలెను.

నే నిపుడేమి తిని జీవింతును? గడచినరాత్రి నాకుఁ బండుకొనుటకుఁజోటు దొఱుకలేదు. అందుచే గష్టమయ్యెను. నే డెక్కడ శయనింతును? అను నీ నాలుగు వితర్కముల విడచిపెట్టవలెను.

అపు డపుడు దొఱకిన యన్నముతో- వస్త్రముతోఁ దృప్తినందవలెను. అల్పసంతోషిగావలెను. భిక్షువు పదార్థములతో నలిపుఁడు గావలెను. జనుఁడు నియమవంతుఁడై

చరింపఁదగును. ఇతరులకు రాగమును గలిగించు కృత్యములు జేయరాదు. వాఁడు గఠోరముగ బల్కరాదు.

నిరంతరము భిక్షువు దనచూపుఁ దన పాదములపైననే యుంచికొనవలెను. అచంచలుఁడు గావలెను. ధ్యానరతుఁడై జాగృతుఁడు గావలెను. ఉపేక్షతో చిత్తైకాగ్రతను సాధింపవలెను. తర్క చాంచల్యముల నాశనమొనర్పవలెను.

తనలోని దోసఁగు నెవరైనఁ జూపించినపుడు వాని నభినందింపవలెను. సబ్రహ్మచారులతోఁ గఠినముగ వర్తింపరాదు. ప్రియకరముగ- మృదువుగ భాషింపవలెను. లోకముయొక్క వాద వివాదములలోఁ జిక్కికొనరాదు.

స్మృతిమంతుఁడు లోకమునందున్న పంచరజస్సుల నుండి యలిప్తుఁడు గావలెను. ఆ పంచరజస్సు లివి. రూప, శబ్ద, గంధ, రస, స్పర్శములు.

ఈ యెదింటి సంసర్గమును వదలి, స్మృతిమంతుఁడై సువిముక్త చిత్తుఁడైనవాఁడు, నిరంతరము సద్ధర్మమును జింతించుచు, నేకాగ్రచిత్తుఁడై, యంధకారమును నాశమొనర్చును."

## రాహులోవాదసుత్తము

దీనికి 'చూళరాహు లోవాదమనియు' 'అంబలట్ఠిక రాహులోవాద'మనియు, బేరు. ఇది మజ్ఝిమనికాయమున వచ్చును. దీని సారాంశ మిది.

బుద్ధుఁడు వేణు వనమం దుండెను. రాహులుడు (అంబలట్ఠిక) యను వనమం దుండెను. ఒకనాఁడు సాయం

కాలము బుద్ధుఁడు, ధ్యాన సమాధిని ముగించికొని, రాహు లుని కడకు వచ్చెను. రాహులుఁడు భగవంతుని దూరము నుండియేఁజూచి, లేచి పాద్యము గొని వచ్చెను. భగవం తుఁడు పాద్యమును స్వీకరించి యాసనముపై గూర్చున్నాఁడు. రాహులుఁ డొకవైపు నిలచి యున్నాఁడు.

భగవంతునకుఁ బాద్యమొసగిన పాత్రలోఁ గొన్ని నీరు మిగిలి యుండెను. బుద్ధుఁడు రాహులుని వైపు దిరిగి, "రాహులా ! యీ కొంచెపు నీటినిఁ జూచితివా ?"

రాహులుఁడు :- భదంతా ! చూచితిని.

బుద్ధుఁడు :- ఓయీ ! యసత్యమును భాషించుటకు సిగ్గులేనివాని సన్న్యాసము, యీ పాత్రలోని నీటివలె నల్పము.

ఆ నీటిని బారఁబోయుమని బుద్ధుఁ డన్నాఁడు.

రాహులుఁ డట్లే యొనర్చెను. వెంటనే బుద్ధుఁడు బల్కెను.

బుద్ధుఁడు :- రాహులా ! పారబోసిన నీటినిఁ జూచి తివా ?

రాహులుఁడు :- అవును.

బుద్ధుఁడు :- రాహులా ! యసత్య భాషణమునకు జంకనివాని సన్న్యాస మీ నీటివలెనే త్యజింప దగినది.

భగవంతుఁ డాపాత్రను దిరుగ వేసినాఁడు. అతఁ డనెను. "ఓయీ ! రాహులా ! యసత్యమునకు జంకనివాని శ్రామణ్యము, యీ పాత్రవలె బోర్ల పడినది.

బుద్ధుఁ డాపాత్రను సరిగ బెట్టెను. మరల నన్నాఁడు. "రాహులా ! వట్టిదైన యీ పాత్రనుఁ జూచితివా ?"

రాహులుఁడు :- చూచితిని.

బుద్ధుఁడు :- అసత్య భాషణ మొనర్చు శ్రమణుని సన్న్యాసము యీ పాత్ర వలెనే వట్టిది.

రాహులా! యుద్ధమునకై దయారొనర్ప బడిన ఏనుగు పాదములతో, శిరస్సుతో, చెవులతో, దంతములతో, వాల ముతో యుద్ధము సేయును. తొండమును మాత్రము వాడ దనుకొనుము. అపుడు మావటివాఁ డేమనుకొనును ? 'యీ యేనుగు దన సర్వస్వమును యుద్ధమునకై వెచ్చించుట లేదు. ఇది కృతఘ్నము' అని యనుకొనును గదా ! కొంత సేపటికి దన హస్తమును గూడ నది వాడు ననుకొనుము. అపుడు వాఁడేమి భావించును ? 'ఈ మదహస్తి యుద్ధమున దన సర్వార్పణము గావించు చున్నది. ఇది కృతజ్ఞ'మని భావిం చును. అట్లే యసత్యమునకు జంకని వాఁడు సేయక విడిచిన పాపమే లేదు. రాహులా ! పరిహాసమునకుఁ గూడ కల్ల లాడకుము. ఓయీ ! ముకురముతోఁ బ్రయోజన మేమి ?

"వీక్షించుకొనుట"

"అట్లే మాటి మాటికిఁ దన్నుతాను ప్రత్యవేక్షణ యొనర్చి కొనవలెను. విచారపూర్వకముగఁ ద్రికరణము లతోఁ గార్యము లొనర్పవలెను.

నీ వీ త్రికరణములతో నొక పనిసేయ నిచ్ఛించితి వను కొనుము. తొలుత నీ వేమి సేయవలెను? ప్రత్యవేక్షణ మొనర్ప

వలెను. 'దీనిచేఁ గలుగఁబోవు నాత్మ పరిహితము లెట్టివి?—' యని భావింపవలెను. ఆ కార్యము యొక్క పరిణామము దుఃఖకారకమైనచో, నాకార్యముఁ జేయరాదు. ఆ కార్యము మొదలు గొంత యాత్మ పరిహితముగ గన్పించును. బరిణామము దుఃఖకరమగుటచే. దానిని త్యజించి తీరవలెను. అట్లే దొలుత గొంత దుఃఖముగ గన్పడినను, బరిణామమున సుఖకరములైన కార్యము లవశ్య మాచరింపవలెను.

త్రికరణములతో నొక కార్యమొనర్చుటకు ముందే ప్రత్యవేక్షింపుము. పరిణామము దుఃఖకరమైనచో నట్టివానిని వదిలిపెట్టుము. పరిణామము సుఖకరమైనచో వానిని మాటి మాటికి గావించుచుఁ బొమ్ము. త్రికరణములతోఁ గార్యము గావించినమీఁద గూడ, ప్రత్యవేక్షింపుము. ఆ కార్యము, బరిణామమున దుఃఖకరమని నీకుఁ దోచినచో, శాస్త్రకడనో, విద్వాంసులైన సబ్రహ్మచారులకడనో, నీవా పాపమును బహిరంగముగ నొప్పికొనుము. ఆపై నటువంటిదిఁ జేయకుండ జాగ్రత్త పడుము. అది మనఃకర్మ యైనచో దానికి పశ్చాత్తాపపడుము, సిగ్గునందుము. అట్టి విచారము మఱి మనస్సున రానీయకుము. కాని త్రికరణములతో నీ వాచరించు కర్మ పరిణామ సుఖకరమైనచో ముదిత మనస్కుఁడవై మాటిమాటికిని గావింపుము. రాహులా! గడచిన కాలమందు శ్రమణ బ్రాహ్మణులు త్రికరణములతో, నేపనులొనర్చిరో, వానిని మాటిమాటికి, బరిశీలింపుము. పరిశీలించియే, వా రట్టి పవిత్ర కర్మల నొనర్చిరి. భవిష్యత్తునందును, శ్రమణ బ్రాహ్మణులు, పరిశీలించియే సత్కర్మ లొనర్తురు. వర్త

మానమునఁ గూడ నింతే. కనుక రాహులా! ప్రత్యవేక్షణాపరుఁడవై త్రికరణములతోఁ గార్యము లొనర్చుము.

బుద్ధుఁ డీ యుపదేశ మొసఁగెను. రాహులుఁడు సంతోషించి నమస్కరించినాఁడు.

ఈ యేడు సుత్తములలో, సుత్తనిపాతమం దున్న మునిగాథ, నాళకసుత్తము, సారిపుత్తసుత్తము-ఈ మూఁడును పద్యాత్మకములు. తక్కినవి గద్యములో నున్నవి. గద్యభాగములలోఁ బునరుక్తి లెక్కువ. ఆనాటి వాఙ్మయపు తీరే యిట్టిదిగాఁ గన్పడును. జైనగ్రంథము లందును, నుపనిషత్తు లందును, గూడఁ బునరుక్తి దండిగ నున్నది. త్రిపిటకముల లోని, పునరుక్తిలో చిన్న మార్పు మాత్రము గానవచ్చును. పాఠకునకు ననేక చోట్ల, బునరుక్తి ఘటిల్లినట్లు గన్పించును. కాని ప్రతి పునరుక్తిలో నేదో యొక క్రొత్తవిషయము ప్రవేశించియుండును. అది చాల సూక్ష్మమై పాఠకుని కన్ను మఱపించును. రాహులోవాద సుత్తమందు, త్రికరణముల ప్రత్యవేక్షణా విషయ మున్నది గదా! కాని త్రికరణములతో నొక యకుశలకర్మ ఘటిల్లి నప్పుఁడు, దానిని శాస్తకడనో, విద్వాంసులైన సబ్రహ్మచారుల కడనో నివేదించికొనవలె ననుట యొక క్రొత్తవిషయము. అట్టి కార్యము మాటిమాటికి రాకుండ జూచుకొనవలె ననుటయు క్రొత్త విషయము. కాని మానసికమైన యకుశలకర్మలకీ నియమము జెప్పబడలేదు. ఎందుకనగా, వినయపిటక మందు, గాయక వాచిక దోషములకే, ప్రాయశ్చిత్తముఁ జెప్పఁబడ్డది. మనో

దోషములకుఁ జెప్పఁబడలేదు. హృదయకల్మషములకు బశ్చాత్తాపమే ప్రాయశ్చిత్తము. లజ్జాధారణమే ప్రాయశ్చిత్తము. అట్టి తలఁపులు మనస్సున మరల రానీయకుండుటయే సాధన. కాయిక వాచికములైన, యకుశల కర్మలకును, మానసికములైన యకుశల కర్మలకును నడుమ నీ భేదమున్నది. ఈ విషయము సూక్ష్మముగ గమనించిననే దెలియును. పైపై జదివిన నవగతము గాదు.

అశోకుని కాలమందీ సర్వసుత్తములు నిట్లే యుండెనా? లేక సంక్షిప్తములై యుండెనా? యను విషయము నిర్ణయింపలేదు. ఒకవేళ యానాటికిని, సంక్షిప్తములై యున్నను, వానిసారముమాత్ర మిదియేయై యుండును. దీన సందేహము లేదు. సుత్తపిటక మందలి ప్రాచీనతమములైన సుత్తము లేవి యని విమర్శించువారికి ఋగ్వేదమునఁ జాలఁ దోడువడును.



# శబ్దానుక్రమణిక

ఈ



ఉ

# క

## ద